

ఆంధ్రానువాదకులు :

శ్రీ అవధూత

**బోధానందేంద్ర సరస్వతీ స్వామి**



భక్తకార్య కల్పద్రుమ, గురుసార్వభౌమ శ్రీమద్రాజాధిరాజ

యోగిమహారాజ త్రిభువన ఆనంద అద్వైత అభేద నిరంజననిర్గుణ

నిరాలంబ పరిపూర్ణ సదోదిత సకల మతస్థాపిత శ్రీసద్గురు -

**మాణిక్యప్రభు మహారాజ్**

(హుమ్నాబాద్, గుల్బర్గా జిల్లా)



## శ్రీపాదవల్లభ స్వామి

శ్రీపాద శ్రీవల్లభత్వం సదైవ, శ్రీదత్తాస్మాన్ పాహి దేవాధిదేవ ।

భావగ్రాహ్యక్లేశహారిన్ సుకీర్తే ఘోరాత్కష్టా దుద్ధరాస్మాన్నమస్తే॥



శ్రీ మత్ సచ్చిదానంద స్వరూప, నిష్కామ, నిర్వికార

నిరుపమాన పూర్ణశుద్ధ చైతన్య ఘనస్వప్రకాశ పరమపురుష సదో

దిత భవబంధచ్ఛేదక ద్వైతాఽద్వైతాతీత, మహాఽద్వైత, మార్గ

నిరత, రాజాధిరాజయోగి శ్రీ సద్గురు సచ్చిదానంద ఉద్ధవ ।

# రామచంద్ర మహారాజ్

చిడుగుప్ప, (హుమ్నాబాద్ తాలూకా, గుల్బర్గా జిల్లా)

(వెంకటక్రిష్ణాపురం (అంగడిపేట) సంస్థానాధీశులు)

(తా॥ ఆందోల్, జి॥ మెదక్)



# శ్రీ నరసింహసరస్వతి

శ్లో॥ మాయాతమోర్కం విగుణం గుణాఢ్యం
శ్రీవల్లభం స్వీకృత భిక్షువేశం ।
సద్భక్త సేవ్యం, వరదం వరిష్ఠం
వందే నృసింహేశ్వర పాహి మాం త్వం ॥

అవతార కాలము

పుష్యమాసము విదియ శనివారము

పరిసమాప్తి కాలము

బహుధాన్య సం॥ మాఘమాసము కృష్ణపక్షము పాద్యమి.

# శ్రీ గురుచరితము

## :: విషయసూచిక ::

# పుస్తక పూజ

గురుచరిత్రమును పారాయణముచేయువారు స్నానమొనర్చి శుచిర్భూతులై కులక్రమముగా సంప్రాప్తమైన సంధ్యావందనము మొదలగు నిత్యకర్మల యథాశక్తి చేసి సూర్యునకు, గణపతికి, గురుమూర్తికి గాని శ్రీదత్తాత్రేయులవారి చిత్రపటమును గాని విగ్రహముగాని లేక వారి పాదుకల గాని తమ కభిముఖముగా పీటమీదయుంచి పూజాద్రవ్యముల కుడి ప్రక్కనయుంచుకొని ఈ క్రింది విధమున గ్రంథమునకు పూజిచేసి అనంతరము యథాశక్తి ఒక అధ్యాయమునకు తక్కువ లేకుండా పారాయణము చేయవలెను. నిత్యము పారాయణ చేయు నియమము గలవారు ఒక రోజున ఏమియైన ఇబ్బందివలన పారాయణ జరుగనిచో ఆ రోజు పారాయణము మరురోజున కలిపి చేయవచ్చును. దత్తాత్రేయ మంత్రము గురుముఖమున ఉపదేశము పొంది జపించుట శ్రేయస్కరము.

ఆచమ్య 3 సార్లు ఆచమన మొనర్చి సంకల్పము చెప్పుకొని ఏవంగుణ విశేషణ విశిష్టాయాం శుబతిథౌ మను సకలా భీష్ట సిద్ధర్థ్యం... నామధేయః అహం గురుచరిత్ర పారాయణం కరిష్యే అనిచెప్పి ఉదకము స్పృశించవలెను. ముందుగ –

**శ్లో॥ శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం ।**
**ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వవిఘ్నోపశాంతాయే ॥**

అని గణపతి ప్రార్థన చేసి ఒక పుష్పము తీసికొని గురుచరిత్రమును త్రిమూర్త్యాత్మక శ్రీ దత్తాత్రేయుల వారుగా భావించి గురుచరిత్రా కారేణ శ్రీ త్రిమూర్త్యాత్మక శ్రీ దత్తాత్రేయ పరబ్రహ్మణే నమః ధ్యాయామీ – ధ్యానం సమర్పయామి.

**దత్తాత్రేయం గురుం శాంతం అవధూతం దిగంబరం ।**
**భక్తాభీష్టప్రదం వందే గ్రంధరూపేణ సంస్థితం ॥**

## VI

(పటము, విగ్రహము లేక పాదుకల పూజించునపుడు పై శ్లోకము నాల్గవ పాదమును దేవ దేవేశమవ్యయం, అని మార్చి చెప్పవలెను) అని పలుకుచు గురుచరిత్రము మీద యుంచవలెను.

1. సువర్ణవర్ణస్సర్వాత్మ త్వమేకోఽసి జగద్గురో ।
   గురుచరిత్రాత్మక శ్రీ దత్తాత్రేయ పరబ్రహ్మణే నమః
   ధ్యాయామి
2. యేషు యేషు చ భావేషు భక్త్యా త్వాం పరమేశ్వర ।
   సాధవో భావయన్త్యాత్మా త్వం తథా తత్ర భాససే ॥
   శ్రీ గురుచరిత్రాత్మక శ్రీ దత్తాత్రేయ పరబ్రహ్మణే నమః
   రత్న ఖచిత దివ్య సింహాసనం సమర్పయామి.
3. సర్వతః పాణిపాదాయ నమః శ్రీ గురుచరిత్రాత్మక
   శ్రీ దత్తాత్రేయ పరబ్రహ్మణే నమః పాదయోః పాద్యం సమర్పయామి
4. త్వమేవ సర్వయోగానాం భోక్తా సాక్షీ జగద్గురుః ।
   శ్రీ గురు నమః హస్తేషు అర్ఘ్యం సమర్పయామి ,
5. అమృతాదమృతం మర్త్యాః భజన్తి త్వాం జగత్పతే.
   శ్రీ దత్తాత్రేయ పరబ్రహ్మణే నమః ముఖే ఆచమనీయం సమర్పయామి.
6. అసంగోహ్యమరః సాక్షీ, నిత్యసిద్ధో నిరామయః
   శ్రీ దత్తాత్రేయ పరబ్రహ్మణే నమః స్నానం సమర్పయామి.
7. స్వమాయయమా ప్రసుప్తాత్మా మాయా నాశ్రయ మోహినీ
   శ్రీ దత్తాత్రేయ పరబ్రహ్మణే నమః వస్త్రం సమర్పయామి

8. బ్రహ్మనామక సూత్రంతు బ్రహ్మసూత్రం ప్రకీర్తితం

శ్రీ దత్తాత్రేయ పరబ్రహ్మణే నమః యజ్ఞోపవీతం సమర్పయామి.

9. ఉత్తమం పురుషం పూర్ణం సుగన్ధం పుష్టివర్ధనం

శ్రీ దత్తాత్రేయ పరబ్రహ్మణే నమః గంధం సమర్పయామి.

10. అతర్క్యోయమయం తోయ మక్షరం పరమేశ్వర

శ్రీ దత్తాత్రేయ పరబ్రహ్మణే నమః అక్షతాన్ సమర్పయామి.

11. నానాశ్చర్యమయం దేవం నానాపుష్పై స్సుపూజితం ।

భక్త కల్పద్రుమమం వందే శ్రీదత్తం కరుణా నిధిమ్ ॥

శ్రీ దత్తాత్రేయ పరబ్రహ్మణే నమః పుష్పైః పూజయామి.

శ్రీపాదాయ నమః పాదౌ పూజయామి.

సిద్ధాసనస్థితాయ నమః కటిం పూజయామి

దలోదరాయ నమః ఉదరం పూజయామి

కృపాలవే నమః – హృదయం పూజయామి

షడ్భుజాయ నమః – కరాన్ పూజయామి

కంబుకంఠాయనమః – కంఠం పూజయామి

సుముఖాయ నమః – ముఖం పూజయామి

సర్వాత్మనే నరమః – సర్వాణ్యంగాని పూజయామి

1. ఓంకార తత్త్వరూపాయ నమః

2. దివ్యజ్ఞానాత్మనే నమః

3. నష్టమత్సరగమ్యాయ నమః

4. బహుకాయధరాయ నమః

5. గతగర్వప్రియాయ నమః

6. తపోధనప్రసన్నాయ నమః

7. జగదాత్మనే నమః

8. మహాత్మనే నమః

9. ద్రాంబీజ జపసంతుష్టాయ నమః

10. వాసనావన దావాయ నమః

11. ధూళియుక్దేహమాలినే నమః

12. ధీప్రదీపాయ నమః

13. అత్రేస్తనూజాయ నమః

14. యాగహోమప్రియాయ నమః

15. యతీంద్రచర్యాం దధతే నమః

16. తంతుసంతన్వతే నమః

17. నరతత్త్వప్రకాశకాయ నమః

18. శ్రీ గురుచరిత్రాత్మక శ్రీనరసింహ సరస్వతీ శ్రీపాద

**శ్రీ వల్లభ దత్తాత్రేయ పరబ్రహ్మణే  నమః**

**పుష్పాణి సమర్పయామి.**

# శ్రీ దత్తాత్రేయాష్టోత్తర శతనామస్తోత్రమ్

ఓం అనసూయాసుతో దత్తోహ్యత్రిపుత్రో మహామునిః
యోగీంద్రః పుణ్యపురుషో దేవేశో జగదీశ్వరః॥ 1
పరమాత్మా పరంబ్రహ్మ పరావందో జగద్గురుః
నిత్యతృప్తో నిర్వికారో నిర్వికల్పో నిరంజనః॥ 2
గుణాత్మకో గుణాతితో బ్రహ్మవిష్ణుశివాత్మకః
నానారూపధరో నిత్య శ్శాంతో దాంతః కృపానిధిః॥ 3
భక్తప్రియో భవహరో భగవా న్భవనాశవః
ఆదిదేవో మహాదేవ స్సర్వేశో భువనేశ్వరః॥ 4
వేదాంతదేవ్యో వరదో విశ్వరూపోఽవ్యయో హరిః
సచ్చిదానంద స్సర్వేశో యోగేశో భక్తవత్సలః ॥ 5
దిగంబరో దివ్యమూర్తిర్ దివ్యభూతివిభూషణః
అనాదిసిద్ధ స్సులభో భక్తవాంఛితదాయకః॥ 6
ఏకోఽనేకో హ్యద్వితియో నిగమాగమవందితః
భుక్తి ముక్తి ప్రదాతా చ కార్తవీర్య వరప్రదః॥ 7
శాశ్వతాంగో విశుద్ధాత్మా విశ్వాత్మా విశ్వతోముఖః
సర్వేశ్వర స్సదాతుష్ట స్సర్వమంగళదాయకః॥ 8
నిష్కళంకో నిరాభాసో నిర్వికల్పోనిరాశ్రయః
పురుషోత్తమో లోకనాథః పురాణపురుషోఽనమః॥ 9
అపారమహిమానంతో హ్యాద్యంతరహితాకృతిః
సంసారవన దావాగ్ని ర్భవసాగర తారకః॥ 10
శ్రీనివాసో విశాలాక్షః క్షీరాబ్ధిశయనో...చ్యుతః
సర్వపాపక్షయకర స్తాపత్రయ నివారణః ॥ 11
లోకేశ స్సర్వభూతేశో వ్యాపకః కరుణామయః
బ్రహ్మాది వందితపదో మునివంద్య స్స్తుతిప్రియః॥ 12
నామరూప క్రియాతీలో నిర్మరాత్మరః
మాయాధీశో మహాత్మా చ మహాదేవో మహేశ్వకః॥ 13

వ్యాఘ్రచర్మాంబరధరో నాగకుండలభూషణః
సర్వలక్షణ సంపూర్ణ స్సర్వసిద్ధిప్రదాయకః॥ 14
సర్వజ్ఞః కరుణాసింధుః సర్పహారః సదాశివః
సహ్యాది దాస స్సర్వాత్మా భవబంధవిమోచనః॥ 15
విశ్వంభరో విశ్వనాథో జగన్నాథో జగత్ప్రభుః॥ 16

ఇతి శ్రీ దత్తాత్రేయాష్టోత్తర శతనామస్తోత్రం సమాప్తమ్.

# శ్రీ దత్తాత్రేయాష్టోత్తర శతనామావళి

ఓం అనసూయాసుతాయ నమః
ఓం దత్తాయ నమః
ఓం అత్రిపుత్రాయ నమః
ఓం మహామునయే నమః
ఓం యోగీంద్రాయనమః
ఓం పుణ్యపురుషాయ నమః
ఓం దేవేశాయ నమః
ఓం జగదీశ్వరాయ నమః
ఓం పరమాత్మనే నమః
ఓం పరస్మైబ్రహ్మణే నమః 10
ఓం సదానందాయ నమః
ఓం జగద్గురువే నమః
ఓం నిత్య తృప్తాయ నమః
ఓం నిర్వికారాయ నమః
ఓం నిరంజనాయ నమః
ఓం గుణాత్మకాయ నమః
ఓం గుణాతీతాయ నమః
ఓం బ్రహ్మవిష్ణుశివాత్మకాయ నమః
ఓం నానారూపధరాయ నమః 20
ఓం నిత్యాయ నమః
ఓం శాంతాయ నమః
ఓం దాంతాయ నమః
ఓం కృపానిధయే నమః
ఓం భక్తప్రియాయ నమః
ఓం భవహరాయ నమః
ఓం భగవతే నమః
ఓం భవనాశనాయ నమః
ఓం ఆదిదేవాయ నమః

ఓం మహాదేవాయ నమః 30
ఓం సర్వేశాయ నమః
ఓం భువనేశ్వరాయ నమః
ఓం వేదాంత వేద్యాయ నమః
ఓం వరదాయ నమః
ఓం విశ్వరూపాయ నమః
ఓం అవ్యయాయ నమః
ఓం హరయే నమః
ఓం సచ్చిదానందాయ నమః
ఓం సర్వేశాయ నమః
ఓం యోగీశాయ నమః 40
ఓం భక్తవత్సలాయ నమః
ఓం దిగంబరాయ నమః
ఓం దివ్యమూర్తయే నమః
ఓం దివ్యభూతివిభూషణాయ నమః
ఓం అవాదిసిద్ధాయ నమః
ఓం సులభాయ నమః
ఓం భక్తవాంఛితదాయకాయ నమః
ఓం ఏకైస్మై నమః
ఓం అనేకాయ నమః
ఓం అద్వితీయాయ నమః 50
ఓం నిగమాగమవందితాయ నమః
ఓం భుక్తిముక్తి ప్రదాత్రే నమః
ఓం కార్యవీర్యవర ప్రదాయ నమః
ఓం శాశ్వతాంగాయ నమః
ఓం విశుద్ధాత్మనే నమః
ఓం విశ్వాత్మనే నమః
ఓం విశ్వతోముఖాయ నమః
ఓం సర్వేశ్వరాయ నమః
ఓం సదాతుష్టాయ నమః
ఓం సర్వమంగళదాయకాయ నమః 60
ఓం నిష్కళంకాయ నమః
ఓం నిరాభాసాయ నమః
ఓం నిర్వికల్పాయ నమః
ఓం నిరాశ్రయాయ నమః
ఓం పురుషోత్తమాయ నమః
ఓం లోకనాథాయ నమః
ఓం పురాణపురుషాయ నమః
ఓం అనఘాయ నమః
ఓం అపారమహిమ్నే నమః
ఓం అనంతాయ నమః 70
ఓం ఆద్యంతరహితాకృతయే నమః
ఓం సంసారవనదావాగ్నయే నమః
ఓం భవసాగరతారకాయ నమః
ఓం శ్రీనివాసాయ నమః
ఓం విశాలాక్షాయ నమః
ఓం క్షీరాబ్ధిశయనాయ నమః
ఓం అచ్యుతాయ నమః
ఓం సర్వపాపక్షయకరాయ నమః
ఓం తాపత్రయనివారణాయ నమః
ఓం లోకేశాయ నమః 80
ఓం సర్వభూతేశాయ నమః
ఓం వ్యాపకాయ నమః
ఓం కరుణామయాయ నమః

ఓం బ్రహ్మాదివందితపదాయ నమః
ఓం మునవంద్యాయ నమః
ఓం స్తుతిప్రియాయ నమః
ఓం నామరూపక్రియాతీతాయ నమః
ఓం నిఃస్పృహాయ నమః
ఓం నిర్మలాత్మకాయ నమః
ఓం మాయాధీశాయ నమః 90
ఓం మహాత్మనే నమః
ఓం మహాదేవాయ నమః
ఓం మహేశ్వరాయ నమః
ఓం వ్యాఘ్రచర్మాంబగధరాయ నమః
ఓం నాగకుండలభూషణాయ నమః

ఓం సర్వలక్షణ సంపూర్ణాయ నమః
ఓం సర్వజ్ఞాయ నమః
ఓం కరుణాసింధవే నమః
ఓం సర్పహారాయ నమః 100
ఓం సదాశివాయ నమః
ఓం సహ్యాద్రివాసాయ నమః
ఓం సర్వాత్మనే నమః
ఓం భవబంధవిమోచనాయ నమః
ఓం విశ్వంభరాయ నమః
ఓం విశ్వనాధాయ నమః
ఓం జగన్నాధాయ నమః
ఓం జగత్ప్రభవే నమః 108

**ఇతి శ్రీదత్తాత్రేయాష్టోత్తర శతనామావళిః సమాప్తా -**

పుష్పాణి సమర్పయామి

ధూపం సమర్పయామి

దీపం సమర్పయామి

నైవేద్యం సమర్పయామి

ఏమియైనను నివేదనముచేసి ఉదకము గ్లాసులో ముందు ఉంచి మధ్యే మధ్యే ఉదక పానీయం సమర్పయామి, అని చెప్పవలెను.

తాంబూలము, యథాశక్తి దక్షిణయు పెట్టి అనంతరము నీరాజనము (హారతి) ఇవ్వవలెను.

త్రిగుణాత్మక త్రైమూర్తి దత్తహాజాణా

త్రిగుణఅవతార్ త్రైలోక్యరాణా

నేతినేతిశబ్దనయే అనుమానా। సురవరముని

జగయోదీసమాధి సయేధ్యానా। జయదేవ జయదేవ,

జయసద్గురుదత్తా। హారతీ ఓవాళితా హారతి భయచింతా।

పుష్పములు చేతిలో తీసుకొని

అవధూతాయవిద్మహే, అత్రిపుత్రాయ ధీమహి

తన్నోదత్తః ప్రచోదయాత్

అని పుష్పములు పుస్తకముమీద ఉంచి నమస్కారము చేసి యథాశక్తి గురుచరిత్రము పారాయణమొనర్చి పారాయణము పూర్తి అయిన తదుపరి అక్షంతలు చేతిలో తీసుకొని అనేన గురుచరిత్ర పారాయణేన శ్రీ గురుదత్తాత్రేయ స్సుప్రీణాతు అని నీరు పళ్ళెములోవదిలి ఆ ఉదకము తీర్థముగా తీసుకొనవలెను.

# శ్రీ దత్తాత్రేయస్తవమ్

**శ్లో॥ జటాధరం పాండురంగం, శూలహస్తం కృపానిధిం**
**సర్వరోగహరం దేవం, దత్తాత్రేయ మహం భజే॥**

అస్య శ్రీదత్తాత్రేయ స్తవమహామంత్రస్య। భగవాన్ నారదఋషిః। అనుష్టుప్ఛందః। శ్రీదత్త పరమాత్మా దేవతా। ఆంబీజం।హ్రీంశక్తిః। క్రోం కీలకం। శ్రీదత్తాత్రేయ ప్రసాద సిద్ధ్యర్థే జపేవినియోగః। ద్రామిత్యాది షడంగన్యాసః।

**నారద ఉవాచ –**

శ్లో॥ జగదుత్పత్తికర్త్రేచ, స్థితిసంహార హేతవే।
భవపాశవిముక్తాయ, దత్తాత్రేయ నమోస్తుతే॥

శ్లో॥ జరాజన్మవినాశాయ దేహశుద్ధి కరాయచ।
దిగంబర దయామూర్తే దత్తాత్రేయ నమోస్తుతే॥

శ్లో॥ కర్పూరకాంతిదేహాయ బ్రహ్మమూర్తి ధరాయ చ।
వేదశాస్త్ర పరిజ్ఞాయ దత్తాత్రేయ నమోస్తుతే॥

శ్లో॥ హ్రస్వదీర్ఘకృతస్థూల, నామగోత్ర వివర్జితః।
పంచభూతైక దీప్తాయ దత్తాత్రేయ నమోస్తుతే

శ్లో॥ యజ్ఞభోక్త్రేచ యజ్ఞాయ యజ్ఞరూప ధరాయచ।
యజ్ఞప్రియాయ సిద్ధాయ, దత్తాత్రేయ నమోస్తుతే॥

శ్లో॥ ఆదౌ బ్రహ్మ హరిర్మధ్యే, హ్యంతే దేవః సదాశివః
మూర్తి త్రయ స్వరూపాయ, దత్తాఽస్తుతే॥

## XIV

శ్లో॥ భోగాలయాయ భోగాయ యోగ యోగ్యాయ ధారిణే।
జీతేంద్రియ జితజ్ఞాయ, దత్తాఽస్తుతే॥

శ్లో॥ దిగంబరాయ దివ్యాయ, దివ్యరూప ధరాయచ।
సదోదిత పరంబ్రహ్మ, దత్తాఽస్తుతే॥

శ్లో॥ జంబూద్వీపే మహాక్షేత్రే, మాతాపుర నివాసినే।
జయమానసతాం దేవ, దత్తాఽస్తుతే॥

శ్లో॥ భిక్షాటనం గృహే గ్రామే, పాత్రం హేమమయం కరే।
నానాస్వాదుమయీ భిక్షా దత్తాఽస్తుతే॥

శ్లో॥ బ్రహ్మజ్ఞానమయీ ముద్రా, వస్త్రమాకాశ భూత లే।
ప్రజ్ఞాన ఘన బోధాయ, దత్తాఽస్తుతే॥

శ్లో॥ అవధూత సదానంద, పరబ్రహ్మ స్వరూపిణే ।
విదేహ దేహ రూపాయ, దత్తాఽస్తుతే॥

శ్లో॥ సత్యరూప సదాచార, సత్యధర్మ పరాయణ।
సత్యాశ్రయ పరోక్షాయ, దత్తాఽస్తుతే॥

శ్లో॥ శూలహస్త గదాపాణే, వనమాలా సుకంధర।
యజ్ఞసూత్ర ధరబ్రహ్మన్, దత్తాఽస్తుతే॥

శ్లో॥ క్షరాక్షర స్వరూపాయ, పరాత్ పరతరాయ చ।
దత్తముక్తి ప్రదంస్తోత్రం దత్తాఽస్తుతే॥

శ్లో॥ దత్తవిద్యాయ లక్ష్మీశ, దత్త స్యాత్మ స్వరూపిణే ।
గుణ నిర్గుణ రూపాయ, దత్తాఽస్తుతే ॥

శ్లో॥ శతృనాశకరం స్తోత్రం జ్ఞానవిజ్ఞాన దాయకం ।
సర్వపాప ప్రశమనం దత్తాఽస్తుతే॥

శ్లో॥ ఇదం స్తోత్రం మహద్దివ్యం దత్త ప్రత్యక్ష కారకం ।
దత్తాత్రేయ ప్రసాదాశ్చ, నారదేన ప్రకీర్తితమ్ ॥

**ఇతి శ్రీ నారద పురాణే దేవర్షిణా విరచితం**

**శ్రీ దత్తాత్రేయ స్తవం సంపూర్ణమ్**

## శ్రీ దత్తశ్శరణమ్

మాలా కమండలుధరః కర పద్మ యుగ్మే
మధ్యస్థ పాణి యుగళే డమరు త్రిశూలే
యశ్యాశ్య ఊర్ధ్వకరయో శ్శుభ శంఖ చక్రే
వందే త మత్రి వరదం భుజషట్కయుక్తం।

# శ్రీ గురు చరితము

## మొదటి అధ్యాయము

**ఓమ్ అవధూత చింతనం శ్రీగురుదేవదత్త జయ ఓమ్**

శ్రీ గణపతి నీకు నమస్కారము. నీవు భక్తుల విఘ్నముల నివారించువాడవు. నీవు విశాలములైన చెవుల నెప్పుడునూ కదుల్చుచుందువు. అందుచే పుట్టిన గాలితో నిన్ను సమీపించి నీ పూజ చేయు భక్తుల విఘ్నములు దూరముగా పోగొట్టబడును జగములన్నియు నీ యుదరమున నున్నవి గాననే నిన్ను లంబోదరుడవని యందురు. దేవతలు గూడ కార్యరంభముల నిన్ను పూజింతురు. అట్టి నిన్ను ధ్యానించి ఈ గురుచరిత్రము నాంధ్రమున వ్రాయబూనితిని గాన నీ కార్యము నిర్విఘ్నముగ కొనసాగించును.

ఓ సరస్వతి నీకు వందనము. శబ్దము నీ రూపము భక్తులకు నీవు జ్ఞాన మనుగ్రహింతువు. నీ సాహాయ్యములేనిది మానవుడొక శబ్దమైన నుచ్చరింప సమర్థుడుగాడు. నీవు ప్రతి వారియందును పరా, పశ్యంతీ, మధ్యమా వైఖరి యను రూపములతో వెలుగొందుచున్నావు. నీ యనుగ్రహముండిననే నేను ఈ గురుచరిత్రమును వ్రాయగలను గాన, నాకు మంచి శబ్దము స్ఫురింపజేసి నాచే నీ గురుచరిత్రమును వ్రాయించుము.

త్రిమూర్తులకు నా నమస్కారము. త్రిమూర్త్యాత్మక దత్తాత్రేయ స్వరూపుడై. లోకమున కాదిగురువై భక్తుల ననుగ్రహించగలందులకు కలిగియుగమున నవతరించిన శ్రీపాద శ్రీవల్లభస్వామికి, శ్రీనృసింహసరస్వతీ స్వామికి అభేదానుసంధాన పూర్వకముగ నమస్కార మర్పించి గ్రంథము నారంభించెద.

సికింద్రాబాదు నుండి పూనాకు పోవు మార్గమున గుల్బార్గా జిల్లలో గణగాపురము (గంధర్వ నగరము) అను నొక గ్రామము కలదు. త్రిమూర్తి స్వరూపుడైన శ్రీ నృసింహ సరస్వతి యను మహాత్ముడు క్రీస్తుశకము 15వ శతాబ్దమున నవతరించి ఆ క్షేత్రమున చాలాకాలము నివసించుటచే నా క్షేత్రము లోక ప్రఖ్యాతమై భక్త జనులకు కామధేనువై విరాజిల్లుచున్నది. భక్తితలో స్మరించు వారికి భక్తుల రక్షించు శ్రీ నృసింహ సరస్వతి ప్రత్యక్షముగ నిప్పటికిని దర్శనమిచ్చి రక్షించును.

ఈ విషయమును నామధారకుడను నొక భక్తుడు విని స్వామి వారిని దర్శించని జన్మ మెందులకని భావించి సర్వమును త్యజించి తన గ్రామమును

విడిచి గణగాపురము నుద్దేశించి ఒంటరిగా పోవుచు నిట్లు అనుకొనుచున్నాడు.

దేవా ! నీవు భక్తుల రక్షింతువని వింటిని. నన్నెందుల కనుగ్రహించవు. నా యందు దయ లేదా ? "నీవు నాకేమి ఉపకారము చేసితివి. నిన్నెందులకు రక్షించవలె" నందువా ? ఉపారము నపేక్షించి, ఉపకరించువాడు ఉదారుడుగ పరిగణింపబడునా ? నీవు ఆహేతుక దయామయుడవు గావా ? ధ్రువుని, ప్రహ్లాదుని, విభీషణుని ఎట్లు రక్షించితివో అట్లే నాకును దర్శినమిచ్చి నన్ను రక్షింపుము. నీవు నా భక్తుడవు కావందువా ? నేను నీ భక్తి చేయకున్నను మా పూర్వీకుడైన సాయం దేవుడు నీకు అనన్య భక్తుడు కాడా ? అతను చేసిన భక్తికి నీవే మాకు ఋణపడియున్నావు. కాన నీవు నన్ను రక్షించి కాపాడుట ధర్మము. నాకు దర్శనమిమ్ము. లేనిచో నేను జీవింపజాలనని యిట్లు ప్రార్థించుచు గణగాపురమును గూర్చి పోవుచు భగవంతుడు దర్శన మివ్వలేదను చింతలో పరవశుడై పడిపోయెను. అప్పుడు స్వామివారు దర్శనమిచ్చి తన అభయహస్తము అతని శిరమున నుంచి అంతర్హితుడయ్యెను.

**ఇది శ్రీ గురుచరిత్రమున మొదటి అధ్యాయము.**

**దిగంబరా దిగంబరా శ్రీపాదవల్లభ దిగంబరా**

**శ్లో॥ నామధారక భక్తాయ నిర్విణ్ణాయ వ్యదర్శయత్ ॥**
**తుష్టః స్తుత్యా స్వరూపం స శ్రీదత్తశ్శరణం మమ॥**

తా॥ అరణ్యములో నామధారకునకు స్వామివారు దర్శనమిచ్చుట.



# శ్రీ గురు చరితము

## రెండవ అధ్యాయమము

**ఓమ్ అవధూత చింతనం శ్రీగురుదేవదత్త జయ ఓమ్**

**శ్రీ గురుభోయనమః శ్రీ గణేవాయనమః శ్రీ సరస్వత్యైనమః**

**శ్రీ గురుదత్తాత్రేయాయనమః శ్రీ మహాలక్ష్మైనమః**

నామధారకుడను భక్తుడు భగవంతుని అనుగ్రహము నొంది లేచి గణగాపురమును గూర్చి పోవుచు శ్రమచే నొక చెట్టు క్రింద నిద్రించెను. నిద్రలో భస్మమును ధరించి జటాధారియై వ్యాఘ్రచర్మ ధరుడైన నొక సాధువును చూచెను. వెంటనే నిద్రనుండి మేల్కాంచి పోవుచుండగా స్వప్నములో చూడబడిన సత్పురుషుడు అతనికిదృష్టిగోచరుడయ్యెను. అప్పుడతనికి సాష్టాంగము నమస్కరించి మీ దర్శనముచే ధన్యుడనైతిని. తమరెక్కడ నుండి వచ్చుచున్నారు? మీ నామమేమి ? సెలవిండని ప్రశ్నించ నా సాధు విటుల చెప్పదొడంగెను.

నా పేరు సిద్ధుడందురు. తీర్థయాత్రలు చేయుచు వచ్చుచున్నాను. మా గురువైలన నరసింహ సరస్వతీ స్వామి వారు భీమా అమరజానదీ సంగమముల గాంధర్వ నగరమున నుందురు. వారు త్రిమూర్తి స్వరూపులు, భక్తులకు సమస్త సౌఖ్యములను, ఐశ్వర్యములను నిచ్చుటకు సమర్థులు. వారి భక్తులకు దైన్యము ఎప్పుడు నుండదు అని చెప్పెను. ఆ మాటలు విని నామధారకుడు నేను కూడ స్వామివారి భక్తుడనే. నేనే కాక మా పూర్వీకులు గూడ స్వామివారి భక్తులై యున్నారు. అయినను నేనే మిక్కిలి దీనస్థితిలో నుండుటకు కారణమేమి ? అని ప్రశ్నించ సిద్ధముని ఇట్లు చెప్పుచున్నాడు.

గురుమూర్తి భక్తవత్సలుడు. ఈ విషయమున సంశయము లేదు. నీకు ధృడమైన భక్తి వారియందు లేకపోవుటయే నీ దైన్యమునకు కారణమని తెలిసికొనుము నిజమయిన గురుభక్తి ఎవరికి గలదో వారికి దేవతలు గూడ నపకృతి చేయజాలరు. గురువు యొక్క కోపమునకు గురి అయిన వారిని దేవతలు గూడ రక్షింప సమర్థులు కారు. అని సిద్ధముని యన నామధారకుడు సిద్ధమునితో స్వామీ; మీరు గురువు త్రిమూర్తి స్వరూపుడనియు, గురుభక్తుని జోలికి దేవతలు గూడ రాజాలరనియు చెప్పితిరి. ఈవిషయము స్పష్టముగ నాకు బోధపడునట్లువిశదీఎరింపుడు. అని ప్రార్థించ సిద్ధముని ఇట్లు చెప్పెను.

నామధారకుడా ! వినుము, మంచి ప్రశ్న వేసితివి. సృష్ట్యాదియందు

విష్ణుమూర్తి నాభికమలము నుండి బ్రహ్మదేవుడుద్భవించెను. అ తని నాల్గు ముఖముల నుండి నాలుగు వేదములుద్భవించెను. ద్వాపర యుగాంతమున విష్ణువు వేదవ్యాసుడయి జన్మించి ఆ వేదములలోని ధర్మములను పదునెనిమిది పురాణములుగ రచించెను. అందు బ్రహ్మవైవర్తమును పురాణమున చెప్పబడిన విషయమును నీకు చెప్పుచున్నాను. ఆ పురాణమందు బ్రహ్మదేవుడు కలిని గూర్చి, గురువు యొక్క మహాత్మ్యమును గూర్చి చెప్పెను. అదియే చెప్పుచున్నాను. వినుము. బ్రహ్మదేవుడు నారాయణుని ఆజ్ఞననుసరించి వేదములలో చెప్పబడిన విధమున జగత్తును సృజించి కాలమును, కృతయుగము, త్రేతాయుగము, ద్వాపరయుగము, కలిగియుగము అను నాలుగు యుగములుగా విభజించెను. అందు కృతయుగ దేవతను ప్రథమమున పిలిచి భూలోకమునకు వెళ్ళి నీవు నీ ధర్మమును ప్రకాశింప జేయుమనెను. జ్ఞాన వైరాగ్యములు కలిగి అసత్యమన్న నెంత మాత్రము నెరుగని, యజ్ఞపవీతము, రుద్రాక్షలు ధరించి యున్న ఆ కృతయుగ దేవత బ్రహ్మకు నమస్కరించి ఇట్లనుచున్నది. స్వామీ, మీరు నన్ను భూలోకమునకు పొమ్మనుచున్నారు. భూలోకమున ప్రజలు సామాన్యముగ అసత్యపరులును, మూఢులుగను, నిందాపవాదములు చేయువారుగ నుందురు. అటట్టి స్థలమునకు నేను ఎట్లు పోగలననెను. అప్పుడు బ్రహ్మ కృతయుగ దేవతతో త్రేతాయుగము వచ్చు పర్యంతమే నీవు భూలోకమున నుండుము. నీకేమియు కష్టము కలుగనీయనని చెప్పి పంపెను. కృతయుగము పూర్తికాగా త్రేతాయుగ దేవతను పిలిచి భూలోకమునకు పొమ్మనెను. యజ్ఞ సామాగ్రుల హస్తములయందు ధరించి బ్రహ్మ ఆజ్ఞను శిరసావహించి భూలోకమునకు వచ్చెను. ఆ కాలమున ప్రజలు యజ్ఞముల నాచరించువారై ధర్మరతులయి యుండిరి. త్రేతా యుగ కాలము పూర్తికాగా మిశ్రరూపమైన ద్వాపరయుగ దేవతను బ్రహ్మ ఆహ్వానించి భూలోకమునకు పంపెను. ఆ దేవత ఉగ్రతయు, శాంతియు, దయయు, పుణ్యాపాపముల మిశ్రమమై యుండుటచేత ఆ కాలమున ప్రజలు కూడ మిశ్రమ స్వభావము కలవారుగనే యుండిరి. ద్వాపరయుగ కాలము పూర్తికాగానే బ్రహ్మ కలియుగ దేవత నాహ్వానించెను. అప్పుడు ఆ కలిదేవత విచారముతో నీచమైన పిశాచము వంటి కళావిహీనమయిన ముఖముతో అశుభమై అడుగడుగునకు తొట్రుపాటు పడుచు కలహ ద్వేషముల వెంట నిడుకొని కుడిచేత నాలుకను ఎడమచేత గుహ్యేంద్రియమును ధరించి నవ్వుచూ, ఏడ్చుచూ వచ్చిన కారణమేమి ? అనెను. ఆ మాట విని కలి

ఇట్లనెను. నేను ఎంతటి వారినైనను, లింగముచేతను, జిహ్వాచేతను జయించెదను. ఇది నా ప్రతిజ్ఞ. అందుకనియే నేను వాటిని పట్టుకొంటిని. నాకు ఎవరన్నను భయము లేదు. అని అనెను. అప్పుడు బ్రహ్మ కలితో మంచిది, నీవు భూలోకముకు వెళ్ళి కొంతకాలము నీ ప్రభావమును చూపుమని ఆజ్ఞాపించెను. దానికి కలి ఇట్లనెను. స్వామీ ! నన్నెందులకు భూలోకమునకు పంపెదరు. నేను ధర్మమును నశింపచేయువాడను, సిగ్గు అనునది నాకు లేదు నిద్రాకలహ శోకములు నా అనుచరులు. పరద్రవ్యాపహారులు పర స్త్రీరతులు నా సోదరులు. దంభమాత్సర్యములు నా ప్రాణస్నేహితులు. కొంగలవలె పైకి మాత్రమే యతుల వేషమును ధరించిన దాంభికులన్న నాకు పంచప్రాణములు. భూత ద్రోహులు నాకాత్మీయులు. పుణ్యమాచరించువారు నాకు పరమ శత్రువుల, పవిత్రమయిన ఇట్టి భూలోకమునకు నన్నెందులకు పంపెదరు అని అనెను. అప్పుడు బ్రహ్మ ఇట్లు చెప్పెను.

ఇతర యుగముల యందు మానవునకు ఆయుష్యము మెండగుటచే వారు దీర్ఘకాలము తపమాచరించి సిద్ధి నొందుదురు. కలియుగమున మానవులు స్వల్పాయుష్మంతులగుటచే స్వల్ప కాలముననే భగవద్భజన మాత్రమునే మానవులు కృతార్థులగుదురు. కాన నీవు నా యజ్ఞ ప్రకారము భూలోకమునకు పొమ్ము. కాని బ్రహ్మజ్ఞానులు పుణ్యాత్ములు భక్తులు మొదలగు వారికి మాత్రము విఘ్నము చేయకుము అని అనెను. ఆ మాట విని కలి ఇట్లనెను. స్వామీ; మీరు చెప్పిన వారు నాకు పరమ శ్రతువులు, అట్టి చోటుకు నేనెట్లు పోగలను. వారి పేరు వినగనే నాకు భయమగుచున్నది. భూమండలమైన భారతదేశము పుణ్యాత్ములచే నిండియున్నది, నేనక్కడికి పోయిన వారు నన్ను సంహరించెదరు, నా గతి యేమి ? అని అనెను. అప్పుడు బ్రహ్మ నవ్వుచు భయపడకుము. కాలము నీకు తోడగును. నీవు భూలోకమున నడుగిడినంత మాత్రముననే పుణ్యాత్ములకు గూడ పాపపు బుద్ధులు కలుగును. ధర్మ వాసన నశించును కాన వెడలుమనెను. ఆ మాట విని కలి యిట్లనెను. భూలోకమున తీర్థక్షేత్రముల యందు శివభక్తులు, ధ్యానష్టులు, ధార్మికులు నివసింతురు. వారు నాకు శత్రువులు. అట్టి వారిని చూచినంత మాత్రముననే నాకు శరీరము కంపించును. నాసాగ్ర దృష్టి నిలిపి జపాదులచేయు వారిని చూచినంతనే నా ప్రాణము లెగసిపోవును దారాపుత్రాదుల యందు ఆసక్తి కలవారై మోహజాలమున చిక్కి యున్న వారు

నాకు చాలా యిష్టులు వేదముల ద్వేషించువారు హరిహరుల భేదభావమున చూచువారు నాకు చాలా ఆప్తులు, జితేంద్రియులు, రాగద్వేషరహితులునగు వారు నాకు పరమ శత్రువుల, అట్టి స్థలమునకు నేనెట్లుపోగలను ? అప్పుడు బ్రహ్మ యిట్లనెను. నీ కోర్కె నెరవేరును. జన సామాన్యము నీకే వశులగుదురు. కాని కొందరు పుణ్యాత్ములు అనగా హరిహరుల నభేద దృష్టితో భజించువారును, నిజమయిన గురు భక్తులును, తల్లిదండ్రుల సేవించువారును కొందరుందురు. నాయాజ్ఞను శిరసావహించి అట్టి వారి జోలికి నీవుపోకుము, ముఖ్యముగా గురుసేవా నిరతులగు వారిని నీవు పీడించకుము, అని చెప్పి కలి బ్రహ్మను గూర్చి గురువననెవరు, ఆ గురుసేవలోన్ను మహిమయేమియో నాకు విశదముగా సెలవిండని ప్రశ్నించ బ్రహ్మ ఇట్లనుచుండెను.



ఓ కలీ నీకు గురు మహిమను చెప్పుచున్నాను. సావధానుడవై వినుము. గురు అన్న శబ్దమందు గ.ర.ఉ. అనునక్షరములు కలవు. 'గ' అనగా సిద్ధినిచ్చు గణపతి, 'ర' అనగా అగ్ని, 'ఉ' అనగా విష్ణువు. కాన "గురు" అను మంత్రము భక్తులకు సర్వాభీష్టముల నొసంగును. గురువు త్రిమూర్తి స్వరూపుడు. ఎట్లన గురువు జీవునకు బ్రహ్మ తత్వమును ప్రకాశింప చేసి అజ్ఞానమను శత్రువు నుండిరక్షించును. సంసార బంధమును నశింపజేయును. భక్తునకు దేవుడు ప్రసన్నుడయిన ఆ దేవుని వలన నతడు సద్గురు సమావేశమును వరముగ కోరును. గురువే ప్రసన్నుడయినచో సర్వ దేవతలు కోరకుండగనే ప్రసన్నులగుదురు. గురువు యొక్క అనుగ్రహమునకు పాత్రులు కాని వారలకు దేవతల యనుగ్రహము స్వప్నమునందును లభించదు. కాన గురువును ప్రతి

వారును భక్తితో సేవించ వలయును. అని బ్రహ్మ చెప్ప గురువునకు అంత గొప్పతన మెందులకు వచ్చెనని కలి ప్రశ్నించెను.

దానికి బ్రహ్మ ఇట్లు చెప్పుచుండెను. గురువు వలననే మనము తెలియని శాస్త్ర విషయములను తెలుసుకొన కలుగుచున్నాము. సంసారమునుండి మనల గురువే తరింప చేగలడు. గురు సేవచే సర్వము సిద్ధించుననుటకు నీకొక కథను చెప్పుచున్నాను, వినుము.

పూర్వము గోదావరీ తీరమున అంగీరసుడను మహర్షి యొక్క ఆశ్రమముగలదు. అందు పైలుడను మహర్షి యొక్క పుత్రుడైన వేదధర్ముడను నొక మహాత్ముడు నివసించుచుండెను. అతని యొద్ద చాలామంది శిష్యులు వేధాధ్యయన మొనర్చుచుండిరి. ఒకనాడు వేదధర్ముడు తన శిష్యుల భక్తిని పరీక్షించదలచి వారలతో ఓ శిష్యులారా ! నేను మీకొక విషయము చెప్పుచున్నాను. నేను ఎన్నియెా జన్మముల క్రింద పూర్వమొక పాపమాచరించితిని. నా తపస్సుచే అందు కొంత నశించెను. కొంత ప్రారబ్ధము మాత్రము నేననుభవించక తప్పదు. అట్టి పాప ఫలమును ఈ జన్మలో ననుభవించనేని నాకు మోక్షమునకు విఘ్నమువాటిల్లును. ఆ పాపఫల మనుభవించుటకు, సర్వ పాపముల నశింపచేసెడి కాశీ పట్టణమునకు పోదలచితిని.

మీలోనెవ్వరికయినను నాయందు భక్తి విశ్వాసములున్నచో నన్ను కాశీ పట్టణమునకు తీసికొని పొండు అని చెప్ప శిష్యులందరు ఒకరి మొగమొకరు చూచుకొనుచుండిరి. కాని అందు దీవకుడను నొక శిష్యుడు మాత్రము గురువును సమీపించి నమస్కరించి, స్వామీ మీరు చెప్పినది సత్యము. శరీరము స్వస్థముగ నుండగనె పాపమునకు ప్రతిక్రియ చేసికొనుట ధర్మము. ఉపేక్షించితి మేని ఆ పాపమే విషముతో సమమై అనేక జన్మలకు కారణమగును. కాన మీవెంట వచ్చి మీరు ఆపాపముననుభవించు సమయములో నేను మీకు సేవ చేసెదను. అప్పుడు వేదధర్ముడు దీవకునితో ఇట్లు చెప్పుచుండెను. దీపకాఁ ఇరువది యొక్క సంవత్సరములు కుష్ఠరోగినై కండ్లు కాళ్లుగూడ స్వాధీనములో లేక పడియుందును. నీవు అట్టి సమయములో నన్ను రక్షించగల శక్తి యుండిననే ఈ కార్యభారమున కొడంబడుమనెను. ఆమట విని దీవకుడు గురువుతో స్వామీ, మీకు బదులు ఆ పాపఫలమును నేనే అనుభవించెదను. మీకు శ్రమ వద్దు, ఆ కుష్ఠరోగము నాకే వచ్చునటుల సెలవిండనెను. ఆ మాటవిని





వేదధర్ముడు సంతోషించి కుమారా : ఎవరి పాపఫలము వారే అనుభవింపవలెను. ఒకరు మరియొకరి బాపఫలము ననుభవించుట ధర్మము కాదు. కాననేను ఈ శరీరముతోడనే ఆ పాపఫలము ననుభవించెదను. రోగముననుభవించుట ఎంతకష్టమో అట్టివారికి సేవ చేయుటయు అంతకంటె ఎక్కువ కష్టము. కనుక ఈవిషయములో ఆలోచించి నీకు శక్తి కలదేని నన్ను కాశీకి తీసుకొని పొమ్ము, ఇంత మాత్రము సహాయము చేసితివేని నా పాపఫలమచ్చుటననుభవించి శాశ్వత విముక్తి పొందెదను. అప్పుడు దీవకుడు గురువుతో స్వామీ మీరు నాకు కాశీ విశ్వేశ్వరునితో సమానముగాన అట్లే

యొనర్చెదననగా గురు శిష్యులిద్దరు కాశీ జేరిరి. గురువు మణికర్ణికలో స్నానమొనర్చి విశ్వనాథుని పూజించి తన సంచిత పాప ఫలమును అనుభవించుటకు సన్నద్ధుడయి కంబలాశ్వతరమును నొక దేవాలయమున నివసించిరి. వెంటనే అతని శరీరము కుష్టురోగముచే నాక్రాంతమయ్యెను. నేత్రహీనుడయ్యెను. కాని దీపకడు శ్రద్ధతో సేవించుచుండెను. శరీరావయవముల నుండి చీమునెత్తురు కారుచుండెను. అందుండి క్రిములుగూడ బహిర్గతములగు చుండెను. వేదధర్మునకు రోగబాధచే స్మృతి నష్టమయ్యెను. ఇట్టి స్థితిలో దీపకుడు గురువును విశ్వనాథునిగ భావించి బిచ్చమెత్తి అన్నము తీసికొని వచ్చి పెట్టుచుండెను. రోగముచే పీడికపబడినపుడు సాధువులు కూడ శాంతిని గోలుపోయి క్రూరస్వభావులగుట సహజమగుటచే శిష్యుడు తెచ్చిన భిక్షమంచిదిగా లేదని తిరస్కార భావమున చిమ్మివేయును. శిష్యుని కొట్టును, అనరాని మాటలాడును. కాని ఒక్కొక్కప్పుడు మాత్రము కనికరించి శిష్య శిఖామణీ ! నా నిమిత్త మింత కష్టమనుభవించు చుంటివా అని యోదార్చును. వెంటనే బుద్ధి మారి నన్ను ఈగలు బాధించుచున్నవి, వ్రణముల నీవు సరిగా కడుగుటయైనను లేదు అని అధిక్షేపించును. సేవ చేయుచున్న నతనిని భిక్షలేక కూర్చుంటివేమని విసిగికొనును. ఇట్లెన్ని విధముల పరీక్షించినను శిష్యుడది యేదియు మనసున నుంచుకొనక గురువునే మహేశ్వరునిగ భావించి సేవచేయు చుండెను. కాశీ క్షేత్రమందున్నను తీర్థయాత్రలు చేయుటగాని విశ్వేశ్వరుని దర్శించుటగాని చేయక గురుసేవానిరతుడు మాత్రమే అయియుండెను. ఇట్లు కొంత కాలము జరుగ విశ్వనాథుడితని గురుభక్తికి మెచ్చి సమీపించి దీపకా; నీకు ఇష్టమైన వరమును అనుగ్రహించ వచ్చితి వేడుమనెను. అప్పుడు దీపకుడు "మృత్యుం జయా ! మా గురువును విచారించి వారికి నభిమత మయినచో మీ వలన వరము కోరెద" అని చెప్పి దీపకుడు గురువును సమీపించి వినయముతో గురువరేణ్యా; విశ్వనాథుడు నాకు వరములీయవచ్చెను. మీయాజ్ఞ అయినచో మీ రోగము ఉపశమించునట్లు వరమడిగెదనని చెప్పెను. ఆ మాట విని గురువు ఓరీ, నాకు సేవచేయుట నీకు కష్టమయ్యెనా? నాకు ఈశ్వరుని వరముతో పనిలేదు, నా పాపఫలమును పూర్తిగ నేనే అనుభవించెదను, వరములచే తాత్కాలికముగ తగ్గినటులుండుటయే గాని ఎప్పటికైనను కర్మ శేష మనుభవించక తీరదు

అనెను. ఆ మాట విని దీపకడు ఈశ్వరుని సమీపించి శంకరా మీ వరములతో మాకు పనిలేదు. మా గురువునకు అభిమతముగాని వరము నేనెట్లు కోరుదును. కాన తమరు వెళ్ళుడు అనెను. ఆ మాట విని విస్మితుడై శివుడు కైలాసమునకు వెళ్ళెను. మరియొక దినమున విష్ణువు కైలాసమునకు రాగా శివుడు దీపకుని యొక్క గురుభక్తిని గూర్చి ప్రస్తావించెను. శివుని వాక్యములు విని విష్ణుమూర్తి అట్టి నిజమయిన గురుభక్తిని చూడ నుత్సహించి ఆ గురుశిష్యులున్న కంబళేశ్వర దేవాలయమునకు వచ్చి దీపకుడు చేయు గురుశుశ్రూష కర్చరువొంది దీపకుని పిలిచి దీపకా; నీ గురుభక్తికి సంతసించితిని, వరము కోరుకొనెమనెను, అప్పుడు దీపకుడిటులనెను. కోరిక లేని నాకు మీరు వరములిచ్చుట యెందులకు ? నేను ఏమియు మిమ్ముల గూర్చీ తపము చేయలేదు. కోట్లకొలది సంవత్సరములు మునులు మీ వలన వరముల నపేక్షించి తపమాచరించుచున్నారు అట్టి వారికే మీ వరముల నొసగుడు అని అనెను. ఆ మాటలు విని విష్ణుమూర్తి నాయనా; ఎవడు గురుభక్తుడో వాడే మాకు భక్తుడు, కాననే నీ భక్తిచే ఆకర్షింపబడి వచ్చితిని. తల్లిదండ్రుల సేవించువారు, భర్తను సేవించు పతివ్రతలు మాకు భక్తులే. యోగీశ్వరులను, సాధువులను పూజించుటయు మమ్ములను పూజించుటయే గాన నీ భక్తికి సంతసించితిని. వరము కోరుకొనుమనెను. అప్పుడు దీవకుడు విష్ణుమూర్తితో మీరిచ్చు వరములు మా గురువే మాకు నీయ సమర్థుడు గురువే మాకు సర్వస్వము. అట్టి గురువునుపేక్షించి మీ వలన వరములు కోరువాడను కాననెను. అతని భక్తికి మిక్కిలి సంతసించి విశ్వనాథుని త్రిప్పి పంపినటుల నన్ను గూడ పంపకుము ఎట్లయినను నీకు వరములీయ వేడుక కలుగుచున్నది. అని మిక్కిలి నిర్బంధించ దీపకుడు అట్లయినచో నాకు వెనుకటి కన్న అత్యధికమగు గురుభక్తిని మాత్రము అనుగ్రహింపుమని ప్రార్థించుచు విష్ణుమూర్తి పాదములపై బడెను. విష్ణుమూర్తి అట్టి వరమిచ్చి దీపకుని లేవనెత్తి కౌగిలించుకొని ఆశీర్వదించి వెడలి పోయెను. అంత దీపకుడు గురువును సమీపించి నమస్కరింప శిష్యుడా నీవు ఇంతవరకు విష్ణువుతో నేమి ప్రసంగించితివి. వారివలన నేమి యాశించితివి. అని యడుగ దీపకుడు స్వామీ; నేనేమియు కోరలేదు. వరము కోరుమని మిక్కిలి నిర్బంధించగా మీ పాదముల యందు దృఢ భక్తిని మాత్రమే యాచించితిని అనెను ఆ మాటలు విని వేదధర్ముడు సంతసించి నీవు చిరంజీవివై కాశీ యందుండుము. సమస్త

సిద్ధులు నీ యింట నుండును. విశ్వనాథుడు నీ యాధీనముననే యుండును. నిన్ను ఎవరు కష్టకాలమున స్మరింతురో వారి కష్టములు తొలుగును. నిన్ను స్మరించువారు దారాపుత్రాదుల తోడను, ధన కనక వస్తు వాహనాదుల తోడను సుఖముగ జీవింతురు అని చెప్పి మిక్కిలి ప్రేమతో దీపకున కాలింగన మొనర్చెను. దీపకుడు గురుస్పర్శ మాత్రముననే సమస్త విద్యా పారంగతుడయ్యెను. వేదధర్ముని శరీరము కుష్ఠురోగ రహితమై దివ్య శరీరమయ్యెను. శిష్యుని భక్తిని పరీక్షించగలందులకు గాను మహాజ్ఞానియై గొప్ప తపస్వియైన వేదధర్ముడు కుష్ఠురోగిగ కనబడెనే కాని అట్టి మహాత్మునకు పాపము శంకించ కూడ వీలు పడదు. అట్టి మహాత్ములు కాశీ యాత్ర సలుపుట కూడ కాశీక్షేత్ర మహిమను లోకమునకు ప్రదర్శించుట మాత్రమే అని ఇట్లు కలితో బ్రహ్మ గురుభక్తి ప్రభావము చెప్పెనని సూతుడు శౌనకాది మహర్షులతో చెప్పినటుల బ్రహ్మవైవర్త పురాణమున గలదు. బ్రహ్మవాక్యము విని కలి భూలోకమునకు వచ్చెనని సిద్ధమునీశ్వరుడు నామధారకునకు గురుభక్తి ప్రభావము ఈ రెండవ అధ్యాయమున చెప్పెను.

**ఇది శ్రీ గురుచరిత్ర యందలి గురుభక్తి ప్రభావమను**

**రెండవ అధ్యాయము సమాప్తము.**

**దిగంబరా దిగంబరా శ్రీపాదవల్లభ దిగంబరా**

**శ్లో॥ యః కలిబ్రహ్మ సంవాద మిషేణాహ యుగస్థితిః ॥**
**గురుసేవాంచ సిద్ధాస్యాత్ శ్రీ దత్తశ్శరణం మమ॥**

తా॥ సిద్ధముని నామధారకునకు గురుచిత్రమును గణగాపురమున అశ్వత్థ వృక్షము క్రింద బోధించుట.

**శ్లో॥ గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః గురుర్ధేవో మహేశ్వరః ॥**
**గురుస్సాక్షాత్పర బ్రహ్మ తస్మై శ్రీ గురువేనమః ॥**

తా॥ వేద ధర్ముడను గురువును దీవకుడు సేవించుట.

# శ్రీ గురు చరితము

## మూడవ అధ్యాయము

### ఓమ్ అవధూత చింతనం శ్రీగురుదేవదత్త జయ ఓమ్

సిద్ధమునివలన గురుభక్తి ప్రభావమునంతయు వినిన నామధారకుడు స్వామీ నేను మీదాసుడను. మీనివాస మెక్కడ ప్రశ్నించ సిద్ధముని అతనిని ఆలింగనమొనర్చి ఇట్లు చెప్పదొడగెను.

మా గురువు యొుక్క నివాస గ్రామవే మా గ్రామము గురు మహిమామృతపానమే మాకు జీవనాధారము. ఈ పుస్తకమును చూడుము. ఇది గురుచరిత్రము. దీనిని పఠించినవారికి భుక్తిముక్తులు కరతలామలకములు పుత్రార్థికి పుత్రుడును, ధనార్థికి ధనమును ముముక్షువునకు జ్ఞానప్రాప్తియు దీనిని పఠించుట వలన సిద్ధించును. ఈ గ్రంథమునెవరు శుచియై భక్తితో సప్తాహములో పఠింతురో వారి మనోరథములు నెరవేరును. అట్టివారికి గ్రహబాధలుగాని రోగపీడలు గాని కలుగవు. అట్టివారు శతాయుష్మంతులగుదురు. బ్రహ్మ హత్యాది పాపములు గూడ ఈ గ్రంథము పఠించువారికి నశించును. అని సిద్ధముని చెప్పగా నామధారకుడు స్వామీ ఎంతకాలము నుండియో ఈ గ్రంథమును పఠించ నిశ్చయించితిని. దప్పిక కొన్నవారికి అమృతము లభించినట్లు నేటికి మీదర్శనమయ్యెను. ఈ గ్రంథమును మీరే దయతో నాకు శ్రవణము చేయించి నన్ను ధన్యుని చేయుడని ప్రార్థించెను. అప్పుడు సిద్ధముని అతనితో ఇంత పర్యంతము నీకు దృఢమైన గురుభక్తి లేకపోవుటచేతనే కష్టముల ననుభవించు చుంటివి. దృఢమైన గురుభక్తి కలవానికి నెట్టి కొరతయు నుండదు, అని చెప్పి తన యొుక్క హస్తమును అతని శిరమున నుంచి నామధారకా భయపడకుము. చింత వదలుము. లెమ్ము సంశయమును విడనాడి గురువును భజింపుము. గురుమూర్తి ఎన్నడును తన భక్తుని ఉపేక్షించరు. గురువన దయాసముద్రుడని తెలిసికొనుము, గురుచరణముల శరణు పొందినవారికి లభించని దెద్దియు లేదు మేఘము అంతటా వర్షించును, దానికి పక్షపాతము లేదు, కాని ఆ ఉదకము ఎత్తు ప్రదేశమున నిలువ జాలదు. తటాకములయందేవచ్చి చేరును. దాంభికుడయిన భక్తుని చిత్తము ఎత్తు ప్రదేశము వంటిది. అక్కడ భక్తికి తావుండదు. కాన ఇప్పటికైనను నిశ్చలమైన భక్తితో గురువును భజింపుము గురువును కల్పవృక్షము తోడను పోల్చుటకు

వీలుకాదు. కల్పవృక్షము సంకల్పించిన ఫలములనే ఇచ్చును. గురువన్నవో శిష్యున కేడి హితమో అదియే యొసంగును. అని చెప్ప స్వామీ ! నేనొక ప్రశ్న వేయుచున్నాను. భగవంతుడు భూలోకమున మానవుడై అవతరించుటకు కారణమేమి ? అని ప్రశ్నించెను. అప్పుడు సిద్ధముని శిష్యోత్తమా ఈ గురుచరిత్రమును శ్రవణము చేయుము. నీసంశయములన్నియు తీరును. భగవంతుడు రూపరహితుడైనను ధర్మమును పాలించుటకుగాను భక్తుల నుద్ధరించుటకు గాను అప్పుడప్పుడు భూలోకమున నవతరించుచుండును. బ్రహ్మ విష్ణు మహేశ్వరులు సృష్టి స్థితి సంహారముల జరుపుచుందురు. ఈ ముగ్గురు పరస్పరము భేదము లేనివారయ్యు కార్యానుసారముగా రూపముల స్వీకరించితురు. అందులో విష్ణుమూర్తి జగత్తును పాలించవలసిన యధికారము గలవాడై యున్నందున విశేషించి యవతారముల ధరించుచుండును. అట్టి విష్ణువు యొక్క యవతారములకు కారణము ఈ క్రింది విధముగ చెప్పబడినది, వినుము.



పూర్వము సూర్యవంశమున అంబరీషుడను నొక విష్ణుభక్తుడు దృఢవ్రతుడై ఏకాదశీ వ్రతము నియమముతో జరుపుచుండెను. ఒకరోజున అతని యింటికి దూర్వాసుడు అతని వ్రతభంగ నిమిత్తమో యనునటుల వచ్చెను ఆ రోజు ద్వాదశి ఒక ఘడియ మాత్రమే యుండెను. అంబరీషుడు ద్వాదశి ఘడియలలోనే పారణచేయు నియమముగలవాడు. అతను దూర్వాసుని చూడగనే లోపల భయమునొందెను. కాని అతను అతిథి సత్కారము చేయువాడు గాన విధి పూర్వకముగ దూర్వాసునెదుర్కొని పాదప్రక్షాళన మొనర్చి స్వామీ ఈ రోజున ద్వాదశి స్వల్పముగనే కలదు. తమరు శీఘ్రముగ అనుష్ఠానము పూర్తిచేసి

పారణమునకు దయచేయుడని వేడెను.

దూర్వాసుడు నదికేగి ఎంతకాలమునకు రాకపోయెను. అంబరీషుడు చేయునది లేక ద్వాదశి పారణము పండితుల అనుమతి పై ఉదకము తోడనే ఆచరించెను. అంతలో దూర్వాసుడు వచ్చి, మండిపడుచు అతిథియైన నన్ను అవమానము చేసి పారణచేతిసివి. ఇదిగో నిన్ను శపించెదనని కన్ను లెఱ్ఱ చేసెను. అంబరీషుడు చేయునది లేక తన మనస్సును విష్ణువునందు ఏకాగ్రముగ నిలిపెను వెంటనే విష్ణువు అదృశ్య రూపముగ వచ్చి శరణాగత వత్సలుడు గాన ఇద్దరకు మధ్య నిలిచెను. దూర్వాసుడు కోపముతో నీవు చేపవుగమ్ము, పందివిగమ్ము, రాజార్హత లేని క్షత్రియుడవు గమ్ము, అని ఎన్నియో శాపముల నిచ్చెను. వెంటనే విష్ణువు ప్రత్యక్షముగ దర్శనమిచ్చి దూర్వాసునితో ఋషీశ్వరా: నీ శాపము చెల్లవలయును నా భక్తుడు రక్షింపబనవలయును. నీ శాపములు నేను వింటిని. అంబరీషుడు నన్ను ధ్యానించుచు నాలోలయించి యుండుట వలన నీ శాపములనతడు వినలేదు. కాబట్టి నీ శాపముల ననుసరించి ధర్మసంరక్షణార్థము, భూభారము తీసివేయగలందులకు గాను భక్తుల రక్షించుటకు గాను నేనే అవతరించెదను అని చెప్పెను.

ఈ పై నిమిత్తముచే భగవంతుడు విశ్వాత్ముడై సర్వవ్యాపకుడైనను మత్స్య కూర్మాద్యవతారములను ధరించి శిష్ట సంరక్షణ దుష్ట శిక్షణము చేయుచుండెను. దశావతారములే కాక ఇంకెన్నియో అవతారములు గలవు. అట్టి అవతారముల రహస్యములను బ్రహ్మవిదులే తెలిసికొనుటకు సమర్థులు, మూఢులు గ్రహింపజాలరు. పూర్వ కాలమున త్రిమూర్తులు అనసూయాదేవి యను పతివ్రతారత్నము యొక్క గృహమునకు మధ్యాహ్న కాలమున అతిథి రూపులై వచ్చి యుండిరి. వచ్చి ఆమెను పరీక్ష చేయనెంచి ఆమెకు వారు పుత్రులయిరి. అని సిద్ధముని చెప్ప నామధారకుడు ఆశ్చర్యముతో స్వామీ; అనసూయాదేవి ఎవరో ఆమెకు త్రిమూర్తులు పుత్రుట్లెయిరో ఆ కథా భాగమును మీరు చెప్పుడని ప్రార్థించెను.

ఇది శ్రీ గురు చిరత్రమున మూడవ అధ్యాయము సమాప్తము

దిగంబరా దిగంబరా శ్రీపాదవల్లభ దిగంబరా

**శ్లో॥ దూర్వాస శ్శాప మాశ్రుత్య యో...ంబరీషార్థ మవ్యయః**
**నానావతార ధారీ స శ్రీ దత్త శ్శరణం మమ ॥**

తా॥ భక్తుడైన అంబరీషుని రక్షించు నిమిత్తము దూర్వాసుని శాపములను విష్ణుమూర్తి స్వీకరించుట.

# శ్రీ గురు చరితము

## నాలుగవ అధ్యాయము

**ఓమ్ అవధూత చింతనం శ్రీగురుదేవదత్త జయ ఓమ్ శ్రీ దత్తాత్రేయాయ గురవేనమః**

**శ్లో॥ దత్తాత్రేయ శివం శాంతం । ఇంద్రనీల సమ ప్రభం,**
**అనసూయాత్రి సంభూతం । జగద్గురు ముపాస్మహే ॥**

నామధారకునితో సిద్ధముని చెప్పుచుండెను. నామధారకా! నీవు మిక్కిలి దన్యుడవు నీవు ప్రశ్నించుటచే నాకు గురులీలలు స్మరించు భాగ్యము ఘటించినది. గురుచరిత్రమును చెప్పెద వినుము. పూర్వము సృష్ట్యాదియందు నారాయణుడు జలశాయి అయియుండ ఇతని నాభి కమలము నుండి బ్రహ్మాడ ముదయించెను. అట్టి బ్రహ్మాండములో నాల్గు ముఖములు గల బ్రహ్మ పుట్టెను. అతను దిక్కును కాలమును సృజించి విష్ణుమూర్తి ఆజ్ఞ ననుసరించి సృష్టి వృద్ధి కాగలందులకు మరీచి అత్రి, అంగిరస, పులస్త్య, పులహ, క్రతు, వశిష్ఠులు అను ఏడుగురు మహర్షులను మనస్సంకల్పముచే సృష్టించెను. అనంతరము బ్రహ్మ యొక్క కుడి శరీర భాగము నుండి స్వాయంభువ మనువు, ఎడమ సగ భాగము నుండి శతరూపయను స్త్రీ రత్నమును జనించెను. వారికి దేవహూతియను కన్య కలిగెను. ఆ దేవహూతిని కర్ధముడను ప్రజాపతికిచ్చి వివాహముచేసిరి. కర్దమునకు దేవహూతి యందు తొమ్మిది మంది కన్యలు పుట్టిరి. అందు రెండవ కన్యక అయిన అనసూయను బ్రహ్మ మానస పుత్రుడయిన అత్రి వివాహమాయెడెను. అనసూయాదేవి యొక్క చక్కదనము వర్ణనాతీతము. ఆమె పాతివ్రత్యము నిరుపమానము. ఇంద్రాది దేవతలు ఆమె పాతివ్రత్య ప్రభావమును చూచి భీతిల్లి త్రిమూర్తుల సమీపించి ట్లు చెప్పిరి. అత్రి భార్యయగు అనసూయాదేవి పాతివ్రత్యము చూడమాకు భయముగుచున్నది. ఆమె ఎవ్వరికైన వరమిచ్చినచో మా ఇంద్ర పదవియు దక్కదని తోచుచున్నది మనోవాక్కాయములతో నామె పతిని భజించును. అతిథులు స్వప్నమందయినను ఆమె గృహము నుండి విముఖులయి పోవుట చూడము. సూర్యుడు గూడ తన తీక్ష్ణ కిరణముల నామెపై ప్రసరింపజేయుటకు భయపడుచున్నాడు. అగ్నియు ఆమెను దహింపజాలడు. భూమియు ఆమె పాదమిడుచోట మృదువయి యుండును. ఆమె యెవ్వరిని ఎప్పుడు శపించునో

అను భయముతో మా ప్రాణములు పోవుచున్నవి. కాన జగదీశ్వరులారా ! ప్రస్తుతము మాకు ఘటిల్లిన ఆపదను నివారించి మాకు పదభ్రంశము కాకుండునటుల చేయుడు. మీరు అనుగ్రహించనిచో మేము ఆమె యింటికి వెళ్ళి దాస్యము చేయవలసిన దుర్గతి యేర్పడును అనగా త్రిమూర్తులు వారి మాటలు విని కోపించి అంత పతివ్రతయా ఆమె; మేము వెళ్లి ఆమె వ్రతభంగమొనర్చి ఆమెను యమలోకమునకు పంపెదము. అని దేవతలను సమాధానపరచి అతిథి రూపముల ధరించి అత్రి మహర్షి ఆశ్రమమున లేని సమయమున ఆకలి గొన్న వారి వలె ఆమె ఆశ్రమము సమీపించిరి.

అనసూయాదేవిని గూర్చి అమ్మా మాకు తొందరగా అన్నమిడుము. మీ యింట అభ్యాగతులకు తృప్తిగా ఇచ్ఛానుసారముగా భోజనము లభించునని వింటిమి. నీ కీర్తి విని వచ్చితిమి. అనగా వారి మాటలు విని అనసూయాదేవి వారికి ప్రణమిల్లి పాదప్రక్షాళన మొనర్చి ఆసనముల కూర్చుండబెట్టి అర్ఘ్యపాద్యముల సమర్పించి గంధపుష్పాదుల పూజించి స్వామీ ! అనుష్ఠానము చేసికొనుడు. మహర్షి శీఘ్రముగ రాగలడు. మీరు భుజించవచ్చును అనెను ఆ మాట విని వారు మీ మహర్షి వచ్చు పర్యంతము ఉండజాలము. శీఘ్రముగ అన్నమిడుము. లేనిచో పోయెదమనిరి. అప్పుడు ఆమె అతిథి పూజాధురంధరురాలుగాన వారిని ఆసనముల కూర్చుండబెట్టి పత్రములుంచి అన్నము తెచ్చుటకు నుద్యుక్తురాలయ్యెను. అప్పుడు వారు ఆమెతో అమ్మా మాకొక కోరిక కలదు. మాయభీష్టమును తీర్చితివేని నీయింట భుజించెదము. అది ఏమనిన నీవు నగ్నురాలవయి మాకు అన్నమిడవలయును. లేనిచో మీయింట భుజించము వెళ్ళెదమనిరి. ఆ మాట విని ఆ పతివ్రత తన మనసులో వీరు సామాన్య మానవులుగ తోచరు ఏవరో కారుణిక మహాపురుషులుగ నుండనోపు ఇట్టి మహాత్ములు విముఖులయినచో ఈ ఆశ్రమము వనతుల్యమగును. వారివాంఛను నేను నెరవేర్చని యెడల వారు విముఖులయిపోవుదురు. నా మనము నిష్కల్మషమై ఉన్నప్పుడు కాముడు నన్నేమి చేయగలడు. నా భర్త యొక్క తపమే నాకిత్తరి తారకము. అని విచారించి స్వామి మీకోరిక ప్రకారమే చేసెదను స్వస్థమనస్కులై భుజించుడని చెప్పి ఆమె పాకశాలలో గరిగి భర్త పాదముల మనమున స్మరించి ఈ వచ్చిన వారు నాకు బాలులగుదురు గాక యని చెప్పి వస్త్రమును విడిచి అన్నపు పళ్లెమున చేతనిడుకొని వారిని సమీపించగా ఇంతలో వారు అప్పుడు పుట్టిన పిల్లలవలె క్రిందపడి పొరలుచు ఏడ్చుచుండిరి.

ఆమె వారిని సమీపించి ఓదార్చుచు ఆ బిడ్డల నెత్తికొనగా ఆమె స్తనములనుండి క్షీరము సమృద్ధిగ నుత్పన్నమయ్యెను. ఒక్కక్కరికి వరుసగా పాలనిచ్చి తృప్తి పరచెను. నామధారక; ఆమె భాగ్యమేమని చెప్పలగను; త్రిభువములు తనలో గల విష్ణువు ఆమె పయః పానము చేసి తృప్తి పొందెను. సృష్టికర్తయగు బ్రహ్మయు ఆ సతి స్తన్యపానము చేసి తృప్తి పొందెను. పంచముఖుడై, ఫాలనేత్రుడయిన శివుడు ఆ సాధ్వీమతల్లిస్తన్యము గ్రోలి ఆనందము నొందెను. ఇది అంతయూ అత్రి అనసూయల యొక్క తపః ప్రభావము. ఆమె బాలకులను ఉయ్యాలలయందు పరుండబెట్టి మధురముగా ఉపనిషదర్థ గర్భితములగు గీతముల పాడుచు నిద్ర పుచ్చుచుండెను. ఇంతలో మధ్యాహ్నమగుట వలన తపోవనము నుండి అత్రి మహర్షి ఆశ్రమమును సమీపింప, లోపల అనసూయచే పాడబడు గీతములు వినబడెను. ఆయన ఆశ్చర్యపడి ఆశ్రమము ప్రవేశించి అనసూయ వలన జరిగిన వృత్తాంతము తెలిసికొని జ్ఞాన దృష్టిచే వారు త్రిమూర్తులని గ్రహించి నమస్కరించెను. వెంటనే ఉయ్యాలలో బాలురై ఉన్న త్రిమూర్తులు వారి నిజరూపములతో అత్రి అనసూయలకు ప్రత్యక్షమయి మీ తపః ప్రభావమునకు మెచ్చితిమి. ఏమయిన వరములు కోరుకొనుమనిరి. అప్పుడు వారు మీరు ఈ బాల భావముతో మాకు బిడ్డలయి యుందురు గాక. అని వరమడిగిరి. అట్లే వరము ననుగ్రహించి వారి లోకమునకు వారేగిరి. త్రిమూర్తుల వరప్రసాదముగా ముగ్గురు బాలురు అత్రి అనసూయలకు కలిగిరి. ఆ బాలురలో విష్ణు అంశతో నేర్పడిన బాలుని దత్తాత్రేయుడనియు, బ్రహ్మ అంశముతో నేర్పడిన బాలుని చంద్రుడనియు, శివుని యంశతో కలిగిన బాలుని రుద్రాంశమును నామకరణ మొనర్చిరి. కొంత కాలము జరుగగా దూర్వాసుడు తన దుర్వాంశమును దత్తాత్రేయుని యందే యుంచి తల్లిదండ్రుల యనుమతిపై తపమునకు పోయెను. చంద్రుడును తన బ్రహ్మాంశమును దత్తాత్రేయున కర్పించి చంద్రమండలమునకు వెడలెను. అప్పటి నుండియు దత్తాత్రేయుల వారే త్రిమూర్తి స్వరూపుడయి గురు సంప్రదాయమునకు మూలపీఠమియి బ్రహ్మ కల్పాంతము భక్తుల ననుగ్రహించుచుందురు. దత్తాత్రేయుల వారి ప్రాదుర్భావము షోడశావతారములుగ కల్ప భేదములను బట్టియు, సమయ సందర్భమును బట్టియు జరిగి యున్నటుల శ్రీ వాసుదేవానంద సరస్వతీ స్వాములవారు తమ



స్తోత్ర సంగ్రహమను గ్రంథమునందు విశదీకరించియున్నారు. గ్రంథ విస్తర భీతిచే నీ గురుచిత్రమందు నా విషయయు క్లుప్తీకరించబడినది.

దత్తాత్రేయుల వారు అవధూతయై బాలోన్మత్త పిశాచ రూపముల సంచరింతురు. కృతయుగాదుల యందు పెక్కు మంది వారిని నవవిధ భక్తులతో నారాధించి ధన్యులయిరి. కార్తవీర్యార్జునుడు స్మరణ భక్తి జేసి ధన్యుడయ్యెను. ఆయురాజు అర్చనయను భక్తితో నైహికాముష్మిక సుఖముల చూరగొనెను. మదాలస యను పతివ్రతా గర్భ రత్నమయిన అలర్కుడను మహారాజు స్వామి వారిని వందన భక్తితో నారాధించి ముక్తుడయ్యెను. పరశురాముడు సఖ్య భక్తి చేసి దత్త దేవుని కృపకు పాత్రుడయ్యెను. ఇంతేకాక ప్రహ్లాదుడు యదుమహారాజు. వేదధర్ముడు పింగళుడను నాగుడు మొదలగు వారెందరో దత్తాత్రేయుని ఆరాధించి కృతార్థులయిరి, ఈ విషయము దత్త పురాణమందు విశదముగా వ్రాయ ఆడినది అని ఇట్లు సిద్ధముని నామధారకునితో చెప్పెను. అప్పుడు నామధారకుడు సిద్ధమునితో స్వామీ దత్తాత్రేయుల వారు ఈ కలియుగమునందు భక్తుల రక్షించు నిమిత్తము బవతరించిరని వింటిని అట్టి వారి అవతారలీలల నాకు విశదముగ చెప్పి ధన్యుని చేయుడని ప్రార్థించెను. ఆ వృత్తాంతమును సిద్ధముని పై అధ్యాయమున చెప్పగలడు.

ఇది శ్రీ గురు చరిత్రమున నాల్గ అధ్యాయము సమాప్తము.

దిగంబరా దిగంబరా శ్రీపాదవల్లభ దిగంబరా

**శ్లో॥ అనసూయా సతీ దుగ్ధ స్వాదాయేవ త్రిరూపతః ।**
**అవతారదజోయోపి శ్రీదత్తశ్శరణం మమ ॥**

తా॥ అనసూయాదేవిని పరీక్షింప త్రిమూర్తులు రాగా ఆమె తన పాతివ్రత్య ప్రభావము వలన వారల బాలురగ నొనర్చుట.

**శ్లో॥ "సో....న్వేష్టవ్యః, స విజిజ్ఞాసితవ్యః, ఆత్మావారే ? ద్రష్టవ్య**
**శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్యః" శ్రుతి**

తా॥ ఆ యాత్మను వెదుక వలయును ఆ యాత్మను ఎతలిసికొన ప్రయత్నించవలయును. ఆయననే విచారదృష్టిచే తెలిసికొనిన నదియే పురుషార్థము. ఈ పురుషార్థమును సాధించుటకై సద్గురువు ద్వారా శ్రవణఅ మనన నిదిధ్యాసనములను గావింప వలయును.

# శ్రీ గురు చరితము

## అయిదవ అధ్యాయము

**శ్రీదత్తాత్రేయాయనమః శ్రీపాద శ్రీ వల్లభ అవధుత పరబ్రహ్మణేనమః**

**దిగంబరా దిగంబరా శ్రీపాదవల్లభ దిగంబరా**

సిద్ధముని నామధారకునితో ఇట్లు చెప్పుచుండెను. నారాయణుడు దూర్వాసుని శాపమును, భక్తుడయిన అంబరీషుని సంరక్షణమును కారణముగా జేసికొని అవతారముల స్వీకరింపవలసి వచ్చెను. మత్స్యమయి వేదముల నుద్ధరించెను. కూర్మమై అమృత మథన సందర్భములో దేవతలకు సహాయపడెను. వరాహమయి భూమి నుద్ధరించెను నరసింహ రూపమును దాల్చి భక్తుడయిన ప్రహ్లాదుని రక్షించెను. వామనుడయి యాచయక రూపమున బలిని భిక్షమడిగెను. బ్రాహ్మణుడయి పరశువుచే దుష్ట క్షత్రియుల సంహరించి పరశురాముడను కీర్తి గడించెను. దాశరథియయి రావణుని సమూలముగ సంహరించెను కృష్ణుడయి గోష్ఠమున గోవుల కాచెను. దిగంబరుడయి కలియుగమున బుద్ధ రూపము దాల్చెను. యుగాంతమున కల్కియై అతడే అశ్వము నధిష్ఠించి ఖడ్గముచే మ్లేచ్ఛుల దనుమాడగలడు. కలియుగము రాగా దురాచార రతులై భక్తి యననేమియో తెలియని అజ్ఞానుల రక్షింపదలచి శ్రీదత్తాత్రేయులవారు భూలోకమున నవతరించిరి. ఆ కథ చెప్పెద వినము.

పిఠాపురమున ఒక సత్కోల ప్రసూతుడయిన ఆపస్తంబశాఖకు సంబంధించిన రాజాయను పేరుగల నొక బ్రాహ్మణుడు కలడు. ఆయనకు సుమతియను పేరుగల నొక పతివ్రతయగు భార్య కలదు. ఆమె సాత్విక వృత్తి గలదై పతిని భక్తితో సేవించుచు అతిథి అభ్యాగతుల నాదరించుచు కాలము గడుపుచుండ ఒక అమావాస్య దినమున మధ్యాహ్న కాలమునకు దత్తాత్రేయుల వారు ఒక బ్రాహ్మణ రూపమున ఆమెయింటికి అతిథి అయి వచ్చిరి. ఆమె భర్త ఇంట లేకున్నను వారిని చూడగనే భక్తితో భిక్షము పెట్టెను. వెంటనే ఆమె భక్తికి సంతసించి త్రిమూర్తి రూపమున ప్రత్యక్షమయి, అమ్మా నీకిష్టమయిన వరమును కోరుకొనుము ఇచ్చెదమనిరి అప్పుడు ఆ పతివ్రత స్వామివారికి నమస్కరించి వారినిట్లు స్తుతించెను. స్వామీ జయజయ జగన్నాథా; మీరు విశ్వకర్తలు, భక్త వత్సలులు, దయా స్వరూపులు, మీ వాక్యము వ్యర్థము కాదు. మీరే ధ్రువునకు

ధ్రువలోకాధిపత్య మిచ్చితిరి. విభీషణునకు ఆచంద్రతారకముగ లంకానగరాధిపత్య మొసంగితిరి. మీరు భక్తాధారులు. మీ బిరుదములు ప్రఖ్యాతములు కాన నా మనోవాంఛను పూర్తి చేయుడని వారి పాదములపై పడెను. అప్పుడు వారు ఆమెను లేవదీసి అమ్మా; నీ కోరిక ఏమియో చెప్పుమనిరి. అప్పుడు ఆమె స్వామీ ఇప్పుడు మీరు నన్ను అమ్మాయని సంబోధించితిరి. ఇది వరకు నాకు ఎంత మందియో పిల్లలు పుట్టి మరణించిరి. ఇద్దరు మాత్రము బ్రతికియున్నారు. కాని ఒకనికి పాదములు లేవు, మరియొకనికి నేత్రములు లేవు. అట్టి కుమారుల వలన నేను కష్ట జీవితమును గడుపుచున్నాను. సత్పుత్రుడు లేని జన్మ నిష్ఫలముగదా. ఆయుష్మంతుడయి, జ్ఞానియై, జగద్వంద్యుడయిన మీ వంటి కుమారుని నాకు అనుగ్రహించి నా జన్మను సఫలమొనర్చుడనెను. ఆ మాట విని భగవంతుడు ప్రసన్నుడై కలియుగమున సజ్జనులకు భక్తి మార్గమును ప్రచారమొనర్చుటకు ఇదియే తరుణమని భావించి తానే ఆ పతివ్రతా గర్భమున జన్మించ నిశ్చయించుకొని ఆమెతో అమ్మా నీకోరిక నెరవేరును. ఉభయవంశముల తరింప జేయగల నా వంటి కుమారుడే నీ గర్భమున నుద్భవించగలడు. కాని అతని వాక్యమును మీరనుసరింప వలయును. అతడు లోకమునకు జ్ఞాన ప్రదుడగును. అని చెప్పి భగవానుడంతర్హితుడయ్యెను. ఆమె విస్మితురాలై ఆ రూపమునే స్మరించుచుండెను. ఇంతలో భర్తరాగా జరిగిన విషయమును చెప్పెను. అప్పుడతడు సంతసించి వచ్చినవారు దత్తాత్రేయులే సుమా...మధ్యాహ్న కాలమునకు అతిథియైవారు బ్రాహ్మణ గృహములకే తెంచెదరు. వారు మాహూరు, కరవీరము, పాంబాలేశ్వరము మొదలగు క్షేత్రములనుందురు. భిక్షక రూపమున అచ్చటచ్చట సంచరింతురు. నేను ఇంటలేకున్నను నీవు వారిని సత్కరించితివి. నాకు సంతసమయినది అనెను. అప్పుడామె ఈ రోజున అమావాస్య అయినను దేవతార్చనము, వైశ్యదేవము, పితృతర్పణము కాకున్నను నేను వారికి భిక్షమిచ్చితిని, నా తప్పు క్షమింపుడనెను. అప్పుడా బ్రాహ్మణుడు ఆమెతో పితరులనుద్దేశించి శ్రాద్ధముల నొనరించి ఏ ఫలము విష్ణువున కర్పింతుమో అట్టి దత్తాత్రేయుడే నేడు వచ్చి మన ఇంట భిక్ష మంగీకరించను. అందుచే మన పితరులకు శాశ్వత స్వర్గము సిద్ధించెను.

త్రిమూర్త్యాత్ముడయిన దత్తదేవుని పూజించు భాగ్యము నీకు లభించెను. అందుచే నీవేగాక నిన్ను కన్న తల్లియు ధన్యురాలయ్యెనని తలచెదననెను. కొలది కాలమునకే

ఆమె గర్భవతి అయ్యెను. నవమాసములు నిండ శుభ ముహూర్తమున ఆమె ఒక బాలుని కనెను. దైవజ్ఞులు ఆ బాలుని జన్మలగ్నమును పరిశీలించి ఈ పిల్లవాడు జగద్గురువు కాగలడు, సాధువులకు దీక్ష నొసంగును, అని చెప్పిరి. తల్లిదండ్రులు సంతసించిరి. ఆ బాలునకు పాదమందలి శంఖచక్రాది రేఖల చూచి పన్నెండవ రోజున శ్రీపాదుడను నామమిడిరి. ఆ బాలుడు దినదిన ప్రవర్ధమానుడగుచుండెను. ఎనిమిదవ యేట ఉపనయనము గావించిరి. సమస్త వేదములు వేదాంగములు ఆ బాలునకు కంఠగతములయ్యెను. అతని ధారణాశక్తి చూచి పరమేశ్వరుడే గావచ్చునని అందరును విశ్వసించిరి. పదహారు సంవత్సరములు సమీపించగా తల్లిదండ్రులు అతనికి వివాహము చేయ సమకట్టిరి. ఆ విషయమును గ్రహించి శ్రీపాదుల వారు నేను మానుష స్త్రీని వివాహమాడు వాడను గాను. విరక్తిను కాంతయే నాకు సమ్మతమగు కయన్యారత్నము. ఆమెనే వివాహమాడ నిశ్చయించితిని. ఇతర స్త్రీలందరు నాకు తల్లితో సమానులు. యోగలక్ష్మిని తప్ప ఇతరులనే కాంక్షించువాడను గాను ననే నన్ను శ్రీకాలవల్లభుడని తెలిసికొనుడు. నేనుమునలకు జ్ఞానము ననుగ్రహించుచు ఉత్తర మార్గమున వెడలెదను. అప్పుడు పూర్వము దత్తాత్రేయులవారు చెప్పిన వాక్యమును స్మరించి ఇట్టి మహాత్ముని వాక్యమునకు మన మడ్డుచెప్పుట ధర్మము గాదు. అట్లొనర్చితిమేని మనకే నష్టము వాటిల్లును. కాన నితనికి మన కష్టముల మాత్రము విజ్ఞాపన చేసుకొందమని నిశ్చయించుకొని నేత్రముల వెంబడి బాష్పములు కార్చుచుండిరి. అప్పుడు శ్రీపాద శ్రీవల్లభులవారు వారి నేత్రోదకముల తన హస్తముల తుడిచి తల్లితో అమ్మా చింతించకుము. నీ కోరిక ఏమిటో చెప్పుము. మనస్సును దృఢము చేసికొని సుఖముగ నుండుమనెను. అప్పుడు తల్లి తన కుమారునితో నాయనా నిన్ను చూచుకొని దుఃఖమును మరచితిని, వార్ధక్యమున మమ్ముల రక్షింతువనుకొంటిమి మాకా వృద్ధాప్యము వచ్చెను. ఉన్న ఇద్దరు నీ సోదరులలో కుంటివాడు. ఒకడు వేరొకడు గ్రుడ్డివాడు కదా, నీవా మమ్ముల విడిచి పోవుచుంటివి. మా గతి యేమి ? అని దుఃఖించుచుండెను. తల్లి యొక్క వాక్యములు విని తన సోదరులయిన కుంటివాడిని, గ్రుడ్డివాడిని సమీపించి శ్రీపాదవల్లభులు అమృత దృష్టితో చూచిరి. వారిచూపు సోకినంతనే స్పర్శవేది సోకినంతనే ఇనుము బంగారమయిన రీతిని కుంటివానికి పాదములు వచ్చెను, గ్రుడ్డివానికి నేత్రములు వచ్చెను. ఇద్దరును వేదశాస్త్ర పారం గతులయిరి. అప్పుడు శ్రీపాద శ్రీవల్లభుల వారు వారిని మరల దీవించి మీరు

పుత్రపౌత్రాభివృద్ధి నొందగలరు. లక్ష్మీసంపన్నులయ్యెదరు. నా వాక్యము ననుసరించి మీరు తల్లి తండ్రుల సేవించి ధన్యులు కండని చెప్పి తల్లితండ్రులతో ఈ పిల్లలు శతాయుష్మంతులగుదురు. వీరల పుత్రికాపుత్రుల మీరు కన్నుల చూడగలరు. కాన చింతంచవలదు, మీ యింట లక్ష్మి నిశ్చలముగ నుండును. మీ వంశమున వేద శాస్త్ర పారంగుతులే జన్మించెదరు కాన తల్లీ నా యందు అనాదరణ భావముంచక నాకు అనుజ్ఞనిమ్ము. సాధువులను అనుగ్రహించుటకు గాను నేను ఉత్తర మార్గమున వెళ్ళుచున్నాను అని చెప్పి నమస్కరించి అదృశ్యుడై కాశీపురము చేరి అచ్చట నుండి బదరికాశ్రమము వెళ్ళి అచ్చట నరనారాయణుల దర్శించి భూమండల మందలి ముఖ్య క్షేత్రముల సంచరించి గోకర్ణ క్షేత్రము ప్రవేశించిరని ఈ కథా వృత్తాంతమును సిద్ధముని నామధారకునితో చెప్పెను.

**ఇది శ్రీ గురుచరిత్రమున అయిదవ అధ్యాయము సమాప్తము.**

**దిగంబరా దిగంబరా శ్రీపాదవల్లభ దిగంబరా**

# శ్రీ గురు చరితము

## ఆరవ అధ్యాయము

**ఓమ్ అవధూత చింతనం శ్రీగురుదేవదత్త జయ ఓమ్**

**శ్రీగురు దేవదత్త :-**

నామధారకుడు శ్రీపాదుల వారు గోకర్ణ క్షేత్రమున ఎంతకాలముండిరి ? అనేక క్షేత్రములుండ ఆ క్షేత్రమును వారు మిక్కిలి ప్రేమించుటకు గారణమేమి ? సెలవిండని ప్రశ్నించెను. సిద్ధముని ఇట్లు చెప్పుచుండెను.

శ్రీపాదుల వారు స్వయముగ తీర్థ స్వరూపులయినను భక్తుల నుద్ధరించుటకు గాను పుణ్య క్షేత్రముల సంచరించిరి. గోకర్ణ క్షేత్రము భూతలమందలి అన్ని క్షేత్రములకన్న శ్రేష్ఠమగుట వలన అచ్చట వారు మూడు సంవత్సరములండిరి. అట్టి క్షేత్రము యొక్క నిరుపమానమగు మహాత్మ్యమును చెప్పుచున్నాను. సావధానుడవై వినుము.

ఆ క్షేత్రమందు సాక్షాత్తు శివస్వరూపమయిన "మహా బలేశ్వరుడు" అను పేరుగల లింగము విష్ణుమూర్తి ఆజ్ఞననుసరించి గణపతిచే ప్రతిష్ఠింపబడెను. ఆ సందర్భమెట్టిదనిన, పులస్త్య బ్రహ్మకు కైకసి యను భార్య కలదు. వారి పుత్రుడు రావణుడను రాక్షసుడు. ఆమెకు నిత్యము శివపూజనొనర్చు ఆచారము గలదు. శివుని పూజింపనిదే ఆమె భుజించదు. ఒక దినమున ఆమెకు శివలింగము లభించనందున మట్టితో లింగము చేసి పూజించుచుండెను. ఇంతలో రావణుడు తల్లిని దర్శించుటకు వచ్చి వందన మొనర్చి నాకు తల్లివై యుండియు ఈ మట్టి లింగమును పూజించుటకు కారణమేమి అని నామె అతనితో శివుని పూజించుటకే కైలాసము ప్రాప్తించుననెను, అప్పుడు రావణుడు అమ్మా; వ్యర్థముగా నీవు ఈ లింగము నెందుకు పూజించెదవు, నేను నీ కొరకు పార్వతీపరమేశ్వర సహితముగ కైలాసమునే కొనవచ్చి మన లంకలో ఉంచెదను నీవు నిత్యము యథేష్టముగ శివుని పూజించుకొనవచ్చునని చెప్పి కైలాసమునకు పోయి తన పది శిరస్సులు కైలాసమునకు మోకరించి ఇరువది భుజములతో కైలాసపర్వతమును ఎత్తుటకు యత్నించెను. కైలాసము చలించెను. అప్పుడు పార్వతి భయకంపితురాలై శివుని సమీపించి కైలాసము పడిపోవుచున్నది. మీరు స్వస్థముగ నుంటిరేల తగిన ప్రతిక్రియ చేయుడని

ప్రార్థించెను. అప్పుడు శివుడు పార్వతితో “ఏమియు భయపడకుము, మన భక్తుడగు రావణుడు విలాసముగ క్రీడించుచున్నాడు,” అని చెప్పి నవ్వుచు పార్వతి భయమును నివారించుటకు గాను తన ఎడమ చేతితో కైలాసమును కొంచెము క్రిందకు నొక్కెను. అప్పుడు రావణాసురుడు కైలాసము క్రిందపడి ప్రాణసంకటావస్థ నొంది ఎట్లో తప్పించుకొని బయటకు వచ్చి శివుని అఖండముగ స్తుతించెను.

తన శిరస్సును కోసి వీణగా చేసి ఒక భుజమును వీణాదండముగాను తన ప్రేవులను వీణకు తంత్రులుగాను చేసి అఖండమైన భక్తితో సప్త స్వర సహితముగ రాగముతో అద్భుతముగ సామగాన మొనర్చెను. అట్టి రావణుని నిరుపమానమైన భక్తికి సంతసించి శంకరుడు నీకు వరమిచ్చెదను. ఏమి నీకోరిక అని అడుగ, రావణుడు ఇట్లనెను. శంకరా; మీయనుగ్రహము వలన నాకెట్టి కొదువయులేదు. లక్ష్మి మా యింట దాస్యమొనర్చును. నవనిధులు మా లంకలో కాపురము దాస్యమొనర్చును. నవనిధులు మా లంకలో కాపురము చేయుచున్నవి. బ్రహ్మ నాకు వశవర్తియై నిత్యము మాయింట పంచాంగశ్రవణము చేయును. ముక్కోటి దేవతలు నాకుసేవకులే. అగ్నిదేవుడు మాయింట బట్టలనుతుకును. యముడుగూడ నాయాజ్ఞ లేనిదే ఎవ్వరిని ముట్టజాలడ. కుంభ కర్ణుడు నా సోదరుడు. ఇంద్రుని జయించినట్టి ఇంద్రజిత్తు నా కుమారుడు, నాస్థావమా ఇతరులకు అజేయమగు లంకా పట్టణము, కామధేనువు మా యింటనే నివసించును. కాని మా తల్లికి నిత్యము మిమ్ముల పూజించు కోరిక కలదు. కాన కైలాస సమేతముగ మిమ్ముల మాలంకకు తీసుకొని పోవచ్చితిని. ఇదియే నా కోరిక, నామనోరథమును సఫలము చేయుడు అనెను. ఆ మాట విని శివుడు రావణా ఈ కైలాసముతో నీకేమి ప్రయోజనము, నా ఆత్మ లింగమును



నీకీయదలచితిని, అట్టి లింగమును త్రికాలమందు పూజించి నా మంత్రమును జపించుము. మూడు సంవత్సరములట్లొ నర్చితివేని నీవే శివుడవగుదురు.

నీ లంకయే కైలాసమగును. ఈ లింగమున్న చోట మృత్యుభయము లేదు. ఇట్టి లింగమును దర్శించినంత మాత్రమున సమస్త దోషములు నశించును. ఈ లింగమును మధ్యమార్గమున నెచ్చట నుంచక లంకకు గొనిపొమ్ము. అనగా రావణుడు సంతసించి శివునకు సాష్టాంగముగ నమస్కరించి శివుని వలన ప్రాణలింగమును స్వీకరించి లంకకు పయనమయ్యెను.

ఈ విషయము నాదరుడు గ్రహించి చింతనొంది వెంటనరే స్వర్గమునకు పోయి దేవేంద్రునితో ఇంద్రా; స్వస్థముగ కూర్చున్నావు. రావణునిచే నీ ఐశ్వర్యము అవహరింపబడెను. అతను శివుని మెప్పించి వారివలన ప్రాణలింగమును వరముగ పొంది పోవుచున్నాడు. ఇదివరకే రావణుని వలన బాధనొందుచున్నాము. ఈ లింగమే లంకకు చేరెనేని మనకతడజేయుడగును మీరందరు ఆయనకు కింకరులై దాస్యము చేయవలసిన గతిపట్టును. అనగా ఇంద్రుడు భయపడి ఇట్టి స్థితిలో నా కర్తవ్య మేమియో చెప్పుమని నారదుని ప్రార్థించెను. నారదుడు ఇప్పుడు మనము బ్రహ్మనుశరణు వేడవలయును. తగిన ఉపాయమువారు చెప్పగలరు, అని చెప్పి ఇంద్రుని వెంటనిడుకొని నాదరుడు బ్రహ్మలోకమునకు పోయి వారితో జరిగిన వృత్తాంతమంతయు చెప్పెను. బ్రహ్మయు తాను చేయునది ఏమియు లేనందున నారదుని, ఇంద్రుని వెంట పెట్టుకొని వైకుంఠమునకు పోయి జరిగిన వృత్తాంతమంతయు విష్ణుమూర్తితో చెప్పి ఇట్లనెను. ప్రాణలింగమే లంకను చేరినచో రావణుడు మీకును నవధ్యుడగును. కాబట్టి ఎట్టి ఉపాయముతోనైన ఇట్టి సంకటము నుండి త్రిభువనములను రక్షించి కాపాడుమని ప్రార్థించెను.

అంతట విష్ణువు మిక్కిలి కోపించి ఎంత నష్టము వాటిల్లెనని వెంటనే కైలాసమునకు పోయి శంకరా; ఎట్టి పనిచేసితివి. రావణుడు క్రూరుడుగదా. పాముకు పాలుపోసి నటుల దురాచారుడైన అతనికి ప్రాణలింగమును ఎట్టిచ్చితివి. దేవతల గతియేమి ? అని అనెను అప్పుడు శివుడు నేనేమి చేయుదును. అతని భక్తికి నేను పరవశుడనైతిని. తన శిరమును ఛేదించి వీణగ చేసి సామగానమొనర్చెను. అతడడిగిన నా పార్వతినైనను ఇవ్వ సమట్టితిని. కాని నా ప్రాణలింగమే యాచించెను. అని అనెను. అప్పుడు విష్ణువు శివునితో ఇట్లు మీరు రాక్షసులకు దుర్లభములైన వరములనిచ్చుచుందురు. వారు దేవతలను,

బ్రాహ్మణులను పీడించుచుందురు. అట్టి వారల సంహరించుటకు కష్టముల నేనుపడుచుండవలయును. అయినదేమో అయినది ప్రాణలింగము నతనికిచ్చి ఎంతకాలమయినది; అతడు లంకను చేరియుండునా ? అని ప్రశ్నింప శివుడు అయిదు గడియలయ్యెను. అతను మార్గమధ్యమున నున్నాడు. మీరేదైన ఉపాయమొనర్చి దేవతల సంకటము నుండి తొలగించుడనెను. వెంటనే విష్ణువు సూర్యుడు కనపడకుండునటుల తన సుదర్శన చక్రమును సూర్యునకు అడ్డుపరచి, నారదుని పిలిచి నారదా; నీవు మనోవేగమున పోయి రావణుని గమనమునకు విలంబమగునటుల చేయుము నేను నా సుదర్శన చక్రముచే సూర్యుడస్తమించునటుల చేసితిని. రావణునకు సకాలమున సంధ్యావందనము చేయు నియమముగలదు. పై విషయము నేనాలోచించెదనని చెప్పి నారదుని పంపెను. తరువాత గణపతిని స్మరించెను. వెంటనే గణపతి రాగా అతనితో విష్ణుమూర్తి ఇట్లనెను. గణనాథా నిన్ను పూజించువారి కార్యములన్నియు ఫలించునట్లు చేసెదవు నిన్ను ఉపేక్షించు వారి కార్యములకు విఘ్నము చేసెదవు. రావణుడు నిన్ను పూజింపక శివుని ఎట్లో మోహింపజేసి అతని వలన ప్రాణ లిమంగమవహరించి లంకకు పోవుచున్నాడు. నీవు బాల వేషము ధరించి అతనిని మోసము చేయుము. అతనికి సంధ్యాకాలమున సంధ్యవార్చు నియమము కలదు. నేను నారదుని ముందుగా రావణునకు కాల విలంబమగునటుల చేయుమని పంపితిని. మూత్ర విసర్జన కాలమున రావణుడు పవిత్రమగు ప్రాణలింగమునుతన వద్దనుంచుకొనడు. శివుడు ప్రాణలింగమును మార్గమధ్యమున నెచ్చటను, భూమిమీద నుంచవలదని చెప్పెను. ఇట్టి స్థితిలో నీవు బాలుడవయి అతని దృష్టి పథమునబడుము. నిన్ను నమ్మి యతడు ప్రాణలింగమును నీచేతికి నిచ్చి సంధ్యావందన మొనర్చుటకు వెడలును. అప్పుడు నీవాలింగమును భూమియందు ప్రతిష్ఠించుము అని చెప్పి విఘ్నేశ్వరునకు ఫలములు మొదలగు భక్ష్యములు నొసంగి పంపెను.

నారదుడు మనోవేగమున వెళ్లి రావణుని సమీపించి ఏమియు తెలియని వానివలె వినయముతో రావణా; తొందరగ పోవుచున్నావు; ఎక్కడనుండి వచ్చుచున్నావు ఏమి వృత్తాంతము ? చెప్పుమనెను. అప్పుడు రావణుడు నేను కైలాసమునకు వెళ్లితిని, శివుడు ప్రసన్నుడయి నాకు ఆత్మలింగము నొసంగెను. అనగా నారదుడు నీవు గొప్ప అదృష్టవంతుడవు. ఆ లింగము యొక్క మహిమ నాకు పూర్తిగ తెలియును. నిజముగ అది ఆత్మలింగమో కాదో నాకు

చూపుమనెను. రావణుడు శంకించుచు దూరముగ చేతిలోనున్న లింగమును చూపెను. నారదుడు దానిని చూచి ఇది ప్రాణలింగమే పూర్వము ఒక భయంకర మృగముండెను. దానికి మూడు శృంగములు కలవు. అట్టి మృగమును త్రిమూర్తులు వేటాడి సంహరించిరి, మూడు శృంగములందును మూడు లింగములు వారలకు లభించెను. అట్టి లింగమును మూడు సంవత్సరములు ఎవ్వడు పూజించునో వాడు ఈశ్వరుడే కాగలడు. ఈ లింగమున్న స్థానము కైలాసమే కాగలదు. ఇంకను దీని మహిమ చెప్పెదనని చెప్పబోవుచుండ రావణుడు నాకిప్పుడు సమయము లేదు తొందరగల లంకకు పోవలసియున్నది. అనగా నారదుడు నీవు అనేక వేదములెరిగిన వాడవు. సంధ్యాకాలమా సంప్రాప్తమయ్యెను. సంధ్యా కాలమున మార్గమున నడచుట ధర్మము కాదు. నేను నాకు తోచిన విషయమును నీకు చెప్పితిని నేను మాత్రమే సంధ్యావందనము కొరకు సముద్రమునకు పోవుచున్నాను. అని చెప్పి నారదుడు పోయెను. అదేనమయమున గణపతి బ్రహ్మచారి వేషమును ధరించి రావణునకు కనబడునంత దూరములో సమిధలనేరుచున్న వానివలె కనబడెను. రావణుడు "నేను సకాల సంధ్యావందనము చేయునియమము గలవాడను. వ్రతభంగము కాకూడదు. ఈ లింగమును దగ్గర నుంచుకొని సంధ్యావందనము చేయు వీలుగాదు. ఇచ్చటనొక బాలుడు తిరుగుచున్నాడు. బ్రహ్మచారిగా కనబడుచున్నాడు. కాన ఇతని చేతికి లింగమిచ్చి సంధ్యావందన మొనర్చెదను. అని విచారించి ఆ బ్రహ్మచారిని సమీపించెను.

గణపతి రావణుడు తన దగ్గరకు వచ్చుట చూచి భయపడిన వానివలె పరుగెత్తసాగెను. రావణుడు ఆ బాలునకు ధైర్యము చెప్పి బాలుడా భయపడకుము. నీ తల్లిదండ్రులెవరు ? అని ప్రశ్నించెను. అప్పుడు ఆ బాలుడు మా తల్లిదండ్రులు నీ కేమయిన ఋణముండిరా వారితో నీ కేమిపని అని అనెను. మా తండ్రి భస్మరుద్రాక్షల ధరించును బిచ్చమెత్తి జీవించును. ఆయన పేరు శంకరుడందురు. మా అమ్మను "ఉమ" యని పిలిచెదరు. నన్ను వదులుము, నాకు భయమగుచున్నది. మా యింటికి నేను పోయెదననెను. అప్పుడు రావణుడు బాలకా; మీ తండ్రి బిచ్చమెత్తునని చెప్పితివి. మీకు సుఖమెక్కడిది. నా వెంట రమ్ము నాదిలంకా పట్టణము. మా యింట దేవతార్చనము చేయుచుండుము. నీకు మృష్టాన్నము లభించగలదు. అనగా

నా మాట విని యాబాలుడు నన్నువదులుము. మీ లంకలో రాక్షసులుందురు. వారు నన్ను భక్షించెదరు. నేను మీ లంకకు రాను నాకాకలి యగుచున్నది. మా యింటికి వెళ్లి శెనగలు తిని యాకలి తీర్చుకొనియెదను. అనగా రావణుడు అతనినెట్లో బ్రతిమిలాడి బాలకా ఇపుడే సంధ్య వార్చి వచ్చెదను. అంతవరకు ఈ లింగమును పట్టుకొని యుండుము. అన అప్పుడా బాలుడు నేను బాలుడను బ్రహ్మచారిని ఇంత బరువైన లింగమును మోయజాలను. నా చేయి వదులుము. పుణ్యముండును అని నిరాకరించినను ఎట్లో ఆ బాలుని బ్రతిమిలాడి అతని చేతికి లింగమునిచ్చి రావణుడు సంధ్యా వందనము కొరకు సముద్రతీరమునకు పోవుచుండ, గణపతి రావణా నీవు శీఘ్రముగ రమ్ము. మూడు పర్యాయములు పిలిచెదను. అంతలో నీవు రావేని లింగమును భూమి యందుంచెదను. సంశయింపబనిలేదు. అని కేకపెట్టెను. అప్పుడు దేవతలు ఏమి జరుగునో యని విమానములయందుండి నిరీక్షించుచుండిరి. రావణుడుఆర్ఘ్యప్రదాన మొనర్చుచుండ లింగము బరవుగుచున్నది. శీఘ్రముగరమ్మనెను. రావణుడు



హస్తసంకేతముతో వచ్చెదనని సూచించి అంగన్యాస పూర్వకముగా గాయత్రి అనుషానమును మౌనముగా చేయుచుండ వెనుకటి వలెనె రెండు పర్యాయములు పిలిచి రావణుడు ధ్యానమగ్నుడై వినియో వినకయో రానందున ఆకసమున విమానములందుండి నిరీక్షించెడి దేవతలు సాక్షులుగానుండ విఘ్నమూర్తిని మనసా స్మరించి సముద్రతీరమందలిభూభాగమున నా లింగమును స్థాపించెను. దేవతలు సంతోషముతో పుష్ప వర్షమును గురిపించిరి.

ఇంతలో రావణుడు సంధ్యవార్చి శీఘ్రముగవచ్చి లింగమును భూమియందుండుట చూచి ఓరీ మూర్ఖా ! వంచకా నీవు బుద్ధి పూర్వకముగ

నిట్లోనర్చితివి. అని ఆ బాలుని కొట్టపోవగా నేనేమి తప్పు చేసితిని. నన్నెందులకు కొట్టెదవు ? మా నాయనతో చెప్పెదనని భయపడి ఏడ్చుచున్నవానివలె తప్పించుకొని పారిపోయెను. రావణుడు చేయునదేమియు లేక తన యిరువది చేతుల తోడను లింగమును పెకిలించయత్నించెను. భూమి కంపించెనే గాని లింగము కదలదాయెను. అంతబలశాలియైన రావణుని బలము సైతము ఆ ప్రాణలింగము పట్ల నిరర్ధకమైనందున ఆ ప్రాణలింగమునకు మహాబలేశ్వరుడను సార్ధకనామము లోకవిఖ్యాతమయ్యెను. అతని చేతి యొరిపిడికి ఆ లింగము గోకర్ణము యొక్క (ఆవు చెవి యొక్క) ఆకృతి నొందినందున గోకర్ణాకృతి లింగమగుటచే నుండుటచే ఆ క్షేత్రమునకు గోకర్ణమను నామముగూడ సిద్ధించెను. రావణుడు చేయునది లేక అచటనే శివుని గూర్చి తపమాచరించి వరములు నొందెను. అప్పటి నుండియు దేవతలందరు శివునినచట భక్తితో నారాధించుచున్నారు. ఈ క్షేత్రము యొక్క మహిమ స్కాందపురాణమున విపులముగా వర్ణించబడినదని సిద్ధమని నామధారకుని గూర్చి గోకర్ణక్షేత్రము యొక్క చరిత్రమును వర్ణించెను.

సిద్ధముని నామధారక పంవాద రూపమగు గురుచరిత్ర యందు నావర అధ్యాయము సమాప్తము.

**దిగంబరా దిగంబరా శ్రీపాదవల్లభ దిగంబరా**

**శ్లో॥ ప్రకాశయామాస సిద్ధముఖాత్, స్థాపన మాదితః ॥**
**మహాబలేశ్వరస్యైష, శ్రీదత్తశ్శరణంమమ॥**

**భావము :** రావణుడు శివుని మెప్పించి వారి వలన ప్రాణ లింగమును స్వీకరించుట. రావణుడు ప్రాణలింగమును లంకకు తీసుకొనిపోవుచుండ దేవతలచే ప్రార్ధింపబడి గణపతి యుక్తితో రావణుని ప్రాణ లింగమును గ్రహించి సముద్రతీరమున స్థాపించుట.

"ఓమ్ ఈశా వాస్యమిదగ్ం సర్వం యత్కించ జగత్యాం జగత్ ।
తేన త్యక్తేన భుఞ్జీథా మాగృధః కస్య స్విద్ధనమ్ ॥
ఈశావాస్య – ఉపనిషత్తు ౧)

తా॥ ఈ జగత్తులో నామ రూపాత్మకమైన స్థావరజంగమ పదార్ధములు ఏవేవి కలవో అవియన్నియు ఈశ్వరుని ద్వారా ఆచ్ఛాద నీయమైయున్నవి కనుక అట్టి నామరూపాత్మకమైన ప్రపంచమును త్యాగముచేసి తన వాస్తవికమైన స్వరూపముయొక్క పాలన చేయుము. గ్రద్ద వత్తుగ లోలుపుడవు (లోభివి) గాకుము. ఎవ్వరి ధనమును ఆశించకుము.

# శ్రీ గురు చరితము

## ఏడవ అధ్యయము

**ఓమ్ అవధూత చింతనమ్ శ్రీ గురుదేవదత్త జయ ఓమ్**

**మహాదేవం మహేశానం మహేశ్వర ముమాపతిం।**

**మహాసేన గురుంవందే మహాభయం నివారణం॥**

**హరహర మహాదేవ.**

నామధారకుడు సిద్ధమునిని గూర్చి స్వామీ గోకర్ణ క్షేత్రమున నెవ్వరయిన వరములనొందిరా ! చెప్పుడని ప్రశ్నించ సిద్ధమునీశ్వరుడిట్లు చెప్పుచుండెను.

**నామధారకా ! శిష్య శిరోమణి :** గోకర్ణ క్షేత్రమహిమను చెప్పుచున్నాను. వినుము. పూర్వము ఇక్ష్వాకు వంశమున మిత్రసహుడను రాజు ఒకడుగలడు. అతను శూరుడు. స్వధర్మ రతుడు బలాఢ్యుడు దయానిధియు అతనొకనాడు అడవికివేట నిమిత్తము వెడలెను. అచ్చటనొక భయంకరుడైన దైత్యుని చూచెను. తాను ధనస్సును ధరించి అతని మీద బాణముల వర్షింజేసెను. ఆ రాక్షసుడు నేలకూలెను. అతను చచ్చుచు తనసమీపమునన్ను తన సోదరునితో నేనా చనిపోవుచున్నాను. నన్ను చంపిన ఈ రాజులకు నీవు ఎటులయిన అపాకరము చేయుము. అట్లుచేసితివేని నా ఆత్మ శాంతించునని చెప్పి వాడు మరణించెను. వాడి సోదరుడు కామరూపధరుడు గాన నొక మానవ రూపము ధరిపంచి రాజు వేట నుండి తన నగరమునకు వచ్చుచుండ రాజును కలసి నమ్రభావముతో మీ వద్ద సేవ చేయుచు భృత్యుడనై ఉండెదను. అంగీకరింపుడని ప్రార్థించెను. రాజు అతను కపటియని గ్రహించక అతని సేవకు అంగీకరించెను వాడు రాజునకు నమ్మకము కలుగునటుల ప్రవర్తించుచు వినయముతో సేవించుచుండెను. ఇట్లుండ మిత్రసహుని యింట పితృశ్రాద్ధము సంప్రాప్తమాయెను. అతను వశిష్ఠాదుల భోక్తలుగ నిమంత్రణము చేసెను. శ్రాద్ధమునకు కావలసిన శాకపాకముల సమగూర్చు అధికారము నీ కపట సేవకుని పై నుంచెను. వాడు ఇదియే సమయమని గ్రహించి వంట వానిని వశపర్చుకొని నరమాంసమును శాకములలో నొకటిగ తయారు చేయించెను. భోజన కాలమున పత్రములయందు శాకపాకములు వడ్డింపబడెను. వశిష్ఠుడు నరమాంసము శాకముగ వడ్డింపబడుట గ్రహించి రాజును గూర్చి

మహర్షులమైన మాకు నరమాంసము వడ్డించితివి. కాన నీవు నర మాంసము భక్షించు బ్రహ్మరాక్షసివి ఆగుమని శపించెను. అప్పుడు రాజు నాకా విషయము తెలియదు. నేను బుద్ధిపూర్వకముగ నాపని చేసియుండలేదు. నిష్కారణముగ నన్ను ఇట్లు శపించితిరి గాన తిరిగి శపింతునని ఉదకము పట్టుకొని శపింప నుద్యుక్తుడయ్యెను. అప్పుడు అతని భార్యయగు మదయంతి గురువును శపించు అధికారము మనకు లేదు, అని చేయి పట్టుకొని వారించ, రాజు చేయునది లేక మంత్రించబడిన ఆ శాపోదకమును వేరొకచోట పోసిన భూతహింస యగునని భావించి తన పాదముల మీదనే పోసికొనెను. అందుచే అతనికి ఆనాటి నుండియు కల్మాషపాదుడను నామము వచ్చెను. అప్పుడు అతని భార్యయగు మదయంతి వశిష్ఠుని గూర్చి స్వామి మమ్ముల నుద్ధరింపుడు. శాపమునకు అంతము సెలవిండని ప్రార్థింప వశిష్ఠుడు కొంత శాంతినొంది పన్నెండు సంవత్సరములకు ఇతను శాపమునుండి విముక్తి పొందగలడు అని చెప్పి వెడలెను.

మిత్రసహుడు బ్రహ్మ రాక్షస రూపము ధరించి నిర్మానుష్యమగు అరణ్యమున మనుష్యులను, పశువులను భక్షించుచు కాలము గడుపుచుండెను. ఒక రోజున అతను అరణ్యమార్గమున పోవుచున్న ఒక బ్రాహ్మణ దంపతుల చూచి వ్యాఘ్రము పశువు మీద పడునట్లు అందలి బ్రాహ్మణుని మీద పడెను. అప్పుడు అతని భార్య గడగడ వణకుచు ఆ బ్రహ్మ రాక్షసుని పాదముల పై బడి తండ్రీ నా సౌభాగ్యమును కాపాడుము. నా ప్రాణేశ్వరుని వదులుము. నన్ను భక్షించుము. భర్త లేని స్త్రీ జన్మ వ్యర్థముగదా, వేదశాస్త్ర పారంగతుడయిన ఈ నా భర్తను రక్షించినచో పుణ్యము ఘటిల్లును. నన్ను నీ కుమార్తెగా భావించుము, అని ఎంత ప్రార్థించినను, ఆమె వాక్యమును పెడచెవిని పెట్టి ఆ బ్రాహ్మణుని భక్షించెను. అప్పుడామె తన భర్త మరణించుట చూచి ఆ బ్రహ్మరాక్షసునితో ఓరీ నీవు సూర్యవంశపు రాజువు, శాపమువలన బ్రహ్మరాక్షసివైతివి. పన్నెండు సంవత్సరములకు నీకు శాపవిమోచన మగును. నా భర్తను హింసించి నా సుఖమునకు భంగ మొనర్చితివి. కాన శాపాంతమయినను నీ భార్యతో నీవు కలసిన యెడలమరణించెదవు గాక అని శపించి తన భర్త ఎముకలతో సహగమనము చేసెను. పండ్రెండు సంవత్సరములకు శాప విముక్తినొంది తన పట్టణమునకు వెడలెను. అప్పుడు అతని భార్య మదయంతి కామాతురురాలై సమీపించ తాను బ్రహ్మరాక్షసియైయున్న సమయమున బ్రాహ్మణ స్త్రీ చేత

శపింపబడిన వృత్తాంతమును భార్యకు తెలియజేసి ఆమెను నివారించెను ఆమె కడు దుఃఖించెను అతనిచే సంహరింపబడిన బ్రాహ్మణుడు బ్రహ్మ పిశాచమై వెంటబడెను. ఆ రాజు ఎవ్వరు ఏమి చెప్పిన ఆ దానముల చేసెను. తీర్థ క్షేత్రముల పర్యటించెను. కాని బ్రహ్మరాక్షసి ఘోరరూపమున అతనిని వెంబడించుచునే యుండెను. ఒకనాడు ఆరాజు దైవ వశమున మిథిలానగర సమీపమున సంచరించుచు శ్రమచే ఒక వృక్షపు నీడకూర్చుండెను. అచ్చటికి సాక్షాత్తు రుద్రాడాఅనునట్లు ప్రకాశించు గౌతముల వారు శిష్య సమేతముగా వచ్చిరి. రాజు వారి పాదములకు దీనుడై నమస్కరించ గౌతముడు రాజును గూర్చి మీ రాజ్య మేమయ్యెను. నీవు చింతక్రాంతుడవై ఇట్లు వనముల సంచరించుటకు కారణమేమి అని యడుగ రాజు దుఃఖితుడై తనకు బ్రహ్మ హత్య పాతకము ఘటించిన వృత్తాంతమంతయు తెలియచేసి ఇట్లుచెప్పెను.

స్వామీ; ఈ బ్రహ్మహత్య నివృత్తి కొరకు నేను ఎన్నియో వ్రతములాచరించితిని. అనేక క్షేత్రముల పర్యటించితిని. కాని ఈ బ్రహ్మహత్య నన్ను ఘోరరూపమున వెంబడించుచునే యున్నది. నేడు మీ దర్శనమయ్యెను. నాజన్మ ధన్యమయినది. నా కష్టములు నేటికయినను తొలుగునని నమ్ముచున్నాను అని చెప్పుచు వారి పాదముల మీద పడి దుఃఖించ, దయా సముద్రుడగు గౌతముడు అతనితో ఓరాజా; భయపడకుము, శంకరుడు మృత్యుంజయుడు, నిన్ను రక్షించును. మహా పాపముల నశింపజేయు పరమపావనమయిన ఒక క్షేత్రమును గూర్చి నీకు చెప్పుచున్నాను వినుము. గోకర్ణమను క్షేత్రమొకటి కలదు దానిని స్మరించినంతనే బ్రహ్మ హత్యాది పాతకములన్నియు నశించును. అది శివునకు నివాస స్థానమగు కైలాసముతో సమానము. గోకర్ణక్షేత్ర దర్శనము వలననే పాతకములు నశించును. ఇంద్రాది దేవతలందరు అచ్చట తపస్సు చేసి సిద్ధినొందిరి. అచ్చట చేసిన తపస్సు క్షేత్ర ప్రభావము వలన లక్ష గుణితమగును. విష్ణుమూర్తి ఆజ్ఞా ననుసరించి గణపతి అక్కడ శివుని ప్రతిష్టించెను. బ్రహ్మ, విష్ణువు, అష్టవసువులు, గోకర్ణము యొక్క పూర్వ ద్వారమున వసించి శివుని పూజించుచుందురు. వరుణుడు మొదలగు దేవతలు పడమటి ద్వారమున నివసించి చంద్రమౌళిని ప్రేమతో అర్చింతురు. కుబేరుడు, భద్రకాళి, సప్త మాతృకలు, మొదలగు వారు ఉత్తరపు ద్వారమున నివసించి అచ్చటి మహాబలేశ్వరుని ఆరాధింతురు. విశ్వామిత్రుడు, జాబాలి, జైమిని అచ్చట శివుని ఆరాధించి తపస్సిద్ధిగాంచిరి. శౌనకాది మహర్షులు నారదుడు మొదలగు

దేవఋషులు సిద్ధులు సాధ్యులు, అచ్చట శివుని ఉపాసింతురు. అచ్చట శివుని పూజించు వారికి మహాబలేశ్వరుడు వారి మనోరథముల తప్పక నెరవేర్చును.

రావణుడు కుంభకర్ణుడు విభీషణుడు మొదలగు వారును నిత్యము వచ్చి శివుని ఆరాధించి పోవుచుందురు. భక్తులు తమ పేర్లతో అచ్చట శివలింగములను గూడా స్థాపింతురు. అందు అసంఖ్యాకముములగు లింగలు కలవు. వేయేల ఆ క్షేత్రమందలి పాషాణములన్నియు లింగములే, అందలి ఉదకమంతయుతీర్థమే ఆ లింగము సప్తపాతాళముల నుండి మహోన్నతమై పూర్వయుగలములందు ప్రకాశించెడిది కలియుగమున సూక్ష్మ రూపముగ కనబడును. ఈ గోకర్ణక్షేత్రము పశ్చిమ సముద్ర తీరమున కలదు. అచ్చట చేయబడిన శివపూజలేమి, వ్రతము లేమి, బ్రాహ్మణ సంతర్పణములేమి స్వల్పగ చేయముబడినను అనంత ఫలప్రదములగును. శివరాత్రి మొదలగు పుణ్య కాలముల యందు అచ్చట మహాబలేశ్వరుని పూజించుట వలన వచ్చు ఫలము ఎవ్వరి కేనియు చెప్ప శక్యము కాదు. మాఘ మాసమున శివరాత్రియందు నిశీథకాలమున ఒక బిల్వ పత్రమును శివునకర్పించుట వలన వచ్చెడి పుణ్యమును ఆదిశేషుడయినను చెప్పజాలడు. ఇట్టి నిరుపమానమగు క్షేత్రమున్నను దీని మహిమనెవ్వరు వినరో అట్టివారు బధిరులుగ, మూఢులుగ భావింపబడుదురు. శివరాత్రినాడు అచ్చట చేసిన ఉపవాసము, జాగరణము స్వర్గ మార్గమునకు సోపాన మన వచ్చును అచ్చటి తీర్థముల స్నానమొనర్చి మహా బలేశ్వర లింగమును పూజించు మానవుడు నిస్సంశయముగ పాపవిముక్తుడు కాలగడు. అని గౌతముడు చెప్ప మిత్రసహుడు ఆమునితో స్వామీ గోకర్ణ క్షేత్ర మహాత్మ్యమును మీరు విస్తరించి సెలవిచ్చితిరి. ఆ క్షేత్రమున నెవ్వరయిన పాప విముక్తి నొందినటుల నిదర్శన మేమయిన కలదా కృపతో సెలవిండని ప్రశ్నింప గౌతముడిట్లనెను.

రాజా వినుము అనేక వేలమంది అచ్చట పాప విముక్తి నొందుట నాకు తెలియును అందు నేను ప్రత్యక్షమగు కాంచిన ఒక దృష్టాంతము నీకు చెప్పుచున్నాను వినుము. నేనొక సంవత్సరము శివరాత్రికి అచ్చటకు యాత్రకు పోయితిని. అనేక వేల మంది యాత్రికులు వచ్చిరి. మధ్యాహ్న కాలమున నేనొక వృక్షచ్ఛాయ యందు కూర్చొని యుంటిని. అచ్చట కొక చండాల స్త్రీ వృద్ధురాలు, అంధురాలు, కుష్ఠ రోగముచే పీడితురాలై ఎండలో తూలుచు

వచ్చి నాకు కొంత సమీపమున చెట్టు నీడను క్రిందపడి ప్రాణముల త్యజించెను. అదే సమయమునకు కైలాసము నుండి సూర్యునివలె ప్రకాశించునొక విమానము వచ్చెను. అందుండి శివదూతలు నలుగురు మణికుండల కిరీటముల ధరించి శూలములు చేతపూని దేదీప్యమానమగు కాంతితో ప్రకాశించుచు వచ్చి మరణించిన చండాలస్త్రీని కైలాసమునకు కొనిపోవ నుద్యుక్తులయిరి. నేను విభ్రాంతినొంది వారల నిట్లు ప్రశ్నించితిని. శివదూతలారా; కుక్కను సింహాసనమున కూర్చుండ బెట్టుదురా ? ఇట్టి చండాల స్త్రీని మీరు విమానములో కైలాసమునకెట్లు తీసికొని పోవుదురు. ఈమె జన్మాదిగా పరమపాపి, పశు మాంసము భక్షించు చండాలురాలు, అంతియేగాక కుష్ఠురోగముచే పీడింపబడుచున్నది. ఈమె ఎక్కడ, కైలాసమెక్కడ, జ్ఞానముగాని జ్ఞాన సాధనముగాని దయా సత్యములుగాని ఈమె యందు వెతికినను కానరావు. శివపూజ ఎరుగదు. శివమంత్ర జపమనిన నేమియో నీమెకు తెలియదు. దానధర్మముగాని, శివరాత్రి ఉపవాసముగాని ఆచరించినది కాదు. ఇట్టి స్త్రీకి కైలాస ప్రాప్తి యెట్లు ? ఇది నాకుడుక ఆశ్చర్యముగ నున్నది. నాసంశయమునకు తగిన సమాధానము చెప్పుడని శివదూతల నడుగ వారు నాతో నామె పూర్వజన్మ వృత్తాంతము నిట్లు చెప్పదొడగిరి.

గౌతమ మహర్షీ! వినుము. పూర్వ జన్మమున నీమె యొక బ్రాహ్మణ కన్య. పేరు సౌదామిని, చక్కని ఆకారము కలది యుక్త వయస్సు రాగా తండ్రి ఈమెను ఒక సామాన్య బ్రాహ్మణునికిచ్చి వివాహము చేసెను కొలది కాలమునకే భర్త మరణించెను. అప్పుడు ఈమె తల్లిదండ్రుల గృహమున నివసించి యౌవనములో నున్నందున కామవికారము నాపుకొనలేక రహస్యముగ వ్యభిచారము చేయ ప్రారంభించెను. కొంత కాలమును తల్లి దండ్రులు ఈమె దుర్వృత్తిని గ్రహించి కులము నుండి బహిష్కరించి తాము ప్రాయశ్చిత్తము చేసికొని శుద్ధులయిరి. అప్పటి నుండియు ఈమె సిగ్గువిడిచి ఆ నగరమందే ఒక వైశ్యునితో రమించుచు, మద్య మాంసముల భక్షించుచు స్వేచ్ఛగ సంచరించుచుండెను. ఒక రోజున కల్లు త్రాగి ఒడలు తెలియక మాంసమును భక్షించ నుద్దేశించి కత్తి చేతబూని తన పశువుల దొడ్డిలోనికి వెళ్ళి చీకటిలో మేకయని భ్రమించి ఆవు దూడను వధించి కొంత భక్షించి దాని తల మాత్రము ఇంట దాచెను. మరునాడు దయము, ఆవును పాలు పితుక గలందులకు

వెళ్ళిచూడ అది మేకయే కనబడెను ఆవుదూడ లేదు. ఇంటిలోనికి పోయి శిరమును చూడ ఆవుదూడ తలగా గోచరించెను. ఆ సమయమున దాని నోటి నుండి పశ్చాత్తాప పూర్వకముగ శివా ! చంద్రమౌళిః ఎంత పాపమాచరించితిని, అను వాక్కు వెలువడెను. భర్త చూచి కోపించునని భావించి ఆ శిరస్సును, ఎముకలను, చర్మమును దూరముగ భూమిలో పాతివేసి ఏడ్చుచు భర్తరాగా రాత్రి పెద్దపులి వచ్చి ఆవుదూడను మ్రింగివేసెనని అబద్ధమాడెను. ఇట్లు ఎన్నియో పాపము లాచరించి మరణించెను.

యమదూతలు ఈమెను యమలోకమునకు తీసికొని వెడలిరి. అచ్చట యమయాతనల ననుభవించి గోహత్యా పాపమువలన చండాల స్త్రీ అయి ఈ జన్మలో జన్మించెను. సరిగ చూడని దోషముతో అంధురాలయ్యెను. వ్యభిచార దోషమును బట్టి కుష్ఠరోగి అయ్యెను. కొలది కాలము తల్లితండ్రులు పోషించిరి. వారును మరణించిరి. అచ్చటచ్చట యాచించి ఉదరపోషణము చేయుచుండెను. మార్గమున పడియుండి వచ్చుపోవు వారల యచించుచుండెను. ఇట్లుండ వృద్ధాప్యము సమీపించెను. మాఘ మాసము వచ్చెను. ఎంతో మంది దారాపుత్ర సమేతముగ శివభజన లొనర్చుచు గోకర్ణ క్షేత్రమును గూర్చి పోవుచుండిరి. ఈమె గూడ వారితో పూర్వజన్మలో ఆవుదూడను చంపినపుడు శివ శివ చంద్రమౌళిఅని ఉచ్చరించిన పుణ్యవిశేషముచే గోకర్ణము పోవ సంకల్పించెను వారలతో కలసి ఎట్లో గోకర్ణము చేరెను. అచ్చట ఒకచోట కూర్చొని పుణ్యాత్ములారా ! నేను పాపాత్మురాలను ఆకలి యగుచున్నది. ఏమి అయిన ధర్మమొనర్చుడు అని చేతులు చాచి శివరాత్రినాడు శివుని పూజింప వెడలు యాత్రికలు దీనస్వరముతో యుచించుచుండెను. శివరాత్రి యగుటచే యాత్రికులు ఉపవాస నియమము కలవారుగాన, ఎవ్వరును ఏమియు ఈమెకు తినుటకు ఆహారము ఇవ్వరయిరి ఇంతలో రాత్రి అయ్యెను. ఒక భక్తుడు శివపూజకు పోవుచు ఈమె దీనాలాపమువిని తన చేతిలో నున్న మారేడుదళములలో నొక దానిని "ఇదియే నా వద్ద కలదు. ఇంకనేమియు లేదని చెప్పుచు ఆమె చేతిలో పడవేసెను. అప్పుడామె గ్రుడ్డిదగుట వలన చేతితో తడమిభక్ష్య పదార్థము కాదుగదా నాకెందుల కని విసిరివేయ దైవయోగముచే నాబిల్వదళము అచ్చటనున్న శివలింగము పైబడుట తటస్థించెను.

ఆ రోజున ఆహారము లేకపోవుటచే ఉపవాసము సంభవించెను. ఆకలి బాధచే నిద్రపట్టనందువలన జాగరణముగూడ సంప్రాప్తమయ్యెను. బిల్వదళముచే శివుని పూజించిన ఫలముగూడ ఆమెకు సిద్ధించెను. ఈ విధముగ అయత్నముగ నామెకు శివరాత్రి వ్రతము నాచరించు భాగ్యము లభించెను. ఇప్పుడు ఈమె కీవిధముగ మరణకాలము సంప్రాప్తమయినది. కాన శివుడు సంతసించి ఈమెను కైలాసమునకు తోలుకొని రాగలందులకు ఈ విమానమునిచ్చి మమ్ముల పంపెను. ఈమె పాపములన్నియు నశించెను. శివుని ప్రేమకు పాత్రురాలయ్యెను. అని చెప్పుచు శివదూతలు కొంత అమృతమును ఆమె పై చిలకరించగా ఆమె దివ్యదేహమును ధరించెను. వారు అప్పుడాయెను విమానము నధిష్టింపజేసి కైలాసమునకు కొనిపోయిరి. ఇది అంతయు నేను ప్రత్యక్షముగ చూచిన విషయము. కావున ఓ రాజా నీవు సంశయమును విడనాడి గోకర్ణమునకు పొమ్ము. నీ పాపము క్షయించును. బ్రహ్మహత్య నిన్ను వదులును. అని చెప్ప గౌతముని ఆజ్ఞతో నామిత్రసహుడు గోకర్ణక్షేత్రమునకు వెడలెను. అతను ఆ క్షేత్రమును ప్రవేశించినంతనే ఆ బ్రహ్మహత్య అతనిని వదలెను. కాన ఓ నామధారకా ! గోకర్ణము అట్టి పరమపావనమగు క్షేత్రమగుటచే శ్రీపాద శ్రీ వల్లభుల వారు అచ్చట మూడు సంత్సరములు నిలుచుట తటస్థించినది. అని సిద్ధముని నామధారకునితో గోకర్ణ క్షేత్రమును గూర్చి చెప్పెను.

**ఇది గురుచరిత్రమున ఏడవ అధ్యాయము సమాప్తము.**

**దిగంబరా దిగంబరా శ్రీపాదవల్లభ దిగంబరా**

**శ్లో॥ చండాల్యపి యతో ముక్తా**
**గోకర్ణే తత్ర యో...వసత్**
**లింగతీర్థ మయే త్ర్యబ్ధం**
**శ్రీదత్త శ్శరణం మమ ॥**

తా॥ చండాల స్త్రీ దైవయోగమున గోకర్ణ క్షేత్రమునకు వచ్చి శివరాత్రి శివునిమీద తెలియక బిల్వదళ మర్పించినందున విమానము నధిష్టించి కైలాసమున కేగెన.

**“జన్మాద్యస్యయతః”**

**మహర్షి శ్రీ వేదవ్యాస రచిత బ్రహ్మసూత్రులు – – ....**





తా॥ జడ–చేతనాత్మకమై, చిత్రవిచిత్రమైన ఈ జగత్తు యొక్క ఉత్పత్తి, స్థితి మరియు ప్రళయము యెవ్వనిచే జరుగుచున్నవో అట్టి సర్వశక్తిమంతుడే పరబ్రహ్మ పరమాత్మయని చెప్పబడును.

# శ్రీ గురు చరితము

## ఎనిమిదవ అధ్యాయము

**ఓం గణేశాయనమః ఓం శ్రీ గురుదత్తాత్రేయానమః**

**ఓమ్ అవధూత చింతనమ్ శ్రీ గురు దేవదత్త జయ ఓమ్**

శ్రీ పాదుల వారు గోకర్ణ క్షేత్రమున మూడు సంవత్సరములు నివసించి అచ్చటి నుండి శ్రీశైలము గూర్చి వెళ్లిరి అచ్చట నాలుగు నెలలుండి నివృత్తిసంగమమను క్షేత్రమున స్నానమొనర్చి కురుపురము ప్రవేశించిరి. మహాత్ముల దర్శనమే సర్వతీర్థముల ఫలముల నొసంగును. అయినను వారు లోకోద్ధరణము కొరకు తీర్థ క్షేత్రముల పర్యటన మొనర్చుచుందురు. కురుపురము కృష్ణానదీ తీరమున గలదు. శ్రీపాదుల వారు ఆ క్షేత్రముననుండ వారి మహిమ విఖ్యాతమయ్యెను. అచ్చట వారిని సేవించు భక్తులు సంతానకాములయి సంతానమును, దరిద్రులు సంపదలను పొందుచుండిరి. వారచ్చటనుండ వారు మరియొక అవతారమును స్వీకరించవలసిన సందర్భమేర్పడెను. నాయనా ! నామధారకా ! ఆ వృత్తాంతమును వినుము.

ఆ గ్రామమున వేదశాస్త్ర పారంగతుడగు నొక బ్రాహ్మణుడు కలడు. ఆయనకు పరమ పతివ్రతయగు నొక భార్యగలదు. ఆమె పేరు అంబిక. అనేక మంది పుత్రులు పుట్టి మరణించిరి. చివరకు వారికొక కుమారుడు దైవానుగ్రహము వలన జన్మించి బ్రతికెను. కాని అతను మందమతి. ఎనిమిదవ ఏట తండ్రి ఉపనయన మొనర్చి వేదమును చెప్ప ప్రారంభించెను. కాని ఒక మంత్రమయినను ఆ బాలుడు నోటనుచ్చరించ సమర్థుడు కాకపోయెను. అప్పుడు తండ్రి అయ్యో ఎంతకష్టము పూర్వజన్మమున ఎట్టి పాప మొనర్చితినో; ఇటువంటి మూర్ఖుడగు పుత్రుడు ఏల జన్మించెను అని విచారపడి బాలుని శిక్షించసాగెను. దానికి వాని భార్య మనకు లేక లేక ఒకడు మాత్రమే జీవించియున్నాడు, వాడు పురాకృత కర్మ వలన మందమతి యయ్యెను. మీరు వానిని కొట్టి ఏమి ప్రయోజనము ? ఇక మీద వానినిదండించితిరేని నేను ప్రాణత్యాగ మొనర్చెదననెను. అప్పుడు ఆ బ్రాహ్మణుడు చేయునది లేక తన దురదృష్టమునకు వగచెను. కొలది కాలము ననే ఆ బ్రాహ్మణుడు మరణించెను. విధవరాలైన ఆ బ్రాహ్మణ స్త్రీ దారిద్ర్యముతో బాధపడుచు యాచనవృత్తిలో

మూఢుడగు కుమారుని పోషించుచుండెను. బాలునకు వివాహ వయస్సు వచ్చెను. గాని మూఢుడని ఎవ్వరును, పిల్లనివ్వరైరి. అందరును ఈ బాలుని చూచి మూఢా సిగ్గయిన లేదా ! తల్లి యచించి తెచ్చిన అన్నము తిని బ్రతుకుచున్నావు మీ తండ్రి వేదశాస్త్రజ్ఞుడయియుండ నీవు అతనికి కళంకము తెచ్చితివి. పశువువంటి నీ జన్మచే మీ పితరులును అధోగతి నొందెదరు. నీళ్ల మోసి అయినకు జీవించుము; లేదా ప్రవాహములో పడి చనిపొమ్ము అని దూషించిరి.

ఆ బాలుడును వారి మాటలకు కడుదుఃఖించి తన తల్లితో అమ్మా ! నేను తెలివి తక్కువ వాడనగుటచే అందరు నన్ను నిందించుచున్నారు కాన నేను ప్రవాహములో పడి చచ్చెదను అనెను. తల్లియు దుఃఖ సముద్రమున మునిగి బాలునితో పాటు తానును కృష్ణలో పడి దేహత్యాగ మొనర్చగలందులకు సన్నద్ధురాలాయెను. ఇంతలో వారి అదృష్టవశమున శ్రీ పాదుల వారు అచ్చటకు స్నానము నిమిత్తము వచ్చిరి వారి పాదములకు  ఆ బ్రాహ్మణ స్త్రీ నమస్కరించి స్వామీ మేము ఈ ప్రవాహమున పడి మరణించ నిశ్చయించుకొంటిమి. మాకు ఆత్మహత్యా దోషము లేకుండునటుల మీరనుగ్రహించుడని ప్రార్థించెను. ఆ మాట విని దయానిధియగు శ్రీపాదలువారు ఆమెతో మీకు ఏమి సంకటము ప్రాప్తమయ్యెను. దుస్త్యజములగు ప్రాణములనెందుకు విడువ సమకట్టితిరి అని ప్రశ్నించెను. అప్పుడు ఆమె స్వామీ ఈ బాలుడు నా కుమారుడు, మిక్కిలి మందమతి అందరు ఇతనిని దూషించుచున్నారు. వీని తండ్రి వేదశాస్త్ర పారంగతులు అట్టి వారి గర్భమున ఈ మందమతి ఏల జన్మించెను ? నాకు జన్మాంతరమున నైన మీవంటి సత్పుత్రుడు కలుగుటకు ఏదయిన ఉపాయమున్న సెలవిండు, మా భాగ్యవశమున నెడు మీ దర్శనమయ్యెను. మీరు శరణాగత రక్షకులు. నేను ఈ సంసారములో జన్మించి ఒక్క సుఖమయిన నెఱుగను ఎందరో కుమారులు గలిగిపోయిరి. నా సౌభాగ్యమా నష్టమాయెను. అజాగళస్తనమును బోలిన ఈ మూర్ఖపు బాలుడు మాత్రము కలడు. వాడివలననేమియు ప్రయోజనము లేదు. రాబోవు జన్మలోనయిన ఎట్టి పుత్రుని వలన పితరులకు మోక్షము సిద్ధించునో, ఎవ్వనిని సర్వులు పూజింతురో అట్టి లోక పూజ్యుడయిన పుత్రుడు నాకు కావలయునను నాస కలదు. అందులకేమయిన ఉపాయమున్న సలెవిండని ప్రార్థించెను.

ఆ మాటలు విని శ్రీపాదలు వారు దయగలవారై అమ్మా నీవు శివుని ఆరాధించుము నీవు కోరిన లక్షణములు గల హరియంతటి కుమారుడు నీకు వచ్చు జన్మమున గలుగుగలడు. పూర్వమొక గోపిక ప్రదోషకాలమున ఈశ్వరారాధనము చూచిన పుణ్యముచే కృష్ణుడామెకు పుత్రుడయ్యెను. కాన నీవు ఈశ్వరుని ఆరాధించితివేని శ్రీమహావిష్ణువే తప్పక నీకు కుమారుడు కాగలడు. అని చెప్ప ఆ బ్రాహ్మణ స్త్రీ స్వామీ ఆ గోపిక ఎవ్వరు ? ఎప్పుడు శివపూజ చూచెను. ఆ వ్రతమేమియో నాకు విశదముగా చెప్పుదని శ్రీపాదుల వారి పాదములయందు శిరముంచి నమస్కరించెను.

అప్పుడు శ్రీపాదుల వారిట్లు చెప్పుచుండిరి.

స్కాందపురాణమున ఈశ్వరుని మహిమను ప్రకటించు ఒక కథ కలదు, అదియే నీకు చెప్పుచున్నాను. వినుము, ఉజ్జయిని అను ఒక పట్టణము గలదు దానిని అతిధార్మికుడగు చంద్రసేనుడను నొక రాజు పాలించుచుండెను. అతని వద్ద చింతామణి యనునొక రత్నము కలదు. ఆ రత్నము యొక్క ప్రకాశము సోకినంతనే ఇనుము బంగారమగును. ఆ రాజు యొక్క భక్తికి సంతసించి శివుడతనికి ఆ రత్నము నను గ్రహించెను. ఇతని వద్ద ఇట్టి రత్నముండుట ఇతర రాజులు గ్రహించి ఆ రత్నమును సామదానభేదములతో తీసికొన యత్నించిరి. రాజు అందుల కొడంబడనందున వారు చతురంగ సైన్యములతో పట్టణము నకస్మాత్తుగ ముట్టడించిరి. ఆ రోజు త్రయోదశి శనివారమయ్యెను. రాజు శివభక్తుడగుటచే శివునినే అనన్యముగ శరణమొంది మనస్సును ఏకాగ్రపరచి ప్రదోష కాలమున శివాలయమునకు వెళ్లి అచ్చట మహాకాళమను శివలింగమును భక్తితో నర్చించ ప్రారంభించెను. అదే సమయమున కొంతమంది గోప బాలురు అచ్చటికి వచ్చి ఆ రాజు చేయు శివపూజను చూచిరి. వారికి గూడ అట్లే శివపూజ చేయ సంకల్పమయ్యెను. వెంటనే వారు వారి గొల్లపల్లె సమీపముననొక చెట్టుక్రింద స్థలముకు శుభ్రపరచి ఒక గుండ్రని రాతిని శివునిగ నచ్చటస్థాపించి భక్తితో అచ్చట వారికి సంప్రాప్తములయిన పత్ర పుష్పములతో పూజించి ఉదకమునే నైవేద్యముగ సమర్పించి భక్తి చేయుచుండిరి. చీకటి పడినను కొడుకులు రానందున తల్లులు కేకలు వేయుచు రాగా అందరునూ వారి వారి గృహములకు తల్లులతో వెడలిరి. కాని ఒక గోపబాలుడు మాత్రము మనస్సును శివుని

యందు లయింపచేసి ధ్యానములోనున్నందున తల్లి పిలుచుటయు వినడయ్యెను, తల్లివచ్చి అతనినికొట్టి పూజోపకరణములన్నియు చెల్లాచెదురు చేసెను లింగమును దూరముగా విసిరవేసెను. అప్పుడు ఆ బాలుడు ధ్యానమునుండి బహిర్గతుడయి శివపూజ పాడయిపోయినందులకు విలపించుచు చిత్తమున శివుని స్మరించుచు ప్రాణముల త్యజించ నుద్యుక్తుడయ్యెను. వెంటనే శివుడు ప్రత్యక్షమయ్యెను. అద్భుతమగు శివాలయమచట వెలసెను. సూర్యునితో సమానమగు ప్రకాశముగల శివలింగమందుద్భవించెను. శివుడు అచట నిజరూపములో ప్రత్యక్షమయి బాలుని లేవదీసి భక్తాగ్రేసరా ! నీ భక్తికి మెచ్చితిని. నీకిష్టమయిన వరము వేడుకొనుమనెను. అంతనా బాలుడు ఈశ్వరా; మా తల్లి తెలియక అజ్ఞానముతో నీపూజకు భంగమొనర్చెను. ఆమెను కోపించకక రక్షింపుము అని ప్రార్థించెను అప్పుడు శివుడు ఆ బాలునితో మీ అమ్మ నీవు చేయు శివపూజను చూచెను గాన ఆమె ధన్యురాలు వచ్చు జన్మములో కృష్ణునకు తల్లి కాగలదు. నీవు ఇహలోకమున సమస్త సౌఖ్యముల ననుభవింతువు అని వరమిచ్చి ఆ లింగమందు శివుడంతర్హితుడయ్యెను. ఆ లింగము కోటిసూర్యులతో సమానముగ ప్రకాశించుచుండెను. ఆ ప్రకాశము భూమ్యాకాశము నిండిపోయెను. పట్టణము చుట్టు ముట్టడించిన రాజులు చీకటి రోజున పట్టణమున నట్టి ప్రకాశముండుటకు ఆశ్చర్యచకితులై తమలో తామిట్లను కొనిరి. ఈ పట్టణము నేలు రాజు గొప్ప మహిమ గలవాడుగ కనపడుచున్నాడు. ఇతనితో విరోధము మనకు చెల్లదు అని భావించి తెల్లవారగనే రాజును సమీపించి రాజుతో సఖ్యమొనర్చిరి. ఆచంద్రసేన మహారాజు కూడనుగోపాలబాలుని భక్తి విశేషము చూచి అచ్చట నూతనముగ వెలసిన శివాలయమునుగాంచి, సంతసించి, ఆ బాలునిగోపాలుర కధిపతిగ చేసి కొంత రాజ్యమతనికొసగెను. అప్పుడు గోపాలబాలుడు తల్లిఇ సమీపించి శివుడిచ్చిన వరమును ఆమెకు చప్పెను. కొంతకాలమున కట్లే ఆమె యశోద అయి పుట్టి పూజను చూచెనె గాని స్వయముగ చేయనందున కృష్ణుడామె గర్భమున జన్మించకున్నను ఆమెనే తల్లిగ భావించుటయు ఆమెయు, కృష్ణుడే నా కుమారుడని భావించుటయు జరిగెను. శివుడు ప్రసన్నుడయినచో దుర్లభ మెద్దియు లేదు. కాన నీవుగూడను భక్తితో ప్రదోష వ్రతమాచరించితివేని నావంటివాడే నీకు రాబోవుజన్మలో పుత్రుడయి పుట్టును. అని చెప్పుచు ఆమె కష్టమును చూచి జాలినొంది ప్రసన్నుడయి అమూర్ఖుడయిన బాలుని శిరమున

తన దివ్య హస్తమనుంచుసరికి ఆ బాలుడు గొప్ప జ్ఞాని అయి వేదశాస్త్రవేత్త అయ్యెను. వేదశాస్త్రముల నవర్గళముగ పఠించునా బాలుని చూచి తల్లి విస్మితురాలయ్యెను. శ్రీపాదులు ఈశ్వరులే యను భావన ఆమెకు కలిగెను. క్షణక్షణమునకు నమస్కరించెను. స్వామీ; శివుడే మీరు, మీకన్నవేరుగ శివుడు లేడు. మిమ్ములనే ప్రదోషమున పూజించెదను. మీవాక్యమెన్నడును వ్యర్థముగాదు. అని చెప్పి అది మొదలు కాని ఆమె ప్రదోషుల యందు భక్తితో శివుని పూజించుచుండెను. బాలుడు విద్వాంసుడగుట అందరకు తెలిసెను.





అతనికి వివాహమయ్యెను శ్రీ పాదుల వారి అనుగ్రహమున పుత్రపౌత్రాదులతో కూడుకొని ఆ బాలుడు ఐహిక ఆముష్మిక సుఖముల నొందెను. గాన ఓనామధారకా; ఎవరు గురుకృపకు పాత్రులో అట్టి భక్తులకు దయా సముద్రుడగు సద్గురువు సర్వాభీష్టములొసంగి రక్షించును.

**ఇది గురుచరిత్రమున ఎనిమిదవ అధ్యాయము సమాప్తము**

**దిగంబరా దిగంబరా శ్రీపాదవల్లభ దిగంబరా**

**శ్లో॥ కృష్ణాద్వీపే కురుపురే కుపుత్రం జననీయుతం :**
**యోహిమృతోఽ్య రపాచ్ఛీత్రత్ శ్రీ దత్తశ్శరణం మమ॥**

తా॥ శ్రీపాదులవారు మందమతియగు బాలుని విద్యావంతునిగా నొనర్చుట.

గోపబాలుడు శనిప్రదోషమున బాలలీలగ శివుని పూజించుట శివుడు ప్రసన్నుడై వరమొసంగుట.

# శ్రీ గురు చరితము

## తొమ్మిదవ అధ్యాయము

**ఓం ఓం గణపతయే నమః శ్రీ దత్తాత్రేయాయ నమః**

**శ్రీపాద శ్రీవల్లభ శ్రీ గురుదేవతాభ్యోనమః**

సిద్ధముని చెప్పిన విషయమును విని నామధారకుడు చేతులు జోడించి ఇట్లు ప్రశ్నించుచున్నాడు. స్వామీ సిద్ధము నీంద్రా కురుపురమున (కురుగడ్డ) ఆపైన జరిగిన శ్రీపాదుల వారి లీలల సెలవిండు అని ప్రార్థించ అతని మంచి భావమునకు సంతసించి సిద్ధముని ఇట్లు చెప్పుచుండెను. నామధారకా! వినుము.

ఆ గ్రామమున నొక రజకుడు కలడు. అతను శ్రీపాదుల వారి ముఖ్య సేవకుడు. శ్రీవారు నిత్యము ప్రాతఃకాలమున స్నానమునకు కష్ణకు వెళ్లుదురు. ఎట్టి మహాత్ముని చూచినంతనే చూచువారికి గంగా స్నానముకంటె నధికమగు ఫలము సిద్ధించునో అట్టివాడయ్యు లోకానుగ్రహార్ధము నిత్యము స్నానమొనర్చుచుండును. వారు వచ్చునపుడు వారి వెంట నీ చాకలి వెళ్లి భక్తితోవారికి నమస్కరించి వారివస్త్రములను శుభ్రముగ నుతుకును. ఇంతియ కాక త్రికాలములయందు వారిని సమీపించి వినయంతో మనోవాక్కాయ పూర్వకముగ దండప్రణామమాచరించును. ఇట్లు కొన్ని దినములు జరిగెను. ఒక రోజున వారు సంతసించి ఓరీ ! మంచి పుణ్యమొనర్చుచుంటివి. నీకు రాజ్యమొసంగెత సుమా అని అనిరి. వాడు దీనభావముతో మీరు సత్య సంకల్పులు. మీరు తలచిన నెద్దియు అసత్యముగాదు అని చెప్పుచు సంతసించెను. ఇట్లేంతో కాలము జరిగెను. అతనికి శ్రీపాదుల వారియందు దినదినమునకు భక్తి అధికమగుచుండెను. వారిని దూరముగ చూడగనే నమస్కరించును. ఉదయముననే వారి ఆశ్రమమునకు వెళ్లి అక్కడ స్థలశుద్ధి చేయును. ఇట్లెంతో కాలము జరిగెను.

వైశాఖ మాసము మధ్యాహ్న సమయమున ఒకనాడు వాడు కృష్ణానదిలో బట్టల నుతుకుచుండ నొక మ్లేచ్ఛరాజు తన దారాపుత్ర సమేతముగ ఒక పడవయందు విహారముగ నానది మధ్యన పోవుచుండుట నతడు గాంచెను. నదికి రెండు తీరముల యందు ఏనుగులు, గుఱ్ఱములు, కాలిసైన్యము కనులకు పండువుగ నిలబడెను చక్కని వాయిద్యముల ధ్వని కర్ణ పేయముగ

వినబడుచుండెను చాకలివాడు వాయిద్యముల ధ్వని విని తలయెతి చూచుసరికి అతని దృష్టికి పడవయందలి ఆమ్లేచ్ఛరాజు పరివార సమేతముగ గోచరించెను. అప్పుడు వాడిట్లనుకొనెను. వైభవము లేని జన్మ పశువుతో సమానము. నేను ఎంత దురదృష్టవంతుడనో, సౌఖ్యమన్నదే ఎరుగను.

ఈరాజెంత ధన్యుడో; ఏ ఈశ్వరుని ఆరాధించెనో; ఏ గురువును సేవించెనో; ఇంత ఐశ్వర్యము ననుభవించుచున్నాడు అని చింతించుచు మామూలు ప్రకారము తన గురువైన శ్రీపాదుల సమీపించి దండప్రణామమాచరించి నిలబడెను అతనిని చూచుటతోడనే శ్రీపాదులవారు అతని మనోగతము గుర్తెరిగి, ఏమిరా; ఏదియో మనస్సుతో యోచించుచుంటివి. నీహృద్గత మేమియో దాచక చెప్పుమనిరి.



అప్పుడా చాకలి స్వామీ ఈ దినమున కృష్ణలో నొక తురకరాజు విహారార్థముగ నొక వడవనధిష్టించి విహరించుచుండెను. ఏ దేవుని పూర్వజన్మమున నరారాధించుటచే నంత సుఖము అతనికి సిద్ధించెనో అని అనుకొంటిని. ఈ సంసారములో అజ్ఞానులమగు మాకు జితేంద్రియలము కాకపోవుటచే నిట్టి వాసనలు కలుగుట స్వభావము. స్వామీ మీపాదభక్తియే నాకు చాలును అని అనెను. వాని మాటలు శ్రీపాదులవారువిని ఓరీ నీకు రాజ్యభోగేచ్ఛ కలిగినది కాన తప్పక ననుభవింతువు. మనమున కలిగిన కోరిక నెరవేరనిచో మనస్సు శాంతించదు. వాసనలు నిశ్శేషముగ పోవనిచోనవి జన్మాంతరమునకు దారి తీయును. కాన నీ భక్తికి సంతసించిని నీవు మ్లేచ్ఛరాజువై రాబోవు జన్మలో జన్మింతువు. అఖండ సౌఖ్యములు అనుభవింతువు అనిరి. అప్పుడు రజకుడు వారితో స్వామీ మీచరణములతో నాకు వియోగము కలుగకూడదు. రాబోవు జన్మమందును మీదర్శనభాగ్యము నాకు ఘటించవలెను. ఇదియే నాకోరిక అన శ్రీపాదుల వారు నీవు వైడూర్య (బిదర్) నగరమునకు రాజువు కాగలవు. నేనును ఈ అవతారమును తొందరలో చాలింపబోవుచున్నాను కారణాంతరమున నృసింహసరస్వతీ అను

యతిరూపమున నవతరించుదును. నీవు మ్లేచ్ఛరాజవయిన పిదప నీకోరిక ప్రకారమే అంత కాలము నన్ను దర్శించెదవు. నాదర్శన మాత్రముననే ఆ జన్మలో జ్ఞానము ఉత్పన్నమగును, చింతిచంకుము. ఆ జన్మలో అని అతనినోదార్చి సాష్టాంగముగ నమస్కరించిన అతనితో ఓరీ నీకు ఈ జన్మమందే రాజు కావలయునను కోరిక గలదా చెప్పుమనిరి. అప్పుడు వాడు స్వామీ వృద్ధుడనయిన నేను ఇప్పుడు రాజునయిన నేమి ఫలము ? మీ ఆజ్ఞ ప్రకారము రాబోవు జన్మలోననే రాజ్య మనుభవించెదను. రాజునయ్యెదను, యౌవనమున గదా భోగములు సంతోషదాయకములు. అనియన మంచిది. అట్లే నీవు తొందరగ జన్మాంతర మొందుమనిరి. వెంటనే వాడు ప్రాణముల త్యజించి వైడూర్య నగరమున మ్లేచ్ఛ కులమున రాజైపుట్టెను. ఇతని కథ ఈగురుచరితమున ప్రసంగ వశమున ముందు చెప్పబడును.

శ్రీపాదుల వారు కురుపురమున నిట్లెన్నియో మహిమలప్రదర్శించిరి అవి అన్నియు చెప్పవలయుననిన గొప్ప గ్రంథమగును. కాన నీగురుచరితమందు ఇంత మాత్రమే సంక్షిప్తముగ చెప్పబడినది. ఇట్లు కొంతకాల మక్కడ నివసించి తాను మరియొక అవతారమును స్వీకరించ దలచి ద్వాదశి కృష్ణ పక్షము అశ్వయుజ మాసము హస్తానక్షత్రమునాడు కృష్ణ యందు తన భౌతిక దేహమును అదృశ్యము చేసిరి. లోక దృష్టికి అదృశ్యుడయి ఉన్నను ఇప్పటికి త్రిమూర్తి స్వరూపుడయి ఆ కురుపురమున నుండియే ఉన్నారు. భక్తులగువారికి దర్శనమిచ్చి వారల రక్షించుచుందురు. శ్రీపాదలు వారి పాదుకలు ఇప్పటికి కురుపురమున ప్రతిష్ఠింపబడి యున్నవి. ఆశ్వయుజ బహుళ ద్వాదశినాడు ఎందరో భక్తులు అచ్చటకు వెళ్లి వారి పాదుకల నారాధించి మనోభీష్టములనొందుచుందురు. శ్రీ పాదుల వారి నివాసముచే ఆ కురుపురము భూలోకమందలి క్షేత్రములన్నింటిలోను ప్రసిద్ధమయి వరాజిల్లుచున్నది.

**ఇది గురుచరితమున తొమ్మిదవ అధ్యాయము సమాప్తము.**

**దిగంబరా దిగంబరా శ్రీపాదవల్లభదిగంబరా**

**శ్లో॥ రజ కాయాపి దాస్యన్యో రాజ్యం కురుపురేప్రభుః**
**తిరోభూదజ్ఞ దృష్ట్యాస శ్రీదత్తశ్శరణంమమ ॥**

తా॥ శ్రీపాదులవారు కురుగడ్డలో నుండి ఒక చాకలి వాని భక్తికి ప్రసన్నులై నీవు రాబోవు జన్మలో...బీదర్...కు రాజువు కాగలవని చెప్పుట.

# శ్రీ గురు చరితము

## పదియవ అధ్యాయము

**ఓమ్ అవధూత చింతనమ్ శ్రీ గురుదేవదత్త జయఓమ్**

**ఓం శ్రీదత్తగురవే నమః ఓం శ్రీగణాధిపాయ నమః**

నామధారకుడు సిద్ధమునితో శ్రీపాదులవారు కురుపురమునందు వారి అవతారమును పరిసమాప్తి నొందించిన పిదప ఆ క్షేత్రమున నెవ్వరయిన వారి వలన నభీష్టముల నొందిరా; సెలవిండని ప్రశ్నించ సిద్ధముని ఇట్లు చెప్పుచుండెను.

నామధారకా; వారి మహిమ నేనేమి చెప్ప సమర్ధుడను. కార్యార్ధము మరియొక అవతారమును స్వీకరించనుద్ధేశించి లోకదృష్టికి వారు ఆయువతారమును సమాప్తి నొందించినటుల కనబడుటయే దాని గుప్తరూపంబున ఇప్పటికి అచ్చట నుండియే యున్నారు. పరమాత్మ స్వరూపులగు మహాత్ములకట్టి సామర్థ్యముండుట సహజము. కురుపురము భక్తులకు నిధివంటిది. క్షేత్రదర్శనము వలననే భక్తులు వారి మనోరథముల నొందెదరు. శ్రీపాదులకు నివాస స్థానమయిన కురుపురము యొక్క మహిమ పూర్తిగ వర్ణింప సమర్ధుడను కాకున్నను నీవు గురుభక్తుడవు అగుటచే నీకొక్క నిదర్శనము చెప్పెద. దృఢమయిన భక్తిగల దీరుడు గుర్వను గ్రహమునకు పాత్రుడయి ఇహలోకమున సుఖమును పరలోకమును సద్గతియో నొందగలడు.

ఆకాలమున కాశ్యప గోత్రోద్భవుడైన వల్లభేశుడను పేరుగల ఒక బ్రాహ్మణుడు కలడు. అతడు ఆచారవంతుడు. కుటుంబి. వాణిజ్యముచే జీవించువాడు. అతను ప్రతి సంవత్సరము కురుపురమునకు యాత్రగా వెళ్ళు నియమము గలవాడు. ఒక సంవత్సరము అతను వ్యాపారమునకు పోవుచు నాకు ఈ సంవత్సరమున నధికముగ లాభమువచ్చుచో కురుపురమున శ్రీపాదుల వారి ప్రీతి కొరకు సహస్ర బ్రాహ్మణ సంతర్పణమును చేసెదనని మ్రొక్కుకొనెను. ఆ సంవత్సరము అతను ఎచ్చటనేమి వ్యాపారము చేసినచ్చట నత్యధికమగు లాభము కలిగెను అందుచే నతడు కడు సంతసించి తాను సంకల్పించిన విధముగ కురుపురమున బ్రాహ్మణ సంతర్పణ చేయగలందులకు తగినంత ద్రవ్యమును వెంటనిడుకొని కురుపురమునకు పోవుచుండెను. కొంతమంది తస్కరులు ఈ విషయము గ్రహించి మేమును మీతోడ కురుపురమునకు

వచ్చుచున్నామని కపట మైత్రిని ప్రదర్శించి అతని వెంట ప్రయాణమయిరి. ఆ బ్రాహ్మణుడు వారల విశ్వసించెను. రెండు మూడు రోజులు అట్లే అతని వెంట జని ఒక కీకారణ్యమార్గమున జనరహితమగు నొకచోట ఖడ్గముతో అతని శిరమును ఛేదించ నుద్యుక్తులయిరి. ఆ వల్లభేశ్వరుడు జేయునది లేక శ్రీపాదుల వారి పాదపద్మముల ననన్యముగధ్యానించెను. ఇంతలో వారు అతని శిరమును ఖండించిరి. అప్పుడు భక్తవత్సలుడగు శ్రీపాదులు జటాధారియై భస్మము ధరించి శూలమును చేతపూని కృద్ధుడయి ఆ దొంగల సంహరించెను. అంతలో ఆ దొంగలలో నొకడు మాత్రము శ్రీపాదలు వారి పాదములపై బడి నేను నిరపరాధుడను వీరు దొంగలని తెలియక అజ్ఞానముచే వీరి వెంటవచ్చితిని. మీరు సర్వసాక్షులుగాన నన్ను రక్షింపుడని ప్రార్థించెను. శ్రీపాదలు వారు అతనికి అభయము నొసంగి కొంత భస్మము అతని చేతికిచ్చి ఈ భస్మమును మరణించిన బ్రాహ్మణుని కంఠమునకు పూసి తెగిన శిరమున కలుపుమని చెప్పిరి. వాడట్లు చేయ అమృతదృష్టితో శ్రీపాదుల వారు ఒకసారి చూచుసరికి నిద్రపోయిన వానివలె ఆ మరణించిన బ్రాహ్మణుడు జీవించెను. శ్రీపాదులు అంతర్హితులయరి. అంతలో తెల్లవారెను సూర్యోదయమయ్యెను ఆ బ్రాహ్మణుడు వీరందరు ఎటుల చచ్చిరి ? ఎవ్వరు వీరల సంహరించిరి అని అచట నున్నవానిని ప్రశ్నించ అతడిటగ్లు చెప్పెను.

బ్రాహ్మణోత్తమా; ఎవరో ఒక గొప్ప తపస్వి వచ్చి శూలముతో వీరల సంహరించెను. భస్మముతో మీ శిరమును సంధింపచేసి మిమ్ముల బ్రతికించెను. ఇపుడే అంతర్హితుడాయెను. దీనిని బట్టి చూడవచ్చినవారు ఈశ్వరుడయి ఉండ నోపునని తోచుచున్నది అని చెప్పెను. అప్పుడు ఆ బ్రాహ్మణుడు శ్రీపాదుల వారి దర్శనము తనకు కానందులకు కడు భిన్నుడయి అత్యధధికమగు భక్తితో కురుపురమునకు వెళ్ళి అచటి శ్రీపాదుకల షోడశోపచారములతో పూజించి అనుకొ్న దానికి అధికముగ చతుస్సహస్ర బ్రాహ్మణులకు సంతర్పణము గావించెను. ఇట్లెంతమందియో ఆ క్షేత్రమున శ్రీపాదుల వారి పాదుకల నారాధించి ధన్యులయిరి.

కాన ఓ నామధారకా; కురుపురమున శ్రీపాదులవారు నేటికి కలరని విశ్వసింపుము వారియొక్క రాబోవు అవతారమును నీవు పై అధ్యాయమున వినగలవు.

**ఇది గురుచరిత్రమున పదియవ అధ్యాయము సమాప్తము**



**దిగంబరా దిగంబరా శ్రీపాదవల్లభ దిగంబరా**

**శ్లో॥ విశ్వాసఘాతిన శ్చోరాన స్వభక్తఘ్నా న్నిహస్యసః ।**
**జీవయామాస భక్తంస శ్రీదత్తశ్శరణంమమ ॥**

భా ॥ ఒక భక్తుడు వ్యాపరాములో అధికము లాభము రాగా "కురుగడ్డ"లో శ్రీపాదస్వామి వారి సాన్నిధ్యమున బ్రాహ్మణ సమారాధాన చేయగలందులకు ద్రవ్యము వెంట తీసుకొని యాత్రగపోవుచుండ కొంతమంది దొంగలు తాము యాత్రికులమని చెప్పుట వెంటవచ్చి అతని తల నరుకుట అప్పుడు శ్రీపాదులవారు ప్రత్యక్షమై భస్మముతో భక్తుని బ్రతికించుట.

# శ్రీ గురు చరితము

## పదునొకండవ అధ్యాయము

**ఓం గణేశాయనమః**

**శ్రీపాద శ్రీవల్లభ శ్రీనృసింహసరస్వతీ దత్తాత్రేయపర బ్రహ్మణేనమః**

నామధారకుడు సిద్ధమునితో స్వామీ దయామయుడయిన శ్రీపాదవల్లభులవారు కురుపురమున వారి అవతారమును సమాప్తము జేసి ఎచట, నెవ్విధముగ, నేరూపముతో నవతరించిరో సెలవిండని ప్రశ్నించ సిద్ధముని ఇట్లు చెప్పుచుండెను.



నామధారకా వినుము, అంబిక యను బ్రాహ్మణ స్త్రీ శ్రీపాదులవారి ఉపదేశానుసారము శనిత్రయోదశి ప్రదోషమున ఈశ్వరునిభక్తితో నారాధించుచుండెనను విషయము నీవు విని యుఏంటివి. ఆమెయే మరణించి ఉత్తర దేశమున "కరంజ" నగరమున ఒక బ్రాహ్మణునకు కుమార్తె అయి జన్మించెను. ఆమెకు తల్లిదండ్రులు, అంబ, యని నామకరణ మొనర్చిరి. ఆమెకు వివాహ వయస్సు రాగా మాధవుడను పేరుగల ఒక బ్రాహ్మణునికిచ్చి వైభవముతో వివాహము చేసిరి. పూర్వ జన్మ సంస్కారము ననుసరించి ఈ జన్మయందును ఈ నూతన దంపతలు శని ప్రదోషమున శివుని భక్తితో నారాధించుచునే

యుండిరి. కొంత కాలమునకు ఆమె గర్భవతి అయెను. శాస్త్రవిధి ప్రకారము సీమంతము పుంసవనము అను సంస్కారములు గావింపబడెను. ముత్తైదువలకు వాయనము లిచ్చిరి. నవమాసములు పూర్తికాగా నాపతివ్రత శుభదినమున ప్రసవించెను. బాలుని చూచి తల్లిదండ్రులు హర్ష నిర్భరులైరి. పుట్టిన బాలుడు తాను ఈశ్వరావతారమని తెలియ జేయుటకోయన పుట్టుట తోడనే ఓం అను ప్రణవము నుచ్ఛరింప సాగెను. అందరును ఆశ్చర్య చకితులైరి. బ్రాహ్మణుడు సంతోషముతో జాతకర్మ చేసెను. జ్యోతిష్కులు వచ్చి ఆ బాలుని జన్మకాలమును విమర్శించి ఇతను గురువులననియు, ఇతనివలన ఎందరో ఉద్ధరింపబడుదురనియు, ఈ బాలుని వాక్యము వేదముతో సమమనియు, ఇతని పాదము భక్తులకు చింతామణి యనియు, ఉండుచోట నవనిధులు, అష్ట సిద్ధులు దాస్యమొనర్చుచుండు ననియు, ఇతనికి భార్యగాని పుత్రులు గాని ఉండరనియు జగద్వంద్యుడయి పతితుల పావనమొనర్చునకు గాను అవతరించిన ఒక మహాత్ముడనియు చెప్పి ఆ బాలునకు నమస్కరించిరి. తల్లిదండ్రులు ఇట్లు చెప్పిన జ్యోతిష్కులు వస్త్రములతోడను భూషణములతోడను సత్కరించిరి. ఆ బాలుని కడుప్రేమతో పోషించుచు దృష్టిదోషము తగులునేమోయని రక్షాబంధనము చేయించుచుండిరి. బాలుడు అప్పుడప్పుడు సహజముగ ప్రణవోచ్చారణము చేయుంచుడుట చూచి అందరును అత్యాశ్చర్యము నొందుచుండిరి.

పన్నెండవ రోజున మాధవుడు ఆ బాలునకు నరుడయు హరిలక్షణము లుండుట చేసి 'నరహరి' యను నామకరణము చేసెను. బాలునకు సరిపోవు స్తన్యము తల్లివద్ద లేకుండెను అప్పుడామె భర్తతో నాపాలు మన బాలునకు సరిపోవుటలేదు. ఇతని ఆకలి తీరకున్నది. మీరు ఒక ఉపమాతను గాని ఒక పాలిచ్చు మేకను గాని ఏర్పాటు చేసిన బాగుండునని చెప్పుచుండ చంకనున్న ఆ బాలుడు ఆ మాట విని నవ్వుచు తల్లిస్తనముల తన చిన్నహస్తములతో స్పృశించెను. వెంటనే ఆమెస్తనములు పాలతో నిండుటయే గాక ఆమె ధరించిన రవికయ తడసి అందుండిపాలు భూమియందు పడెను తల్లిదండ్రులాశ్చర్యపడి దృష్టిదోషము తగులునను భయముతో ఈ విషయమును లోకమునకు ప్రకటింపరైరి.

బాలుడు అడుగులిడ సాగెను. కాని ఓంకారము తప్ప మరియే అక్షరమునయినను ఉచ్ఛరింపకుండుట చేత తల్లి దండ్రులు మనకు దైవయోగమున బాలుడు జన్మించెనాయని చింతించుచుండిరి. జ్యోతిష్కుల

ప్రశ్నించిరి. వారు మీ కులదేవతల నారాధించుడు ఆదివారమున అశ్వత్థపత్రము నందు అన్నమిడి ఈ బాలునిచే భుజింప చేయుడు. అని ఏమేమియో ఉపాయముల బోధించిరి. తల్లిదండ్రులు అట్లోనర్చిరి గాని ఆ ఉపాయములన్నియు నిష్ప్రయోజనములయ్యెను. ఎవ్వరు ఏమి చెప్పిన అశబ్ధధముల అర్థమును గ్రహించును వినును కాని ఓంకారము తప్ప ఇతరాక్షరమేమియు ఉచ్ఛరించకుండుటచే వారు ఈ బాలుడు మనము చెప్పిన విషయముల వినుచున్నాడు. నిజముగా మూగవాడగుచో వినజాలడు గదా; ఇదియేమి చిత్రమని ఆశ్చర్యపడుచుండిరి ఇంతలో ఏడుసంవత్సరములు పూర్తి అయ్యెను.

గర్భాష్టమమున బ్రాహ్మణబాలునకు ఉపనయనము చేయవలయుగదా, మాటరాని మనబాలునకు ఉపనయనమెట్లు చేయగలము అని తల్లిదండ్రులు చింతా నిమగ్నులయిరి అయ్యో; ఈశ్వరుని ప్రదోష కాలమున ఆరాధించితిమే. మన మొనర్చిన శివపూజ వ్యర్థమెట్లయ్యెను. మనకు ఈ బాలుడు ఒక్కడేగదా సంతానము, ముందు మన గతియేమి ? అనివిలపించుచున్న తల్లిదండ్రుల చూచి బాలుడు దుఃఖింప వద్దని సంజ్ఞ చేయుచు అచ్చటనున్న ఒక ఇనుప వస్తువును చేతితో స్పృశించ నది పదహారువన్నె బంగారమయ్యెను. దానికి వారాశ్చర్య పోయి ఇది నిజమా స్వప్నమాయని యనుకొనుచు ఏయే ఇనుప సామాగ్రుల నతని చేతికిచ్చిరో అవి యన్నియు సువర్ణ మయములయ్యెను. అప్పుడు ఆ బాలుని కౌగలించుకొని బాలకా; కులదీపకా; నీవు చూడ ఒక కారుణిక మహాపురుడగ నగపడుచున్నావు. నీవు మౌనము ధరించుటకు కారణమేమి మేము అజ్ఞానులము, అమృతమువంటి వాక్యములను నీనోట విన ఆసపడుచుఅన్నము. అని దీనము పలికిరి. వారి మాటలు విని నవ్వుచు నడుములకు మేఖలాబంధము జంధ్యము పడిన వెంటనే మాటలాడుదునని సంజ్ఞతలతో తెలియమజేసెను. వారు సంతసించిరి. జ్యోతిష్కుల పిలిపించి ఉపనయనమునకు సుముహూర్తము నిశ్చయించిరి సంభారములను సమకూర్చిరి. వేదవేత్తల నాహ్వానించిరి. ఆప్తులు చుట్టములు నందరును వచ్చిరి. ఇరుగు పొరుగువారు ఈ బ్రాహ్మణునకు పిచ్చియా; మూగవానికి ఉపనయనమేల ఇంతద్రవ్యమును ఊరకే వ్యయము చేయుచున్నాడు గాయత్రీమంత్రమునెట్లు ఈ బాలునిచే నుచ్చరింప జేయుదురు ? అని ఆక్షేపించుచుండిరి. కొంతమంది ఏమి ఎట్లయిన మనకేమి ? మనకు మృష్టాన్నము, తగిన దక్షిణ లభించును గదా అని అనుకొనిరి.

ఈ విధముగా వచ్చినవారు ఎవరికి తోచినట్లువారు అనుకొనుచుండ తల్లిదండ్రులు మాత్రము ఆ బాలుడు దేవుడను భావముతో ఇతరుల వాక్యములను లెక్కచేయక ఉపనయన మొనర్చుటకే బద్ధ దీనులయిరి. ముహూర్తదినము సంప్రాప్తమాయెను. అభ్యంగన స్నానము, పుణ్యాహవాచనము, చౌలము మొదలగు ఉపనయన పూర్వాంగ నమస్కారములు యథావిధిగ వేదవేత్తలయిన పురోహితులచే జరుపబడెను. ఇక బాలుని తల్లితో కలసి భుజించి రమ్మని ఆజ్ఞాపించిరి. అదియు జరిగెను ఉపవీతమును ధరింప చేసిరి. మౌంజీబంధనము చేయబడెను. గాయత్రీ మంత్రముపదేశించిరి. ఇంతలో తల్లి మాఆతృభిక్ష నిచ్చుట ధర్మము గాన బాలుని సమీపించి కుమారా; భిక్షమడుగుమనెనుఎ. వెంటనే బాలుడు 'అగ్నిమీళే" అను ఋగ్వేదమందలి మొదటి మంత్రమును పఠించి భిక్షయాచించెను. తల్లి మొదటి భిక్షయిచ్చెను తిరిగి ఇషేత్వా అను యజుర్వేద మందలి మొదటి పనసను చదివి రెండవ భిక్ష యాచించెను అగ్న ఆయాహి అని మూడవ హరి సామవేదమంత్ర పఠన పూర్వకముగ మూడవ భిక్షనడిగెను సభలోనివారు ఆశ్చర్యచకితులైరి తండ్రి తన కుమారుడు పరమాత్మ యొక్క అవతారమనితలచి హర్షమొందెను. అందరును భక్తితో ఆ బాలునకు లేచి నమస్కరించిరి అప్పుడా బాలుడు తల్లిని సమీపించి అమ్మా నన్ను భిక్షమడుగుమంటివి. నీ వాక్యము వ్యర్థము కాకూడదు. నాకు ఆజ్ఞనిమ్ము నేను బ్రహ్మచారినై ఇంటింట భిక్షమడుగుచు వేదాంతమునందు నిరతుడనై లోకాను గ్రహార్థము తీర్థయాత్రలకు వెడలెదనని అనెను.

కుమారుని మాటలు విని తల్లి మిక్కిలి బాధపడి కన్నీరు కార్చుచు అట్లేభూమి మీద పడి మూర్ఛనంది తిరిగి లేచి ఆ బాలునితో నిట్లనెను. నాయనా; నీవు బాల్యమంతయు మౌనముతో గడిపితివి. ఇప్పుడు అమృతమువంటి నీ వాక్యములను విని మేము చేసిన శివపూజ ఫలించెనని సంతసించుచుంటిమి. నీవు మమ్ముల విడిచిపోయినచో మాకు దిక్కెవ్వరు అని పరిపరివిధముల విలపించుచుండ ఆ బాలుడు ఆలింగనమొనర్చి ఓదార్చుచు అమ్మా; నా మాట వినుము, వివేకము తెచ్చుకొనుము. నేను ధర్మరక్షణార్థ మవతరించితిని. నీకిక ముందు నలుగురు పుత్రలు కలిగెదరు. వారు నీ సేవ చేసెదగు సంశయింపకుము నీవు పూర్వమున ఈవ్వరుని ఆరాధించివి గాన నేను నీ గర్భమున జన్మించవలసి వచ్చెను. అని చెప్పుచు తన దివ్యహస్తమును ఆమె శిరమున ఉంచెను. అప్పుడామెకు ఆ బాలుడు పూర్వమున తనకు వర

మొసంగిన శ్రీపాద శ్రీవల్లభ స్వరూపమున దర్శనమొసంగెను. వెంటనే ఆమె ఆనందబాష్పముల గార్చుచు ఆ బాలుని పాదములపై బడి నమస్కరకించెను. అప్పుడా బాలుడు తల్లిని లేపి ఓదార్చి ఈ విషయమును గుప్తముగ నుంచుమని చెప్పుచు అమ్మా నేను సంసారమున లప్తుడగాను, నన్ను సన్యాసిగ గ్రహించుము, కారణాంతరమున తీర్థపర్యటనము గావించెద. నాకాజ్ఞనిమ్మనెను కుమారుని మాటలు విని తల్లి కుమారునితో కుమారా మమ్ముల వదలి పోవుట ధర్మము గాదు. మాకా ఇంకొక పుత్రుడు లేడాయె. బాల్యము ననే తావసియగుట ధర్మమా. బ్రహ్మచర్యమొనర్చి అనంతరము గృహస్థుడవయి సమస్త ధర్మముల పుణ్యముల నాచరించి చిత్తశుద్ధిని సంపాదించి అనంతరము సన్యాసము స్వీకరించుట ధర్మము. అట్లు గాక బాల్యముననే తాత్కాలిక వైరాగ్యముతో సన్యసించు వారు పతితులయ్యెదరు. గృహస్థాశ్రమమున వాసనల నన్నిటిని పూర్తిచేసికొని సన్యసించుట ధర్మము. అని ఇట్లు చెప్పిన తల్లి వాక్యములు విని నవ్వుచు నరహరి యను నా బాలుడు తల్లికి తత్వము నుపదేశించెను. ఆ విషయమే పై అధ్యాయమున రాగలదు.

**ఇది గురుచరితమున పదునొకొండవ అధ్యాయము సమాప్తము.**

**దిగంబరా దిగంబరా శ్రీపాదవల్లభ దిగంబరా**

**శ్లో॥ కరం జనగ రేంబాయాః ప్రదోషవ్రతసిద్ధయే ।**
**యో...భూత్సుతో నృహర్యాఖ్యః శ్రీదత్తశ్శరణంమమ॥**

తా॥ శనిప్రోదష వ్రతమాచరించిన "అంబా" అను పతివ్రత గర్భమున "కంజ" మను నగరములో శ్రీపాదుల వారు తిరిగి జన్మించిరి. పుట్టుటతోడనే ప్రణవము ఉచ్చరింపసాగిరి.

# శ్రీ గురు చరితము

## పన్నెండవ అధ్యాయము

**శ్రీ దత్త ఓం శ్రీ గణాధిపతయేనమః**

**దత్తావతారమయిన ఆ బాలుడు తన తల్లితో ఇట్లు చెప్పచుండెను.**

అమ్మా వినుము. ఈ దేహమా అనిత్యము క్షణికమగు ఈ జీవితమును విశ్వసించుట ఎట్లు ? మృత్యువు ఎప్పటికప్పుడు మానవుని మ్రింగచూచుచుండును. కాన ప్రతివారును ఒక్క క్షణమయినను వ్యర్థము చేయక ధర్మసంగ్రహ మొనర్చుటయే యుక్తము నేను చిరకాలము జీవింతును అని చెప్ప ధైర్యము కలవానికి నీవు చెప్పినట్లు ఆచరించుట తగును. అట్లు చెప్పగల వారెవ్వరు లేరు. కాన శరీరముదృఢముగ నున్నప్పుడే పుణ్యమాచరింప వలయును. మృత్యువు నెవ్వరూ జయింపలేరు. రోజులు గడచిన కొద్దియు మన ఆయుష్యము క్షీణించుచుండును కొద్ది నీరుగల గుంటలోని చేపయొక్క జీవితమును మానవ జీవితమునకు దృష్టాంతముగ తీసికొన వచ్చును. రావియాకు చివర నంటియున్న నీటి బిందు వేక్షణమున పడునో తెలియనట్లు మనజీవితము గూడ ఎప్పుడు పరిసమాప్తమగునో నెవ్వరు చెప్పజాలరు. కాని నిట్టినశ్వరమగు దేహమును విశ్వసించరాదు. వృక్షమున ఫలము పక్వమయిన తోడనే పడునటుల ఈ దేహము గూడను కర్మ పరిపాకము ననుసరించి



పడిపోవును. అపివచ్చిన వాడు రోజులను గణించు విధమున మృత్యు దేవుడు మన జీవిత దినములను లెక్క పెట్టుచుండును. జరిగిన రోజును మనము తిరిగి చూడము. ఇట్టి స్థితిలో తన ఆయుష్మఉయొక్క గొప్పతనము గ్రహించక పుణ్యమాచరించక నెవ్వడు వ్యర్థమగు జీవితము గడుపునో వాడు పశువుతో సమానుడు. ఏ దినము పుణ్యము చేయక జరిగెనో ఆ రోజు న్మమున వ్యర్థముగ గడచెనని గ్రహింపవలయును. తప్పక పుణ్యమాచరింప వలయును. యముడు మనకు చుట్టముగాదు. పుణ్యమాచరించని వారియందతడెంత మాత్రము దయచూపడు.

ఎవ్వరు దారాపుత్ర పశ్వాదుల శాశ్వతములని తలతురో వారు పశువులతో సములు. నీటిలో మొలసి పట్టునటుల ఈ సంసార సముద్రములో మనము ముసలితనమును మొసలి పట్టును. దాని పట్టునుండి తప్పించుకొను వారెవ్వరు లేదురు. కాన వివేకి యగు వాడు తారణ్యముననే ధర్మమాచరింప వలసియుండ నీవు నాతో ఇట్లు పలుకుట బాగుండలేదు. ఈ సంసారము అసారముమాలతి కుసుమమువలె క్షణములో విరసమగును. అని ఇట్లుతల్లితో నానా విధముల తత్వోపదేశమొనర్చెను సభలోని వారందరు అతని వాక్యములకు విస్మితులయిరి; తల్లి యా బాలునకు నమస్కరించి దేవా నీవు మాకు జ్ఞానబోధ చేసితివి. నీవు మా కుల దేవతవు మా కుమారుడవు గావు. మాకింకను నలుగురుపుత్రులు జన&ఇమంతురని చెప్పితివి. నా మనస్సు విశ్వసించుట లేదు. నాకొక్క కుమారుడయినను పుట్టు పర్యంతము నీవు మావద్దనుండుము. నా వాక్యము నతిక్రమించి ఇప్పుడే మమ్ముల విడిచిపోయెదవేనిమేము మా ప్రాణముల త్యజించెదము అనగా తల్లితో మఅఆ్మ అట్లేఉండెదను. నీ మాట నీవు నిలుపుకొనవలయును. ఒకడేకాదు, ఇద్దరు పుత్రులు నీకు కలిగిన తరువాతనే నేను వెళ్లెదను అనెను. కాలము గడచుచుండెన. వేవేదాంగములు పఠించువారు గూడ ఈ బాలునివద్దకు వచ్చి శిష్యులగుచుండిరి ఇంతలో తల్లి గర్భవతియయ్యెను. ఆమె కుమారుని దేవుడను భావముతో నిత్యము నర్చించుచుండెను. నవమాసములు పూర్తికాగా ఆమె ఇద్దరు మగ పల్లల గనెను. తల్లిదండ్రులు కడుసంతసించిరి గురువు యొక్క నోటినుండి వచ్చిన వాక్యమెన్నడు నసత్యఉ గాద. వారి వారి భావననుసరించియే వారికి ఫలప్రాప్తి యగుచుండును. అప్పటికొక సంవత్సరము పూర్తియయ్యెను. జన్మించిన బాలురకు మూడవ మాసము

వచ్చెను. తల్లి సంతోషముగా నున్న సమయమున నరహరి ఆమెను సమీపించి అమ్మా నీ కోరిక నెరవేరెను గదా ! వీరిద్దరు పూర్ణాయుష్మంతులు. నరీకిక ముందు మరి యిద్దరు మగ పిల్లలు తరవుఆత నొక ఆడపిల్లయు జన్మించును. సుఖముగ నుండుము. నాకాజ్ఞ నిమ్ము అనెను. అప్పుడు తల్లిదండ్రులు అతనికి నమస్కరించి నీవు మాకులదైవతమవు. మాయామోహములో పడియున్న మేము నీమహిమలనేమి తెలిసికొన సమర్థులము.

కుమారుడవని భ్రమించి నిన్ను ఒకప్పుడు నిష్ఠురముుగ మాట్లాడియుండవచ్చును. సకాలమునకు నీకాహారమివ్వక గాని, నిన్నెత్తుకొని లాలన చేయక గాని ఏ అపరాధముల నొనర్చితిమో వాటిని క్షమింప ప్రార్థించుచున్నాము. మేము చేసిన ప్రదోష పూజ ఫలించెను గానసే నీవు మాకు పుత్రుడవైతివి. మాకు ఇకముందు యమయాతనలు లేకుండ చేయుము. నీవా వెళ్ళుచున్నావు. నీదర్శనము లేక మేము జీవించుట ఎట్లు ? అని విలపించుచున్న తల్లిదండ్రులతో నాబాలుడు నన్ను చూవలయునను కోరికతో ఎపుడు నన్ను స్మరింతురో అప్పుడు మీకు దర్శనమిచ్చెద అని వారల కభయమిచ్చి ఇకమీద మీ యింట దైన్యముండదు లక్ష్మితో మీయిల్లు తులతూగుచుండును. దేహాంతమున మీరు కైలాసము నొందెదరు మీ కికమీద జన్మలేదు నేను తీర్థపర్యటనమొనర్చి ముప్పది సంవత్సరములకు తిరిగి మీ గ్రామమునకు రాగలను. అప్పుడు నా దర్శనము కాగలదు అని తల్లిదండ్రుల సమాధాన పరచి గృహము విడిచి ఉత్తర దిక్కుగ పయనమైరి.

తల్లిదండ్రులు, గ్రామవాసులు కొందరు ఆ బాలుని వెంటపోవుచుండిరి కొందరు ఈ తల్లిదండ్రుల యొక్క హృదయము పాషాణమా ! ఈ బాలుని ఎట్లు ఉపేక్షించి పంపుచున్నారు అని ఆశ్చర్యపోవుచుండిరి. కొంతమంది మాత్రము ఈ బాలుడు వారికి కుమారుడన తగదు. ఇంతచిన్న వయస్సున సమస్త వేదముల సామాన్య బాలుడు పఠించ సమర్థుడా, కాన ఈశ్వరావతారై ఉండనోపునని భావించి నమస్కరించిర. అందరును వెనుకకు మరలిరి. పుత్రమోహముతో తల్లితండ్రులు మాత్రమే వెంబడించుచుండ వారి వ్యామోహము నశింప జేయుటకు త్రిమూర్త్యాత్మక శ్రీదత్తాత్రేయ శ్రీపాద శ్రీవల్లభ రూపముతో వారి ఎదుట ప్రత్యక్షమయిరి. అటి రూపమును చూచి తల్లిదండ్రులు స్వామి జయ జయ, త్రిమూర్తి స్వరూపా జగద్గురో నీవు విశ్వతారకుడవు. నీ వలన

వేము ఉద్ధరింపబడితిమి. అని చెప్పుచు తమ శిరములను వారి పాదములయందుంచి నమస్కరించిరి. గురునాథుడు వారల లేవదీసి ఓదార్చి నేను తిరిగి మీకు దర్శనమిచ్చెద పొందని సాగనంప వారుతమ గృహమునకు సంతోషముతో వెడలిరి అప్పుడు గురుమూర్తి బదరికాశ్రమమును గూర్చి పోవుచు కాశీ పట్టణమున కొంత కాలముండిరి. కాశి పట్టణమును ఆనంద కాననమనియు, అవిముక్తపురి అనియు, వారణాసి అనియు పిలిచెదరు అక్కడ విశ్వేశ్వరుడు స్వయముగ నుండుటచే దానికంత ప్రసిద్ధివచ్చెను. వారచ్చట కొంతకాలము వసించిరి. త్రిషవణ స్నానముల చేయుచు అష్టాంగ యోగము లభ్యసించిరి. ఆ కాశీపురమందు ఎందరోతాపసులు, సన్యాసులు, అవధూతలు కలరు. వారు ఈ బాలుడైన నరహరిని చూచి వారి తపోనిష్ట కచ్చెరు వొంది ఇట్టివారి నెక్కడను చూడము. ఇంత వైరాగ్యము వీరికి ఇంత అల్ప వయస్సున ఎట్లు సిద్ధించెను. స్వార్థము కొంచమయినను కనపడదు. త్రికాలముల యందును మణికర్ణికయందు నిత్యము స్నానము చేయుచున్నారు. నిజముగ నీ బాలుడే సన్యాసమున కర్హుడు అని అనుకొనిరి. ఆ కాలమున కాశీపట్టణమున బ్రహ్మజ్ఞాని, వృద్ధుడు, గొప్ప తపస్వి అయినా కృష్ణ సరస్వతి యను నొక యతీశ్వరులు కలరు. వారు ఈ నరహరి బాలుని చూచి అచ్చటివారితో నిట్లు చెప్పిరి.

ఈ బ్రహ్మచారిని మానవ మాత్రునిగ చూడకుడు. ఇతనొక ఈశ్వరావతారముగ తోచుచున్నాడు. వయస్సుకు పిన్న అయినను భక్తితో మనబోంట్లకును గూడ నమస్కారార్హుడు, జ్యేష్ఠుడు, కనిష్ఠుడు అను విమర్శను మూర్ఖులు మాత్రమే చేయుదురు విద్వాంసుమగు మనకది చెల్లదు. ఇట్టివారు సన్యాసాశ్రమస్థాపన కర్హులు. పరోపకారార్థము వీరు సన్యసించిరేని మన బోంట్లకు వీరియందు భక్తిసుస్థిరము కాలగదు అని చెప్పి ఆ బాలుని సమీపించి నమస్కరించి ప్రభో మీరు లోకానుగ్రహార్థము సన్యాసము స్వీకరించి మమ్ములనుద్ధరించి మాచే పూజల రిస్వీకంచుడు. కలియుగము రాగా సన్యాసము పనికిరాదని కొందరనుచున్నారు. కాని శంకరాచార్యులవారు అట్టి వాదమును ఖండించి వర్ణాశ్రమ విభాగమున్నంత పర్యంతము కలియుగమందును సన్యాసము అనుష్ఠేయమే అని సిద్ధాంత పరచిరి. సమర్థులగు మీరు, సన్యాసాశ్రమమును స్వీకరించిననే గాని లోకోపకారము కాదు. మీరు సంసారతారకులుగాన మిమ్ములనిట్లు ప్రార్థించుచుంటిమి అనిరి. వారి మాటల నాదరించి నరహరి బ్రహ్మచారి కృష్ణ సరస్వతి యను నాయతీశ్వరుని గురువుగ

స్వీకరించి వారి వలన సన్యాసాశ్రమ స్వీకార మొనర్చిరి అని ఇట్లు సిద్ధముని చెప్పగా నామధారకుడు త్రిమూర్త్యవతారమైన ఆ మహాత్మునకెరకు గూడను మరియొక గురువు కావలసి వచ్చెనా; ఈ సంశయమును నివారింపుడని ప్రార్థించ రఘురాముడు భగవంతుడైనను వశిష్ఠుని ఎట్లు గురువుగ భావించెనో, కృష్ణావతారమున కృష్ణుడు సాందీపునకు శిష్యుడు ఎట్లయ్యెనో మనుష్యుడయి అవతరించి నందు వలన దత్తాత్రేయ అవతారమయిన ఈ నరహరి బాలుడు గూడ లోక సంగ్రహార్థము జ్ఞాన వృద్ధుడును, వయోవృద్ధుడును అయిన కృష్ణ సరస్వతిని గురువుగ స్వీకరించెను అని చెప్ప స్వామి ఈ కృష్ణ సరస్వతి సన్యాసమొనర్చిరి. ఈ గురు సంప్రదాయమును సాంతముగ వివరింపుడని ప్రశ్నించెను. శిష్యుని వాక్యము విని గురుసంప్రదాయము నిట్లు సిద్ధముని చెప్పుచున్నారు.

గురు సంప్రదాయమునకు మూలపీఠము శంకరుడు ఆయనకు విష్ణువు శిష్యుడయ్యెయను. విష్ణువుకు బ్రహ్మ శిష్యుడు. అతనివలన నా బ్రహ్మవిద్యా సంప్రదాయము వశిష్ఠునకు సంప్రాప్తమయ్యెను. వశిష్టుని వలన శక్తియు, శక్తివలన అతని పుతృడగు పరాశరుడును. పరాశరునివలన సాక్షాత్తు నారాయణుని అవతారమగు వ్యాసుడును. వ్యాసుని వలన శుకుడును ఈ సంప్రదాయమును వంశక్రమమున పొందగలిగిరి. సకునకు గౌడపాదుడు శిష్యుడయ్యెను. అనతి శిష్యుడు గోవిందాచార్యుడు. వారివలన సాక్షాత్తు శివావతారమగు శంకరాచార్యుడు శిష్యుడయి బ్రహ్మ విద్యా సంప్రదాయమును ప్రపంచమున ప్రఖ్యాతికి తెచ్చెను. శంకరాచార్యులకు శిష్యుడు విశ్వరూపుడు విశ్వరూపునకు శిష్యుడు బోధజ్ఞానగిరి. వారి శిష్యుడు సింహగిరి ఈశ్వరతీర్థులు వారి శిష్యుడు నృసింహతీర్థులు. వారి ద్వారా సర్వవిద్యా విశారదుడయిన విద్యారణ్య స్వామి ఈ బ్రహ్మవిద్యను గ్రహించి ప్రచారమునకు తెచ్చెను. వారి శిష్యుడు మలయానందుడు వారి వలన నుపదేశము పొందినవారు దేవతీర్థుడు. దేవతీర్థుని శిష్యుడు యావేంద్ర సరస్వతి, వారి శిష్యుడే కృష్ణ సరస్వతి, వారి వద్ద ఈ నరహరిప బాలుడు తుర్యాశ్రమ స్వీకారామొనర్చి, వీరికి నరసింహ సరస్వతి యను నామము ఆశ్రమ స్వీకారము మొదలుకొని వాడుకలోనికి వచ్చెను. వీరు కాశీ పట్టణముననే కొంత కాలము నివసించిరి. గొప్ప గొప్ప విద్వాంసులు గూడ వీరికి గురుభావముతో పూజించిరి. వీరికి అనేక మంది శిష్యులుగ నేర్పడిరి. ఇట్లు కొంత కాలము గుడువగ అనేక మంది శిష్యులతో కలసి బదరికాశ్రమము వెళ్లి మేరు పర్వతమునకు ప్రదక్షిణక్రమముగ

నవఖండమందితమయిన ఈ భూమండల మందలి ముఖ్య క్షేత్రముల పర్యటన మొనర్చిరి. గంగా సాగర సంగమమునకు వచ్చిరి అచ్చటనుండి బ్రహ్మక్షేత్రమయిన ప్రయాగకు రాగా అచ్చట మాధవుడను పేరుగల నొక బ్రాహ్మణుడు స్వామివారిని దర్శించి ప్రణతుడై వారివలన సన్యాసాశ్రమ స్వీకారమొనర్చెను. అతనికి దయామయుడగు స్వామివారు బ్రహ్మజ్ఞాన ముపదేశించిరి. ఎంత మందియో స్వామివారి వలన ఆశ్రమ స్వీకరాము చేసియున్నను ఈ మాధవ సరస్వతి అనునతనియందు స్వామి వారికి మిక్కిలి ప్రేమ కలిగెను. ఇట్లు అతనికి సన్యాసమిచ్చి అనేక శిష్య సమేతముగ తిరిగియు భూపర్యటనమునకు బయలుదేరిరి. తరువాతి కథా వృత్తాంతమును పై అధ్యాయమున తెలిసికొందుము. ఇది గురుచరితమందలి పన్నెండవ అధ్యాయము సమాప్తము.

**దిగంబరా దిగంబరా శ్రీపాదవల్లభ దిగంబరా**

**శ్లో॥ మూకో భూత్వాప్రవతాత్పశ్చాత్**
**వదన్వేదాన్ స్వమాతరం ।**
**ప్రవ్రజన్ బోధయామాస**
**శ్రీదత్తశ్శరణం మమ**

తా॥ ఉపనయనము పర్యంతము ఓంకారమే ఉచ్ఛరించుము ఉపనయనము కాగా వేదములనన్నిటిని పఠించి తల్లికి ఆత్మజ్ఞానముపదేశించి తల్లిదండ్రుల సమాధాన పరచి నరహరి బాలుడు సన్యాస రూపములో వెడలుట.

**శ్లో॥ అనన్యాశ్చింతయంతో మాం, యే జనాః పర్యుపాసతే**
**తేషాం నిత్యాభియుక్తానాం, యోగక్షేమం వహామ్యహమ్ శ్రీ మద్భగవద్గీత**

తా॥ ఏ జనులు ఇతర భావములేనివారై (అనన్యమనస్సుతో) నన్ను సదాస్మరించుచు ఉపాసింతురో, ఎల్లప్పుడు నాయందే నిష్ఠ గల్గియుండు అట్టివారి యొక్క యోగక్షేమములను నేనే భరింతును.

# శ్రీ గురు చరితము

## పదమూడవ అధ్యాయము

**ఓం శ్రీగురువేదత్త**

**జయ జయ నృసింహ సరస్వతి శ్రీగణాధిపతయేనమః**

**ఓమ్ అవధూతచింతనం శ్రీ గురుదేవదత్త జయఓమ్**

నామధారకుడు సిద్ధమునితో చేతులు జోడించి వినయపూర్వకముగ నిట్లనుచుండెను.

సిద్ధమునీంద్రా మీరు భవార్ణవ తారకులు. మీవలన గురుచరిత్రయను అమృతమును త్రాగుచున్న కొలదియు తృష్ణ అధికమగుచున్నది. సమృద్ధిగ గడ్డి పట్టిన బీటిలో మేయుచున్న గోవు అందుండి బయటకు వెళ్ళదలచునా? తక్రమయినను లేని కడు బీదవానికి పాలసముద్రము సంప్రాప్తమయిన, దానిని వాడెట్లు వదల నిచ్ఛగించును. అట్లే నేను అజ్ఞానములో పడి అనేక కష్టముల నొందుచుండ మీరు నన్ననుగ్రహించి ఈగురు కథామృతమును శ్రవణము చేయించుచున్నారు. మీరు చేయు ఉపకారమునకు ప్రత్యుపకృతి చేయ సమర్థుడను గాను నేనే గాక మావంశ పరంపరయు మీసేవ చేసినను మీ ఉ పకారమునకు సరిపోజాలదు. మీబోధ వినినందువలన నాకు గురు భక్తి స్థిరమయ్యెను. వామనమున శాంతికి స్థానము లభించెను. గురుమూర్తి యగు శ్రీనరసింహ సరస్వతి స్వామివారు మాధవుడను బ్రాహ్మణునకు ఆశ్రమ దీక్షనిచ్చి శిష్య సమేతముగ బయలు వెడలిరని చెప్పితిరి. ఆపై కథావృత్తాంతమును సెలవిండు అని ప్రశ్నించ సిద్ధముని ఇట్లుచెప్పుచుండెను.

శిష్యుడా నామధారకా; నీవును కడు ధన్యుడవు. కావుననే అత్యాసక్తితో గురులీలు ప్రశ్నించుచుంటివి. కాన నానందమయ్యెను, వినుము.

స్వామివారు ఆప్రయాగ క్షేత్రముననే కొంతకాలముండి ఇంకననేక మందికి సన్యాసాశ్రమ దీక్షనిచ్చిరి. ఇది అంతయు వివరించి చెప్పవలయునన నది గొప్ప గ్రంథమగును. గాన సంక్షిప్తముగ చెప్పుచున్నాను వినుము. స్వామివారి శిష్యులలో ప్రఖ్యాతిగాంచిన శిష్యులు ఏడుగురు. 1. బాలసరస్వతి 2. కృష్ణ సరస్వతి 3. ఉపేంద్ర సరస్వతి 4. మాధవసరస్వతి, 5. సదానందసరస్వతి 6. జ్ఞానజ్యోతి సరస్వతి, 7. వవాడను స్ధిదుడను పేరుతో వ్యవహరింపబడు

నన్నుగా తలంపుము. మీరు ఒకరి కంటె ఒకరు అధికులు. ఇట్లు గురుదేవులు శిష్య సమేతులయి దక్షిణ దిక్కుగా పయనమొనర్చి తమ జన్మస్థానమగు కరంజనగరమునకు వచ్చిరి. తల్లిదండ్రులు గుర్తించి పూజించిరి. అప్పటికి వారికి స్వామివారు చెప్పినటుల నలుగురు కుమారులును, ఒక కుమార్తెయు కలిగిరి. నగర వాసులందరు స్వామివారి రాక తెలియుట తోడనేవచ్చి దర్శించి పూజించిరి. ప్రతివారును తమ ఇంటికి భిక్షకు దయచేయుడని ప్రార్థించిరి. సర్వేశ్వరుడగుటచే స్వామివారు బహురూపముల ధరించి ఆహ్వానించిన ప్రతివారియింటను భిక్షల ఏకకాలమున స్వీకరించిరి. అందరును స్వామివారిని చూచి శ్రీమహావిష్ణువే యతి రూపమున వచ్చెనని గ్రహించిరి. ఇట్టి మహాత్ముని సామాన్య మానవునిగ నెవ్వరు తలతురో వారు నిశ్చయముగ నరకమునే పొందెదరు. త్రిమూర్తి స్వరూపుడగు దత్తాత్రేయుడే కార్యార్థముగ నిట్లవతరించెనని తల్లిదండ్రులు భావించి భక్తితో పూజించిరి. పూజించు సమయమున వారలకు పూర్వజన్మ స్మృతి కలుగుగలందులకు తాము తమ వెనుకటి అవతారమయిన శ్రీ పాద శ్రీ వల్లభుల రూపమున దర్శనమిచ్చిరి. తల్లి వారి పాదముల శిరముంచి నమస్కరించి, సర్వేశ్వరా మేము చేసిన ప్రదోష వ్రతమిట్లు ఫలించెను. అని భావించి తన భర్తతో నేను పూర్వజన్మమున ఈ దేవుని ఆరాధించితి గాననే మనకు ఈ జన్మమున వీరు పుత్రులయి జన్మించిరి అని చెప్పెను.

అప్పుడు భార్యాభర్తలిరువురు వారిని శరణుపొంది యతిరాజా ! మమ్ముల సంసార మహాసముద్రము నుండి కడతేర్చుడని దీనులయి ప్రార్థించిరి. అప్పుడు స్వామివారు ఇట్లు చెప్పుచుండిరి. ఏకులమున నెవ్వరయిన సన్యసించిన ఆకులమున నలుబది రెండు తరముల వారుద్ధరింపబడుదురు. ఆవంశము వారికి యమభయము లేదు. పూర్వమున నరకమున నున్నవారు గూడ నరకమునుండి విముక్తులుగుదురు. నేనే మీ వంశమున జన్మించ ఇక మీవిషయము చెప్పనేల. మీకు యమభయము లేదు. బ్రహ్మ పదవి మీకు లభించును. మీపుత్రులు శతాయుష్మంతులయి అష్టఐశ్వర్యములతో తులతూగెదరు. వీరికి పుత్రపౌత్రులను గూడ మీరు చూడగలరు. ఇట్లు ఇహలోకమున సుఖముల ననుభవించి అంత్యకాలమునకు ముక్తి క్షేత్రమయిన కాశీ పట్టణమున చేరి అచ్చట భౌతిక దేహముల త్యజించి శాశ్వత పదవినొందగరు. గాన చింతింపకుడు అని వారల నోదార్చిరి, ఆ సమయమున

స్వామివారి పూర్వాశ్రమపు చెల్లెలు "రత్న" యను నామె వారిని సమీపించి స్వామి నేను తాపత్రయములచే తపించుచున్నాను. సంసార మహాసముద్రమున కామము మొదలగు మొసళ్లు నన్ను పీడించుచున్నవి స్వామీ నాకయితే తపమాచరించి సంసారము నుండి విముక్తురాలను కావలయునను సంకల్పము దృఢముగ కలదు కాన నాకేమయిన ఉపదేశింపుడనెను, అప్పుడు స్వామివారు నవ్వుచు ఇట్లనిరి.

అమ్మాస్త్రీలకు తపస్సుతోనేమి ప్రయోజనము ? భర్త యొక్క సేవచేతనే స్త్రీలు ఉత్తమ గతిని పొందగలరు. పతివ్రతయొక్క పాతివ్రత్యముచే ఈశ్వరుడు సంతసించి ఆమెకు సద్గతినొసంగును కాన భర్తనే మనస్సుస్థిరముగ చేసికొని శివునిగా భావింపుము. సేవించుము. నీవు ఉద్ధరింపబడుదువు అని చెప్ప వారి మాటలు విని స్వామీ మీరు బ్రహ్మాజ్ఞానులు గురువులు, మీకు నమస్కారము, మీరు భూత భవిష్యద్వర్త మానములు తెలిసిన వారు గాన ముందు జరుగబోవు నాజీవిత ప్రారబ్ధమును దయచేసి సెలవిండని ప్రార్థించెను. అప్పుడు స్వామివారు అమ్మా నీ ప్రారబ్ధము మంచిదిగాదు. పూర్వజన్మమున ఒక ఆవును తన్నితివి. నీ సమీపస్థులగు దంపతులకు అన్యోన్య కలహమును పుట్టించి వారల నెడబాపితివి. ఈ రెండు దోషముల యొక్క ఫలమును ఈ జన్మలో నీవు అనుభవించనున్నావు. అవును తన్నిన దోషముచే కుష్ఠ రోగము సంప్రాదప్తము కాగలదు. దంపతులకు విరోధము కలిగించిన దోషముచే నీ భర్త, నిన్ను త్యజించును. సన్యాసి అగును. నిన్ను విడిచి వెళ్ళిపోవును అని చెప్పిరి. ఆ మాటలను విని ఆమెకడు దుఃఖించి వారి పాదముల మీద పడి స్వామీ నన్నుద్ధరింపుడని ఏడువ సాగెను. అప్పుడు స్వామివారుఆమెనోదార్చుచు మంచిది. నీకు వృద్ధాప్యము వచ్చిన తరువాతనే నీ భర్త నిన్నుత్యజించును. అప్పుడు నీకు కుష్ఠురోగము సంప్రాప్తమగును. అప్పుడు నీవు భీమానదీ తీరమున నున్న గాణగాపురమను క్షేత్రమునకు రమ్ము అచ్చట నీవు నన్ను దర్శించెదవు. అచట నున్న పాపవినాశనమను తీర్థమున స్నాన మొనర్చినంతనే నీకు కుష్ఠురోగము పోవును అని చెప్పి వారల సమాధాన పరచి శిష్యసమేతముగా బయలుదేరి గోదావరీ తీరముననున్న నాసికాత్ర్యంబకమను క్షేత్రమునకు వచ్చిరి. నామధారకా, ఆ క్షేత్రమును పవిత్రమొనర్చుచున్న గోదావరీ మహానది యొక్క మాహాత్మ్యమును సంక్షిప్తముగా చెప్పెద వినుము.

పూర్వము ఈశ్వరుని జటాజూటమున నున్న గంగను ఋషీశ్వరులు

ఉపాయముచే భూమికి తీసికొని రాగలిగిరి. పూర్వము గౌతముడు మహర్షి గలడు. గొప్ప క్షామము రాగా ఋషులందరు క్షుద్బాధితులయి గౌతముల వారి ఆశ్రమమునకే వచ్చిరి. గౌతముడు నిత్యము పిడికెడు ధాన్యము ఉదయమున ఆశ్రమ ప్రాంతమున చల్లి తపమునకు కూర్చుండును. మధ్యాహ్న కాలమునకు ఆ బీజములు ఫలించ ఋషులందరు నట్టి ధాన్యమును భక్షించిసుఖముగ జీవించుచుండిరి కొన్నాళ్ళకు ఋషులు ఏకాంతమున కలిసి మనము ఏ విధముగ నయినను ఈ గౌతమునకు గొప్ప సంకటమును కలిగించవలయును. అట్లొనర్చితిమేని ఈ ఋషి గొప్ప ఈశ్వరభక్తుడు గాన గంగను భూమండలమునకు రప్పించగలడు. మనకు అట్టి మహానదీ స్నానము చేయు పుణ్యము లభించును. గంగ భూమికి ఏతెంచుట వలన ప్రస్తుత క్షామము గూడ నశించును. అని యోచించి వారు దర్భతో, ఒక మాయ గోవును సవత్సముగ నిర్మించి గౌతముడు వెదజల్లిన పైరు మీదికి పోవునట్లు చేసిరి. గౌతముడది చూచి తన చేత నున్న దర్భ పవిత్రమును పైరు వేయుచున్న గోవుమీద విసరివేసెను వెంటనే వజ్రముచే కొట్టబడినటుల ఆ గోవు క్రిందపడి మరణించెను. అచట నున్న ఋషులందరు గౌతముని సమీపించి నీవు గోహత్యా పాతకమొనర్చితివి, శివుని జటాజూటమందలి గంగను భూమికి రప్పించి అందు స్నానమొనర్చిననే నీ పాపము పోవుననిరి.

గౌతముడు అందుకు గాను ఈశ్వరుని గూర్చి సహస్రాబ్దములు తపస్సుచేసెను ఈశ్వరుడు ప్రత్యక్షమయి వరము కోరుకొనుమన స్వామి చరాచరాత్మకమగు ఈలోకము యొక్క ఉద్ధారము కొరకు తమ జటాజూటము నుండి భూమికి గంగను ప్రసాదించుడని ప్రార్థించెను. శివుడట్లే యొనర్చెను. ఆ ప్రవాహమే గౌతమునిచే కొనిరాబడినందున గౌతమియనియు, గోహత్యా పాతకము నుండి గౌతముని విముక్తుని చేసినందున గోదావరి యనియు ప్రసిద్ధినొందియున్నది. ఇట్టి మహానది గాననే గురునాథుడు గోదావరి తీరము నందలి క్షేత్రముల పర్యటింప సాగెను. వారు మంజరీకమను గోదావరీ తీరమందలి ఒక గ్రామమునకు వచ్చిరి అచట మాధవారణ్యుడనునొక ముని గలడు. అతను ఆ రోజున నిత్యమువలె తన ఇష్టవేదత అయిన నరసింహస్వామిని మానసోపరచారములచే పూజింపుచుండ అతని చిత్తమున శ్రీనృసింహ సరస్వతీస్వామి వారు ప్రత్యక్షమయిరి. అదేరోజున స్వామి వారిని ప్రత్యక్షముగ దర్శించుటయు ఘటించినందులకు ఎంతయు ఆశ్చర్యపడుచు గద్గదధ్వనితో

ఈశ్వర స్వరూపులగు మీ పాద ద్వంద్వమును నేటికి దర్శింప గలిగితిని. ధన్యుడనయితిని అని నమస్కరించెను. స్వామివారును అతని భక్తికి సంతసించిరి నాయనా నీపుకృతార్థుడవైతివి. నీకు ఈ సంసారమున యాతా యాతములు (రాకపోకలు) నా ఈ దర్శనముచే పరిసమాప్తపములయ్యెను అని చెప్పుచు తన నిజరూపము నతనికి చూపిరి. అప్పుడతను హర్షనర్భరుడై, వినయావంతుడై స్వామి జయ జయ మీరుజగద్గురువులు, లోక దృష్టికి మానవులుగా కనబడుచున్నను మీరు త్రిమూర్త్యవతారమైన శ్రీదత్తాత్రేయులే. విశ్వతారకులు మీచరణ దర్శనముచే కృతార్థుడనయితిని అని స్తుతించెను. స్వామివారు సంతసించి అతనితో ఓ మాధవారణ్యా నీవు మంత్రసిద్ధి నొందితివి. శీఘ్రముగనే శాశ్వత బ్రహ్మ పదవి నొందెదవు. నీవు నిత్యము నరసింహోపాసన చేయుచున్నందున నేడు ప్రత్యక్షముగ నన్ను దర్శింప గలిగితివి అని చెప్పి అతనిని ఓదార్చి అచటనుండి శిష్య సమేతముగాగోదావరి తీరమున నడచుచు వాసరయను బ్రహ్మేశ్వరి క్షేత్రమునకు వెళ్లిరి. అచ్చట గోదావరి యందు స్నానమొనర్చుటకు గాను శిష్యసమేతముగా ప్రవాహమును సమీపించుచుండిరి. అదే సమయమునకు ఉదరశూలతో బాధపడుచునొక బ్రాహ్మణుడు నది ఒడ్డుపొర్లుచు నదిలోపడి ప్రాణత్యాగమొనర్ప నుద్యుక్తుడయ్యెను. అతడిట్లుఅనుకొనుచుండెను.

నేను మహాపాపాత్ముడను. ఈ ప్రపంచమున నుండి యేమి ప్రయోజనము. ప్రాణులకు అన్నమే కదా జీవనాధారము. అన్నము తినక యవ్వరు బ్రతుకజాలరు అట్టి అన్నము నాకు శత్రువయ్యెను ఇట్టి నేను మరణించుటయే శ్రేష్ఠము. అని అనుకొనుచు గొప్ప పాషాణమును పొట్టకు కట్టుకొని భగవంతుని స్మరించుచు దేవా ! నేను భూమికి భారమైతిని, నేను పూర్వ జన్మమున నెవ్వరికిని అన్నదాన మొనర్చనైతిని గాబోలు, బ్రాహ్మణుని సిద్ధాన్నమును అపహరించితినో; కపిల గోవు మేయుచుండ దాని నచట నుండి తరిమివేసితినో; విశ్వాసఘాతమొనర్చితినో; ఈశ్వరుని పూజించనైతినో; గురువుల నిందించితినో; తల్లిదండ్రుల నవమాన పరచితినో; ఇంటికి వచ్చిన అతిథిని ధిక్కరించి వెడలగొట్టితినో; వనమును దగ్ధమొనర్చితినో, తల్లి దండ్రుల త్యజించి భార్యతో మృష్టాన్నమును గుడిచితినో; ఏ పాపమువలననో నేనిట్టి కష్టమనుభవించుచున్నాను. స్వామీ నన్ను రక్షించి కాపాడుము అని పలుకుచు ప్రవాహములోనికి దిగుచుండ నదే సమయమున శ్రీ స్వాముల వారు అతనిని చూచుట తటస్థించెను అప్పుడు వారు శిష్యులతో ఎవ్వడో గంగలోపడి ఆత్మహత్య

గావించుకొన బోవుచున్నాడు. మీరు వెళ్లి వెంటనే అతనిని ఒడ్డునకు తీసికొని రండు అని ఆజ్ఞాపించెను.

శిష్యులు అట్లే పరుగున పోయి వానిని గురు సమీపమునకు తీసికొని వచ్చిరి. అప్పుడు వారు ఓ బ్రాహ్మణా; ఆత్మ హత్య మహాదోషముగదా. ప్రాణములనిట్లు ఎందులకు నదిలో తాగ్యము చేయ నుద్యుక్తుడవయితివి అనిరి అప్పుడు అతడిట్లనెను. యతీశ్వరా ! నేను చెప్పి ప్రయోజనమేమి ? నేను భూమికి భారముగజన్మించితిని. పక్షమునకు గాని, మాసమునకు గాని ఒక్కసారి భుజించినను శూలబాధచే మరణబాధ నొందుచుంటిని. ఆకష్టము భరింపలేక నీశరీరమును త్యజించనుద్యుక్తుడనైతిని. శరీరము అన్నమయము గదా, అన్నము నాకు శత్రువయ్యెను. ఇక నేను జీవించుటెట్లు ? అనెను. అప్పుడు గురుమూర్తి ఓయి భయపడకుము. నీ వ్యథ నేటితో తీరెను. నీకు మృష్టాన్నము భుజించవచ్చును. అని అనుచుండ అదే సమయమున ఆ గ్రామాధికారియగు ఒక బ్రాహ్మణుడు స్నానార్థమచ్చటకు వచ్చుట తటస్థించెను. ఆ బ్రాహ్మణుడు గురుమూర్తిని చూచుట తోడనే భక్తితో సమీపించి మనోవాక్కాయ కర్మలతో వందన మాచరించెను. అప్పుడు స్వామి వారు ఆ బ్రాహ్మణుని చూచి నీపేరేమి ? నీ నివాస మెక్కడ అని ప్రశ్నింప అతను అయ్యా, నేను ఆవస్తంభశాఖీయుడను. బ్రాహ్మణుడను. కౌండిన్యస గోత్రమున జన్మించితిని. నా పేరు సాయందేవుడందురు “కడగంచి”, మాకు నివాసస్థానము ఉదరపోషణ నిమిత్తము ఈ గ్రామాధిపతి అయిన యవన రాజు యొక్క సేవ చేయుచున్నాను. ఇచ్చటకు వచ్చి ఒక సంవత్సరము అయ్యెను. నేడు మీదర్శన మాయెను. నేను ధన్యుడనైతిని, నా జన్మ కృతార్థమయ్యెను. నాజన్మాంతర దోషములు గూడ మీదర్శనముచే నశించెను. మీబోటి మహాత్ముల అను గ్రమునకు పాత్రుడయిన వాడు తప్పక భవార్ణవమును దాటగలడు. అట్టి మీ దర్శనము నేడు అప్రయత్నముగ నాకు ఘటిల్లెను. గంగా దర్శనమువలన పాపము, చంద్రుని సాన్నిధ్యముచే తాపము, కల్పతరువువలన దైన్యము నశించును, మీబోటి సత్పురుషుల దర్శనము పాపముల, తాపముల, దైన్యములను గూడ నశింపజచేయ సమర్థము అని చెప్పుచు భక్తితో వారి పాదముల స్పృశించి నమస్కరించెను. అప్పుడు స్వామివారు అతనిని ఓదార్చి సమీపమున కూర్చుండబెట్టుకొని అతనితో ఇట్లు చెప్పుచున్నారు.

నీవు ఈ బ్రాహ్మణుని ఇంటికి తీసికొని పొమ్ము. ఇతను ఆకలితో బాధ

పడుచున్నాడు. శూలవ్యాధిచే పీడితుడు గూడను, అయినను శంకించక ఇతనికి ఈ రోజున ఇష్టాన్నమిమ్ము. నేటితో ఇతని బాధశమించును అనిరి ఆ మాట విని సాయందేవుడను ఆ బ్రాహ్మణుడు స్వామీ! నిన్నటి దినమున నెలకు గాను ఈ గ్రామమున నితడు భుజించెను అందుచే నిం బాధ నొందుచున్నాడు. నేడితనికి అన్నమిడితినేని తప్పక నాకు బ్రహ్మ హత్య ఘటిల్లగలదు. ఏమి చేయుదుననెను. అప్పుడు గురుమూర్తి ఈ రోజున అన్నమే ఇతనికి ఔషధము కాలగదు నా ఆజ్ఞఅయ్యెను. గాన సంశయించక గారెలు పరమాన్నము సమేతముగా భోజనమిడుము, అనిరి, అందులకు సాయందేవుడు అంగీకరించి స్వామి మీరు గూడను శిష్య సమేతముగ మాయింటికి భిక్షకు దయచేయుడని ప్రార్థించ అందులకు స్వామివారు అంగీకరించిరి.

సాయందేవుడు అతిహర్షము నొందెను. ఓ నారుధారకా, ఆ రోజున శిష్యులతో గురుమూర్తియు ఆ బ్రాహ్మణుడును కలసి సాయందేవుని గృహమునకు వెడలిరి. ఆ బ్రాహ్మణుడు, పతివ్రత యగు అతని భార్యయు కడు సంతసించిరి. భార్యభర్తలిద్దరు గురుమూర్తిని ఉత్తమ విధిని పూజించిరి, అట్టి విచిత్రమగు పూజా విధానమును నీకు చెప్పుచున్నాను. వారు ప్రత్యేకముగా ముగ్గుతో రంగవల్లులు తీర్చిరి అష్టదళ పద్మముల చిత్రించిరి. పంచరంగులతో నాస్థలమును అలంకరించిరి. సాష్టాంగముగ నమస్కరించి గురుమూర్తిని శిష్యులమగు మమ్మును ప్రత్యేక చిత్రాసనముల కూర్చుండబెట్టి షోడశోపచారములతో పూజలు గావించిరి, పంచామృతములతో గురుమూర్తి పాదములకు రుద్రాభిషేక మొనర్చిరి. ఆపాద తీర్థమును పాత్రాంతరమున గ్రహించి ఆ పాదతీర్థమునకు గూడనీరాజనమిచ్చిరి, ఇట్లే మిగిలిన వారికి గూడ పూజలు గావించి పుష్పాంజలి సమర్పించి సాయందేవుడను ఆ భక్తుడు గురుమూర్తికి నమస్కరించెను గురుమూర్తి అతనిభక్తికి సంతసించి మీ వంశము వృద్ధినొందును, మీ వంశము వారందరు నా భక్తులయియుందురు, అని ఆశీర్వదించెను. అనంతరము ఆ పతివ్రత పత్రములిడి మాషాపూపములు భక్ష్యభోజ్య పరమాన్నసమేతముగ వడ్డించెను. స్వామివారితో పాటు ఉదరవ్యధతో బాధపడు ఆ బ్రాహ్మణుడు గూడ తనకా వ్యాధి యున్నదను సంగతియు మరచి యథేష్టముగ భుజించెను గురుమూర్తి కృపాదృష్టిచే నాటితో అతని వ్యాధి సమూలముగ పోయెను. పరశువేది సోకినంతనే ఇనుము బంగారమగునటుల గురుమూర్తి దృష్టి మాత్రముచేతనే ఆ బ్రాహ్మణుడు నిరోగి అయ్యెను.

సూర్యోదయముగట తోడనే అంధకారము ఎటుల నశించునో గురు కృపచే శిష్యుని దైన్యము అట్లు నశించును. నామధరకా! ఏమి చెప్పదు. గురుకృప ఎవ్వరి యందు ప్రసరించునో వారి జన్మాంతర దోషములే నశించును. ఇక వ్యాధి మాట చెప్పనేల. ఇది అంతయు గురుభక్తి ప్రభావము అని సిద్ధముని నామధారకునితో చెప్పెను.



**ఇది గురుచరితమున పదమూడవ అధ్యాయము సమాప్తము,**

**దిగంబరా దిగంబరా శ్రీపాదవల్లభ దిగంబరా**

ఈ శ్లోకము నిత్యము 108 పర్యాయములు పఠించిన రోగములు పోయి ఆరోగ్యము సిద్ధించును.

**శ్లో॥ భూమిం ప్రదక్షిణీకృత్య సశిష్యోవీక్ష్య మాతరం ।**
**జహార ద్విజ శూలార్తిం శ్రీ దత్తశ్శరణంమమ ॥**

భా॥ నరహరి బాలుడు కాశీ పట్టణమున సన్యాసాశ్రమము స్వీకరించి బహు శిష్యసమేతముగ జన్మస్థానమున కేతెంచి అచ్చట ప్రతివారి ఇంటను భిక్షచేసి గౌతమీ తీరమున వాసరక్షేత్రమున ఉదరబాధతో చావనుద్యుక్తుడైన బ్రాహ్మణుని మృష్టాన్నము తినిపించి రోగవిముక్తుని జేసిరి.

**శ్లో॥ సర్వధర్మాన్ పరిత్యజ్య, మామేకం శరణం వ్రజ**
**అహంత్వా సర్వపాపేభ్యో, మోక్షయిష్యామి మా శుచః**

**శ్రీ మద్భగవద్గీత ..**

తా॥ ధర్మాధర్మ విమర్శల నన్నిటిని వదలి నన్నొక్కన్ని మాత్రము శరణుబొందుము. నేను సమస్త పాపముల నుండియు నిన్ను విముక్తునిగ జేసెదను. శోకింపకుము. (చింతింపకుము).

# శ్రీ గురు చరితము

## పదునాల్గవ అధ్యాయము

**ఓం దత్తాత్రేయాయనమః, ఓం శ్రీ గణాధిపతయేనమః**

**జయజయ సంకటహరణా శ్రీ నృసింహ సరస్వతి**

**ఓం అవధూత చింతనం శ్రీ గురుదేవదత్త ఓం జయ**

నామధారకుడు సిద్ధమునితో ఓ మునీశ్వరా! శ్రీనృసింహ సరస్వతీ స్వామివారు వాసర క్షేత్రమున శూల రోగముతో పీడితుడగు బ్రాహ్మణుని రోగవిముక్తుని చేసిరని చెప్పితిరి. ఆ పై కథ సెలవిండని ప్రశ్నింప సిద్ధముని సంతోషముతో భక్తులకు కామధేనువగు శ్రీ గురుచరిత్రము నిట్లు చెప్పుచున్నారు శిష్యరత్నమా, వినుము.

ఏ సాయందేవుని యింట స్వామివారు శిష్యసమేతముగా భిక్ష చేసిరో అతని గురుభక్తికి అతను చేసిన పూజకు మిక్కిలి ఆనందించి సాయందేవుని దగ్గరకు పిలిచి నీయొక్క భక్తికి మెచ్చితిని. నీ వంశము వారందరు నా భక్తి చేయుదురు. అని చెప్పవారిమాటలు విని తన శిరమును, వారి పాదముల యందుంచి స్వామి జయ జయ మీమహిమ వేదములకును వర్ణనాతీతము మీరు విశ్వవ్యాపకులు, బ్రహ్మ, విష్ణు, శివాత్మకులు త్రిమూర్తి స్వరూపులయ్యు భక్తుల నుద్ధరించుటకు గాను మానవ రూపమును స్వీకరించితిరి మీరు మమ్ముల నాశీర్వదించితిరి. నా ప్రస్తుత పరిస్థితి తమకు చెప్పుచున్నాను. దయతో ఆలకింపుడు.

నేను ఏ యవనునివద్ద సేవచేయుచుంటినో వాడు మహాక్రూరుడు. ప్రతి సంవత్సరము తన సేవకులమీద ఏదియో వెపముంచి ఒక బ్రహ్మాహత్య గావించును. నేడు అందు నిమిత్తమే అతడు నాయందు మిక్కిలి కోపించి నన్ను వెంటనే రమ్మని కబురు చేసియున్నాడు. వాడు తప్పక నా ప్రాణముల నీరోజున తీయును. మీచరణ దర్శనమయినది మిమ్ముల నేను శరణుపొందితిని. ఇక నాకు మరణమున భయములేదు. అనెనె. స్వామివారు అతని వాక్యమును విని తన అభయహస్తము నతని శరీరమున నుంచి సాయందేవా, భయపడకుము చింతించకుము. నిర్భయముగ యవనుని యొద్దకుపొమ్ము. అతను నీకు అవకృతి చేయకుండుటయే గాక నిన్ను బహూకరించి పంపును నీవు తిరిగివచ్చు

పర్యంతము నేను ఇచ్చటనే ఉండెద. నీవు వచ్చుట చూచియే నేను ఈ క్షేత్రమును విడిచి వెళ్లెదను. నీవు నా భక్తుడవు. సర్వాభీష్టముల నొందెదవు. మీ వంశము వారు గూడను దీర్ఘాయుష్మంతులయి, ఆరోగ్యవంతులయి నాకు భక్తులయి సుఖముగ నుండగలరు అని చెప్పిరి.

సాయందేవుడు సంతోషముతో యవనుని సమీపించెను. సాయందేవుని దూరమునుంచి చూచి కోపముతో కాలాంతకుడు వలె యవనుడు మండిపడుచుండెను. సాయందేవుడు సమీపించుచుండ అతనిని చూచి దిగ్గునలేచిఇంటిలోనికి పోయెను. సాయందేవుడు భయపడియు చిత్తముగ గురుదేవుని పాదముల ధ్యానించెను. చదల పురుగునకు ఎంతకోపము వచ్చినను అగ్ని నేమి చేయగలదు ? అట్లే మ్లేచ్ఛుడెంత క్రూరుడయినను గురు కృపకు పాత్రుడయి వానిపట్ల అతని క్రౌర్యమేమి చేయసమర్థము ? ఎంత విషము క్రక్కు సర్పమయినను గరుడుని హింసించ గలదా ? గురు కృపకు పాత్రుడయిన వానికి కలికాలము వలననే భయములేదు. గురుస్మృతి దారుణమలయిన భయముల పారద్రోలును. గురుభక్తుని కాలమృత్యువే బాధింపజాలదు. మృత్యుభయమే లేనప్పుడు యవనుడేమి చేయను. గురుభక్తుడు యమునివలనను భయపడ నవసరములేదు. యవనుడు ఇంటిలోనికి పోయి శరీరమును గూడ మరచి అట్లే క్రిందపడిపోయెను. హృదయమున ప్రాణాంతకమయిన వ్యధను పొందసాగెను. స్మృతి భ్రంశమయ్యెను. ఏడ్చుచు ఎవరో ఒకరు వచ్చి నన్ను తీక్ష్ణములయిన కత్తులతో పొడుచుచున్నారని అరవసాగెను. ఇంతలో నతనికి స్మృతివచ్చెను. బయటనున్న సాయందేవు డతనికి గుర్తుకు వచ్చెను. వెంటనే లేచి పరుగెత్తుకొని వచ్చి అతని పాదములపైబడి స్వామీ మీరెందుకు వచ్చితిరి నేనేమియు మిమ్ముల పిలువనంపలేదు అని చెప్పి వస్త్రముల భూషణముల గూడ బహుమానముగ నిచ్చి మీరు మీ గృహములకు వెడలి సుఖముగ నుండుడని సాగనంపెను.

అతడు సంతోషముతో గంగాతీరమున నున్న గురు మూర్తిని సమీపించి సద్భావముతో నమస్కరించి జరిగిన వృత్తాంతమంతయు వారితో చెప్పెను. గురుమూర్తియు సంతసించి నేను దక్షిణదిక్కుగా తీర్థయాత్రలు సలుప వెళ్లు చున్నానని చెప్పిరి. వారి వాక్యములు విని సాయందేవుడు చేతులుజోడించి స్వామీ నేనును పాదసేవకుడనయి మీవెంట వచ్చెద. భవహరములగు మీ చరణముల విడిచి క్షణమయిన నుండజాల. సగరపుత్రుల నుద్ధరించ గంగ



వచ్చినట్లు తమ రిచ్చుటకు వచ్చుట తటస్థించెను. కాన నన్నును మీ శిష్యునిగా స్వీకరించి వెంటతీసికొని పొండని చెప్పుచు వారి పాదములపైబడెను. వినయావనతుడయిన అతని ప్రార్థనను విని గురుమూర్తి కడు సంతసించి అతనితో ఇప్పుడిట్లు చేయదగదు, నేను కార్యార్థముగ దక్షిణ దేశమందలి తీర్థ క్షేత్రముల పర్యటించి పదిహేను సంవత్సరములకు మీ గ్రామ సమీపమున నొకచోట నివసించెదను. నీవప్పుడు కళత్రపుత్రసమేతముగా నా దర్శనమునకు కావచ్చును. చింతిచంకుము. నీ అరిష్టములన్నియు తొలగెను, సుఖముగ నుండుమని అతనిని ఓదార్చి అచ్చుట నుండి శిష్య సమేతముగ బయలు వెడలి అనేక తీర్థముల పర్యటించి వైద్యనాథమను క్షేత్రమునకు వచ్చిరి. అచ్చుట వారు కొంతకాలము ఏకాంతిముగ నుండ నిశ్చయించిరి.

**ఇది గురుచరితమునందలి పదునాలుగవ అధ్యాయము సమాప్తము**

**దిగంబరా దిగంబరా శ్రీపాదవల్లభ దిగంబరా**

ఈ అధ్యాయము 108 పర్యాయములు పారాయణ చేసిన సంకటములు తొలగును.

**శ్లో॥ శిష్యత్వేనో రరీకృత సాయం దేవం ర రక్షయః**
**భీతం చ క్రూర యవనాత్ శ్రీ దత్తశ్శరణం మమ ॥**

భా॥ సాయం దేవుడను భక్తునకు తన యజమాని వలన రాబోవు మరణభయము నివారించుటయే గాక స్వామివారి అనుగ్రహమువలన యవనరాజు సాయందేవుని వస్త్రాభరణాదులచే సత్కరించి పంపుట.

# శ్రీ గురు చరితము

## పదునైదవ అధ్యాయము

**ఓం శ్రీ దత్తాత్రేయాయనమః ఓం శ్రీ గణాధిపతయే నమః**

**ఓం శ్రీ గురుభ్యోనమః**

**ఓం అవధూతచింతనం శ్రీ గురుదేవత్తజయ ఓం**

సిద్ధముని నామధారకునితో గురుమూర్తి వైద్యనాథ క్షేత్రమున కొంతకాలము గుప్తముగ నుండ దలచిరని చెప్పిరి అందులకు కారణమేమి యని యడుగ సిద్ధమని ఇట్లు చెప్పుచున్నారు.

స్వామివారి మహిమ నలుదిక్కుల వ్యాపించెను. అనేక మంది సకాలములయి వారి దర్శనార్థము వచ్చుచుండిరి. అందులో సాధువులు కొంతమంది అసాధువులు కొంతమంది ధూర్థులు కొంతమంది దుర్మార్గులు కొంతమంది వచ్చి మేము మీకు శిష్యుల మయ్యెదమని ప్రార్థించ మొదలిడిరి.

పూర్వము పరశురాముడు దుష్టక్షత్రియుల సంహరించి భూమినంతటిని బ్రాహ్మణులకు దానము చేసి ఒక సముద్ర తీరమున తపస్సుచేయ కూర్చొనియుండ అచటికి గూడ బ్రాహ్మణులు వెళ్ళి యాచించమొదలిడిరి. అప్పుడు ఆ ప్రదేశమును కూడ వారలకే ఇచ్చి యాచకుల బారినుండి తప్పించుకొనగలందులకు సముద్రమున నెక్కడో గుప్తమగ నుండిరను పురాణకథ గలదు అట్లే గురుమూర్తి భక్తులకు భుక్తి ముక్తుల నొసగుటకు అవతరించినప్పటికి భక్తి లేనివారును, సకాలములును యాచింపవచ్చుట చూచి వారు గుప్తముగ కొంతకాలముండదలచిరి. ఈశ్వరస్వరూపులయినవారు ఎట్టివరమునయినను ఎవ్వరికయినను ఈయసమర్థులు. కాని పాత్రానురూపముగ వరములు నొసంగుట యచితమని భావించి వారు గుప్తముగ కొంతకాలముండదలచి ఒకనాడు శిష్యుల రప్పించి నేనీ క్షేత్రమున కొంతకాల మేకాంతమున నుండదలచితిని. మీరందరు తీర్థయాత్రలకు పొండు అనగా వారు స్వామివారి పాదములకు నమస్కరించి స్వామీ, గురురాజా, మమ్ములను పేక్షపించుచున్నా రెందులకు ? మీ పాదదర్శనమువలననే మాకు సమస్త తీర్థయాత్రాఫలము లభించుచున్నది. గురు పాదములందే సమస్త తీర్థములు కలవని శ్రుతిస్మృతులు నిరూపించుచున్నవి. సమీపమున నిధియుండ ఎవ్వడయినను కాననముల కట్టెలకోసము పర్యటించునా ? కల్పవృక్షమును వదలి ఎవరయిననూ

కంటకవృక్షముల నాశ్రయింతురా ? అని అనిరి వారి మాటలు విని స్వామివారిట్లు చెప్పిరి. మనము సన్యాసులము. సన్యాసి అయినవాడు అయిదురోజులకు మించి ఎచ్చటనుండరాదు. సన్యాసాశ్రమమును స్వీకరించిన పిదప తీర్థ పర్యటనము గావింపవలయును. చిత్తముస్థిరమయి బ్రహ్మాను భవము కలిగిన తదుపరి ఒక్కచోటనుండుట సమంజసము. కాన నా వాక్యముననుసరించి మీ యాశ్రమధర్మ ప్రకారము తీర్థ క్షేత్రముల పర్యటించి బహుధాన్య సంవత్సరమున శ్రీశైల క్షేత్రమున నన్నుకలియుడు, అని చెప్ప వారుస్వామీ, మీ వాక్యము మాకు ప్రమాణము గురువాక్యము నెవ్వడు శిరసావహించడో వాడు రౌరవ నరకమును పొందును. వారికి యమపురమే గృహమని పెద్దలు చెప్పుదురు. కాన మేము మీ ఆజ్ఞ ప్రకారము వెళ్ళెదము కాని ఏయే క్షేత్రముల నెవ్విధమున యాత్రచేయవలయునో అదియును మాకు దయచేసి సెలవిండని ప్రార్థించ స్వామివారు శిష్యులతో తీర్థయాత్రా విధానమును చెప్పుచుండిరి.

బ్రహ్మాండగోళమున ప్రసిద్ధిగాంచిన తీర్థరాజము కాశీపట్టణము. అచ్చటకుపోయి భాగీరథియందు స్నానమొనర్చుడు. ఎన్ని ఆమడలు ఎ నదీతీరము వెంబడి యాత్రగావింతురో అన్ని కృచ్ఛ్రచాంద్రాయణాది వ్రతములు చేసినఫలము లభించును. అచ్చటనుండి గంగాద్వారమునకు వెళ్లుడు. తరువాత యమునా నదీ తటాకయాత్ర చేయుడు. ఇట్లే సరస్వతీనది, వరుణానది, కుశావర్తము, శతుద్రుపు, విపాశ, శరావతి, వితస్థ, అశిక్ని, మరుద్వృధ, మధుమతి, ధృతవతియను నదులవెంట యాత్రల సలుపుడు. అట్టి నదులయందు స్నానము చేయుటచే బ్రహ్మహత్యాది మహాపాతకములు నశించును. చంద్రభాగ, రేవతి, గోమతి, వేదిక, కౌశికి, సాహస్రవక్త్ర పూర్ణ, బాహుదా, నదులను సేవించుడు, నదుల సంగమమెచ్చటనగునో అచ్చట స్నానము చేయుటచే త్రివేణిస్నానఫలము సిద్ధించును. వైరోచని పుష్కరతీర్థము, కురుక్షేత్రము శ్రీశైలము, శ్రీరంగము రామేశ్వరము అనంతశయనము, మహాలయ తీర్థము. నైమిశారణ్యము, కేదారము, నర్మదానది, కోకాముఖమనే క్షేత్రము గోకర్ణము, అయోధ్య, మథుర, ద్వారక, ఇవి అన్నియు ముక్తిక్షేత్రములు గాన వాటిని గూడ సేవింపుడు.

గోదావరీతీరమున ఆరు ఆమడలు యాత్రచేయువారు వాజపేయ

వ్రతఫలము నొందుదురు. సవ్యముగ గోదావరీ నదికి మూడుపర్యాయములు ప్రదక్షిణముగ యాత్రచేయువారు మహాపాపముల నుండి విముక్తి పొందుదురు. భీమేశ్వరము వఞ్జర ఈ రెండు క్షేత్రములు ప్రయాగతో సమానములు కుశతర్పణమను క్షేత్రము బహుఫలప్రదము గోదావరి సాగర సంగమమున స్నానము చేయుటచే ముప్పదియారు కృచ్ఛ్రములు చేసిన ఫలము లభించును. పూర్ణ నదీయాత్రము, కృష్ణవేణీ నదీయాత్రము సలుపుడు. తుంగభద్రానదియందు స్నాన మొనర్చుడు. పంపా సరోవరము కడు పవిత్రమయినది. హరిహర క్షేత్రము సర్వపాపహారము. బీమా నదీతీరమున నున్న పాండురంగని దర్శించుడు. భీమా ఆమరజా నదీసంగమమున గంధరవ్పఉరమను (గణగాపురము) క్షేత్రముగలదు. అచ్చట కోటితీర్థములు కలవు. అచ్చఇ అశ్వత్థవృక్షము కల్పవృక్షముతో సమానము. అశ్వత్థసమీపమున నృసింహ తీర్థము దానికి ఉత్తరమున క్రమముగా పాపనాశనము, వారణాసితీర్థము, రుద్రపాదతీర్థము, చక్రతీర్థము, కోటితీర్థము, మన్మథతీర్థము మొదలగు తీర్థములు కలవు. అచ్చట కల్లేశ్వరుడను ఈశ్వరుడు కలడు ఆక్షేత్రము గోకర్ణముతో సమానము. ఆక్షేత్రమునకు వెళ్ళి అనుస్ఠాన మొనర్చువారి మనోరథములు తప్పక ఫలించును. కాని నా క్షేత్రము సిద్ధభూమియని ప్రసిద్ధినొందినది.

కనుక ఓ శిష్యులారా ! నేను చెప్పినటుల మీరు తీర్థ యాత్రలు సలుపుడు. మీ జన్మాంతర పాపములన్నియు నశించగలవు. బృహస్పతి సింహరాశికి



వచ్చినపుడు గంగ గోదావరియందు సంగమించును దానినే పుష్కరమందురు. అట్లే బృహస్పతి కన్యరాశికి వచ్చినపుడు గంగ కృష్ణానదిని చేరును. ఇట్లు మహానదులకు పన్నెండు సంవత్సరములకొకసారి పుష్కరమను పుణ్యకాలము వచ్చుటచే ఆ నదులయందప్పుడు స్నానములు మొదలగు పుణ్యకర్మల నాచరించుటచే సత్యధిక ఫలము లభించును. భీమానది కృష్ణానదియందు కలియుచోట ఎవ్వడు స్నానమొనర్చునో వాడుశుద్ధుడయి ఆరువది (60) పర్యాయములు వరుసగ విప్రుడయి జన్మించును పాతాళగంగయందు స్నాన మొనర్చి మల్లికార్జునుని దర్శించువారికి ముక్తియే సిద్ధించును. కృష్ణాసాగర సంగమము, కావేరిసాగర సంగమము సర్వపాపముల నశింపచేయ సమర్ధము. శేషాద్రి, కుంభకోణము, కన్యాకుమారి, మత్స్య తీర్థము, పక్షితీర్థము, రామేశ్వరము, దనుష్కోటి, మహాలక్ష్మికి నివాసస్థానమయిన కొల్హాపురము (కరవీరము) ముఖ్య క్షేత్రముగాన ఆ క్షేత్రమును సేవింపుడు అట్లే కృష్ణానదీ తీరమున భిల్లవటియను గ్రామము కలదు. అక్కడ భువనేశ్వరియను అమ్మవారుకలదు ఆ క్షేత్రమును సేవింపు. కృష్ణానదీతీరమున అమరపురమను నొక క్షేత్రముకలదు. అచ్చుట అయిదు నదులు కృష్ణతో సంగమించును యుగాలయమను తీర్థము, శూర్పాలయమను మరియొక తీర్థము. ఇవి పరమ పవిత్రములు మలావహా అనేది కృష్ణతో సంగమించును అది విశ్వామిత్రుడు తపమొనర్చిన స్థానము గాన పరమపావనము, కపిలాక్షేత్రమున కృష్ణానది ఉత్తరవాహిని అయి ప్రవహించును. అచ్చుట చేసిన మంత్రజపము కోటిరెట్లుగా ఫలించును.

పిఠాపురము దత్తాత్రేయులకు నివాసము మణిగిరియను క్షేత్రమునసప్తఋషులు తపమొనర్చిరి. అహోబలమను క్షేత్రదర్శనముచేతనే ఆరువది 60 యజ్ఞములు చేసిన ఫలము లభించును. ఇవ్విధమున పైన చెప్పబడిన తీర్థక్షేత్రముల యాత్ర గావింపుడు. వర్షాకాలమున ప్రతి నదికి రెండు నెలలు రజస్వలా దోషము తటస్థించును. గాన ఆ దినముల ఆ నదీ స్నానము చేయరాదు. భాగీరథి, చంద్రభాగ, సింధునది, గోదావరి, సరయు నర్మద మొదలగు మహానదులకు మూడుదినములు మాత్రమే రజస్వలాదోషము, ఏ దినమున నూతనోదకము వచ్చునో ఆ దినమునుండి నదికి రజోదోషము వాటిల్లెనని గ్రహించవలయును. వాపీకూప తటాకములకు ఒక దినము మాత్రమే

రజోదోషము. ఈ నియమము యాత్రచేయువారికి వర్తించును గాని ఆ తీరస్థులకు వర్తించదు సాధారణమయిన యాత్రావిధీని చెప్పితిని. ఇంకను ఆయా క్షేత్రములకు వెళ్లునపుడు చేయవలసిన క్షౌరుపవాసాది నియమముల పాటించవలయును అని చెప్పి శిష్యుల తీర్థయాత్రకు సాగనంపిరి.

నేను మాత్రము స్వామివారి సేవచేయుచు వారిద్దనే ఉంటిని అని సిద్ధముని నామధారకునితో చెప్పెను.

**ఇది గురుచరిత్రమున పదునైదవ అధ్యాయము సమాప్తము.**

**దిగంబర దిగంబరా శ్రీపాదవల్లభ దిగంబరా**

**శ్లో॥ ప్రేరయ తీర్థయాత్రా యై**
**తీర్థరూపో....పి యః స్వకాన్ ।**
**సమర్ ధర్మ ముపాదిశ్య**
**శ్రీ దత్తశ్శరణం మమ ॥**

భా॥ స్వామివారు వైద్యనాథమను క్షేత్రమున కొంత కాలము గుప్తముగ నుండదలచి శిష్యులను తీర్థయాత్రలకు గాను పొండని పంపుట.

ఈ అధ్యాయము పారాయణముచే తీర్థయాత్రలు చేసిన ఫలము రాగలదు.

**శ్లో॥ సశిష్యః పర్యవీ క్షేత్రే వైద్యనాథ సమీపతః ।**
**స్థిత్వోద్ధ ధారమూఢం యః శ్రీదత్తశ్శరణం మమ ॥**

ఈ అధ్యాయము పారాయణచే సద్గురులాభము కలుగును.

# శ్రీ గురు చరితము

## పదునారవ అధ్యాయము

**ఓమ్ అవధూత చింతనం శ్రీగురుదేవదత్త జయ ఓమ్**

**ఓం శ్రీ గురుదత్తాత్రేయాయనమః ఓం శ్రీ గణాధిపతయే నమః.**

**ఓం శ్రీ గురుదేవదత్త.**

సిద్ధముని నామధారకునితో నిట్లు చెప్పుచున్నారు. స్వామివారు శిష్యులనందరను తీర్థయాత్రలకు సాగనంపిరి. నేను మాత్రమే వారి పాదసేవాతత్పరుడనై అక్కడ ఉంటిని. ఆ క్షేత్రము కడు మనోహరము. ఆరోగ్యభవానియను పరమేశ్వరి అచ్చట వెలసియుండుటచే ఆ క్షేత్రమహిమ జగద్విఖ్యాతము. ఆ క్షేత్రమున శ్రీనృసింహ సరస్వతీస్వామి వారు ఒక సంవత్సరము గుప్తముగ నివసించిరి. వారచ్చటనున్న కాలములో నొక చిత్రము జరిగెను. చెప్పెదవినుము.

ఒక బ్రాహ్మణు డొకదినమున స్వామివారి వద్దకు వచ్చి, సాష్టాంగముగ నమస్కరించి, స్తుతించి, అజ్ఞాన మహాసముద్రములో మునిగియున్నాను. నన్ను తరింపజేయుడు. నేను బహుదినములు తపమొనర్చితిని గాని మనస్సునకు స్థిరత ఏర్పడలేదు, జ్ఞానములేని తపస్సు వ్యర్థము గదా; మీ దర్శనము వలన నా మనస్సునకు హర్షోదయమయ్యెను. నాకు శీఘ్రముగ జ్ఞానోదయమగునటుల నేమి అయిన ఉపదేశించి నన్ను తరింప చేయుదని ప్రార్థించెను. అప్పుడు స్వామి వారు నవ్వి ఓయీ బహుదినములు తపమొనర్చితినంటివి. నీకింతపర్యంతము గురూప దేశమయ్యెనా; గురూపదేశము లేనిది తపమెట్లాచరించితివి. అని అడిగిరి. అప్పుడు ఆ బ్రాహ్మణుడు దుఃఖముతో కన్నుల నీరుకార్చుచు స్వామీ! నా వృత్తాంతము చెప్పెద వినుడు.

నాకును ఇదివరకొక గురువుండెను. కాని అతను నిష్ఠురముగ మాట్లాడువాడు. దయ అనునది ఏ మాత్రము లేదు. విద్య చెప్పకపోగ అదిచేయుము, ఇది చేయుము అని కఠిన సేవల విధించెను. నేను ఆ పనుల చేయ నిరాకరించి వారిని త్యజించి మీకడకు వచ్చితిని. వారి వాక్యమును వినక పోవుటచే వారికి నామీద మరింత కోపము వచ్చెను. ఇది నా పూర్వవృత్తాంతము అని చెప్పెను.

అతని వాక్యము విని స్వామివారు ఓరీ! మూఢుడా ఒకడు దేవాగారమున మలవిసర్జనము చేసి ఎవ్వరయిన నది క్షేపింప అదినా ప్రారబ్ధమనినటుల ఒకడు తన ముక్కల చెవుల కోసికొని ఇతరులకు అపశకునము కాగలందులకు వారల కెదురయినట్లు నీ చరిత్ర నాకు తోచుచున్నది. గురువును. అవమానించిన నీకు జ్ఞానమెట్లు కలుగును? నీవు నిజముగ గురు ద్రోహివి కాన గురువును నోట నిందించుచున్నావు. స్వముఖమున గురువు యొక్క దోషముల కీర్తించెడి నీకు మనస్థైర్యమెటుల లభించును? జ్ఞాన మెట్లు సిద్ధించును? గురు ద్రోహియగు వాడు ఇహపరముల సుఖమునొందజాలడు. గురుసేవావిధిని తెలిసికొనిన వాడే నిజమైన శిష్యుడు గురుభక్తునకు వాటంతట అవి వశము కాగలవు. అని ఇట్లు గురుభక్తి ప్రభావమును వారు విస్తరించి చెప్పవాడును తాను చేసిన దానికి పశ్చాత్తప్తుడయి దీనవదనుడయి నమ్రుడయి ఇట్లు చెప్పుచుండెను.

సద్గురో ! జయజయ! మీరు నిర్గుణులు. నిరాకారులు నేను అజ్ఞానమను వలలో పడి గురుస్వరూపమును గుర్తించకపోతిని. నాయందు దయయుంచి నాకు జ్ఞానము కలుగునటుల చేయుడు గురువన నెవ్వరు? గురుసేవ చేయవలసిన విధానమెయ్యది? మొదలగు విషయముల నాకు విశదీకరించి నామనస్సును స్థిర పరచుడు. అని చెప్పుచు స్వామివారికి నమస్కరించెను.

గురునాథుడు అతని దీనాలాపములకు కరుణించి అతనితో గురుసేవా విధానమును ఇట్లు చెప్పిరి.

ఓ బ్రాహ్మడా! వినుము, తల్లిదండ్రులు మొదటి గురువులు. మనకు హితము నుపదేశించువారును గురుతుల్యులే. బ్రహ్మ విద్య నుపదేశించు నతడు త్రిమూర్తి స్వరూపుడగు దత్తాత్రేయునిగ భావించవలయును. సావధానముగ అట్టి వారి సేవచేసి తీరవలయును. గురు సేవాఫలము నీకు గోచరము కాగలందులకు భారతమున చెప్పబడిన యొకకథను చెప్పుచున్నాను. వినుము.

పూర్వము ద్వాపరయుగమున ధౌమ్యుడను నొక మహర్షి కలడు. అరుణుడు, పెలుడు. ఉపమన్యువు అను ముగ్గురు శిష్యులు వేదాభ్యాసము నిముత్తమువచ్చి వారి సేవ చేయుచుండిరి. పూర్వపు విద్యాపరిస్థితి ఎట్టిదనిన శిష్యుడు వచ్చుటతోడనే అతనికి విద్య చెప్పు సంప్రదాయము లేకుండెను. ఎంతో కాలము పరీక్షార్థము అతనివలన నానా విధములగు శుశ్రూషలు చేయించుచుందురు. ఇట్లు కొంతకాలము శిష్యుడు చేయుసేవచే అతని చిత్తము పరిపాకమునొందుట

చూచి అప్పుడు వారు కృపాదృష్టితో శిష్యుని చూతురు. వెంటనే అతడు సర్వవిద్యాపారంగతుడగును. ఇది ప్రాచీనవిద్యాసంప్రదాయము. ధౌమ్యుడు నట్టి సంప్రదాయము ననుసరించిన వాడేగాన ఒకరోజున అరుణుడను శిష్యుని పిలిచి శిష్యుడా! నీవు మా పొలమునకు పోయి చెరువు నీరు మంచిగ పొలము తడియునట్లు పెట్టుము. నీరులేనిచో సస్యము ఎండును. కాన శీఘ్రముగ పొమ్మనిరి. గురువు యొక్క వాక్యమును వినుటతోడనే శిష్యుడు సంతోషముతో క్షేత్రమునకు వెళ్లి చెరువునీటిని కాలువ ద్వారా గురువు యొక్క పొలము పర్యంతము తెచ్చుచుండ మధ్య మార్ధమున ఆ కాలువ కట్టతెగి ప్రవాహము పల్లమునకుపోవుచుండ అక్కడ దగ్గరనున్న రాళ్లను మట్టిని గండిపడినచోట వేసి ప్రవాహము క్రిందికి పోకుండునటుల ప్రయత్నించెను. కాని అతని ప్రయత్నము విఫలమయ్యెను. అప్పుడువాడు శ్రీహరీ! ఏమిచేయుదును. గురుకార్యము చేయలేని ఈ జన్మ ఉండిఎందులకు? ప్రాణములత్యజించి అయినను గురుకార్యము నిర్వహించుటయే నాధర్మము. అని నిశ్చయించుకొని గురువును ధ్యానించుచు తన శరీరము నాపడిన గండికి కట్టగ నుండునటుల ప్రవాహముతో పడుకొనెను. అప్పుడు ప్రవాహజలము స్వేచ్ఛగ గురువు గారి పొలములో ప్రవేశించెను. ఆ క్షేత్రమంతయు చక్కగా తడసెను.

అంతలో గురుమూర్తి ధౌమ్యుడు సూర్యుడస్తమించి నను శిష్యుడు ఇంటికి రాకుండుటకు ఖిన్నుడై వ్యాఘ్రములచేత భక్షింపబడియుండునా అని శంకించుచు దీర్ఘస్వరముతో శిష్యుని పిలుచుచు క్షేత్రమును సమీపించెను. గురువు యొక్క



పిలుపు చెవిని పడుటతోడనే నీటినుంచి లేచి శిష్యుడు భక్తిభావముతో గురువు యొక్క పాదములకు వందనమాచరించెను. గురువు జరిగిన వృత్తాంతము నతనివలన తెలిసికొని అతని గురుభక్తికి అతని ధైర్యమునకు విస్మితుడయి నీవు సమస్తశాస్త్ర పారంగ తుడవగుదువు గాక. అని ఆశీర్వదించెను. వెంటనే అతను విద్యానిధి అయ్యెను. నీవు ఇంటికిపొమ్ము. తగిన భార్యను వివాహమాడిసుఖముగ నుండుమని చెప్పి ఆ శిష్యుని పంపివేసెను. మిగిలిన ఇద్దరు శిష్యులు గురువును సేవించుచుండిరి. కొంతకాలము జరుగ ధౌమ్యుడు పైలుడను రెండవ శిష్యుని పరీక్షింపనెంచి ఒకరోజున అతని పిలిచి పుత్రకా! క్షేత్రమున పైరు పక్వమయినది. నీవు పొలమునకు పోయి అహోరాత్రములు కాపలా కాచి ధాన్యమును సిద్ధపరచుమనిరి. వాడును గురుని ఆజ్ఞ ననుసరించి క్షేత్రమునకు వెళ్లి పైరును రక్షించి ధాన్యము రాశిచేసి గురువును సమీపించి గురువుతో ధాన్యమును సిద్ధము చేసితిని. మీ ఆజ్ఞ అయినచో నింటికి తెచ్చెదననెను. అప్పుడు ధౌమ్యుడు అతనితో శిష్య శిఖామణీ! నాకొరకింత కష్టపడితివి. ధాన్యమును శీఘ్రముగ నింటికి తెమ్ము అని చెప్పి తనవద్దనున్న ఒక బండిని ఒక దున్నపోతును మాత్రము శిష్యునకు స్వాధీనముచేసెను. శిష్యుడు వారి ఆజ్ఞను స్వీకరించి మహిషమును బండి కాడికి కట్టి రెండవ మహిషము లేనందున రెండవ ప్రక్క కాడిని తన భుసమునందే ఉంచుకొని ఆబండిని పొలమునకు తీసికొనిపోయి నలుబదిమణుగుల ధాన్యముతో ఆ బండిని నింపి తిరిగి ఆ బండిని వెనుకటి విధముగ గురు గృహమునకు తెచ్చుచుండెను. కాని ఆ మహిషముతో సమముగ తాను నడువలేకుండెను. త్రోవలో ఆ మహిషము బురదలో దిగబడెను. అప్పుడు దాని కంఠపాశమును వదలి బండిని బురద నుండి తీయగలందులకు ప్రాణమునయినను లెక్కచేయక ప్రయత్నించుచుండెను. అట్టి సమయమునకే ధౌమ్య మహర్షి అచ్చటకు వచ్చుట తటస్థించెను. వారు శిష్యుని సాహసమునకు వాని దృఢ భక్తికి సంతసించి అతనిని సమీపించి ఆలింగనము చేసికొనిరి వెంటనే వాడును సర్వ విద్యాపారంగతుడాయెను. అతనిని ఆశీర్వదించి ఇంటికి పోయి వివాహమాడి సుఖముగ నుండుమని చెప్పి పంపివేసిరి.

ఇక మూడవ శిష్యుడు ఉపమన్యుడు గురు సేవానిరతుడు. కాని తిండిపోతు కనుక విద్యాభ్యాసమునకు అర్హుడు కాకుండెను. అతనికి మితాహారము నభ్యసింప చేయవలయునని గురువు తలచి ఒకరోజున అతనిని పిలిచి ఓరీ, నీవు నిత్యము



ప్రొద్దునలేచి మన గోవులను అరణ్యమునకు తీసికొనిపోయి కాచుకొనిరమ్ము. అని శుశ్రూష విధించిరి. వాడు గోవులను మేతకు తీసికొని పోయెను. కాని ఆకలి అయినందున కొలది కాలమునకే గోవులను తిరిగి తీసికొనివచ్చెను. గురువు అతనిని చూచి ఓరీ ఇంత శీఘ్రముగ వచ్చితివేమి? సూర్యుడస్తమించు పర్యంతము గోవులను మేపి తీసుకురమ్మని అని పంపిరి. వాడు గురువు ఆజ్ఞననుసరించి గోవులను తీసికొనిపోవుచు ఆకలి యగుచున్నందున అచ్చట ఒక నది యందు స్నానమొనర్చి గోవులను మేతకు వదిలి సమీపమున నున్న గృహముల మాధూకరము చేసి భుజించి సాయంకాలమునకు గురు గృహమునకు గోవులను తెచ్చుచుండెను. గురువు మితముగ రాత్రి ఆహారము నొసంగుచుండెను. ఇట్లుకొన్ని రోజులు గడువ శిష్యుడు మామూలు ప్రకారమే పుష్టిగ నుండుట చూచి గురువతనితో ఓరీ నీవు పగలంతయు ఆహారములేక గోవులకాచుచుంటివి గదా! నీవింత పుష్టిగ నెట్లుండగలిగితివి అని ప్రశ్నించెను.

అప్పుడు వాడు స్వామీ! ఆవులు మేయుచుండ నేను నిత్యము మధ్యాహ్నకాలమున పరిసరములయందున్న గృహము లయందు మాధూకరముచేసి భుజించుచుంటిని. అని చెప్పెను అప్పుడు గురువు కోపించి ఓరీ నన్ను విడిచి నీవు భుజించుట ధర్మమా! రేపటి నుండి నీవు యాచించిన మాధూకరమును నాకు తెచ్చియిమ్ము. అనంతరము గోవుల కాచుటకు పొమ్ము అని అజ్ఞాపించెను శిష్యుడటులనే చేయుచుండెను. గురువు ఇచ్చు ఆహారముచే ఇతని యాకలి తీరకుండెను. అప్పుడు వాడు గురువు ఇంట భుజించియు తిరిగి గోవులను తోలుకొనిపోవుచు మరికొన్ని యిండ్లలో మాధూకరము చేసి భుజించుచుండెను. ఇట్లుకొన్ని రోజులు జరుగ శిష్యుడు వెమకటివలెనే పుష్టిగ

నుండెను. దానిని చూచి గురువు అట్లుండుటకు కారణమేమని ప్రశ్నించ స్వామీ! మీరిచ్చిన పదార్థముచే నాకాకలి తీరనందున మరియొక పర్యాయము గూడను మరికొన్ని గృహములందు భిక్షముచేసి భుజించుచుంటిని. అని నిజము చెప్పెను గురువు కోపించి రెండవసారి యాచించిన యన్నమును గూడ నాకే తెచ్చియిమ్మనెను. వాడును అట్లే చేసెను అతనికి ఆకలి తీరకుండెను. మరుసటి రోజున గోవులకాచుటకు వెడలెను. ఆవుదూడలు పాలు త్రాగుచుండ వాటి మూతినుండి చొంగధారలు క్రిందపడుచుండెను. వాడప్పుడు దోసిళ్ళతో ఆపాల చుంగనుత్రాగ ప్రారంభించెను. రెండు పర్యాయములు తాను తెచ్చిన భిక్షమిచ్చుచుండెను. అందుండి గురువిచ్చిన ప్రసాదమును తినును తిరిగి అడవులలో గోవత్సములముఖముల నుండి స్రవించు పయోధారల గ్రోలుచుండుటచే వీడు దినదినంబునకు మరింత పుష్టిగనుండుట గమనించి కారణమడుగ వాడు తాను చేసిన పనిని చెప్పెను. గురువు అది విని ఓరీ: మతిభ్రష్టుడా: ఉచ్ఛిష్టపయఃపానము చేయవచ్చునా? అట్లు చేయుట బహుదోషము. ఇకమీదట నట్లొనర్పకుము అనిరి. శిష్యుడును వారు యాజ్ఞకు బద్ధుదేగాన మరుసటి నాటినుండియు ఆపని మానెను. ఆవుల కాచుచుండెను. కడుపులో ఆకలి మండిపోవుచుండెను. అచ్చట అనేక జిల్లేడువృక్షములు అతనికి ఆగుపడెను. అందొక ఆకువిరచగా అందుండి క్షీరము స్రవించసాగెను. ఇదియు క్షీరమే గదా! గురువు ఇది త్రాగవద్దని నిషేధించలేదు గాన దీనిని త్రాగి ఆకలిని తీర్చుకొనియెద అని నిశ్చయించికొని ఆకులతో నొకదప్పను. తయారుచేసి అందు అర్కక్షీరములు నింపి త్రాగుచుండ దైవవశమున అవికంటిలోపడి రెండు నేత్రములు పోయి గ్రుడ్డివాడాయెను. గోవులను చూడలేకపోయెను. చింతాక్రాంతుడయి చేతనొక కఱ్ఱను పట్టుకొనిగోవులేమయ్యెనోగదా! గురువు నన్ను కోపించును. ఏమిచేయుదును! అని అటునిటు అంధుడయి తిరుగుచు ఒక గర్తమున పడెను. ఇంతలో సూర్యుడు అస్తమించెను ధౌమ్యుల వారు శిష్యుడు ఎంతకును రాకపోయెను. ఏమి కారణమాయని విచారించుచు అడవి మార్గమున వెదకుచు వచ్చుచుండ వారికి గోవులుమాత్రము గోచరమయ్యెను. శిష్యుడు కనబడనందున దుఃఖార్తుడయి దీర్ఘధ్వనితో కేకలు వేయసాగెను. గురువు యొక్క వాక్యము చెవినిపడి గర్తములో నుండిన శిష్యుడు దీనస్వరముతో స్వామీ! ఇచ్చట పడియుంటిని. అని చెప్పెను. ధౌమ్యమహర్షి అచ్చటకు వచ్చి వానియందవు కృపకలిగి వానివలన జరిగిన వృత్తాంతమును విని, ఓరీ! ఒక

పర్యాయము అశ్వినీదేవతల స్మరింపుమని చెప్పిరి వాడట్లే స్మరించినంతనే యథాపూర్వముగ దృష్టి వచ్చెను. వెంటనే వాడు గర్తమునుండి బయటకు వచ్చి భక్తితో నమస్కరించి స్తుతించెను.

అప్పుడు ధౌమ్యులవారు సంతసించి అతనిని ఆలింగనమొనర్చి ఓ శిష్యశిఖామణి! నీ భక్తికి నీకౌశల్యమునకు సంతసించితిని. అని చెప్పి తన హస్తమును అతని శిరముననుంచుసరికి ఆ శిష్యుడును తత్క్షణము వేదశాస్త్ర పారంగతుడాయెను. అప్పుడు ధౌమ్యులవారు అతనితో గృహమునకు పోయి తగిన భార్యను పెండ్లాడి భూతలమున సుఖముగ జీవించుము నీకీర్తి భూతలమున ప్రఖ్యాతిగాంచును. నీకు నీతో సమానుడగు ఉత్తంకుడను శిష్యుడు నీ వద్ద విద్యనభ్యసించి నీకు గురుదక్షిణగ పాతాళలోకమునుండి ఆదిశేషుని కుండలముల తెచ్చి సమర్పించును. అతనే జనమేజయునితో సర్పయాగముచేయించును. ఆసమయమున తక్షకుడు ఇంద్రుని శరణుపొంది అతని పీఠమునకు చుట్టుకొనియుండ నీ శిష్యుడయిన ఉత్తంకుడు తన మంత్ర మహిమచే "సహేంద్ర తక్షకాయస్వాహా యని ఇంద్రుని పీఠముతో సహా తక్షకుని ఆకర్షింప సమర్థుడగును, ఇటువంటి శిష్యుని ద్వారా నీకీర్తి ఆచంద్రతారకముగ నుండగలదు అని చెప్పి అతనిని గూడ పంపివేసిరి.

స్వామివారు బ్రాహ్మణునితో పై విధమయిన ధౌమ్యుని కథ చెప్పి ఓ బ్రాహ్మణుడా! గురుభక్తి ప్రభావము వింటివి గదా: గురు ద్రోహికి ఇహసుఖమే లేదు. పరసుఖ మెక్కడిది? అట్టివాడు గురుద్రోహమను పాపముచే కుంభీపాకమునే పొందును. గురువు సంతసించిన నేది సిద్ధించదు? కాన ఇప్పటికయినను అజ్ఞానమును విడనాడి చేసిన పొరపాటును దిద్దుకొని నీ గురువును సమీపించుము. అతడు నిన్ను తరింప చేయును. గురువు సంతోషించిన మంత్రసిద్ధి వెంటనే కలుగును. అని ఆజ్ఞాపించిరి. వారి వాక్యములు విని ఆ బ్రాహ్మణుడు స్వామీ! జయజయ. గురుతత్వమును బోధించిరి. నేను నిజముగ గురుద్రోహినైతిని గురువు యొక్క చిత్తమునకు నొప్పి కలిగించితిని. నేనిప్పుడు వెళ్లినను నాయందెట్లు ప్రసన్నులయ్యెదరు. సువర్ణాదిధాతువులు అతికిన నతకవచ్చును. ముత్యపుచిప్ప పగిలిన ఎవ్వరయిన అతుకగలరా? గురుద్రోహి నయిన నేను జీవించి ప్రయోజనమేమి? ప్రాణముల త్యజించెద అని చెప్పుచు ఆత్మహత్యకు నుద్యుక్తుడయ్యెను. అందుచే అగ్ని



స్పర్శచే తృణము భస్మమయినటుల పశ్చాత్తాపముతో అతని పాపములన్నియు పటాపంచలయ్యెను. అగ్ని కర్పూరమును నిశ్శేషముగ దహించునటుల పశ్చాత్తాపముచే సర్వదోషములు సమూలముగ నశించును కాన గురుమూర్తి అతనికి కలిగిన పశ్చాత్తాపమునకు సంతసించి అతనిని దగ్గరకు పిలచి నీ దురితము లన్నియు పోయెను. నీవు గురువును హృదయమున స్మరించి ఆ రూపముతో నన్ను ధ్యానించుము అని చెప్ప అతడును సంతసించి వారి పాదముల శిరముంచి నమస్కరించెను. గురువును స్తుతించెను. శరీరము పులకరించెను. కంఠము గద్గదమయ్యెను. ఆనంద బాష్పములు నేత్రముల వెంట స్రవింపసాగెను. తక్షణమున గురు కృపచే అతనికి జ్ఞానోదయమయ్యెను. వేద శాస్త్రములయందు నిపుణుడయ్యెను. ఆ బ్రాహ్మణుని యొక్క అదృష్టమును ఏమని చెప్పవలెను? అప్పుడు గురుమూర్తి అతనిని ఓదార్చి నీవు సంశయించక ఇపుడు నీ గురువునొద్దకు పొమ్ము. నీవు వెళ్లినంతమాత్రముననే అతను సంతసించును. అతను వేరు నేను వేరు అనుభేదమును విడనాడుము అని చెప్పిరి. వాడుమ అట్లే చేసి గురుకృపకుపాత్రుడయి ఇహపరసుఖముల నొందెను. ఇంతలో వైద్యనాథక్షేత్రమున సంవత్సరము పూర్తి కాగా శ్రీనృసింహ సరస్వతీస్వామివారు ఆ క్షేత్రమును విడిచి కృష్ణానదీతీరమందలి భువనేశ్వరియను పరాశక్తికి నివాసమయిన భిల్లవటియను గ్రామముచేరి నదికిపశ్చిమతీరముననున్న ఒక ఉదుంబర వృక్ష మూలమున కొంతకాలము నివసించిరి. ఆ కథ పై అధ్యాయమున చెప్పబడును.

**ఇది గురుచరితమున పదునారవ అధ్యాయము సమాప్తము.**

**దిగంబరా దిగంబరా శ్రీ పాదవల్లభ దిగంబరా**

# శ్రీ గురు చరితము

## పదునేడవ అధ్యాయము

**ఓం శ్రీ గురుదత్తాత్రేయాయనమః ఓం శ్రీ గణాధిపతియేనమః**

**ఓం అవదూతచింతనం శ్రీ గురుదేవదత్త జయ ఓం**

సిద్ధముని నామధారకుని గూర్చి నీవు నిజమయిన గురు భక్తుడవు కావుననే గురుచరిత్రమును విను భాగ్యము నీకు లభించెను. వర్షమువచ్చుటకు పూర్వము దానిని సూచించు చల్లనిగాలి ముందువచ్చునటుల గురుకృపకు పాత్రుడగుటకు పూర్వము వారి కథ వినుట యందు రుచియు అటులనే పుట్టును. సావధానుడవై గురుచరిత్రమును వినుము.

స్వామి వారు భువనేశ్వరికి నివాసస్థానమయిన ఆ "భిల్లవాటికా" యను క్షేత్రమున కృష్ణానదికి పశ్చిమతీరమున ఒక మేడిచెట్టు క్రింద చాతుర్మాస్యవ్రతము నాచరించుచుండిరి. వారు నివసించుటచేత ఆ స్థానమునకు మహిమ మెండాయెను. అచ్చట వారు గుప్తముగ నుండి భిక్షావృత్తిచే జీవయాత్ర సలుపుచుండిరి. అని చెప్ప నామధారకుడు సిద్ధమునితో స్వామీ! అంతటి మహాత్ములు గుప్తముగ నుండుటకు కారణమేమి? భిక్షమెత్తి జీవించవలసిన అవసరమేమి అని ప్రశ్నించ సిద్ధముని ఇట్లు చెప్పుచుండెను.

శివుడు భిక్షమాచరించును. మహాత్ములు తీర్థయాత్ర చేయుట ఏమి, తపమాచరించుట యేమి. భిక్షమెత్తుట యేమి భక్తుల ననుగ్రహించుటకే గాని అందు వారి స్వార్థ మేమియు లేదు. భక్తి లేనివారి బారి నుండి తప్పించుకొనందులకు గాను గుప్తముగ నుండనెంతురు. వారు ఎంత గుప్తముగ నుండదలచినను, కస్తూరి గుప్తముగ దాచినను దాచి సుగంధమెటుల వెలువడునో అట్లే వారి మహిమయు ప్రఖ్యాతమగుచునే యుండును. ప్రస్తుతము ఈ భిల్లవటీతీరమున జరిగిన చరిత్రమును చెప్పెద వినుము.

కరవీర నగరమున వేదశాస్త్రపారంగతుడై స్వకర్మనిరతుడయిన ఒక బ్రాహ్మణుడు కలడు. అతనికొక కుమారుడుండెను. ఆ బాలుడు మందబుద్ధి చిన్నతనముననే తండ్రి మరణించెను. బాలునకు ఏడు సంవత్సరములు వచ్చెను. జ్ఞాతివర్గమువారు అతనికి ఉపనయనము చేసిరి. కాని పశుప్రాయుడగు నా బాలుడు గాయత్రీ మంత్రమునయినను సరిగ నుచ్చరింప సమర్థుడుగాడు.

ఎన్ని పర్యాయములు చెప్పినను వెంటనే మరచిపోవును. అయిదారక్షరములు గల పదమునయినను కలిపి పలుకజాలకుండెను. అచ్చటి విద్వాంసులందరు. ఆ బాలునితో ఓరీ దుర్మతీ అటువంటి విద్వాంసుని గర్భమున నెట్లు జన్మించితివి? పాషాణముతో సమమగు నీవు జన్మించి ఏమి ప్రయోజనము? నీ పుట్టుకచే నీ తండ్రి కీర్తికి గూడ కళంకము వాటిల్లెను. పంది వలె ఊరక తిని తిరుగుచున్నావు. దురాచారుడవగు నీకు యమలోకమే ముందు నివాసము కాగలదు. ఇట్టి నీవు బ్రతికియు ఏమిలాభము. పెద్ద పాషాణమొకటి కట్టుకొని చెరువులో పడి చచ్చుటయే శ్రేష్టము విద్య గలవాని జీవితమే జీవితము.

విద్య తరుగని నిధి. విద్వాంసుడు అందరిచే పూజింపబడును. వయస్సుకు చిన్నవాడయినను విద్వాంసుడు వయోధికుల చేతను గౌరవింపబడును. సోదరులు లేకున్నను విద్యయే సోదరునిగ పని చేయును. విదేశములకు వెళ్ళినను పరిచయము లేనిచోట గూడ అతను మన్నన నొందును. విద్య గలవాడు జ్ఞాని కాగలడు విద్య గలవానియందు సమస్త దేవతలు ఉందురు. అందరి చేతను గౌరవింపబడును. చక్రవర్తియు విద్వాంసుని పూజించును. కాన విద్యాభ్యాసము ప్రతి వారును చేయనగును. విద్య లేనివాడు పశువు అని అనిరి. వారి మాటలు విని ఆ మూఢ బాలుడు వారితో స్వామీ మీరు చెప్పినది సత్యము, నేను పూర్వజన్మమున విద్యాదానము చేయనయితిని. కాననే ఈ జన్మ యందిట్టి మందమతి నయితిని. నేనేమి చేయుదును? ఏది అయిన ఉపాయము నాకు విద్య రాగలందులకు మీరుపదేశించిన నేనాచరించెద అని అన వారు అతనిని పరిహసించి కులనాశకా! కుక్షింభరుడా! నీకేమిటి? విద్య వచ్చుట ఏమి? పోపొమ్ము అని నిరాకరించిరి. అప్పుడు వాడు అనుతాపము నొంది విరక్తుడయి ఆ గ్రామమును వదలి ఛీ నేను జీవించి ఏమి లాభము నాకన్న కుక్కయు శ్రేష్ఠము. ప్రాణముల త్యజించెద ననుకొనుచు అడవిమార్గమున పోయి పోయి దైవవశమున భిల్లవటీ గ్రామమున ప్రవేశించెను. అచ్చట ప్రసిద్ధిగాంచిన భువనేశ్వరి అమ్మవారి దేవాలయ ద్వారము వద్ద కూర్చొని ఉపవాసము చేయుచుండెను. స్నానము లేదు. సంధ్యయు లేదు. ఇట్లు మూడురాత్రులు ఉపవాసముచేసెను. మనస్సున అమ్మ వారిని ప్రసన్నురాలవయి విద్యనిమ్మని ఆర్తితో ప్రార్థించుచుండెను.

మూడు దినములయినను స్వప్నమందయినను దేవి ప్రసన్నురాలు కాకుండుటకు వాడు కోపించి తల్లీ నన్ను ఉపేక్షించుచున్నావా? అని చెప్పుచు



ఒక పదునైన కత్తితో తన నాలుకను ఛేదించి దేవి పాదములముందుంచి ఇంతియే కాదు నీవు ప్రసన్ను రాలవు. కానిచో రేపు నా శిరమును కోసి నా పాదములయందుంచెదనని శపథము చేసెను. భువనేశ్వరి అతనియందు జాలికలదై స్వప్నములో దర్శనమిచ్చి ఓరీ నామీద నీకెందులకు కోపము. సాక్షాత్తు శివావతారమయిన ఒక మహానుభావుడు ఈ కృష్ణానది పడమటి తీరమున మేడి చెట్టుక్రింద కూర్చొనియున్నారు. నీవు వారిని శరణుపొందుము. నీ కోరికతీరును అని చెప్పి అంతర్ధానము నొందెను. వెంటనే ఆ బాలుడు మెలుకువనొంది సంతోషముతో నదిని దాటి అనాథరక్షకుడగు స్వామి వారిని మేడిచెట్టుక్రింద చూచి వారి పాదములయందు శిరముంచి నమస్కరించెను. వెంటనే స్వామివారు ప్రసన్నులయి అతని శిరమున తమ హస్తముంచగా తెగిపోయిన నాలుకయు సరిగ వచ్చెను. వేదశాస్త్ర పురాణ తర్క వ్యాకరణముల యందు గొప్ప పాండిత్యము కలవాడయ్యెను. కాకి మానస సరోవరమును సమీపించినంతనే రాజహంస ఎట్లగునో అట్లే స్వామి వారి హస్త స్పర్శ మాత్రముననే వాడు పండితుడయ్యెను. లోకపూజ్యుడయ్యెను. స్వామి వారి ఆజ్ఞ గైకొని వాడు తన గ్రామమునకు వెళ్ళి ఇహపర సౌఖ్యముల నొందెను.

ఇది గురుచరిత్రమున పదునేడవ అధ్యాయము సమాప్తము

దిగంబరా దిగంబరా శ్రీ పాదవల్లభ దిగంబరా

ఈ అధ్యాయము విద్యాప్రదము

**శ్లో॥ విద్యుత్సుతమ విద్యంయ ఆగతంలోకనిందితం ।**
**చిన్న జిహ్వాంబుధంచ క్రే శ్రీదత్తశ్శరణంమమ ॥**

**శ్లో॥ యో యో...తః ప్రవిశ్యమమ వాచమిమాం ప్రసుప్తాం।**
**సంజీవ యత్యఖిల శక్తి ధరస్స్వధామ్నా,**
**అన్యాంశ్చ హస్త చరణ శ్రవణత్వగాదీన్**
**ప్రాణాన్నమో భగవతే పురుషాయతుభ్యమ్ ॥**

శ్రీమద్భాగవతము ...

తా॥ ప్రభూ; మీరు సర్వశక్తి సంపన్నులు మీరే నా అంతః కరణములో ప్రవేశించి తమ తేజస్సుతో నాపలో నిద్రాణమగు వాణిని సజీవము చేసినారు అలాగే చేతులు, కాళ్ళు, చెవులు మొదలగు ఇంద్రియములు మరియు ప్రాణములు గూడా మీ వల్లనే చైతన్యవంతమగుచున్నవి సర్వాంతర్యామియుగు మీకు ప్రణామము చేయుచున్నాను.

# శ్రీ గురు చరితము

## పదునెమిదియవ అధ్యాయము

**ఓం శ్రీ గురుదత్తాత్రేయాయనమః ఓం శ్రీ గణాధిపతయేనమః**

నామధారకుడు సిద్ధమునిని గూర్చి మీవలన గురుకథా మృతమును పానము చేయుచుండ నాకు పిపాస యధికమగుచున్నది. భక్తునకు గురుకథామృతమే జీవనముగదా. కాన పైనకథను నాయందు దయముంచి చప్పుడని ప్రార్థించ సిద్ధముని హర్షముతో నిట్లు చెప్పుచుండిరి.

శోత్రలారావినుడు – శిష్యశిఖామణి ! నీవు ధన్యుడవు నీ ప్రశ్నయుకడు ధన్యము నీవలన గురుకథను చెప్పు భాగ్యము నాకు లభించుచున్నది. కొంతకాలము భిల్లవటియందు నివసించి అచ్చటనుండి వరుణాసంగమమను క్షేత్రమునకు వచ్చి క్రమముగా కృష్ణాతటమందలి ముఖ్యక్షేత్రముల తమ పాదముల స్పర్శచే పావనమొనర్చుచు కృష్ణాపంచనదీ సంగమముననున్న అమరపురమను గ్రామమునకు వచ్చి అచ్చట పన్నెండు సంవత్సరములు స్వామివారు నివసించిరి. ఆక్షేత్రము కాశీపురము వలె మనోహరమయియుండుటచేతను అయిదు నదులు కృష్ణానది యందు సంగమము నొందుటచేతను, ప్రయాగ కురుక్షేత్రము మొదలగు క్షేత్రముల కంటె మిన్న అయినందుకు ఆక్షేత్రమున వారు అంతకాలము నివసించుట తటస్థించెను.

అచ్చట శివ, భద్ర, భోగవతి, కుంభి, సరస్వతి అను అయిదు నదులు కృష్ణయందు వచ్చి చేరును. ఇవి యన్నియు మహాపాతకనాశకములు. అమరపురమను గ్రామము నిరుపమానమగు పుణ్యక్షేత్రము. దక్షిణప్రయాగగ బ్రసిద్ధినొందినది. ఆసంగమమున నమరేశ్వరుడను శివుడు గలడు. అందుచే అపురమునకు అమరపురమని పేరు వచ్చెను. అమరేశ్వరుని సన్నిధిని లోకపావనమగు శక్తి తీర్థముగలదు. అందు నరువది నలుగురు యెగినీ శక్తులు అమరేశ్వరుని సేవించుచు నచ్చట నివసించుచుందురు. అందువలన ఆ తీర్థమునకు శక్తి తీర్థమని పేరువచ్చెను ప్రయాగయందు మాఘమాసము నెలరోజులు స్నానము చేయుటచే వచ్చు పుణ్యము ఆ క్షేత్రమున ఒక స్నానమున మాత్రమే రాగలదు అక్కడ కృష్ణ దక్షిణవాహినియయి ప్రవహించును. అచ్చటి తీర్థముల యొక్క మహిమపూర్తిగా నెవ్వరికి వర్ణించతరముగాదు.

అమరపురమునకు ఉత్తరముగా కృష్ణ పశ్చిమ వాహినియయి ప్రవహించును.

అచ్చట శుక్ల తీర్థమను తీర్థము కలదు అచ్చట ఒక మేడి చెట్టు కలదు. ఆ మేడిచెట్టు యొక్క సమీపమున పాపవినాశనము, కామ్యతీర్థము, వరద తీర్థము, అను తీర్థములు దగ్గరదగ్గరగా గలవు. సంగమమున శక్తి తీర్థము అమరక తీర్థము కోటి తీర్థము అను ముఖ్యమయిన మూడు తీర్థములు కలవు. ఇట్టి పుణ్యతీర్థమగుటచే త్రిమూర్తి స్వరూపుడయిన శ్రీ నృసింహసరస్వతీస్వామి వారు అచ్చట కొంతకాలము నివసించిరి. ఆ క్షేత్రము సకలాభీష్టదము గాన సిద్ధస్థానమని చెప్పనగును. కలియుగమున కాలవశమున గుప్తమయిన తీర్థములకు లోకమున ప్రఖ్యాతి తెచ్చుటకుగాను స్వామివారచ్చట నివసించిరి. స్వామివారు నిత్యము మధ్యాహ్న కాలమునకు అమరపురమునకు భిక్షకు వెళ్లుచుందురు.

ఆ గ్రామమున నొక వైదిక బ్రాహ్మణుడు కలడు. అతను మిక్కిలి సాధువృత్తము కలవాడు. అతని భార్యయూ పతివ్రతా శిరోమణి. బ్రాహ్మణుడు బీదవాడగుటచే నిత్యము యాయవారవృత్తిచే జీవించును. దారి అంగణమున నొక తమ్మపాదుండెను, అది కాయలు కాయుచుండును. ఏ దినమున దైవవశమున వారికి తినుటకు ఆహారము లభించకుండెనో ఆ దినమున నాతమ్మకాయలను మాత్రమే శాకముగ చేసి భుజించుచుండెడివాడు. ఒకరోజున దైవవశమున శ్రీ గురుమూర్తి వారు వారి ఇంటికే మధ్యాహ్నమునకు భిక్షకు వెళ్లుట తటస్థించెను. దంపతులు భక్తితో స్వామివారిని ఆహ్వానవెునర్చి షోడనశోపచారములతో పూజగావించి తాము ఆ రోజున సిద్ధపరచుకొనిన అట్టి శాకాహారముచేతనే కడు భిన్నులయి భిక్షగావించిరి. స్వామివారు భిక్షచేసి సంతృప్తినొంది వారి నోదార్చి నేడు నాకు సంతోషమయ్యెను. నేటితో మీదరిద్రము నశించెను. అని చెప్పిపోవుచూ ద్వారసమీపమున నున్న ఆ తమ్మచెట్టును మొదటికి విరచివేసి వెళ్లిరి, అదిఊచి ఆ బ్రాహ్మణుని యొక్క భార్యయూ వారి పుత్రులును ఇట్లు దుఃఖ పడసాగిరి.

హా : దైవమా : ఎంత కష్టము : మనకింత దురదృష్టమా మనమా యతీశ్వరునకు ఏమి యపకారము చేసితిమి. ఇంత మాత్రము ఆహారముకూడ మనకు లేకుండ మన చెట్టును విరచి వెళ్లిరే ; అని విలపించుచుండిరి. అప్పుడు ఆ బ్రాహ్మణుడు తన భార్యతో ఔషధముచే రోగమునునశింపజేయుటుల శ్రేయస్సునకు భంగము తెచ్చెడి రోషమును విడనాడుము. ప్రతివారికి ప్రారబ్ధమని ఒకటి ఉండును. జరుగు ప్రతివిషయము ప్రారబ్ధము ననుసరించియే జరుగుచుండును. ఈశ్వరుడు వారి వారి ప్రారబ్ధము ప్రకారము ఆయా



కాలములందు సుఖదుఃఖముల అనుభవింపజేయుచుండును. పీలిక మొదలుకొని సర్వజీవులకు ఆహారమెట్టి అవసరమే అట్టి ఆహారము అతనునొసంగుచుండెను. ఆయురన్నం ప్రయచ్ఛతి ఈశ్వరుడు ముందుగా అన్నమును సృజించియే జీవుల సృజించుచున్నాడు. ఈశ్వరుని దృష్టిలో కడు బీదాడును చక్రవర్తియుగూడ సమానమే. ఎవ్వరికి పూర్వార్జితముగ నేది సిద్ధమయియున్నచో అద్దానినే వారలకు ఘటింపజేయుచుండును మూర్ఖుడు తన పూర్వార్జిత కర్మను తాను మఱచి ఇతరుల మీద దోషములనారోపించును, నీవును అటులే అజ్ఞానములోపడి స్వామివారిని నిందించుచున్నావు. స్వామివారు మనకు తారకుడయి నేను, నాదియను దృఢమయి మొలుచుకొనియున్న అహంకారమను గ్రంథిని ఛేదించి వేసిరి. అట్టి మహాత్మునినిందించి పాపము నార్జించకుము అని భార్యనుసమాధానపరచి విరువబడిన తీగను బయట పారవైచిగడ్డపారతో మొదలుగూడ వేరుతోసహా త్రవ్వనారంభించెను. అట్లు త్రవ్వుచుండ ధనముచేత పూర్ణమయిన ఒక గొప్ప ఘటము అందుండి వెలువడెను. అది చూచి పరమానందముతో తన భార్యను పిలిచి ఇటు చూడుముయతీశ్వరులు మనయందు ప్రసన్నులయిరి. తీగను ఛేదించి మహానిధిని మనకు అనుగ్రహించిరి. వారు సాక్షాత్తు మహేశ్వరులయి ఉండవచ్చు. మన దైన్యమును హరించుటకుగాను నేడు ఈశ్వరుడే నరరూపమున మనయింటికి వచ్చెను. అని చెప్పి భార్యాసమేతముగ పూజాద్రవ్యముల

వెంటనిడుకొని స్వామి వారున్న స్థలమునకు వెళ్లి వారిని పూజించిరి. జరిగిన వృత్తాంతమును వారితో చెప్పిరి. స్వామివారు ఈ విషయమును మీరు లోకమునకు తెలియజేయకుడు. అట్లొనర్చితిరేని లక్ష్మి మీ యింట నుండనొల్లదు. మీవంశము పుత్రపౌత్రాదులతో, అష్టఐశ్వర్యములతో తులతూగగలదు. అని వారల నాశీర్వదించి పంపిరి.

నామధారకా ; గురుకృపకు పాత్రుడయిన వానికి దైన్యముండదు. కల్పవృక్షమే యింటనుండ దారిద్ర్యమచ్చట నివసించునా; ఎవరయిన భక్తితో సద్గురువును సేవించిన తప్పక వారు గురుకృపకు పాత్రులయి సర్వపూజ్యులు కాగలరు. ఇది అంతయు గురుభక్తి ప్రభావము కాననీవును స్థిరమైన భక్తితో సద్గురువు భజించి ధన్యుడవుకమ్ము.

**ఇది గురుచరితమందలి పదునెనిమిదియవ అధ్యాయము సమాప్తం**

**దిగంబరా దిగంబరా శ్రీపాదవల్లభ దిగంబరా**

**ఈ అధ్యాయము దారిద్రమము పోగొట్టును.**

**శ్లో॥ నరసింహ వాటికాస్థోయంః ప్రదదౌశాకభుక్ నిధిం ।**
**దరిద్ర బ్రాహ్మణాయా సౌ శ్రీ దత్తశ్శరణం మమః ॥**

# శ్రీ గురు చరితము

## పందొమ్మిదవ అధ్యాయము

**ఓం అవధూతచింతనం శ్రీ గురుదేవదత్త జయ ఓం**

**ఓం శ్రీ గురుదత్తాత్రేయానమః ఓం శ్రీ గురుభ్యోనమః**

**ఓం శ్రీమహాగణపతయే నమః**

నామధారకుడు సిద్ధముని చరణములకు నమస్కరించి చేతులు జోడించుకొని జయ జయ యోగీశ్వరా! నీవు అజ్ఞాన ధ్వాంతమునకు మార్తాండుడవు. భవసాగరతారకుడవు. మోహమను రాత్రియందు నిద్రించుచున్న నన్ను లేపి మీరు గురులీలా మృతమును త్రాగించుచున్నారు. మీవలన నేను ప్రబుద్ధుడయనితిని. ముందురానున్న గురుమూర్తి కథను నాకు వినిపింపుడు. అని ప్రార్థించెను. శిష్యుని వాక్యము విని సిద్ధముని సంతసించి గురుమూర్తి యొక్క నిరుపమానమగు మహాత్మ్యమును ఇటుల చెప్పదొడగెను.

స్వామివారు ఆ క్షేత్రమున కృష్ణానదీతీరమున నొక జేదుంబర (మేడి) వృక్షముక్రింద నివసించిరి. లోకమున అనేక పుణ్యవృక్షములున్నను శ్రీదత్తాత్రేయ అవతారమగు శ్రీనృసింహసరస్వతీ స్వామివారికి ఉదుంబర వృక్షమన్న కడు అదరము. పూర్వము శ్రీమహావిష్ణువు నరహరి అయి అవతరించి తన నఖములచేత హరిణ్యకశిపుని ఉదరము చీల్చి అతని ప్రేగులు కంఠమున హారముగ ధరించెను. ఆదైత్యుని ఉదరమున కాలకూటముతో సమమగు విషముండుటచే స్వామివారికి దుస్సహమగు వేదన వాటిల్లెను. అప్పుడు లక్ష్మి అచ్చట నొక మేడిచెట్టు ఉండ ఆ వృక్షముయొక్క పక్వములగు ఫలముల కొన్నిటిని వారి నఖములకు అద్దెను. వెంటనే ఆ విషవేదన అంతయు శాంతించి నరసింహస్వామి శాంతినొందెను. సంతోషముతో లక్ష్మిన ఆలింగనమొనర్చెను. అప్పుడు లక్ష్మియు నరసింహస్వామియు ఆ మేడివృక్షము యెడ సంతసించి నీవిక మీదట కల్పవృక్షముగ భక్తులకు సర్వాభీష్టముల నిచ్చుచుందువుగాక. నిన్ను భజించువారి కామ్యములన్నియు తప్పక సిద్ధించగలవు. నీదర్శనమువలననే ఉగ్రమయిన విషబాధయు తత్కాలమున శమించగలదు. నిన్ను పూజించి నీకు ప్రదక్షిణ మొనర్చువారు వంధ్యాత్వ దోషము నుండి విముక్తులై పుత్రవతులయ్యెదరు. నిన్ను సేవించువారి దైన్యము నశించి వారు శ్రీమంతులు కాగలరు. నీ నీడయందు ఎవ్వరు స్నానము చేయుదురో వారికి

గంగాస్నానము చేసిన పుణ్యము కలుగును. నీ నీడనెవరు జపానుష్ఠానములచేయుదురో వారికి అనంతమగు ఫలము సత్వరము సిద్ధించును. అట్టివారి వ్యాధులు నశించును. నిన్ను పూజించుటచే బ్రహ్మహత్యాది మహాపాతకములు సవీతము పోగలవు. సమస్త దేవతలేగాక లక్ష్మీసమేతముగ నేనును నీ కధీనులమయి యుండెదము. అని ఆ వృక్షమునకు వరములనిచ్చిరి.

స్వామివారు విష్ణ్వవతార మగుటచే దానివలన పూర్వము అనగా తాము నృసింహస్వామి అయి అవతరించిన సమయమున ఉపకృతి నొందిన కారణమును బట్టి వారికి ఈ వృక్షమనిన కడు ప్రేమ. అందుకనియే ఆ వృక్షసమీపముననే వారు నివాస మేర్పరచుకొనిరి. ఇట్లుండ మధ్యాహ్న కాలమునకు స్వామివారు అచ్చటనుండుట గ్రహించిశక్తి తీర్థమున గుప్తముగనున్న చతుష్షష్టియోగినీ గణములు మహోత్సవముతో స్వామివారిని సమీపించి భిక్షకుగాను తమ నివాసమునకు గొనిపోయి గంధాక్షతలతో పూజించి భిక్షమొనర్చి తిరిగి స్వామివారిని యథాస్థానమునకు చేర్చుచుండిరి. ఆ అమరపురమున నుండు బ్రాహ్మణులు తమలో తామిట్లను కొనుచుండిరి. ఎవ్వరో ఒక యతి కృష్ణాతీరమున అరణ్యమధ్యమున ఒక వృక్షముక్రింది నుండుచున్నట్లు తెలియుచున్నది. వారు ఎన్నడును మన గ్రామమునకు భిక్షకయినను రారు. వారికి నిత్యము భిక్ష ఎట్లు జరుగుచున్నదో విచారింత మనుకొని గూఢముగ నొక వ్యక్తిని అచ్చటనుంచిరి. మధ్యాహ్న కాలము రాగా అచ్చటనున్నవానికి హృదయమున భీతాహమయ్యెను. వాడు అచ్చటనుండజాలక గ్రామమునకు తిరిగి వెడలెను. ఏవ్వరు మహాత్ముల పరీక్షించదలతురో వారికి అధోగతియు యమలోక ప్రాప్తియు తప్పక కలుగును. దైవవశమున నచ్చటకొక గంగానుజుడను పేరు గల పొలపు కాపరియగు కర్షకుడొకడు వచ్చుట తటస్థించెను. అదే సమయమునకు యోగినీ గణములు స్వామివారిని సమీపించి భిక్షకుగొని పోవుచుండిరి. వారు



స్వామివారిని వెంటనిడుకొని జలప్రవాహమును సమీపించ ప్రవాహము రెండుపాయలయి వారికి మార్గమిచ్చెను. గంగానుజుడు అది చూచి వీరెవ్వరో ఈశ్వరావతారమయి యుండవచ్చును. గాననే దేవకన్యలు ఈ మహాత్ముని గౌరవముతో తమ స్థానమునకు గొనిపోవుచున్నారు అని భావించెను. తిరిగి స్వామివారు అదే ప్రకారము భిక్షచేసికొని కొంతసేపటికి వచ్చుటయు వాడు కనులార గాంచెను. మరునాడు అట్లే యోగినీగణములు మధ్యాహ్న కాలమునకు మహోత్సవముతో స్వామివారిని సమీపించి నమస్కరించి నీరాజనమిచ్చి తమ స్థానమునకు తీసికొనిపోవుటకు నదిని సమీపించ మామూలు ప్రకారము నది రెండుపాయలయి మార్గమొసంగ ఆ మార్గమున గురుమూర్తి యోగినీసమేతుడై పోవుటగాంచి ఈ గంగానుజుడు వారి వెంట తెలియకుండునట్లు ఆ మార్గముననే వెడలెను. అచ్చట నొక పట్టణము చిత్రములయిన రత్న ఖచితగోపురములచే అమారవతీతుల్యముగ సూర్యునివలె దేదీప్యమానముగ ప్రకాశించుచుండెను. యోగినులు స్వామివారిని రత్నములచే మండితమగు నొక సింహాసనమున కూర్చుండబెట్టి పూజించి షడ్రసాన్నములతో భిక్షగావించిరి. అప్పుడు గురుమూర్తి ఆ కర్షకుని చూచుట తటస్థించెను. స్వామివారు నీ వెవ్వడవు ? ఎందుకొచ్చితివి? అని ప్రశ్నించ అతడు స్వామీ మీదర్శనార్థము వచ్చితిని. పరమేశ్వరా; మీరు మనుష్యమాత్రులుగారు సంసారమహాసముద్రమున మగ్నుడనయియున్న నన్ను ఉద్ధరించుడు. మీరు విశ్వతారకులు. అజ్ఞానాంధుడనైన నాకు నేడు జ్యోతిస్వరపులగు మీదర్శనము దైవవశమున ఘటించెను. నా తప్పిదము క్షమించి నన్ను కాపాడి రక్షించుడని దీనత్వముతో స్వామి వారి నతడు శరణుపొందెను. అతని భక్తికి స్వామి వారు సంతసించి అతని నోదార్చి నేటితో నీ దైన్యము తొలగెను. నీ అభీష్టములన్నియు నెరవేరగలవు. నేనీక్షేత్రమున నుండుదనుక నిచ్చట జరిగిన విషయమును ఎవ్వరికిని ప్రకటించకుము. నీకు సద్గతి లభించును, అని ఆశీర్వదించిరి. స్వామివారు మామూలు ప్రకారము ఔదుంబరవృక్షము చేరిరి. వాడును స్వామివారి వెంటవచ్చి వారికి నమస్కరించెను. ఆనాటినుండియు వాడు స్వామివారియందు అనన్యమయిన భక్తిగలవాడయి నిత్యము గురుసేవాపరాణుడయి పుత్ర పౌత్రాభివృద్ధిఇతో సంతోషముగ నుండెను. ఇట్లుండ మాఘ పూర్ణిమ సంప్రాప్తమయ్యెను. వాడాదినమున ఉదయమున స్వామి వారిని సమీపించి మామూలు ప్రకారము నమస్కరించి, స్వామి వారితో

స్వామీ పెద్దలు మాఘమాసమున ప్రయాగస్నానము మహాపుణ్య ఫలప్రదమని చెప్పుచుందురు. ప్రయాగయన నేమియో కాశీయన నేమియో, తెలియని జ్ఞానహీనుడను అని పలికెను.

వాని మాటలు విని ఓరీ ఈ కృష్ణానదీ సంగమమే మనకు ప్రయాగము. కోల్హాపురమే మనకు గయ. ఇచ్చట సమీపమున నున్న యుగాలము కాశి. ఇవి ఈ దక్షిణ క్షేత్రముననున్న కాశీ గయా ప్రయాగలు. అయినను నీ భక్తిశ్రద్ధలకు సంతసించితిని. కాన నీకు నేను కాశీగయా ప్రయాగల ప్రత్యక్షముగ దర్శించ చేసెద నని చెప్పి స్వామివారు వ్యాఘ్రాసనమున పద్మాసనముతో గూర్చొని తన పాదుకల నతని గట్టిగ పట్టుకొనుమని ఆజ్ఞాపించిరి. వాడద్లొనర్చెను. కనులు మూసి తెరచునంతలో గురుశిష్యులిద్దరు ప్రయాగయుదఉండిరి. అచ్చట స్నాన మొనర్చిరి. తిరిగి పూర్వపు రీతిని కాశీ చేరిరి. అచ్చట విశ్వనాథుని దర్శించిరి. అచ్చటనుండి మనోవేగముచే గయా క్షేత్రము చేరిరి. అచ్చటను స్నానమొనర్చి సాయంకాలమునకు తిరిగి తమనివాసస్థానమగు ఉదుంబరవృక్ష సమీపమునకు శిష్యసమేతముగ వచ్చి చేరిరి. ఇట్లు కొంతకాలము జరిగెను. అప్పుడుస్వామివారు ఇచ్చట నాకీర్తి వ్యాప్తమయ్యెను. నేనీ క్షేత్రము వదలి మరియొక చోట గుప్తముగ నుండుట సమంజసమని భావించి అచ్చట నున్న అమరేశ్వరుని సమాధానపరచి ఆక్షేత్రము విడచి పోవ నుద్యుక్తులుకాగా అచ్చటనున్న యెగినీగణములు స్వామివారి సంకల్పమును గ్రహించి స్వామీ, నిత్యము మీదర్శనముచే మా తాపములన్నియు నశించుచున్నవి. మమ్ముల నుపేక్షించి పోవుట ధర్మమా; అని దీనత్వముతో పలుక భక్తవత్సలుడగు స్వామివారు ఆ యోగినీ గణములతో నిట్లనుచుండిరి.

నేను వెల్లినను ఈ ఉదుంబరమే నాకు నివాసస్థానము. ఇచ్చట అప్రకటముగ నుందును. ఇచ్చట ఎవ్వరువచ్చి ఈ ఉదుంబర వృక్షమున నన్ను పూజింతురో వారికి మీరు గూడను సాహాయ్య మొనర్చుచుండవలయును. నా పాదుకల నిచ్చట స్థాపించెదను. ఈ ఉదుంబర వృక్షమును, మిమ్ములను పూజించువారి సర్వకామనలు నెరవేరగలవు. ఇచ్చట అన్నపూర్ణను స్థాపించుచున్నాను. కాన నీ క్షేత్రమున నిరంతరము బ్రాహ్మణసమారాధనలు జరుగుచుండును. ఇచ్చటనున్న పాపనాశనము, కామ్యతీర్థము, సిద్ధతీర్థములందు స్నానమొనర్చి ఏడు పర్యాయములు ఈ ఉదుంబరవృక్షమును ఎవ్వరు ఉదకముతో తడుపుదురో అట్టివారికి వంధ్యాత్వము తొలగి దీర్ఘాయుష్మంతుడగు పుత్రుడుకలుగును. ఇచ్చట స్నాన

మాత్రముచే బ్రహ్మహత్యాది మహాపాతకములు నశించును. సూర్యచంద్రగ్రహణములు, సంక్రాంతి మొదలగు పుణ్యకాలములయందు ఇచ్చటి తీర్థముల స్నానమొనర్చిన వారికి అశ్వమేధయాగము కన్న నధికఫలము లభించును. అమావాస్య సోమవారము, వ్యతీపాతయును పుణ్యకాలములయందు ఇచ్చటి తీర్థముల సాన్నమొనర్చిన వారికి వెయ్యి కపిలగోవులను గంగా తీరముననున్న నొక సద్బ్రాహ్మణునకు దానమొసంగిని ఫలము లభించును. ఒక బ్రాహ్మణునికి ఇక్కడ అన్నదాన మొనర్చిన వారికి కోటి బ్రాహ్మణులకు తృప్తిగ భుజింప చేసిన ఫలము వచ్చును. ఈ ఉదుంబర వృక్షమూలమున చేయుబడిన జపమహోమతర్పణములు కోటి గుణితములగును. ఒక పర్యాయము నిశ్చలమయిన చిత్తముతో నా పాదుకలకు ఏకరుద్రాభిషేకము చేయువారు అతిరుద్రము చేసిన ఫలమునొందగలరు. మందగతిగ నీవృక్షమునకు పాదుకలకు ప్రదక్షిణమొనర్చిన వారు అతుగడుగునకు వాజపేయక్రతు ఫలమునొందుదురు. లక్షపర్యాయములు ఈవృక్షమునకు ప్రదక్షణ మొనర్చు వారికి కుష్ఠురోగము నవించును. అంగహీనులకు అంగవైకల్యముగూడ పోవును. నేను లోకదృష్టికి ఇచ్చటనుండి భీమా అమరజానదీ సంగమమున నున్న గంధర్వనగరమునకు పోవుచున్నాను. కాని గుప్తముగ నిచ్చటగూడ నుండుదును. చింతింపకూడని వారల నోదార్చి అంతర్హితులయిరి. అయినను, గురునాథుడు సర్వగతుడగుటచే ఈ అమరపుర క్షేత్రమున నుండియే యున్నారు. గురుమూర్తి చరిత్రము కామధేనువువలె భక్తితో శ్రవణమొనర్చువారికి సర్వాభీష్టముల నొసంగు సమర్థము కాన భావికులగు ప్రతివారును స్వామివారిని సేవించి వారి వారి అభీష్టసిద్ధి నొందుదురు గాక.

**ఇది గురుచరితమున పందొమ్మిదవ అధ్యాయము సమాప్తము.**

**దిగంబరా దిగంబరా శ్రీపాదవల్లభ దిగంబరా**

**నరసింహ వాడిలో యెగినీగణములు స్వామి వారికి భిక్షయొనర్చుట**

**శ్లో॥ భక్తాయ త్రిస్థలీ యాత్రాందర్శయామాస యః క్షణాత్ ।**
**చకారవరదంక్షేత్రం శ్రీదత్తశ్శరణంమమ॥**

ఈ అధ్యాయపారాయణచే కాశీ గయా ప్రయాగల దర్శించిన ఫలము రాగలదు.



# శ్రీ గురు చరితము

## ఇరువదియవ అధ్యాయము

**ఓం అవదూతచింతనం శ్రీ గురుదేవదత్త జయ ఓం**

**ఓం శ్రీ దత్తాత్రేయాయ నమః**

**ఓం జయజయ శ్రీ నృసింహసరస్వతి, ఓం శ్రీగణాధిపతయే నమః**

నామధారకుడు సిద్ధమునికి నమస్కరించి చేతులు జోడించి ఇట్లు ప్రశ్నించుచుండెను.

స్వామివారు గంధర్వనగరమును గూర్చి వెళ్లియు ఆ అమరపురమున ఔదుంబర సమీపమున అదృశ్యరూపమున ఉండియే యున్నారని మీరు చెప్పియుంటిరి. స్వామివారు ఆ క్షేత్రమును వదలి వెళ్లిన తరువాత నెవ్వరయిన అచ్చట స్వామివారిని సేవించి ఫలప్రాప్తినొందిరా; దయచేసి సెలవిండని ప్రార్థించెను. అప్పుడు సిద్ధముని ఇట్లు చెప్పుచున్నాడు.

గురులీలలు పూర్తిగ వర్ణించి చెప్ప నెవ్వరితరము అయినను నీకు నిదర్శనముగ అచ్చట జరిగిన నొక వృత్తాంతమును నీకు చెప్పుచున్నాను. సమూహితుడవయి వినుము.

"శిరోతలు" అను గ్రామము గలదు. అచ్చట వేద శాస్త్రపారంగతుడైన గంగాధరుడను నొక బ్రాహ్మణుడు కలడు. ఆయనకు సుశీలయను పతివ్రతయగు భార్య కలదు. వారికి అయిదుగురు పుత్రులు పుట్టుటయు మరణించుటయు సంభవించెను. ఎందరో దేవతల నారాధించిరి, గానివారికి నెట్టి ఫలము లేకపోయెను వ్రతములను ఉపవాసములను గూడ నాచరించిరి. ఏమియూ లాభము లేకపోయెను. అప్పుడా బ్రాహ్మణుని భార్యపుత్రశోకముచే పీడింపబడి కర్మవిపాకమును చెప్ప సమర్థుడయిన నొక బ్రాహ్మణుని సమీపించి పుత్ర దుఃఖము కలుగుటకు కారణమేమని ప్రశ్నించెను. అప్పుడా బ్రాహ్మణుడిట్లు చెప్పుచుండెను ఎవ్వరు గర్భపాత మొనర్తురో పరద్రవ్య మపహరింతురో, గోవులగాని, అశ్వములనుగాని హింసింతురో అట్టివారు రాబోవు జన్మమున వంధ్యలగుదురు. ఒకవేళ పుత్రులు పుట్టినను మరణింతురు. నీవు పూర్వజన్మమున శౌనక గోత్రుడగు నొక బ్రాహ్మణునివలన నూరురూప్యములునప్పుగాగొని, అతడెంత అడిగినను నీవు తిరిగి ఇవ్వనందున ద్రవ్యలోభముచే నతడాత్మహత్య చేసికొని పిశాచమయ్యెను. అతనే నీ

సంతానమును హింసించుచున్నాడు. చేసిన కర్మ భోగముచేతనే క్షమియించును. అని చెప్ప నామెకడు ఖిన్నురాలయి జన్మాంతరమున తానొనర్చిన పాపమునకు పశ్చాత్తాపమునొంది ఆ బ్రాహ్మణునకు నమస్కరించి, చేతులుజోడించుకొని స్వామీ; మహాపాపిని. నేను చండాలురాలను. విషము భక్షించితిని. తమరు దయయుంచి నాపాపము శమించుట కేదయిన ఉపాయమున్న సెలవిండని ప్రార్థించెను. అప్పుడా బ్రాహ్మణుడు నీ నిమిత్తముగ చచ్చిన బ్రాహ్మణుడు పిశాచమయ్యెను. అతనికి వంశీయులు లేకపోవుటచేత కర్మయు జరిగియుండలేదు. కాన నీవు అతనినుద్దేశించి ప్రేతకర్మ నాచరించుము. అతని ద్రవ్యమును నీవపహరించితివి గాన ఆగోత్రీయుడగు బ్రాహ్మణునకు అంత ద్రవ్యము నొసంగుము. కృష్ణానదీ తటమున పంచగంగా సంగమమున ఒక నెలరోజులు గురుమూర్తి పాదుకల నారాధించుము. ఆస్థానము పరమపావనము. అట్లొనర్చితివేని శ్రీనృసింహసరస్వతీ స్వామివారి అనుగ్రహమువలన నీదోషములన్నియు నశించుటయేగాక నీకు పూర్ణాయుష్మంతుడగు పుత్రుడు కలుగగలడు అని చెప్పెను. అప్పుడామె ఆ బ్రాహ్మణునితో అయ్యా; నేను కడు బీరదాలను. నూరురూప్యములు నాకెచ్చునుండి దొరుకగలవు. మీరు చెప్పినటుల నెలరోజులు ఆ క్షేత్రమున నియమముతో శ్రీగురుమూర్తి యొక్క పాదుకల సేవించెద. అని చెప్ప బ్రాహ్మణుడును అందులకు సమ్మతించెను. అప్పుడామె సంతోషము నాక్షేత్రమునకు వెళ్లి సంగమమునను, పాప నాశమునను, కామ్యతీర్థమునకు స్నానమొనర్చి ఏడు పర్యాయములు కలశముతో ఉదకమును తెచ్చి ఉదుంబర వృక్షమును తడపి శ్రీగురుపాదుకల భక్తితో పూజించి ఉపవాసనియమముతో ప్రదక్షణము చేయుచుండెను. ఇట్లు మూడు రోజులు గడచెను. మూడవరోజు రాత్రి స్వప్నమున ఆమెకు పిశాచము కనబడి నాద్రవ్యమపహరించి నీవిచ్చిట ప్రదక్షణల చేయుచుంటివా; నీవంశనాశనము చేసెద. నాద్రవ్యమిమ్ము. నిన్ను సంహరించెదనని ఆమె మీద పడబోగా ఆమె భయముతో లేచి ఆ మేడిచెట్టును సమీపించెను. అచ్చట గురుమూర్తి ఆమెకు ప్రత్యక్షముగ కనపడ ఆమె వారి చాటునకు పోయెను. అప్పుడు స్వామివారు ఆమె కభయమిచ్చి నాభక్తురాలగు నీమెను ఎందుకు హింసించుచున్నావు. అని ఆ పిశాచమును ప్రశ్నింప ఆ పిశాచము స్వామీ ఈమె జన్మాంతరమున నా ద్రవ్య మపహరించెను. అందుమూలమున నేను మరణించుటయు పిశాచమగుటయు సంభవించెను.

మీరు యతీశ్వరులు, ఇట్టి మీరు నా శత్రువగు ఈమె యందు పక్షపాతము చూపుట ధర్మముగాదు. అనగా స్వామివారు కోపించి ఓరీ; నిన్ను శిక్షించెదను. ఆమె జోలికి పోకుము. నేను చెప్పినటుల ఆచరించితివేని నీకును ఈ పిశాచత్వము తొలగి సద్గతి లభించగలదు. ఆమెకు శక్యమయి నంత ద్రవ్యము నిన్నుద్దేశించి దానము చేయును. అంతమాత్రమున తృప్తినొందుము. లేనిచో వెళ్లిపొమ్ము నా భక్తురాలగు ఈమెను నేను రక్షించెదనని చెప్ప ఆ పిశాచము వారి దర్శన మాత్రముచే మనశ్శాంతి నొంది స్వామీ నా అపరాధమును క్షమింపుడు. మీ యాజ్ఞకు నేను బద్ధుడను. నాకీ పిశాచత్వము లేకుండ జేయుడని ప్రార్థించెను. అప్పుడు స్వామి వారు ఈమె పది దినములు నీ సద్గతి కొరకు కర్మనాచరించును. అందుచే నీకు పిశాచత్వము తొలగును. అని చెప్పి ఆమెతో అమ్మా నీకు ఉన్నంత ద్రవ్యముతో ఈ ప్రేతము నుద్దేశించి కర్మనాచరింపుము. నీకు బ్రహ్మహత్యాదోషము నశించును. నీకు పూర్ణాయుష్మంతులగు పుత్రికాపుత్రులు పుట్టెదరు. ఇచ్చటి అష్టతీర్థముల స్నానమొనర్చి ఉదుంబరవృక్షమునకు నిత్యము ఏడు పర్యాయములు నీరుపోసి నాపాదుకల నారాధించుము. నీమనోరథము నెరవేరును. అని చెప్పి స్వామివారు అదృశ్యమయిరి. ఆమెయు గురుమమూర్తి చెప్పిననటుల ఆచరించెను. పిశాచము సద్గతి నొందెను. ఆమెకు బ్రహ్మహత్యాపాతకము నశించెను. ఒకరోజున ఆమెకు స్వప్నమున స్వామివారు దర్శనమిచ్చి రెండు నారికేళ ఫలముల నామె యొడిలో నుంచి నీవ్రతము సమాప్తమయ్యెను. ఈ ఫలముల భక్షించుము. నీకు సంతానవృద్ధికలుగుగలదు. అని సెలవిచ్చివ అంతర్ధాన మొందిరి. ఆమె మెలకువనొంది భర్తతో స్వప్నవృత్తాంతమును చెప్పి స్వామి వారకిచ్చిన ఫలముల భక్షించి వ్రతసమాప్తి గావించి తమ గ్రామమునకు తిరిగి వచ్చెను. గురుకృపచే ఆమె గర్భవతి అయ్యెను. నవమాసములు నిండ ఇద్దరు పిల్లలు జన్మించిరి. బాలురకు ఎనిమిది సంవత్సరములు రాగా వారిద్దరిలో జ్యేష్ఠునకు ఉపనయనము రెండవవానికి చౌలకర్మయు జరుపముహూర్త మేర్పరచుకొనిరి. తగిన సంభారముల నన్నియు సమకూర్చుకొనిరి. రేవు ముహూర్తమనగా దైవవశమున ఆ ఇద్దరిలో పెద్దవాడు వ్యాధిగ్రస్తుడయ్యెను. ధనుర్వాతము చేత అతని అవయవములన్నియు బిగిసిపోయి మూడుదినములట్లే బాధనొంది మూడవరోజు రాత్రి మృతుడయ్యెను. అప్పుడు తల్లి కడు దుఃఖముతో శివరమును వృక్షస్థలమును బాదుకొనుచు నేల మీదపడి పొర్లుచు కంటికి కడవెడుగా కన్నీరు

కార్చుచు పిల్లవాని శవముమీద పడి బాలుని గుణముల స్మరించుచు భోరున ఏడువసాగెను. నాయనా; కుమారా; ఎచ్చటకు పోతివి; నేనేమిచేయుదును. నీ ముద్దుమాటల నేనెట్లు మరవగలను. ఎంతోమంది పిల్లలు మరణించినను నీవు గర్భమున పడిననాటి నుండియు ఆ దుఃఖమును మరచిపోయితిని. గురుమూర్తి వర మొసంగెను. దీర్ఘాయుష్మతండగు పుత్రుడు పుట్టునని విశ్వసించితిని. నీవు వార్ధక్యమున మమ్ముల కాపాడగలవని ఎంతయో ఆశ పెట్టుకొంటిని. అట్టి మమ్ముల అనాథులచేసి పోవుట ధర్మమా అని నానాప్రకారముల విలపించుచుండ చుట్టుప్రకల్కవారందరును ఆమెను సమీపించి అమ్మా దైవము నెవ్వరు తప్పించగలరు. లలాటమున లిఖితమగు బ్రహ్మ లిఖితమును మార్చ నెవ్వరితరము అవతారములే స్థిరము కానప్పుడు మానవులమగు మన జీవితమెంత శాశ్వతము దుఃఖించిన నేమిప్రయోజనము. అని ఎంత ఓదార్చినను ప్రయోజనము లేకపోయెను. అప్పుడామె వారితో నేను అమరపురమున నృసింహసరస్వతీస్వామి వారిని ఆరాధించితిని. వారు నాకు రెండు ఫలములొసంగి నీకు దీర్ఘాయుష్మంతులైన సంతానము కలుగగలదని వరమిచ్చిరి. వారి వాక్యమే వ్యర్థమయినచో నేను జీవించి ఏమి ప్రయోజనము. ఈ బాలునితోడ నేనును నాప్రాణము లర్పించెద. అని చెప్పి స్వామివారిని స్మరించి స్వామీ; నాకింత బాధ కలిగించుచున్నారా మీ వాక్యము సత్యమనియు మీరు సత్యసంకల్పులనియు నమ్మి విశ్వసించితిని. మీరు విశ్వాసఘాత మొనర్చితిరి. మీరు త్రిమూర్తి స్వరూపులని నమ్మితిని. నన్ను రక్షించ సమర్థులు గాని మీరు ధ్రువుని, విభీషణుని, వారి వారి అభీష్టము లొసంగి రక్షించితిరని నమ్ముటెట్లు ? నన్ను మీరెందులకు పేక్షించితిరి. ఎంతోమంది మీ పాదుకల నర్చించుచున్నారు. అట్లొనర్చువారికి మీరభీష్టములిచ్చెదరు. అని నమ్మితిని. నాకు తగిన శాస్తిఅయ్యెను. నీవు విశ్వాసఘాతకుడవని తేలినది. ఇకమీదట మిమ్ముల నెవ్వరు విశ్వసింతురు ? బ్రహ్మహత్యాదోషముచే పీడింపబడి మిమ్ముల శరణునొందితిని. ప్రథమమున అంగీకరించి ఇప్పుడు విడనాడితిరి. ఒక గోవు వ్యాఘ్రభయముచే పరుగెత్తివచ్చి ఒక యవనుని గృహము ప్రవేశించ వాడద్దానిని హింసించునటుల నాగతియు అయెను. దేవుని దర్శించ నొక దురదృష్టుడు దేవాలయములోనికి పోవుచుండ ఆ దేవాలయమే విరిగి వాని మీద పడినట్లయ్యెను. ఓ గురుమూర్తి ! నాగతిఇట్లయ్యెనని ఆమె దుఃఖించుచుండ ఇంతలో తెల్లవారెను. గ్రామములోని

బ్రాహ్మణులందరు వచ్చి ఎందుకు దుఃఖించెదరు ? మూర్ఖత్వమును విడనాడుము. బాలుని శవమిమ్ము. నదీతీరమునకు సంస్కారమునకు తీసికొనిపోయెదమనిరి. ఆమె అప్పుడు ఆ శవమును గట్టిగ తన పొట్టకు వస్త్రముచే గట్టుకొని ఈ బాలునితో గూడ నన్నును కాల్చివేయుడు, అని చెప్పుచు బాలుని శవమును వారల కివ్వక పోయెను. అందరును ఆమె మూర్ఖత్వమునకు వింతపోవుచు చూచుచుండిరి. ఇంతలో మధ్యాహ్న కాలమయ్యెను. గ్రామస్థులందరు అచ్చటకు సమకూడిరి. కాని ఎవ్వరును ఆమె మనస్సునకు సమాధానమును చెప్పరయిరి. అదే సమయమున ఆమె దృఢభక్తికి మెచ్చె భక్తవత్సలుడయిన శ్రీనృసింహ సరస్వతీ స్వామివారు ఒక బ్రహ్మచారి రూపమున నచ్చటకు వచ్చిరి వారు ఆమెను గూర్చి చేయుహితబోధ పై అధ్యాయమున శ్రోతలు వినగలరు.

**ఇది గురుచరితమున ఇరువదియవ**

**అధ్యాయము సమాప్తము.**

**దిగంబరా దిగంబరా శ్రీపాదవల్లభ దిగంబరా**

**శ్లో॥ పీతార్ధివాయిత్వాయో బ్రాహ్మణ్యైభక్తిభావితః ।**
**దదౌపుత్రౌసగతిదః శ్రీదత్తశ్శరణంమమ॥**

భా॥ సంతాననష్టము కలవారు ఈ శ్లోకము జపించిన దీర్ఘాయుష్మంతుడైన పుత్రుడు కలుగగలడు.

# శ్రీ గురు చరితము

## ఇరువది ఒకటవ అధ్యాయము

**ఓం అవధూత చింతనం శ్రీ గురుదేవదత్త జయ ఓం**

**ఓం శ్రీదత్తాత్రేయాయ నమః ఓం శ్రీగురుమూర్తయే నమః**

**ఓం శ్రీగణాధిపతయే నమః**

దుఃఖించుచున్న ఆబ్రాహ్మణస్త్రీని ఆ బ్రహ్మచారి సమీపించి ఇట్లు చెప్పుచుండిరి. అమ్మా ! మూర్ఖురాలవయి ఎందుకలు దుఃఖించెదవు. ఈ సంసారము క్షణభంగురము, పుట్టినదెవరు ? చచ్చినదెవరు ? శరీరములు జలబుద్బుదముల (నీటిబుడగలు) వలె కర్మవశమున పంచభూతముల సంయోగముచే జన్మించును. అట్టి కర్మ క్షయించగా నవి నశించును. మాయాపాశములోపడి పంచభూతవికారమయిన దేహమును పుత్రుడని, భార్యయని, భర్తయని, సోదరుడనియు తలతురు. సత్వరజస్తమో గుణములలో, సత్వగుణమును బట్టి దేవత్వము, రజోగుణముచే మనుష్యత్వము. తమోగుణముచే పశుపక్ష్యాది నీచజన్మప్రాప్తియు ఆత్మకు ఘటించుచుండును వారి వారి కర్మననుసరించి సుఖదుఃఖముల నెంతవారును అనుభవింక తప్పదు. మాయాపాశబద్ధులయి జీవులు కర్మానుభవము నొందుదురు. కల్పాంతము జీవించు దేవతలకు సహితము కర్మానుభవము తప్పదు. మానవుల మాట చెప్పనేల. జీవుడు దేహము మీద నాధారపడును. దేహము కాలాధీనములు యుండును. కాలము కర్మకధీనమయి నడచును. కర్మానురూపముగ ప్రతి దేహధారియు పుట్టుట పెనుగుట నశించుట మొదలగు వికారముల నొందుచుండును. ఇట్టి దేహము స్థిరమని నమ్మరాదు. కాననే వివేకము కలవారు ఒకరు జన్మించిన సంతోషముగాని మరణించిన దుఃఖమును గాని పొందరు. ప్రతివారికి పుట్టుటకు పూర్వము దేహము లేకుండెను. మరణించిన తిరిగి అదృశ్యమగును. మధ్యన కొలది కాలము మాత్రమే గోచరించను. ఇట్టిదేహము స్వప్న శరీరము వలె నస్థిరమనియు, కల్పితమనియు భావించవలయును. కర్మననుసరించి కొందరు బాల్యముననే మరణించెదరు. కొందరు యౌవనమున మరికొందరు వృద్ధాప్యమున మరణింతురు. వారి వారి పూర్వార్జితము మీద వారి వారి జీవిత మాధారపడియుండును. నిజమిట్లుండ నెవ్వరు మాయాపాశములోపడి నాతండ్రి, నా తల్లి, నా కుమారుడు నా సోదరుడు

అనువ్యా మోహములో నుందురో వారు మూఢులని తెలియనగును. రేతస్సు యొక్కయు రక్తముయొక్కయు సమ్మేళనమున జన్మించిన ఈ దేహము బాహ్యమును మనోహరముగ కనబడినను అసహ్యములగు మలమూత్రములు, మాంసము, ఎముకలు, మొదలగు పదార్థములచే నిండియుండును. ఇట్టి దేహమును స్థిరమని తలచుటెట్లు ? కాలమును జయించనెవ్వరికిని తరముగాదు, స్వప్నమున కనపబడిన పదార్థమును గూర్చి మెలుకువ నొందిన తరువాత లేదని ఎవ్వరయిన దుఃఖపడుదురా: వివేకి అయిన వాడెవ్వడు ఇంద్రజాలము వలెన స్థిరమగు దేహమును స్థిరమని నమ్మజాలడు.నీకు ఇంతకు పూర్వము ఎన్ని జన్మములు గడచెనో: ఆ యాజన్మలయందు ఎంత మందికి తల్లివైతివో ఎంతమందికి భార్యవయితివో : వారల కోసము నీవు దుఃఖించుచుంటివా అట్లే ఈ బాలుని యందును మమకారమును విడనాడుము. గ్రామస్థులు ఈ శవమునకు శాస్త్ర రీతిని సంస్కారమొనర్చెదరు. అని ఆ బ్రహ్మచారి చెప్ప ఆమె వారి వాక్యములు విని తిరిగి వారితో నిట్లను చున్నది.

స్వామీ ! మీరు కరుణతో నాకు తత్త్వము నుపదేశించితిరి. మీరు చెప్పినదంతయు నిజమేగాని నామనమున అట్టి తత్త్వము నిలువకున్నది. మీరు ప్రారబ్ధమునకు బలము చెప్పుచున్నారు. ప్రారబ్ధమే ఎంతవారికి తప్పక ననుభవించవలసియున్నచో ఇక ఈశ్వరుని భజించనవసరము లేదు. ఒకడు జ్వరముచే పీడింపబడి వైద్యుని సమీపించి అతని వలన తగిన ఔషధమును స్వీకరించి ఆరోగ్యము నొందుట చూచుచున్నాము. ఎవరికయిన ఆపద వచ్చినపుడు సమర్థులయిన వారిని శరణుపొందుటయు వారి వలన తమ ఆపత్తును తొలగించుకొనుటయు మనము లోకమున చూచుట లేదా! అట్లే నేనును పూర్వము దైవహీనురాలనయి త్రిమూర్తి స్వరూపుడగు నృసింహసరస్వతీ స్వామి వారిని శరణుపొందితిని. వారి వలన వరము నొందితిని. అప్పటినుండియు నిశ్చింతగ నున్నాను. స్వామి వారి వాక్యమును విశ్వసించిన నన్ను మూర్ఖురాలనుగ మీరెట్లు చెప్పగలరు? స్వామి నాకు విశ్వాసఘాత మొనర్చెను. కాన నిట్టి కీర్తి వారలకు రాగలందులకు గాను వారినుద్దేశించి ఈ దేహమును త్యజించ సమకట్టితిని అని సమాధానము చెప్పెను. ఆమె వాక్యములు విని, ఆమె దృఢభక్తికి మెచ్చుకొని ఆమెతో నిట్లనిరి. అమ్మా స్వామి వారి యందు అట్టి దృఢ విశ్వాసము నీకున్నచో నిక్కడ నేడ్చి ఏమి ప్రయోజనము ఎచ్చట నీకు స్వామి వారు వరమొసంగిరో అట్టి పంచనదీ సంగమమున

నున్న ఉదుంబర వృక్షము వద్దకు నీ బాలుని కళేబరమును కొనిపోయి వారి పాదముల యందుంచుము. అని చెప్పి బ్రహ్మచారి వెళ్లిపోయిరి. ఆమెయు వారి వాక్యములు విని వారు చెప్పినటుల పిల్లవాని శవమును తన వస్త్రములో కట్టుకొని భర్తతో సహ ఉదుంబరవృక్షమును సమీపించి అచ్చట బాలుని శవముంచి పట్టరాని కోపముతో తన శిరమును ఆపాదుకలకువేసి కొట్టుకొనెను. ఆమె రక్తముచే పాదుకలుగూడ తడసెను పుత్రశోకము అన్ని దుఃఖములకంటె నధికము. అది క్షయరోగమువంటిది ఆమె అచ్చట విలపించుచుండెను. ఇంతలో గ్రామస్థులందరు వచ్చి అమ్మా దుఃఖించి ఏమి ప్రయోజనము. సూర్యుడు అస్తమించుచున్నాడు. ఈ అరణ్యమున రాత్రికాలమున మనుష్యులెవ్వరు నుండజాలరు. శవము నిమ్ము. సంస్కరించెదము అని అనేకవిధముల బ్రతిమిలాడినను వారి మాటలనామె పెడచెవిని పెట్టి శవము నీయక అట్లే దుఃఖించుచుండెను. అప్పుడు గ్రామస్థులందరు ఈమె మనమాట వినుట లేదు. మనమిచ్చట నుండతగదు. రేపటి దినమున ప్రాతఃకాలమున వచ్చెదము. రాత్రి శవము దుర్గంధముచే వ్యాప్తమగును. అప్పుడు తప్పక ఇచ్చివేయును. అని అనుకొని వారి గృహములకు వెళ్ళిరి. రెండు దినములనుండియు ఆ దంపతులకు దుఃఖముచే నిద్రలేకుండెను. ఆ రాత్రియు మూడు జాములు గడిచెను అప్పుడకస్మాత్తుగ ఆమెకు నిద్రవచ్చెను. స్వప్నమున జటాధారిఅయి, భస్మవిభూషితుడయి రుద్రాక్షమాలలధరించి వ్యాఘ్రచర్మ పరిధానుడయి హస్తములందు యోగదండమును త్రిశూలమును ధరించి స్వామివారు దర్శనమిచ్చి ఆమెతో అమ్మా నన్ను ఊరక ఎందులకు తిట్టి పోయుచున్నారు? నీ కుమారునకు చికిత్స చేయవచ్చితిని. మరణించుటయన ప్రాణవాయువు పోవుటయే గదా! నోరుతెరువుము ప్రాణము పోసెదనని చెప్పి కొద్ది భస్మమును ఆ శవము మీద చల్లిరి. ఇంతలో నావెంకు మెలకువవచ్చెను. భయభీతురాలయ్యెను. ఇది భ్రాంతియా! మరణించిన వారు బ్రతుకుట ఎందయిన కలదా! మన ప్రారబ్ధమిటులుండ దేవుడేమిచేయును. మనము మెలకువ గానున్నప్పుడేమి అనుకొందుమో అదియే స్వప్నమున కనబడును. మూర్ఖురాలనయి అజ్ఞానముతో స్వామివారియందు దోషమారోపించితిని. అని పరిపరివిధముల చింతించుచు ఆ శవమును కొంచెము దూరముగనుంచెను. అంతలో ఆ బాలుని శరీరమందు చైతన్యము ప్రవేశించెను. అవయవములు కదలసాగెను. ఇది ఏమి: భూతావేశమా: అని ఆమె శంకించుచుండ బాలుడు

లేచి కూర్చొని అమ్మా ఆకలియగుచున్నది. అన్నము పెట్టుమని అడుగుచు ఏడువసాగెను. వెంటనే ఆమెకు స్తనముల నుండి క్షీరము స్రవించెను. అప్పుడామె సందేహము విడనాడి బాలుని ఎత్తుకొని స్తన్యమిచ్చెను. వానిని తీసికొని భర్తను సమీపించి జరిగిన వృత్తాంతమంతయు చెప్పెను. అప్పుడు దంపతులు ఉదుంబరవృక్షము వద్దకు వచ్చి ప్రదక్షిణమొనర్చి సాష్టాంగముగ నమస్కరించి ఇట్లు స్తుతించిరి.

ఓ త్రిమూర్తిస్వరూపా! జయజయ : నీవు భక్తవత్సలు డవు విశ్వతారకుడవు. నీ మహిమ వర్ణించ నెవ్వరికి తరముగాదు మా అపరాధముల క్షమించుడు. బాలుడు కోపము వచ్చినపుడు తన తల్లిని కఠోరముగ తూలనాడును. అటులనే మేము గూడ కష్టకాలమున నోటికివచ్చినటుల మిమ్ము దూషించితిమి. మా అపరాధముల మన్నించి రక్షించుడు. మీరే మాకు శరణ్యము. అని ప్రార్థించి బాలునితో సహా కృష్ణానదిలో స్నానమొనర్చి ఆ నీటితో రక్తముతో తడిసిన స్వామివారి పాదుకల ప్రక్షాళనమొనర్చి ఉదుంబర వృక్షమూలమున దీపమాలికల నర్పించి శమీపత్రములచేతను ఇంక ననేక పుష్పములచేతను స్వామివారి పాదుకల పూజించి నీరాజనమిచ్చిరి. ఇంతలో తెల్లవారెను. గ్రామస్థులు ఆ బాలుని శవమును సంస్కరించవలయునను భావముతో నచ్చుటకు వచ్చి బాలుడు జీవించి ఆడుకొనుచుండుట చూచి విస్మితులయిరి.



**నామధారకా :** శ్రీ గురుస్థానము యొక్క మహిమ వింటివిగదా! గురుమూర్తి సర్వకాలములయందును ఉదుంబర వృక్షమూలమున నుందురు. వారిని ఆరాధించుటచే భక్తుల మనోరథములన్నియు నెరవేరును. వంధ్య పుత్రవతియగును. దరిద్రుడు శ్రీమంతుడగును. రోగపీడితులు ఆరోగ్యవంతులగుదురు. అపమృత్యుబాధలు తొలగును. భక్తిభావముతో గురుమూర్తి పాదుకల నెవ్వరు పూజింతురో వారి కోరికలను గురునాథుడు పూర్తిచేయును. అంగహీనులు, కుష్ఠురోగముతో బాధపడువారు అంగ వైకల్యము పోయి సువర్ణ దేహము కలవారు కాగలరు, హృదయశూల, గండమూల, అపస్మారము. మొదలగు రోగములు సహితము గురుపాదుకల నర్చించుటచే, నుపశమించును. ఉదుంబర వృక్షము కల్పవృక్షము గాన అట్టి వృక్షమును పూజించుటచే మందమతులు, మూగవారు, కుంటివారు మొదలగు వారు వారి వారి వైకల్యముల పోగొట్టుకొందురు. ఇట్లెంత వర్ణించి చెప్పగలను. గురుచరిత్రము కేవలము కామధేనువు ఇట్టి గురుచరిత్రమును శ్రద్ధతో వినువారు సర్వాభీష్టముల నొందగలరు, అని సిద్ధమునినామ ధారకునితో చెప్పెను.

**ఇది గురుచరితమందలి ఇరువదియొకటవ**
**యధ్యాయము సమాప్తము.**

**దిగంబరా దిగంబరా శ్రీ పాద వల్లభ దిగంబరా**

**శ్లో॥ తత్వం యోఽమృతపుత్రాయై బోధయిత్వాప్యజీవయత్**
**మృతం కల్పదృమస్థ స్సః శ్రీదత్త శ్శరణం మమ ॥**

తా॥ 20,21 రెండు అధ్యాయములు ఒకరోజు పఠించవలెను. సంతానము లేనివారికి సంతానము కలుగును.

# శ్రీ గురు చరితము

## ఇరువది రెండవ అధ్యాయము

**ఓం అవదూతచింతనం శ్రీ గురుదేవదత్త జయ ఓం**

**ఓం శ్రీ గురుదత్తాత్రేయాయ నమః ఓం శ్రీ గణాధిపతయే నమః**

**ఓం శ్రీ గురుభ్యోనమః**

నామధారకుడు సిద్ధముని పాదములకు నమస్కరించి చేతులు జోడించి సిద్ధమునీంద్రా! నరసింహసరస్వతీస్వామి వారు అమరపురము విడచి గంధర్వనగరము ప్రవేశించిరని చెప్పితిరి. అచ్చటి వృత్తాంతమును నాకు సెలవిండని ప్రార్థించెను. అప్పుడు సిద్ధముని ఇట్లు చెప్పుచుండెను.

నామధారకా! నీవు గురుకృపకు పాత్రుడవయితివి. నీ జీవితము కడు ధన్యము. నీ ప్రశ్నవలన నాకు సంతోషమయ్యెను. కామధేనువుతో సమమగు గురుచరిత్రమును నీకు చెప్పుచున్నాను.

స్వామి వారు గంధర్వనగరమున సంగమమున గుప్తరూపముగ నుండిరి. అచ్చట భీమానది ఉత్తరవాహిని అయి ప్రవహించును. అమరజా యను మరియొక నది అందు కలియుటచే ఆ సంగమ స్థానము గొప్ప తీర్థక్షేత్రముగ పరిగణించతగియున్నది. అచ్చట నొక అశ్వత్థ వృక్షము కలదు. ఆ క్షేత్రము ప్రయాగతో సమానము. ఇంకను ఆ క్షేత్రమున అష్టతీర్థములు కలవు. వాటి మహిమ ప్రసంగవశమున నీకు ముందు చెప్పబడును. సమస్త తీర్థములును శ్రీ గురుమూర్తి పాదములయందే గలవు. అయినను వారు తీర్థ క్షేత్రపర్యటనము చేయుటయు. అచ్చట నివసించుటయు కేవలము భక్తజనుల తరింపజేయుటకు మాత్రమే వారా సంగమమున గుప్తముగ నున్నను వారి మహిమ ఆచిరకాలముననే ప్రకటితమయ్యెను. సూర్యుడు ఎంత గుప్తముగ నుండదలచినను అతని ప్రకాశము బహిర్గతము కాకుండునా; స్వామివారు సంగమమున అరణ్యమున నివసించియు భిక్షార్థము మధ్యాహ్న కాలమునకు గంధర్వ నగరమునకు వెళ్ళుచుండిరి. ఆ గ్రామమున నూరు బ్రాహ్మణ గృహములు కలవు.

అదియొక బ్రాహ్మణ అగ్రహారము, వేదపాంతకులు అందు ఎందరో గలరు. అట్టి నగరమున మిక్కిలి బీవాడగు బ్రాహ్మణుడొకడు కలడు. వారి యింట ఒక గొడ్డుబోతు ముసలి బఱ్ఱెకలదు. దానిని ఆ గ్రామస్తులయిన కర్షకులు

మట్టి మోయుటకు ఇంకను అనేక పనులకు బాడుగకు కొనిపోవుచుందురు. ఈ బ్రాహ్మణుడు భిక్షాటనముతో జీవించును. దానితో పాటు ఈ బట్టెవలనవచ్చు బాడుగను కూడ తన ఖర్చులకు ఉపయోగించుకొనుచుండెను. స్వామివారు ఆ దంపతులు సాత్వికస్వభావము కలవారగుటచే తరచుగా వారియింటికే భిక్షకు పోవుచుండిరి. గ్రామములోని ధనికులగు బ్రాహ్మణులు మనము శ్రోత్రియులము. ఆ యతీశ్వరుడెవరో తరచుగా ఆ బీదబ్రాహ్మణుని గృహమునకే భిక్షకు పోవుచున్నారు. మన యిండ్లకు వచ్చిన షడ్రస్నానము లభించునుగదా. అని పరిపరి విధముల నిందా వాక్యముల పలుకుచుండిరి. భక్తవత్సలుడగు గురుమూర్తి ప్రపంచాతీతుడు. సేవకుల హితము నుద్దేవించి వారి వారి గృహముల పవిత్ర మొనర్చుటకుగాను భిక్షాటనమును మిషతో వెళ్లుచుందురేగాని భక్తిలేనివా యింట నడుగయిన నిడరు. నిత్యతృప్తుడగు గురుమూర్తికి షడ్రస్నానములచే ఏమి ప్రయోజనము. కృష్ణుడు బీదవాడగు విదురుని గృహమునకు అతిథిగా వెళ్లనే గాని ఆహ్వానించినను దుర్యోధనుని గృహమున విందు స్వీకరించెనా ? గురుకృప సాత్విక స్వభావము కలవారి యందు మాత్రమే ప్రసరించును. గురుకృపకు పాత్రుడయిన వాడు ఇహపరసుఖముల చూరగొనుము. శ్రీమంతులతో వారి కేమి ప్రయోజనము ? వారు తలచిన క్షణార్ధమున కడు బీదవానిని చక్రవర్తిగ చేయుగలరు. కోపించినచో ఇంద్రునంతవానిని భస్మమొనర్చ సమర్థులు. తన భక్తులనొసట వ్రాయబడిన దుష్టలిపి సహితము తమ పాదస్పర్శమాత్రముచే మార్చివేయగలరు. అట్టి గురుమూర్తి యొక్క బిరుదావళుల నేనెంత వర్ణించగలను.



ఆ బ్రాహ్మణుడు ఎన్ని జన్మలయందో ఎంతయో పుణ్యమొనరించెను. గాననే గురుమూర్తి వారి యింటికి భిక్షకు వెళ్లుట తటస్థించెను. వైశాఖ మాసము, మధ్యాహ్న సమయము బ్రాహ్మణుడు భిక్షాటనకు వెళ్లియుండెను. ఆ దినమున దైవవశమున నెవ్వరును ఆ ముసలి బఱ్ఱెను బాడుగకుగాను తీసికొని పోరయిరి అది వారి యింటిబయట కట్టివేయబడి యుండెను. అదే సమయమునకు గురుమూర్తి వారియింటికి వచ్చి భిక్షాందేహి యని అనిరి. వారి మాట వినుటతోడనే, పతివ్రతయగు ఆ బ్రాహ్మణుని భార్య దిగ్గున వచ్చి స్వామివారికి నమస్కరించి స్వామీ నా భర్త యాయవరమునకుగాను వెళ్లియున్నారు. శీఘ్రముగ మంచిధాన్యము తీసికొని రాగలరు. ఈ ఆసనమున కూర్చుండి అంతవరకు అనుష్ఠానమొనర్చు చుండుడని వినయముతో ప్రార్థించెను. వారు అట్లే ఆసనమున కూర్చొని ఆమెతో అమ్మా ! భర్తవచ్చెదరని చెప్పుచున్నావు. అంతవరకు నుండజాలను. మీయింట బఱ్ఱెకలదుకదా ! పాలు ఇచ్చిన త్రాగిపోయెదమనిరి. అప్పుడు ఆమె స్వామీ; ఏమి చెప్పుదును. ఈగేదె పుట్టుకనుండియు మా యింటనే పెరిగినది. కట్టుట ఈనుట ఎరుగదు. ముసలిదయినది. దీనిని దున్నపతును పోషించినటుల పోషించుచున్నాము. నిత్యము గ్రామస్థులు దీనిని బాడుగకు తీసికొనిపోవుచుందురు. ఆ ద్రవ్యము మాకు కొంచెము ఆధారమగుచున్నది. నేడు మాదురదృష్టమున దీనిని ఎవ్వరును బాడుగకు తీసికొని పోలేరు. అందువలన నిది యింటి యందు ఉన్నది అనెను. అప్పుడు గురుమూర్తి నవ్వుచు అబద్ధములాడెదవేల ! అది పాలనీయగలదు. నామాట నమ్మి పాలుపిండుము. ఆ క్షీరములనే నేనుత్రాగి పోయెదను అనిరి. అంత ఆమె వారి వాక్యముల విశ్వసించి పాత్రను తీసికొని ఆ బఱ్ఱెను సమీపించ దాని రూపమే మారెను.రెండు పాత్రముల నిండ క్షీరమిచ్చెను. ఆ బ్రాహ్మణుని భార్య అదిచూచి ఏమిచిత్రము. వీరు ఈశ్వరులే కావచ్చును. అని భావించి ఆక్షీరముల వేడిచేసి స్వామివారికి భిక్ష నొసగెను. గురుమూర్తి సంతసించి పోవుచు మీరఖండ లక్ష్మీసంపన్నులు కాగలరు. పుత్రపౌత్రాభివృద్ధిగా ఇహపరసౌఖ్యముల నొందగలరు అని ఆశీర్వదించి తమ నివాస స్థానమయిన సంగమమునకు వెడలిరి. అప్పుడు గృహయజమాని యింటికి రాగ ఆమె జరిగిన వృత్తాంతమును అతనితో చెప్పెను. అప్పుడు అతను చాలా సంతసించి మన పుణ్యము మంచిది. నేటికి గురుమూర్తి అనుగ్రహము లభించెను అని

చెప్పుచు భార్యా సమేతముగ పూజాద్రవ్యముల వెంటనిడుకొని సంగమమునకు వెళ్లి అచ్చట అశ్వత్థవృక్షమూలమున కూర్చొనియున్న గురుమూర్తిని పూజించి స్తుతించెను. గురుమూర్తియు వారిని ఆశీర్వదించిరి. వారివలన వరములనొంది ఆ దంపతులు తమ గృహముచేరిరి. కాన నోనామధారకా ! గురుకృపకు పాత్రుడయినవాడు దారిద్ర్యము నొందక అష్టఐశ్వర్యములతో తులతూగుననుటలో నెట్టిసంశయము లేదు. ఈ అధ్యాయము నెవరు పఠింతురో విందురో వారుగురుకృపకు పాత్రులు కాగలరు.

**ఇది గురురచితమున ఇరువది రెండవ అధ్యాయము సమాప్తము.**

**దిగంబరా దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా**

**శ్లో॥ దోహయామాన భిక్షార్థం యోవంధ్యాం మహిషీంప్రభుః ।**
**దారిద్ర్యరావదావస్సః శ్రీదత్త శ్శరణం మమ॥**

తా॥ గణగాపురమున గొడ్డుబర్రెచే పాలను పిండించిరి.

ఈ అధ్యాయపారాయణచే పాడిపంటలు సమృద్ధి గాంచును.

# శ్రీ గురు చరితము

## ఇరువదిమూడవ అధ్యాయము

**ఓం అవదూతచింతనంశ్రీ గురుదేవదత్త జయ ఓం**

**ఓం శ్రీ గణాధిపతయేనమః, ఓం జయ శ్రీ గురుదేవదత్తా**

**ఓం శ్రీ గురుభ్యో నమః**

సిద్ధముని నామధారకునితో పై కథావృత్తాంతమునిట్లు చెప్పుచున్నారు.

నామధారకా ! గురుమూర్తి బీదబ్రాహ్మణుని గృహమున మహిషీ క్షీరములు భిక్షగగ్రోలి వెళ్లినసంగతి వింటివి. ఆ బఱ్ఱె తిరిగి సాయంకాలమునకు మరునాడుదయమునకు గూడ మామూలు పాడిగేదెలవలె సమృద్ధిగ క్షీరములనిచ్చుచునే యుండెను. మామూలు ప్రకారము గ్రామస్థులయిన కర్షకులు ఆగేదెను బాడుగకుగాను కొనిపోవవచ్చిరి. అప్పుడా బ్రాహ్మణుడు వారలతో మా బఱ్ఱె సమృద్ధిగ క్షీరములనిచ్చుచున్నది. ఇప్పుడే ఈ రెండు పాత్రలనిండ పాలుపిండితమి. కాన ఇట్టి బఱ్ఱెను బాడుగ కెందులకిచ్చెదము పొమ్మనిరి.

వారు ఆశ్చర్యపడి ఇది ఏమీ ఆశ్చర్యము. కట్టనయినలేదు. ఈ ననయినలేదు పాలనెటులనిచ్చెను ? అని అనుకొనుచు తిరిగి వెళ్లిరి. ఈవార్త గ్రామమంతయు వ్యాపించెను. ఆ గ్రామాధికారియగు రాజు ఈ చిత్రమువిని ఆశ్చర్యముతో బ్రాహ్మణుని గృహమునకు వచ్చి అతనికి నమస్కరించి గొడ్డుబోతు బఱ్ఱెవలన పాలనెట్లు పిండితిరి. అని ప్రశ్నించెను. అప్పుడా బ్రాహ్మణుడు రాజులో రాజా! ఒక స్వాములవారు సంగమక్షేత్రమున వచ్చియున్నారు. ఇది వారి మహిమ. వారు ఈశ్వరులయి ఉండవచ్చును. కొన్నిరోజులుగ మా యింటికి భిక్షకు వచ్చుచుండిరి. నిన్నటిరోజున నేను ఇంట లేనిసమయమున వారు మాయింటికి భిక్ష కేతెంచిరి. ఆ సమయమున మాగేదె యింటనే కట్టబడియుండెను. వారు క్షీరముల భిక్షగ యాచించిరి. క్షీరములు మాయింట లేవని నా భార్య చెప్ప మీ యింట ఈగేదె కలదు. గదా క్షీరము లేదనుట ఎందుకు. దీనిపాలు పితికి ఇమ్ము అని ఆజ్ఞాపించిరి. వారి వాక్యమే కామధేనువయ్యెను. అప్పటి నుండియు మా గేదె క్షీరముల నిచ్చుచునే యున్నది. ఇది అంతయు ఆ మహాత్ముని ప్రభావమని చెప్పెను.

ఆ బ్రాహ్మణుని మాటలు విని రాజు పుత్రమిత్ర కళ త్రాదులతో కలసి చతురంగసైన్యమును వెంటనిడుకొని వెళ్లి అచ్చటనున్న స్వామివారి పాదములకు

నమస్కరించి ఇట్లు సుతించెను.

జగద్గురో జయజయ, మీరు త్రిమూర్తి స్వరూపులు, అపారమయిన మీమహిమను వర్ణించ నేనెంతవాడను. మీరు విశ్వతారకులు, మాయా మెహాంధకారములో పడియున్న నన్నుద్ధరింపుడు. ఇచ్ఛామాత్రము చేతనే విశ్వమును సృజించ సమర్థులు సామాన్యులదృష్టికి మనుష్య రూపముతో నగుబడు చున్నారు. మీరు విశ్వాతీతులు. ఇట్లు భక్తితో ఎంతయో స్తుతించెను. మాటిమాటికి వారి పాదములందు శిరముంచి నమస్కరించెను. అప్పుడు రాజులో ఇట్నుఉచున్నారు. ఓ రాజా ! మేము అరణ్యమందు నివసించెడి తాపసులము, యతులము. నీవింత సంభ్రమముతో దారాపుత్రులతో సపరివారముగ నిచ్చుటకు వచ్చుటకు కారణమేమి; అని ప్రశ్నించిరి. అప్పుడా రాజు చేతులు జోడించుకొనిస్వామి; మీరు విశ్వతారకులు, భక్తుల నుద్ధరించు నిమితత్తము అవతరించిన నారాయణులే మీరు. ఇట్టి అవతార పురుషులైన మీరు ఈ అరణ్యమున నుండుట ధర్మముగాదు. మీ మహిమను వేదములుగూడ వర్ణింపజాలవు. మీరు మాయందు దయయుంచి మానగరమునకు దయచేసి మమ్ముల పావనమొనర్చుడు. మీకచ్చట నొక మఠమును నిర్మించెదము. అచ్చట నివసించి మీరు అనుష్ఠాన మొనర్చుచు మమ్ములనుద్ధరింపుడని కడు భక్తితో ప్రార్థించెను. స్వామివారు ఆ రాజు యొక్క అవ్యాజమైన భక్తికి సంతసించి తమలోతాము పరేచ్ఛతో కొంతకాలమీ గ్రామమున నుండవలసిన సందర్భము కనబడుచున్నది. ఈ శరీరముద్వారా కావలసిన కొన్ని కృత్యములు కలవు గాన ఇతని మనోరథమును నెరవేర్చెద అని మనమున నిశ్చయించుకొని ఆరాజుతో నీ భక్తికి మెచ్చితి, నీమనోరథమెట్లో అటులనే ఆచరించుమనిరి. రాజు గురుమూర్తి వాక్యములకు కడుసంతసించి వారిని చక్కని పల్లకిలో కూర్చుండబెట్టి బ్రాహ్మణులు వేదఘోషచేయుచుండ మృదంగాదినానా విధవాద్యఘోషములతో గణగాపుర గ్రామమునకు తీసికొనివచ్చుచుండ గ్రామస్థులందరు నీరాజనములు చేతపూని స్వామివారి కెదురై ఆహ్వానించిరి. గ్రామమునకు పశ్చిమభాగమున నొక ఉన్నతమైన యశ్వత్థవృక్షము గలదు. ఆ వృక్షమును ఎంతకాలము నుండియో ఒక బ్రహ్మరాక్షసి నివసించుటచేత దానిభయముచే ఆ చుట్టు ప్రక్కల గృహములన్నియు పాడుబడియుండెను. స్వామివారు ఆ వృక్ష సమీపమునకు వచ్చుటతోడనే ఆ బ్రహ్మరాక్షసి చెట్టునుండి

దిగి గురుమూర్తిని సమీపించి చేతులు జోడించి స్వామీ, గాడాంధకారమున పడియున్నాను. మీదర్శన మాత్రముచే నాపూర్వదోషము లన్నియు నశించెను. మీరు నన్నుద్ధరించుడని ప్రార్థించెను. స్వామివారు తమ హస్తమును దాని శిరమున నుంచగా నదిమనుష్యరూపము నొంది స్వామివారి పాదములకు నమస్కరించెను. స్వామివారు దానితో నీవు సంగమమునకు వెళ్లిస్నానమొనర్చుము. స్నానమాత్రముననే ముక్తి నొందగలవనిరి. అదియు నట్లొనర్చెను. స్నానమాత్రముచేతనే దానికి ఆ కళేబరము పోయి జ్ఞానము కలిగి ముక్తి నొందెను. అందరును ఆశ్చర్యమునొంది స్వామివారు మనుష్యమాత్రుడు కాడనియు, త్రిమూర్తి స్వరూపుడనియు నిశ్చయించుకొనిరి. రాజు ఆ అశ్వత్థసమీపముననే స్వామి వారికి ఒక మఠము నిర్మించెను. నిత్యము అనుష్టానముకొరకు సంగమమును గూర్చి పోవుచుండ రాజుగూడను వారివెంట సైన్యముతో పోవుచుండెను. తిరిగి మధ్యాహ్నకాలమునకు వారిని మఠమునకు తీసికొనివచ్చుచుండెను. అప్పుడప్పుడు స్వామివారిని పల్లకిలో కూర్చుండబెట్టి వారితో కలసి వనవిహారమునకు పోవుచుండును. స్వామి వారి మహిమ దేశ దేశాంతరము వ్యాపించెను. ఎంతో మంది స్వామి వారు భక్తాధీనులు గాన భక్తునినెట్లు సంతోషమో అట్లే వారును ఆచరించుచుండిరి. స్వామివారి దర్శనార్థము వచ్చుచుండిరి. బ్రాహ్మణ సంతర్పణములు భక్తులచే అవిచ్ఛిన్నముగా జరుగుచుండెను. గాణగాపురమునకు కొలదిధూరమున కుమసియను గ్రామముగలదు. అచ్చట త్రివిక్రమభారతియను నొక స్వాములవారు గలరు. ఆయనే వేదశాస్త్రములయందు గొప్ప పాండిత్యముగలవారు. నిత్యము నృసింహస్వామిని మానసికముగా నర్చించువాడు అట్టి త్రివిక్రమభారతి ఇతరులవలన శ్రీనృసింహసరస్వతీస్వామి వారి యొక్క మహిమను వినుట తటస్థించెను. అతనికి వీరియందు అసూయాభావము కలిగి స్వామివారిని దాంభికుడనియు, యత్యాశ్రమమునకుఎ విరుద్ధముగ ప్రవర్తించుచున్నాడనియు పరిపరివిధుల ఇతరులతో దూషణ వాక్యములు పలుకసాగెను. సర్వసాక్షియగు గురునాథుడు త్రివిక్రమ భారతీస్వామి చేసిన స్వనిందను వినుట తటస్థించెను. పై అధ్యాయమున ఆ రాబోవు కథను వినగలరు.

**ఇది గురుచరితమున ఇరువదిమూడవ అధ్యాయము సమాప్తము.**

**దిగంబరా దిగంబరా శ్రీపాదవల్లభ దిగంబరా**

**శ్లో॥ రాజ ప్రార్థితయే త్యాస్థాత్ మఠే యో గణగాపురే ।**
**బ్రహ్మరాక్షస ముద్ధర్తా శ్రీ దత్తశ్శరణం మమ ॥**

ఈ అధ్యాయము పారాయణ చేసిన వాస్తుదోషములు పోవును.
గ్రహబాధలు తగ్గును.

**శ్లో॥ అహో బకీయం స్తన కాలకూటమ్**
**జిఘాం సయా...పాయ యదవ్యసాధ్వీ,**
**లేభేగతిం ధాత్ర్యుచితాం తతో..న్యం**
**కం వాదయాళుం శరణం భజేషు** **శ్రీ మద్భాగవతము ....**

" భా॥ పాపినియగు పూతన తన స్తనములకు విషమలదుకొని శ్రీ కృష్ణుని చంపునుద్దేశ్యముతో పాలు గరిపెను. ఆమెకు గూడా భగవానుడు పాలు గుడిపించునట్టి తల్లి కిచ్చు పరమగతి (ముక్తి) నిచ్చెను. మనమాయనలాంటి దయార్ద్రహృదయుని వదలి ఇంకెవరి శరణు వేడుదుము?" అని భగవంతుని శరణు పొందినవాని యొక్క మహత్తును ఉద్ధవుడు విదురునితో చెప్పెను.

# శ్రీ గురు చరితము

## ఇరువది నాల్గవ అధ్యాయము

**ఓం అవదూతచింతనం శ్రీ గురుదేవదత్త జయ ఓం**
**ఓం శ్రీగురుదేవదత్త. శ్రీ గణేశాయ నమః, ఓం జయ జయ**
**శ్రీ గురుదేవదత్త.**

సిద్ధముని నామధారకునితో పై కథా వృత్తాంతము నిట్లు చెప్పుచుండిరి.

శ్రీ నరసింహసరస్వతీస్వామివారు, వారి దర్శనము నిమిత్తము మామూలుప్రకారము ఆ గ్రామాధిపతి ఒక దినమున రాగా అతనితో కుమసి గ్రామమున నొక యతి నన్ను నిందించుచున్నటుల తెలియవచ్చినది. రేపటిదినమున మనమచ్చటకు పోవుదమని చెప్పిరి. స్వామివారి వాక్యమును విని ఆ రాజు సంతోషముతో మరునాడుదయమున హస్త్యశ్వరథ పదాతి సమేతముగా స్వామివారిని సమీపించి వారి నొక ఆందోళిక యందు కూర్చుండబెట్టి గీతవాద్యపురస్కృతముగ మహోత్సవముతో కుమసీగ్రామమును గూర్చి తీసికొనివెళ్లెను. అచ్చట నున్న త్రివిక్రమ భారతీస్వామివారు నిత్యమువలె స్నానమొనర్చి తన ఇష్టదైవమైన నృసింహస్వామి యొక్క మానసికారాధనకు కూర్చుండిరి. కాని ఆనాడు వారి చిత్తము ఏకాగ్రము కాకుండెను. అప్పుడు వారు భగవంతునిగూర్చి నృహరే ! నన్ను ఈనాడు ఉపేక్షించితిరేల నాతపమంతయు వ్యర్థమాయెగదా, ఏమి చేతును అని చింతించుచుండ అతని మనమున ఒక యతీశ్వరుడు నదీతీరమునుండి వచ్చుచుండుట గోచరమయ్యెను.

అప్పుడు వెంటనే దిగ్గునలేచి గ్రామబాహ్యమునకు పోయి చూడవచ్చుచున్న స్వామివారేమి, రాజు అతని పరివారమేమి, గుఱ్ఱములు ఏనుగులేమి, సర్వము తనకు మానసికార్చన కాలమున గోచరించిన యతిరూపమున గానవచ్చెను. అప్పుడతను విభ్రాంతి నొంది సాష్టాంగ నమస్కారమొనరించి స్వామి ; త్రిమూర్తి స్వరూపా ! నీమహిమ తెలియజాలక నేను మిమ్ముల నిందించితి. ఇట్లనంతరూపములతో మీరు కనపడి, ఇంతమందిలో జ్యేష్ఠులెవరో కనిష్ఠులెవరో ఎవరిని నిజముగ శరణు నొందవలెనో తోచకున్నది. ఈ చర్మచక్షుస్సుచే మిమ్ముల పరీక్షించ సమర్థుడగాను, మీరు సర్వవ్యాపకులు ఓ నృసింహసరస్వతీ; త్రిమూర్తి స్వరూపా; మీ నిజరూపము నాకు ప్రదర్శించి ధన్యునిచేయుడు.



నేను ఇంతకాలము నుండి చేసిన తపస్సు నేటికి ఫలించినది కాననే మీ దర్శనమయ్యెను. మీరు విశ్వతారకులు అని కడుదీనుడై ప్రార్థించ గురుమూర్తి ప్రసన్నుడై తన నిజరూపముగ నతనికి దర్శనమిచ్చిరి. అప్పుడు త్రివిక్రమ భారతి చతురంగసైన్యమును, ఆందోళికయందు గురుమూర్తిని చూచెను. అప్పుడు స్వామివారు అతనితో నీవు నన్ను దాంభికుడని నిత్యము నిందించుచుంటివని విని ఆ విషయమే నీతో ప్రసంగించ వచ్చితిని. నీవును నరహరి భక్తుడవు. లోకమున సత్పురుషుడవను ఖ్యాతినొందియున్నావు. నీ చిత్తము శ్రీహరి కలదు. అతనే నీకు నిజమును జ్ఞప్తికి తేగలడు అని చెప్పిరి. గురుమూర్తి వాక్యమును విని త్రివిక్రమయతి నేను అజ్ఞానినై మూఢత్వముతో ఒనర్చిన అపరాధముల క్షమింపుడు. మీరు త్రిమూర్తిస్వరూపులు మీమాయలో నిమగ్నుడనై యుంటిని. అట్టి నేను గుడ్లగూబ సూర్యుని ప్రకాశమును చూడలేనటుల మీ మహిమ గుర్తింపజాలనైతిని. గురుదేవా ! నాయపరాధము క్షమించి నన్ను మీ సేవకునిగా స్వీకరింపుడు. అగాధమైన అవిద్యయను మహాసముద్రమున ప్రాక్తన కర్మలనెడు తరంగములచే అటూ ఇటూ కొట్టబడుచున్న నన్ను జ్ఞానమను నావయందు కూర్చుండబెట్టి మీ కృపయను అనుకూలవాతముచే నన్ను ఈ సంసారమను మహా సముద్రముయొక్క ఒడ్డుకు చేర్చుడు. ఎవడు మీదయకు పాత్రుడో వాడి పురాతన దోషములు, దుఃఖములు నశించును. వాడు ఈ కలిగి జయించి పరమార్థము నొందగలడు.

పూర్వము కృష్ణుడు అర్జుననకు విరాడ్రూపమును ప్రదర్శించెనని వింటిని. నేడు మీరు ప్రత్యక్షముగా నాకు విశ్వరూపమును ప్రదర్శించితిరి. భక్తవత్సలారా!! మీ మహిమయపారము. మీ ప్రదర్శనముచే నేను కృతార్థుడనైతిని. గంగ సగరచక్రవర్తి కుమారులనుద్ధరించినటుల తమరదీనుడనైన నన్ను ఉ ద్ధరించుటకొరకు ఇటు విచ్చేసితిరి. అని పరి పరి విధముల స్తుతించ గురుమూర్తియు అతని భక్తికి సంతసించి నీకు ఈ జన్మతో సద్గతి సిద్ధించెను. స్వస్థముగా నుండుమని అతనిని ఓదార్చి క్షణకాలమున సైన్యసమేతముగ గంధర్వపురము చేరిరి.

నామధారకా ! గురుమూర్తి యొక్క మహిమ వర్ణించ నెవ్వరితరము; అట్టి మహాత్ముని ఎవ్వరు సామాన్య మనుష్య మాత్రునిగా తలతురో అట్టి పాపులు ఏడుజన్మల పర్యంతము యమయాతనల ననుభవింతురు. గురువు బ్రహ్మఅనియు, విష్ణువు అనియు, శివుడనియు వేశాస్త్రములు ఘోషించి చెప్పుచున్నవి కాన ఓనామధరకా ! అట్టి గురుపాదముల యందు విశ్వాసముంచిన వారు ఇహపరసౌఖ్యముల నొందగలరు. ఈ గురుచరిత్రమును చలివేంద్రమును భగవంతుడు మనకు ప్రసాదించెను. కాన పూర్వసుకృతముగలవారు అనాయాసముగా సులభముగా లభించుచున్న కథామృతమును పానమొనర్చి ధన్యులుగుదురు గాక.

**ఇది గురుచరితమున ఇరువది నాల్గవ అధ్యాయము సమాప్తము.**

**ఇది గురుచరితమున జ్ఞానకాండము సమాప్తము.**

**శ్లో॥ విశ్వరూపం నిందకాయ శబికాస్థః స్వలంకృతః ।**
**గర్వహా దర్శయత్ యః సశ్రీదత్తశ్శరణంమమ ॥**

భా॥ త్రివిక్రమ భారతికి విశ్వరూపమును స్వామివారు చూపి అతని గర్వము నణచుట.

**దిగంబరా దిగంబరా శ్రీపాదవల్లభ దిగంబరా**

# శ్రీ గురు చరితము

## ఇరువది అయిదవ అధ్యాయము

### కర్మకాండ ప్రారంభము

**ఓం శ్రీగణేశాయ నమః, శ్రీ గురుదత్తాత్రేయాయ నమః**

నామధారకుడు సిద్ధమునితో స్వామీ, గురుమూర్తి త్రివిక్రమభారతికి విశ్వరూపమును ప్రదర్శించి తిరిగి గణాగాపురము చేరిరని చెప్పితిరి. అటుపైన జరిగిన గురుచరితమును నాకు వినిపించి ధన్యునిచేయుడని ప్రార్థించెను. సిద్ధముని ఇటుల చెప్పుచుండెను.

గురుచరితమును విస్తరించి చెప్పవలయుననిన గ్రంథము విస్తారమగును నీవు భక్తితో ప్రశ్నించుచుంటివి గాన అందలి సారమును సంక్షేపముగ చెప్పుచున్నాను.

వైడూర్యమును నగరమున ఒక యవనరాజుగలడు. అతడు బ్రహ్మద్వేషి, క్రూరుడు, హింసారతుడు, అతడు బ్రాహ్మణలను పిలిపించి మీకు వలసినంత ధనమిచ్చెద మీ వేదములను మాకు వినిపించుడు. వేదములను అర్థముతో సహా చెప్పువారిని విశేషముగా సత్కరించెదనని వారలతో ననెను. జ్ఞానులై వివేకముగల విద్వాంసులు అతని మాటలు విని మాకేమియు వేదములు రావు అని తప్పించుకొనిరి. మూఢులై కొంతమంది ద్రవ్యకాంక్షకలవారై అతని వద్ద వేదమును అర్థముతో గూడ ఉపన్యసించుచుండిరి. వారు యజ్ఞప్రకరణమును వ్యాఖ్యానింప ఆ తురకవాడు విని మీరు పశుహింస చేయుదురని మమ్ముల నాక్షేపింతురే; మీరెట్లు యజ్ఞములను పేరుతో పశువుల హింసించుచున్నారు? అని పరాభవించుచు ద్రవ్యమును మాత్రము వారి వారి యోగ్యతననుసరించి ఇచ్చుచుండెను. వేదార్థములు చెప్పువారికి బిరుదములుగూడ ఇచ్చుచుండెను. ఎవరైతే దురాచారులై సంప్రదాయ విరుద్ధముగా మ్లెచ్ఛుల యెదుట వేదముల పఠింతురో అట్టి మూర్ఖులు కలిపురుషనకు ప్రియులు. వారికి ముందు యమరాజ్యమే నివాసస్థానము. ఇట్లుండ ఒక సమయమున ఇద్దరు బ్రాహ్మణులు ఆ రాజును సమీపించి, మేము వేదశాస్త్రముల సమగ్రముగా పఠించితిమి. మాతో వాదింపగలవారెవ్వరులేరు. మీ రాజ్యములో మాతో వాదించగలవారెవ్వరయిన నుండి పిలిపించుడు. అని తమ ఖ్యాతిని చెప్పుకొనిరి.

ఆ తురకరాజు వారి వాక్యములు విని అభిమానియై తమ రాజ్యమందలి పండితులనందర నాహ్వానించి ఈ నూతన పండితుల నెవ్వగు గెలుతురో వారలకు గొప్ప బహుమానములని చ్ఛెదనని అనెను అచ్చటి బ్రాహ్మణులందరు ఆ రాజుతో వీరల గెలువగల సామర్థ్యము మాకులేదు. మాకంత పాండిత్యములేదు మీరు వారలనే గౌరవించుడని చెప్పి తప్పించుకొనిరి. అప్పుడు రాజు నేనెట్లు యవనులకు రాజునో మీఇద్దరు బ్రాహ్మణులకు రాజులు అని చెప్పుచు వస్త్ర భూషణములతో వారలనలంకరించి ఏనుగుల మీద వాద్యఘోషపురస్సరముగా నూరేగించి వారల తన యాస్థాన విద్వాంసులుగా నుంచుకొనెను. వారు పాపభయము విడిచి నిత్యము మ్లేచ్ఛుని యెదుటవేదముల పఠించుచు బ్రాహ్మణుల నిందించుచు మదోన్మత్తులైయుండిరి. ఒకదినమున వారు రాజును సమీపించి మహారాజా మేము చదువుకొని విద్య అంతయు వ్యర్థమగుచున్నది. మీ ఆజ్ఞ అయినచో మేము దేశదేశాంతరములకు వెళ్లి అచటనున్న విద్వాంసుల వాదమున గెలిచెదము. వాదించలేనివారిచే జయపత్రములు కొని తెచ్చెదము అని చెప్పిరి. రాజును చాలా సంతసించి బ్రాహ్మణ పరాభవము చేయదగినదే. అట్లేయొనర్చుడని తగిన పరివారమును గూడ వారి వెంటపంపెను. ఆతామసులగు బ్రాహ్మణలిద్దరు దేశదేశాంతరములు పర్యటించి అచటనున్న విద్వాంసుల ఓడించుచు జయపత్రములు తీసికొనుచు క్రమముగా దక్షిణ దిక్కున నున్న త్రివిక్రమభారతి నివాసస్థానమైన కుమసీగ్రామము చేరిరి. లోకులవలననతను వేదవేత్తయనియు అనేక శాస్త్రముల యందు నిపుణుడనియు విని వారిని సమీపించి మీరుగొప్ప విద్వాంసులని విని వచ్చితిమి మీకుశక్తియున్న మాతో వాదించుడు, లేనిచో జయపత్రమిండని అడిగిరి. అపుడు త్రివిక్రమభారతీ స్వామివారు వారలతో నాకు మూడువేదములు రావు. ఒక్క వేదమును రాదు. వేదశాస్త్రముల తెలిసినవాడవైన యెడల మీవలె రాజపూజ్యతనొంది యందునుగాని ఇట్టరణ్యమున భిక్షకుడవై ఎందులకుందును. కనుక సన్యాసి వేషముతో భిక్షమెత్తి జీవించునేను మీతో సముడ కాజాలను. సర్వమును త్యజించి నిరభిమానియైన నాకు జయాపజయములతోపనియేమి? ఉత్కృష్ట విద్వాంసులైన మీకు భిక్షకుడనగునన్ను జయించుట వలన వచ్చు కీర్తియేమి ? అని వినయముతో సమాధానము చెప్పవారు మరింత అభిమానగ్రస్తులై మమ్ము గెలువగల వారెవ్వరును ఈ భూలోకమునలేరు. అన్ని

రాష్ట్రముల పర్యటించితిమి ఈమా జయపత్రముల చూడుడు. మీకు విద్యాభిమానముండినచో వాదించుడు. లేనిచో నందరివలె జయపత్రమిందు వెళ్లెదమనిరి. స్వామివారు వారలకు తగుసమాధానము చెప్పజాలరైరి. వారు మీరు జయపత్రమీయనిచో మేము పోము. అట్లు పోయితిమేని మారాజువలన మాకు మాటరాగలదు. అని పట్టుపట్టిరి అప్పుడు స్వామివారు ఈ బ్రాహ్మణులు మదించియున్నారు. ఇట్లెంత మంది బ్రాహ్మణుల పరాభవించిరో; వీరల నేను గంధర్వనగరమున నున్నగురుమూర్తి సమక్షమునకు తీసికొనిపోయెద. అచ్చట వీరికి తగినశాస్తి జరుగుగలదని మనమున నిశ్చయించి వారలతో నాకన్న గొప్పవారు మాగురవరేణ్యులు. గంధర్వనగరమున గలరు. అచ్చటకు పోయెదము రండు. అచ్చట మీకు జయ పత్రము లభించుటయో లేదా మీకోరిక నెరవేరుటయెా కాగలదు అని చెప్పిరి. అప్పుడా బ్రాహ్మణులు అందులకంగీకరించిరి.

వారుత్తమయానము నధిష్టించి ప్రయాణమయిరి. స్వామి వారు వారికి త్రోవచూపుచు పాదచారియై నడచుచుండిరి. మహాత్ముడగు యతి నడచుచుండ వారెప్పుడు యానములందు గర్వముతో కూర్చుండిరో అప్పుడే వారి ఆయుష్యము అల్పమై పోయెను. వారు క్రమముగా గంధర్వనగరము సమీపించిరి.

త్రివిక్రమభారతి గురుమూర్తిని సమీపించి ఓ మహేశా! కృపాశో! భక్తవత్సలా! జగద్గురో! సంసారార్ణ వతారకా! మిమ్ముల గుర్తించనివారు నిజముగా నధోగతి పాలగుదురు. అని చెప్పుచు రోమాంచము గలుగు గద్గర ధ్వనితో స్తుతించుచు నేత్రములెవంట ఆనందబాష్పములు రాల్చుచు గురునాథుని పాదములకు నమస్కరించెను. అప్పుడు గురునాథుడు త్రివిక్రమభారతిని లేవదీసి ఆలింగనమొనర్చి ఏమి కార్యము! ఎందులకుగానిటుల సంభ్రమముగా నిటకువచ్చితివని ప్రశ్నించిరి. అప్పుడు త్రివిక్రమభారతి గురుమూర్తితో స్వామీ ఈ ఇద్దరు బ్రాహ్మణులు మదోన్మత్తులు, మాకు నాల్గువేదములు వచ్చును. మాతో వాదించలవలసినది. లేనిచో జయపత్రమిమ్మని నన్ను ఒత్తిడి చేసిరి. నేను ఎంత చెప్పినను వారు నావాక్యముల లెక్కచేయకున్నారు. కానవారలను తమసమక్షమునకు తీసికొని వచ్చితినని చెప్పెను. అప్పుడు గురుమూర్తి నవ్వుచు బ్రాహ్మణులను దగ్గరకు పిలిచి ఓ బ్రాహ్మణులారా ! మీ రెందులకు వచ్చితిరి. వాదములవలన నేమి ఫలము. ఇతరుల పరాభవించుటయే విద్యకు ప్రయోజనమా ! యతులమగు మాకు జయాపజయములు సమములు. యతిని

జయించినందువలన మీకు వచ్చు పురుషార్థమేమి అనిరి. అప్పుడా మదించిన బ్రాహ్మణులు ఓ సన్యాసీ ! మేము భూమండలమంతయు పర్యటించితిమి. మాతో వాధించు పండితుడే ఎందును కానరాడయ్యెను. మాతో వాదము చేయజాలక అందరును జయపత్రముల నొసగిరి. అట్లే మేము ఈ త్రివిక్రమభారతిని గూడ జయపత్రిక నిమ్మనగా కోపముతో మీ వద్దకు తీసికొనివచ్చిరి. మీకు పండితులమను అభిమానమే ఉన్నచో మాతో వేదశాస్త్రలములయందు వాదమునకు ఉపక్రమించుడు. యతుల వేషము ధరించితిరే కాని మీ కేమివచ్చును అని ధిక్కరించి పలికిరి. వారి మాటలు విని గురుమూర్తి వారితో,

వ్యర్థముగా గర్వించకుడు. దేవదానవులెందరో గర్వముతో నశించిరి. బలిచక్రవర్తి గర్వముతో నధోగతి పాలయ్యెను. బాణాసురుడు లంకానాథుడగు రావణాసురుడు గర్వించి మృతి నొందిరి. మేము వేదవేత్తలమని గర్వించుచున్నారు. వేదములనంతములు, బ్రహ్మాదులే వేదముల కంతము కనుగొనరైరి. మీకు హితము చెప్పెద, గర్వమును త్యజించుడు. ఒక్క వేదమే సాంగముగా తెలియియని మీరు చతుర్వేదేత్తలగుట ఎట్లు ? అని స్వామివారు ఎంతో బోధించినను వారు గర్వముతో స్వామి వారి వాక్యమును పెడబెవిని పెట్టి తమ పట్టు విడువరైరి.

**ముందు కథను పై అధ్యాయమున వినగలరు.**

**ఇది గురుచరితమున ఇరువది అయిదవ అధ్యాయము సమాప్తము.**

**దిగంబరా దిగంబరా శ్రీపాదవల్లభ దిగంబరా**

# శ్రీ గురు చరితము

## ఇరువది ఆరవ అధ్యాయము

**ఓం అవధూత చింతనం శ్రీ గురుదేవత్త జయ ఓం**

**ఓం శ్రీ గురుదేవదత్తా ఓం శ్రీ గణేశాయ నమః**

**ఓం శ్రీపరబ్రహ్మణేనమః, ఓం శ్రీసద్గురుభ్యోనమః**

గురుమూర్తి ఆ గర్వితులగు బ్రాహ్మణులతో ఇట్లు చెప్పుచున్నారు. మీరు వ్యర్థముగ భ్రమలో పడకుడు, వేదములు అనంతములు. అట్టి వేదములను నారాయణుడు వ్యాసుడయి అవతరించి విఖ్యాతిలోనికి తెచ్చెను. అదుంకనియే వారికి వ్యాసుడను సార్థక నామమేర్పడెను. వ్యాసునకు నలుగురు శిష్యులు కలరు. 1. పైలుడు 2. వైశంపాయనుడు 3. జైమిని, 4. సుమంతుడు, పై నలుగురు శిష్యులకు నాలుగు వేదములనుపదేశించెను. ఒక్కొక్క వేదము కల్పాంతము పఠించినను అంతమునొందదు. ఇట్టి స్థితిలో మీరు నాల్గు వేదములు పఠించితిమని ప్రగల్భములాడుచున్నారు. పూర్వము భరద్వాజుడను మహర్షి వేదములను సాంతముగ పఠించవలయునని దీక్షపూని ఘోరమయిన తపమొనరించెను. బ్రహ్మ ప్రసన్నుడయి వరము కోరుకొనుమన నాకు సమస్త వేదముల సాంగముగా పఠించు కోరిక గలదు. అనుగ్రహించుడని కోరెను. బ్రహ్మ భరద్వాజనితో అన్ని వేదములు పూర్ణముగ నాకే తెలియవు. నీకు వేదముల చూపెద, శక్యమయినచో పఠించుము. అని చెప్పి జ్యోతిర్మయమయి ప్రకాశించెడి వేద పర్వతముల భరద్వాజనకు చూపెను. అప్పుడు భరద్వాజుడు భయపడి స్వామీ అనంతములయిన ఈ వేదరాసుల నేనేమి పఠించ సమర్థుడను, అనంతరములయిన ఈ వేదరాసుల నేనేమి పఠించ సమర్థుడను; తమరు అనుగ్రహించి ఏ కొంచెమో నా శక్తిని గ్రహించి ఇచ్చినచో పఠించెదనను అప్పుడు బ్రహ్మ మూడు వేదములనుండి మూడు పిడికెళ్లు మాత్రము విడదీసి భరద్వాజునకిచ్చి పఠింపుమనెను. భరద్వాజుడు అప్పటినుండియు చిరంజీవి అయి దీక్షతో పఠించుచుండినను ఇప్పటికి గూడ అతను బ్రహ్మఇచ్చిన ఆ స్వల్పభాగముగూడ పూర్తిగ పఠించ లేకపోయెను. వ్యాసుడు ఈ విషయమును కనిపెట్టి తన శిష్యులకు ఆ వేదమును క్లుప్తపరచి ఈ క్రింది విధముగ బోధించెను.

పైలుడను శిష్యుని పిలిచి అతనికి ఋగ్వేదము నుపదేశించెను. ఒక్కొక్క వేదమునకు ఒక ఉపవేదముగూడ నుండును. ఋగ్వేదమునకు ఆయుర్వేదము

ఉపవేదము. ఋగ్వేద దేవత బ్రహ్మ. ఆత్రేయ గోత్రము, రక్తవర్ణము చక్కని కంఠము. వంకరలు తిరిగిన వెంట్రుకలు, రెండు మమూరల ప్రమాణము గలవాడుగ నుండును. ఋగ్వేదములో ఆశ్వలాయన, సాంఖ్యాయన, శాకల, బాష్కల, మాండూకేయ అనిఅయిదు శాఖలు కలవు. ఇట్టి వేదమును పైలుడు వ్యాసుని వలన గ్రహించెను. కాలక్రమమున కలిరాగా ఋగ్వేద శాఖలందు చాలా భాగములోపించి ఏకొద్ది భాగము మాత్రవే ప్రస్తుతము ప్రాచరములోనున్నది. ఇట్టి స్థితిలో మేము వేదముల సొంతముగ పఠించితమని చెప్పుటకు మీకు సాహసనమెట్లు కలిగెను.

వ్యాసుడు రెండవ శిష్యుడగు వైశంపాయనుని పిలిచి అతనికి యజుర్వేదము నుపదేశించెను. యజుర్వేదమునకు ధనుర్వేదము ఉపవేదము. రుద్రుడు దేవుడ. భారద్వాజ గోత్రము. పద్మవత్రములవలె విశాలమయిన నేత్రములు తామ్రవర్ణము. అయిదు మూరల పొడుగు. ఇట్టి యజుర్వేదమునకు ఎనుబదియారు అవాంతర శాఖలు గలవు. చరకములు ఆహ్వారకములు కఠములు, వాజసనేయములు. పమాధ్యం దినములు మొదలగునవి కలవు. యజుర్వేదము యజ్ఞములచేయు విధానమును విశేషించి వర్ణించునుఉ. ఇట్టి వేదమునకు అపస్తంబబోధాయన, సత్యాషాడ మొదలగు అవాంతర శాఖలు గలవు. మందబుద్ధి గలవారు పఠించుట కనుకూలమగునట్లు విస్తీర్ణమగు వేదమును వ్యాసుడు విభజించి శిష్యులకు బోధించెను. యజుర్వేదమునందు మంత్రమని బ్రాహ్మణుని, సంహితయని, అరణ్యమని విభాగములు గలవు. ఇట్టి విస్తీర్ణమగు యజుర్వేదమును వైశంపాయనున కుపదేశించి, మూడవ శిష్యుడయిన జైమినిని పిలిచి అతనికి సామవేదము నుపదేశించెను.

సామవేదమునకు గాంధర్వవేదము ఉపవేదము. విష్ణుమూర్తి దేవుడు, కాశ్యపగోత్రము, శుభ్రమయిన వస్త్రమును ధరించి శాంతి కలవాడై దండమును చేతబూని తెల్లని రూపముతో ఆరు మూలర పొడుగున సామవేద దేవత ప్రకాశించుచుండును. సామవేదమునకు వెయ్యిశాఖలు గలవు. నారాయణుడు తప్ప సామవేదమును పూర్తిగ పఠించితిమని చెప్పగలవారెవ్వరును లేరు. అట్టి సామవేదమున అశురాయణీయ, వార్తాంతవీయ, అని ఇట్లు ఎన్నియో బేధములు కలవు. ఇట్టి సామవేదమును పూర్తిగ పఠించనెవ్వరు సమర్థులు ? పై విధమున వ్యాసుడు జైమిని సామవేదము నుపదేశించి ఇక నాల్గవ వాడయిన సుమంతుని పిలిచి అధర్వణవేదము నుపదేశించెను.

అధ్వర్ణవేదమునకు అస్త్రవేదము ఉపవేదము. ఇంద్రుడు దేవుడు. తీక్షమయిన రూపము. నల్లని వర్ణము. ఏడు మూరల పొడుగు. ఇట్టి రూపముతో అధర్వణవేదదేవత శోభిలుచుండునుఉ. అధర్వణవేదమునకు పైప్పల, దాంత మొదలగు తొమ్మిది ప్రధానమయిన బేధములు కలవు. విధానకల్పము, నక్షత్రకల్పము, శాంతికల్పము మొదలగు అయిదు కల్పములుగా అది విభజింపబడియున్నది. ఇట్టి అధ్వణవేదమునకు సుమంతుడు వ్యాసునివలన గ్రహించెను.

వేదములింత విస్తీర్ణములు, పూర్వము ఈ భరత ఖండమున బ్రాహ్మణోత్తములు వర్ణాశ్రమాచార నిరతులయి వేదముల పఠించుచుండిరి. ఆ కాలమున వేదములు మంచిగ ప్రచారములో నుండెడివి. కలియుగమురాగా బ్రాహ్మణుని వారి వారి ధర్మముల వదలుటచే వేదములు క్రమముగ లుప్తములయినవి. బ్రాహ్మణులు కర్మభ్రష్టులయి మ్లేచ్ఛుల ముందర వేదముల నిశ్శంకముగ పఠించుటచే ఆమంత్రముల సత్తయు లోపించినది. పూర్వము బ్రాహ్మణులందు వేదములు ప్రతిష్టింపబడియుండెను. కాననే వారు భూసురులని పేరునొందిరి. పూర్వపు చక్రవర్తుల బ్రాహ్మణులను పూజించుచుండిరి. చక్రవర్తులు తమ సర్వస్వమును బ్రాహ్మణులకు నీయ సమకట్టినను ఆకాలపు బ్రాహ్మణులు నిస్పృహులగుటచే రాజద్రవ్యమును గ్రహించక భిక్షాటనము చేతనే ఉదరపోషణ మొనర్చుకొనుచుండెడివారు. అట్టి బ్రాహ్మణులు చూచి ఇంద్రాది దేవతలుగూడ భయపడుచుండిరి. త్రిమూర్తులు వారికి ఆధీనులయి యుండిరి. వారు తలచిన తృణమును పర్వతము చేయగలరు. పర్వతమునుగూడ తృణముగ చేయు సమర్థులు. వారి యొక్క వాక్యము కామధేనువువలె అభీష్టముల



నొసగుసమర్థమయి యుండెను. బ్రాహ్మణులు వేదభూషితులగుట వలన విష్ణువంతవాడు బ్రాహ్మణో మమదైవతమ్ అని చెప్పెను. అట్టి ప్రఖ్యాతిగాంచిన బ్రాహ్మణకులము నేడు వేదమార్గముల త్యజించి కుమార్గముల నాశ్రయించుచున్నది. బ్రాహ్మణులు హీనజాతిసేవచేయ సమకట్టుచున్నారు. వేదములను జీవనార్థము విక్రించుచున్నారు. హీనులయెదుట పవిత్రములగు వేదముల పఠించుచున్నారు. అట్టివారి ముఖమును చూచినను పాపమే వచ్చును. వారు బ్రహ్మరాక్షసులయ్యెదరు. మీరు బుద్ధి హీనులయి వేదములనన్నిటిని పఠించితిమని గర్వించి బ్రాహ్మణుల క్షోభ పెట్టుచున్నారు. మీకిట్టిదుర్బుద్ధి గఱపినదెవ్వరో తెలియదు. మీరు ఆత్మస్తుతి చేసుకొనుచున్నారు. మా శిష్యుడగు త్రివిక్రమయతిని జయపత్రమిమ్మని బాధించితిరి. మీరు దురాగ్రహము విడిచి ఇచ్చట నుండి పొండు. లేనిచో మీ ప్రాణములకే ముప్పువాటిల్లకలదు. అని ఇట్లుహితబోధ చేసినను ఆ తామసబ్రాహ్మణులు స్వామివారి హితబోధను పెడచెవిడనిపెట్టి వారితో మీ వలన జయపత్రమును తీసికొనక మేము పోయినచో మారాజు ఎదుట మాకు గౌరవముండునా ? జయపత్రమిచ్చిననే పోయెదమని మదోన్మత్తులయి పలికి. పై కథా వృత్తాంతమును తరువాతి అధ్యాయములో శ్రోతలు వినగలరు.

**ఇది గురుచరితమందలి ఇరువది ఆవర అధ్యాయము సమాప్తము.**

**దిగంబరా దిగంబరా శ్రీపాదవల్లభ దిగంబరా**

**శ్లో॥ త్రివిక్రమేణ చానీతౌ గర్వితౌ బ్రాహ్మణ ద్విషా।**
**బోధయామాస తౌ యః సః శ్రీదత్త శ్శరణం మమ॥**

తా॥ గర్వితులైన ఇద్దరు బ్రాహ్మణ పండితులకు స్వామి వారు వేదముల స్వరూపము చెప్పుట.

**శ్లో॥ నైవాత్ర కావ్యగుణ ఏవతు చింతనీయో**
**గ్రాహ్యః పరంగుణవతా ఖలు సారేవ**
**సిందూరచిత్రరహితా భువి రూపశూన్యా**
**పారం న కిం నయతి నౌరిహ గంతు కామాన్ ॥ – "అవధూతగీత"**

తా॥ గుణవంతుడైన పురుషుడు గురూపదేశము తీసుకునుటానికి గురువుకు కావ్యోత్పత్తి జ్ఞానము లేదని విచారించకూడదు. కేవలముగ గురువుచెప్పిన తత్వమందే లక్ష్యము వుంచడవలయును. చూడుడీ ! ప్రపంచవ్యవహారంలో నదిదాటుటానికి నౌకా అనగా ఓడ చిత్ర విచిత్రరూప లావణ్యము లేనిది నది రాటేవాండ్ల దాటించదాయేమి.

# శ్రీ గురు చరితము

## ఇరువది ఏడవ అధ్యాయము

**ఓమ్ అవధూతచింతనం శ్రీ గురుదేవదత్త జయ ఓమ్**

**ఓం శ్రీ దత్తాత్రేయాయ నమః ఓం శ్రీ గణాధిపతయే నమ ః**

**ఓం శ్రీ గురుభ్యోనమః**

ఆ బ్రాహ్మణులు మూర్ఖులయి మాతో వాదించుడు, లేదా జయ పత్రమునిందు అని ఎప్పుడు పట్టుదలతో పలికిరో స్వామివారు మీ మనోరథమే నెరవేరుగాక యనిరి.

నామధారకా ! ఎలుక తన మరణము కొరకు సర్పమునుంచిన బుట్టను కొరికి అందు ప్రవేశించునటుల, మిడుత ఆహారమని భావించి దీపజ్వాలమీద పడిన రీతిని ఈ తామన బ్రాహ్మణులు గురుమూర్తి ప్రభావము గ్రహింపజాలక మదోన్మత్తులయి తమ మరణమును తాము కొనితెచ్చుకొనుట కుద్యుక్తులైరి. అదే సమయమునకు ఆ వీధినుండి ఒక చండాలుడు పోవుచుండెను. గురుమూర్తి తన శిష్యుని పంపి అతనిని సమక్షమునకు రప్పించెను. గురుమూర్తి అతనితో నీవెవ్వడవు. ఏజాతి వాడు ? అని ప్రశ్నించిరి. వాడు దూరముగ నిలుబడి గ్రామబాహ్యమున నున్న మాలవుల్లె నా నివాసము. నా పేరు మాతంగుడు. కడజాతివాడను. అని సమాధానము చెప్పి దూరమున నుండి దండ ప్రాణామమాచరించెను.

గురుమూర్తి కృపాదృష్టితో నతని నొకసారి చూచి శిష్యునిచేతికి దండమునిచ్చి వాడున్న స్థలమునుండి, వరుసగా ఏడు గీతలు గీయుమని చెప్పెను, శిష్యుడట్లొనర్చ స్వామివారు ఆ చండాలుని మొదటి గీతమీదకు రమ్మనిరి. వాడట్లొనర్చ స్వామివారు వానిని నీవెవ్వడవని యడిగిరి. నేను మైందుడనని చెప్పెను. రెండవ గీతమీదకు రప్పించ కిరాతుడననెను. మూడవ గీతమీదకు రాగా నదీ తీరమునుండు గంగా పుత్రుడను పేరుగల కాపుననేను. నాలుగవ గీతమీదకు రప్పించతాను శూద్రుడననెను, అయిదవ గీతమీదకు రాగా అతనికి జ్ఞానోదయమయి నేను సోమదత్తుడనను వైశ్యుడనని చెప్పెను. ఆరవ గీతమీదకు రప్పించి అడుగవాడు తాను గోదావరి యను పేరుగల క్షత్రియుడనని చెప్పెను. ఏడవ గీతమీదకు రప్పించి నీవెవ్వడవని యడిగిరి. వాడుతాను బ్రాహ్మణుడననియు వేదశాస్త్రములు పఠించిన పండితుడననియు చెప్పెను.



అప్పుడు గురుమూర్తి కొంచెము భస్మము చేత తీసుకొని అభిమంత్రించి అతనిమీద చల్లి అతనితో వేదశాస్త్రములు పఠించితినని చెప్పుచున్నావు. వాదమునిమిత్తము వచ్చిన ఈ బ్రాహ్మణులతో వాదించి వారిని పరాభవించుమని చెప్పిరి. గురుమూర్తి కృపాదృష్టిచే కాకి హంస అయిన విధమున కడజాతివాడును మహాపండితుడయ్యెను. వేదముల నిరర్గళముగా పఠింపసాగెను. ఇట్టి అద్భుతము ఆ బ్రాహ్మణుల చూచిరి. వారికి భయము కలిగెను. నోరాడకపోయెను.

హృదయము కంపించెను, వెంటనే వారు గురుమూర్తి పాదముల మీద పడి స్వామీ, మేము గురుద్రోహులము మహాపాప మొనర్చితిమి. మీరు సాక్షాత్తు ఈశ్వరావతారులు. తామసులమగు మాకు మీమహిమ గ్రహించు సామర్థ్య మొక్కడిది. మీరు త్రిమూర్తి స్వరూపులు. సృష్టిస్థితిసంహారములు చేయ సమర్థులు. మా అపరాధము క్షమించి మమ్ముల కాపాడి రక్షింపుడని ప్రార్థించిచిరి. అప్పుడు స్వామివారు మీరు ఎందరో బ్రాహ్మణుల పరాభవించితిరి గాన ఎవ్వరి ఆర్జితము వారు అనుభవించవలసినదే. మీరు పండ్రెండు సంవత్సరములు బ్రహ్మరాక్షసులై యుందురు. మీకు ఇప్పటికి పశ్చాత్తాపము కలిగెను గాన పండ్రెండు సంవత్సరములకు ఒక సద్బ్రాహ్మణుని వలన వేదములోని నారాయణానువాకమును వినగలరు. అప్పుడు మీకు పిశాచత్వము తొలగి సద్గతి లభించగలదు. అని చెప్పి వారలను పంపివేసిరి వారు గ్రామమముదాటి బాహ్యప్రదేశమునకు వచ్చుట తోడనే హృదయశూలతో మరణించుట తటస్థించెను. గురువాక్యము ప్రకారము వారు పిశాచత్వము నొందుటయు పండ్రెండు సంవత్సరములకు తిరగి వారు సద్గతి నొందుటయు తటస్థించెను.

ఎవ్వరు చేసిన కర్మఫలము వారనుభవించవలసినదే సుమా నామధారకా!

గురుమూర్తి యొక్క అనుగ్రహమువలన వేదవేత్త అయిన ఆ మాతంగుడు స్వామివారికి నమస్కరించి స్వామీ గురుదేవా ! మీరు త్రికావేత్తలు. నేను పూర్వము వేదవేత్తనయిన బ్రాహ్మణుడనయి యుండియు ఇట్టి నీచజన్మ మెందును ఎత్తవలసివచ్చెను. దయయుంచి కారణము సెలవిండని ప్రశ్నించెను. అప్పుడు స్వామివారు పై అధ్యాయములో ఏ కర్మచేసినవారు ఎట్టి జన్మనొందుదురో అట్టి కర్మవిపాకమును విపులముగా చెప్పగలరు.

**ఇది గురుచరితమున ఇరువది ఏడవ అధ్యాయము సమాప్తము.**

**దిగంబరా దిగంబరా శ్రీపాదవల్లభ దిగంబరా**

**శ్లో॥ సప్తజన్మ విదం సప్తరేఖోల్లం ఘనతోదదౌ ।**
**యెహీనాయ శృతిస్ఫూర్తిం శ్రీదత్తశ్శరణం మమ ॥**

తా॥ పంచమజాతి దానిచే వేదముల చెప్పించి బ్రాహ్మణుల గర్వమణచుట.

**శ్లో॥ మహానుభావసంపర్క స్సంసారార్ణవలంఘనే**
**యుక్త సంప్రాస్యతేరామ యథానౌరివనావికాత్ "వాసిష్ఠ సందేశము"**

తా॥ మహానుభావుల సహవాసము, సముద్రమును ఓడ యెటువలె దాటించునో అటువలె, సంసార సముద్రమును సులభముగా దాటించును.

# శ్రీ గురు చరితము

## ఇరువది ఎనిమిదవ అధ్యాయము

**ఓమ్ అవధూతచింతనం శ్రీ గురుదేవత్త జయ ఓమ్**

**ఓం శ్రీ గురుదత్తాత్రేయాయ నమః ఓం శ్రీ గణాధిపతయే నమః**

**ఓం శ్రీ గురుభ్యోనమః**

సిద్ధముని నామధారకునితో గురుమూర్తి యొక్క సత్కథను ఈ క్రింది విధమున చెప్పుచున్నాడు. అది వినువారికి సర్వదోషములు నశించును. జ్ఞాన ముదయించును.

నరసింహసరస్వతీస్వామివారు పతితుని గూర్చి త్రివిక్రమ భారతి మొదలగు శిష్యులు వినుచుండ కర్మవిపాకమును ఈ క్రిందివిధమున చెప్పుచున్నారు.

(జీవుడు తాను పూర్వ మార్జించిన పుణ్య పాపములను బట్టి ఉత్మమాధమ జన్మలనొందుచుండును.) బ్రాహ్మణక్షత్రియ వైశ్య శూద్రులు దురాచారరతులయ్యేరేని వచ్చుజన్మలో వారు చండాల జాతియందు జన్మింతురు. బ్రాహ్మణస్త్రీయందు శూద్రుని వీర్యముతో జన్మించువాడు చండాలుడు. ఇది మా జాతి. కర్మముబట్టి చండాలత్వము వచ్చు పాపముల చెప్పుచున్నాను.

బ్రాహ్మణుడు అనాచారుడయి యుండినచో నతడు వచ్చు జన్మలో చండాలుడై పుట్టును. తల్లిదండ్రులును గురువును. చేసికొనిన భార్యను, కులదేవతలను, త్యజించువారు చండాలురగుదురు. అబద్ధము నాడువారు, జీవహింస చేయువారు, కన్యావిక్రయ మొనర్చువారు. శూద్రునిఇంట భుజించువారు, అసత్యప్రమాణము చేయువారు, దాసీలతో రతియొనర్చువారు, దేవపితృ కర్మలందు కోపముతో భాండముల పగులుగొట్టువారు. చండాలురయ్యేదరు. అరణ్యమును దహిచెండివారు, తల్లిదండ్రులను వేరుచేసి ప్రత్యేకముగ జీవించెడివారు. ఎద్దు నెక్కి తిరుగువారు, తీర్థయాత్రలకు వెళ్ళి అచ్చట శ్రాద్ధ మొనర్చనివారు, తీర్థ క్షేత్రములందు ప్రతిగ్రహ మొనర్చువారు, ఈశ్వరున కభిషేక మొనర్చక కపిలగోవుపాలు త్రాగువారు, చండాలురయ్యేదరు. ఒక భార్యను వివాహమాడి అంతకు పూర్వమున్న భార్యను విడనాడినవారు. ఒక అతిథి ఇంటికి రాగా ఏమి చదివితిని వేదములు వచ్చునా ? అని పరీక్ష చేసి ఎంతో కష్టముతో అన్నమిడుదురో అట్టివారు చండాలురయ్యేదరు. తల్లిదండ్రులకు

వృద్ధాప్యమున సేవయొనర్చనివాడు చండాలుడగుటయే గాక ఏడుజన్మలయందు క్రిమిఅయి జన్మించును. యోగ్యుని త్యజించి, అయోగ్యుని పూజించువాడును, ఇతరుల యొక్క వృత్తికి భంగమొనర్చు వాడును, వాపీకూపతటాక ధ్వంసమొనర్చువాడును, శివపూజకు విఘ్నమొనర్చువాడును, ఇద్దరు భార్యలుండ వారియందు పక్షపాతముగ వర్తించువాడును. సంధ్యాకాలమున భుజించువాడును, అనిన మాటను నిలబెట్టుకొనజాలనివాడును, సంధ్యాకాలమున నిద్రించువాడును చండాలుడై జన్మించును. శూద్రులకు వేదముల చెప్పువాడును పర్వకాలములయందు స్త్రీసాంగత్యమొనర్చువాడును, శ్రాద్ధముల మానువాడును, తన పుణ్యముల తాను చెప్పుకొనువాడును, నడచు మార్గమున మలవిసర్జనము చేయువాడును, చలివేంద్రములను భంగము చేయువాడనూ వాడీజ్ఞానము లేక వైద్యము చేయువాడను వేదమార్గమును విడనాడి జారణ, మారణాది లోకోపద్రవ కర్మలనాచరించు వాడును చండాలురగుదురు. గురువును మనుష్యుడని తలచువారును, ఇతర దేవతల పూజించుచు హరిహరుల నిందించువారు.ఉ కుక్క తిత్తియందలి గంగోదక మెట్లో అటుగ శూద్రునివలన మంత్రమును గ్రహించువారును, విధవాస్త్రీతో రతిచేయువారును, తన గురువును ఎవరైన నిందించుచుండ హర్షముగా వినువారును, బ్రాహ్మణుల ద్వేషించువారును, వేదములను చర్చించువారును. బ్రహ్మరాక్షసులయ్యెదరు. తన దేవుని తాను భజించుచున్నను ఇతర దేవతల తూలనాడువాడు దరిద్రుడగుటయే గాక అపస్మార రోగపీడితడగును. బ్రాహ్మణుల నవమానించి వేదముల దూషించువాడు మూత్ర కృచ్ఛ్రరోగముచే పీడింపబడును. ఇతరుల యొక్క దుష్కృతములను, మర్మములను బయట పెట్టువాడు జన్మాంతరమున హృదయరోగముతో మహా కష్టము ననుభవించును. స్త్రీలకు గర్భపాత మొనర్చువారు మృతవంధ్యులై జన్మింతురు. అట్టి వారికి సంతానము నిలువదు. కానగర్భపాత మొనర్చుట తగదు.

ఎవ్వరు ధర్మమును చెప్పిన వినరో, ఎక్కువ భుజించువారిని చూచి హేళన చేయుదురో వారు చెవిటి వారుగను గ్రుడ్డి వారుగను పుట్టెదరు. పతితునితో మైత్రి చేయువారు గార్ధభమయి జన్మించముదురు. హీనజాతివలన ఔషధమును స్వీకరించవాడు మృగమగును. బ్రహ్మహత్య చేయువారు క్షయరోగులుగను, కల్లుతాగువారు పిప్పిపళ్లుగలవారగను. సువర్ణమును హరించువారు పిప్పిగోళ్లుగలవారుగను, గురుభార్యతో రతి చేయువారు కుష్ఠురోగులగను జన్మింతురు. గుఱ్ఱమును

గోవును హత్యచేయువారు సంతానహీనులగుదురు. పశ్చాత్తాపము వలన పాపము తగ్గును. పాపము చేసినవాడు ముందుగ నరకముననుభవించి అనంతరము రోగియై భూలోకమున జన్మించును. విశ్వాసఘాతము చేయువాడు మనరోగముచే పీడింపబడును. ఒక సేవకుని వానియజమానినుండి తప్పించి తన వద్ద పనికి నియమించుకొనునో అట్టివాడు బంధకారాగార శిక్ష అనుభవించును. ఘోరమగు నరకమును గూడ ననుభవించును. పరస్త్రీని అపహరించువాడు దారుణమయిన నరకము ననుభవించి మతిహీనుడయి పుట్టి అనేక కష్టముల నొందును. సర్పమును చంపువాడు సర్పమై పుట్టును. సువర్ణము నపహరించువాడు ప్రమేహ వ్యాధిగలవాడగును. పుస్తకము నపహరించువాడు జన్మాంధుడగును. వస్త్రము నపహరించువాడు బొల్లిరోగముగల వాడగును. గణద్రవ్యము నపహరించువాడు గండమాలరోగముతో పీడింపబడును. రోగముచే పీడితుడై మరణోన్ముఖుడైన వాని ద్రవ్యమపహరించువాడు చిరకాలము కారాగారశిక్ష ననుభవించునని నబ్రహ్మాండపురాణమున చెప్పబడెను.

వరులద్వేషించువాడు, వరులు తనవద్ద దాచిన ధనము లేదని ఎగవేయువాడు జన్మాంతరమున అపుత్రుడగును. అన్నమును హరించువాడు గుల్మరోగముచే పీడింపబడును. ధాన్యము నపహరించినవాడు రక్తగాత్రుడగును. తైలము నపహరించువాడు దుర్గంధముగల శరీరముగలవాడగును. బ్రాహ్మణ ద్రవ్యము నపహరించువాడు బ్రహ్మరాక్షసియగును. రత్నములు, మాణిక్యములు,చ మౌక్తికములు మొదలగువాటిని తస్కరించువాడు హీనజతాడుగ జన్మించును. పత్రశాక, ఫలముల నపహరించువాడు తామరరోగి యగును. రక్తపానము చేయువాడు జోరీగయగును. కంచు, దూది, లహము వీటిని అపహరించిన వాడు నరకము ననుభవించి శ్వేతకుష్ఠగలవాడై జన్మించును. దేవద్రవ్యము నపహరించువాడు, దేవకార్యములకు విఘాత మొనర్చువాడు, అభక్షణము చేయువాడు పాండురోగముల వాడై జన్మించును. ధనము నపహరించినవాడు ఒంటెయై జన్మించును. ఫలముల నపహరించిన కోతియగును. నీటిని దొంగిలించిన చాతకపక్షి యగును. గృహోపకరణముల నపహరించువాడు కాకియై జన్మించును. తేనె నపహరించువాడు తేనెటీగయగును. గోరసముల నపహరించువాడు కుష్ఠరోగియై జన్మించును. ఇక వ్యభిచారవిషయము చెప్పెద వినుము.

పరస్త్రీని ఆలింగనమొనర్చివాడు నూరుజన్మములు కుక్క అయి జన్మించి

తరువాత సర్పమగును. పరస్త్రీ యోనిని వీక్షించువాడు అంధుడును, మూఢుడును, అయి పుట్టును, బంధుస్త్రీ తోరతిచేయువాడు గార్దభమగును. ఎవరు దుర్బుద్ధితో పరస్త్రీల ముఖమును చూతురో వారు నేత్రరోగములకవారై పుట్టుదురు.

ఇట్లు గురుమూర్తి కర్మవిపాకమును చెప్ప త్రివిక్రమ భారతీ స్వామివారు గురుమూర్తితో స్వామీ; మీరు ధర్మములను విస్తరించి ప్రతిపాదించితిరి. ఎవరయిన ఇట్టి పాపములు చేసిన అందులకేమయిన ప్రాయశ్చిత్తము గలదా సెలవిండని ప్రార్థించ గురుమూర్తి ఇట్లు చెప్పుచున్నాడు.

ఎవరికి పశ్చాత్తాపము కలుగునో వారి పాపములు నశించును. చేసిన పాపమును సంస్కారరూపమున వారి వారి అంతః కరణములయం దణగియుండును. ఘోరమహాపాపములనొర్చినవారు కర్మవిపాకమునందు చెప్పబడినటుల యథావిధి ప్రాయశ్చిత మొనర్చుకొనవలయును. బ్రాహ్మణుల సభలో తన పాపమును చెప్పివారు విధించినటుల తమ శక్తికొలది గోదానమో కృచ్ఛ్రహచాంద్రాయణాది ప్రాయశ్చిత్తములో ఆచరించవలయును. శక్తిలేనివారు ప్రతినిధిగ ద్రవ్యదానమొనర్చవలెను. అజ్ఞానకృతపాపములు పశ్చాత్తాపపము చేతను గురుసేవ చేతను నశించును. సువర్ణదానము చేతను తీర్థయాత్రు చేయుటచేతను పాపములు నశించును. పదివేల గాయత్రీజపము చేసినచో సామాన్య పాపము నశించును. గాయత్రీహెూమము చేతను వేదపారాయణ చేతనుగూడ కృచ్ఛ్రప్రాయశ్చిత్తము చేసిన ఫలము లభించును.



మూడురోజులు ఉపవాసము, మూడురోజులు పాలు, మూడుదినములు నెయ్యి త్రాగి యుండుట ఇట్టి వ్రతము కృచ్ఛ్రమనబడును. శక్తిలేని వారు నువ్వులు భక్షించవచ్చును. శక్తిగలవారు మారేడు, రావి, కమలములు, దర్భ, గరిక వీటితో భావితమయిన ఉదకమును మాత్రమే త్రాగి ఉపవసించవలయును. ఇది వర్ణకృచ్ఛ్రమనబడును. పాపశాంతి కొరకు చాంద్రాయణవ్రత మాచరించవలయును. అది యెట్లనిన అమావాస్య ఉపవాసముండి తిథిక్రమమమున దినదినమునకు కుక్కుటాండ ప్రమాణమగు గ్రాసమును ఏకోత్తరవృద్ధిగ భక్షించు చుండవలయుచు, ఇట్లు పూర్ణిమవరకు పూర్తిచేసి కృష్ణపక్షమున చంద్రకళ రోజురోజుకు క్షీణించినటుల గ్రాసమును దిన దినమునకు తగ్గించుచు అమవావాస్యనాడు ఉపవసించవలయును. ఇది చాంద్రాయణ మనబడును. ఈ వ్రతముచే సమస్త పాపములు నశించును. కాశీ క్షేత్రమున నెలరోజులు నివసించుటచే సర్వపాపములు నశించును. సేతుబంధమున సముద్రస్నానముచే భ్రూణహత్యాది మహాపాతకములు నశించును.

మితాహారుడయి పురుషసూక్తమును ఆరునెలలు పఠించుచో నెట్టి పాపములయిన పోగలవు. అఘమర్షణసూక్తము, నారాయణోపనిషత్పఠనము, విష్ణుసూక్తజపము ఏడు జన్మమలు పాపములను గూడ పోగొట్టును. ప్రాయశ్చిత్తము చేసికొనువాడు పూర్వదినమున ఉపవాసముండి పంచగవ్యప్రాశన మొనరింపవలయును.

గోమూత్రము, గోమయము, గోక్షీరము, గోఘృతము, గోదధి వీటిని ఒక పాత్రలో కలిపి అందు కుశోదకమునుగూడ చేర్చి వైదిక మంత్రములచే నభిమంత్రించి ఆచార్యునిద్వారా మంత్రపూర్వకముగా పుచ్చుకొనవలయును. అందుచే పాపములుపశమించును. గురువనుగ్రహము చేతను స్వధర్మ నిరతుడయి వేదవేత్తయగు బ్రాహ్మణుని అనుగ్రహము చేతను పాపులు పునీతులు కాగలరు. అని గురుమూర్తి త్రివిక్రమభారతితో చెప్పి ఆ పతితుని చూచి ఓరీ; నీవు పూర్వము తల్లిదండ్రులు ద్వేషించిన పాపమున చండాలుడవయితివి. నీవు నెలరోజులు ఇచ్చిటి సంగమక్షేత్రమున స్నానమొనర్చితివేని నీ పూర్వ దోషము నశించును రాబోవు జన్మమున బ్రాహ్మణుడవయి పుట్టగలవనిరి. అప్పుడు వాడు స్వామి వారితో మీ దర్శనము వలననే నా పాపములన్నియు నశించెను. శరణాగత రక్షకులగు మీదృష్టి పడినమాత్రముననే నేను పవిత్రుడనయితిని. పరశువేదిస్పర్శచే బంగారమయిన యినుము తిరిగి ఇనుమగునా ? మీరు సర్వము తెలిసిన

మహాత్ములు. నన్ను దయతో నభిమంత్రించి బ్రాహ్మణులలో కలుపుడు అని ప్రార్థించ స్వామి వారు నవ్వి జాతిహీనుడవయిన నిన్ను బ్రాహ్మణునిగ నెవ్వరంగీకరింతురు ? హీనజాతి రేతస్సువలన జన్మించి, ఆ జాతిలో పుట్టి పెరిగిన నీకు బ్రహ్మత్వము లభించనేరదు.

పూర్వము గాధిపుత్రుడగు క్షత్రియుడయిన విశ్వామిత్రుడు తనకు బ్రహ్మత్వము రాగలందులకుగాను తప మొనర్చి నాకు బ్రహ్మర్షిత్వమిండని దేవతల ప్రార్థించవారు "నీ గురువగు వశిష్ఠుని ప్రార్థించుము అతీడంగీకరించిన మాకును అంగీకరామే" అనిరి. అప్పుడు విశ్వామిత్రుడు వశిష్ఠుని సమీపించి 'నేను బహుకాలము తపమాచరించితి నన్ను బ్రహ్మర్షిగ చేయుడ"ని యాచించెను. అప్పుడు వశిష్ఠుడు ఓ విశ్వమిత్రుడా ! అపవిత్రమయిన ఈ క్షత్రియశరీరమును త్యజించి బ్రాహ్మణకులమున పుట్టి ఉపనయన సంస్కార మొందినచో నీకు బ్రహ్మత్వము వచ్చుననిరి. అంతదనుక నిన్ను బ్రాహ్మణుడవని అనజాలను వారి వాక్యములు విని కోపించి విశ్వామిత్రుడు వశిష్ఠుని నూర్గురు పుత్రుల సంహరించెను. అయినను బ్రహ్మ జ్ఞానియగు వశిష్ఠుడు తామసమును పొందలేదు. ఒకనాడు విశ్వామిత్రుడు గొప్ప శిలను చేపూని దానితో వశిష్ఠుని చంపచూచెను. అంతలో దైవవశమున నిట్టి విచార ముదయించెను. నేనతనిని సంహరించుటయే బ్రహ్మహత్య వచ్చునే గాని బ్రహ్మర్షిత్వము రానేరదు. ఈ వశిష్ఠుడు నన్ను బ్రహ్మర్షియని యంగీకరించిననే దేవతలు నన్ను అట్లనుటకు సమ్మతించెదరు. కాన ఇట్టి మహాత్ముని చంపుట తగదు, అని భావించి పశ్చాత్తాపము నొంది వశిష్ఠుని పాదము శరణునొందెను. వశిష్ఠుడతని మనః పరివర్తనము గుర్తించి రాజర్షియని మాత్రము సంభోధించెను. అప్పుడు విశ్వామిత్రుడు వశిష్ఠునితో స్వామీ; నాకు బ్రహ్మర్షిత్వము నను గ్రహింపుడని ప్రార్థించెను.

వశిష్ఠులవారప్పుడు అతనితో సూర్యకిరణములచే నీ ప్రస్తుత దేహమును భస్మమొనరించి తపోబలముచే నూతన శరీరమును సృష్టింపుము. అప్పుడు నిన్ను బ్రహ్మర్షియని పిలిచెదనని చెప్ప విశ్వామిత్రుడటులచేసి అది మొదలగ బ్రహ్మర్షియని ప్రసిద్ధినొందెను. అంతంత వారే బ్రహ్మత్వమును అంత కష్టముచే పొందియుండ నీవు నన్ను బ్రాహ్మణులలో కలుపమనుచున్నావు. అది సాధ్యమా ! నేను చెప్పినటుల చేసితివేని రాబోవుజన్మలో బ్రాహ్మణుడవగుదువు అనిరి. కాని దరిద్రునకు నిధి దొరికిన వదలజాలని విధముననను చక్కన పచ్చిక

బయలులో మేయుచున్న గోవు అందుండి వెడలుట కిచ్ఛయించనటులను గుర్వనుగ్రహమున తాత్కాలికముగ జ్ఞాన ప్రాప్తినొందిన అపతితుడు స్వగృపమునకు పోవ నిష్టపడక పోయెను.

ఇంతలో నతని భార్యఉ పిల్లలు అతనిని వెదకుకొనుచు వచ్చి అతనిని సమీపించి ఇక్కడకు వచ్చితివేమి ? నీకు మతి పోయెనా ? పోవుదము రమ్మన వాడు నన్ను సమీపించకుడు. దూరముగ పొండని తరిమి వేయుచుండెను. అప్పుడతని భార్య స్వామివారిని చూచి స్వామీ ! నా భర్తకు మతిపోయినట్లున్నది. ఇంతమంది పిల్లలనెవరు పోషించగలరు ? తగిన సమాధానము చెప్పి మా వెంట పంపుడు లేనిచో నేను మీ యెదుట ప్రాణమర్పించెదననెను. అప్పుడు గురుమూర్తి నవ్వి ఆ పతితునితో ఓరీ నీవింటికి పొమ్ము. దారాపుత్రుల క్షోభ పెట్టిన నీ కేమి సద్గతి రాగలదు. సంసారమున జన్మించినవాడు వారి వారి ధర్మముల నాచరించుచు ఇంద్రియముల సంతోషపరచవలయును. అట్లయిననే వారు సంసర సముద్రమును దాటగలరు. సూర్యచంద్రులు సాక్షిగ ఒక స్త్రీని కామించి వివాహమాడి త్యజించుట మహాపాతకము. అట్టివారికి సద్గతి ఎన్నటికిన కలుగజాలదు. అని గురుమూర్తి చెప్ప వాడును స్వామీ, మీ యనుగ్రహము వలన జ్ఞానినయి తిరిగి యెటుల హీనత్వము పొందగలనని దీనముగ వేడెను. అప్పుడు స్వామివారు తనలో నేను మంత్రించి చల్లిన భస్మ మాహాత్మ్యముచే ఇతనికి ఇంతటి వివేకము కలిగెను.

ఇట్టి భస్మమును కడిగించితినేని ఇతనికి తాత్కాలిక జ్ఞానము నశించగలదు. అని భావించి తన శిష్యునితో ఆ గ్రామమున లబ్ధుడయిన జ్ఞానశూన్యుడయిన బ్రాహ్మణునెవనినయిన వెతికి తీసుకొనిరమ్మని చెప్పిరి. వాడు అట్లే వాణిజ్యముచే జీవించెడి ఒక లుబ్ధబ్రాహ్మణుని పట్టుకొని వచ్చిరి. గురువతనితో నీవు కుండలతో నీరు తెచ్చి ఇతనికి స్నానము చేయించుమనిరి. ఆ బ్రాహ్మణుడట్లొనర్చ స్వామివారు చల్లిన మంత్ర భస్మము క్షాళితమయ్యెను. వాడి జ్ఞానము లోపించెను. అప్పుడు వాడు భార్యాపుత్రులయందు మమకారము కలవాడయి పుత్రుల నెత్తుకొని ఇదేమిటి ఇంత భ్రమ ఏల కలిగెను. అని తాను చేసినదానికి వగచుచు భార్యాపుత్రులతో కలిసి సుఖముగ నింటికి పోయెను.

అచ్చట నున్న వారందరు ఆ చిత్రము చూచి కడు విస్మితులయిరి. అప్పుడు త్రివిక్రమభారతీస్వామి గురుమూర్తి చరణములకు సమస్కరించి జాతిహీనున కింత జ్ఞానమెట్లు కలిగెను ? స్నానము చేయించినంత మాత్రమున

జ్ఞానహీనుడెట్లయ్యెను ? ఈ సంశయమును తీర్పుడని వేడుకొన గురుమూర్తి నేను భస్మమును మంత్రించి అతనిమీద చల్లితిని, అందువలన అతనికి జ్ఞానోదయమయ్యెను. భస్మము క్షాళితముకాగా అజ్ఞానము నశించెను. భస్మము అంతమహిమకలది. కావుననే శివుడద్దానిని నిత్యము ప్రేమతో ధరించుచున్నాడు. అట్టి భస్మమునకు మహాత్ముల కరస్పర్శచే నత్యధిక ప్రభావము కలుగును. అని చెప్ప త్రివిక్రమభారతి స్వామివారిని గూర్చి భస్మముయొక్క మాహాత్మ్యమును సొంతముగానుపదేశింపుడని ప్రార్థించెను. స్వామివారు పై అధ్యాయమున భస్మమాహాత్మ్యమును తెలుపుదురు.

**ఇది గురుచరితమున ఇరువది ఎనిమిదవ అధ్యాయము సమాప్తము.**

**దిగంబరా దిగంబరా శ్రీపాదవల్లభ దిగంబరా శ్రీపాదవల్లభ దిగంబరా**

**శ్లో॥ త్రివిక్రమాయాహ కర్మగతిందత్తవిదా పునః।**
**విముక్తం పతితంచక్రే శ్రీదత్తశ్శరణం మమ ॥**

తా॥ స్వామివారు చల్లిన భస్మప్రభావముచే కలిగిన తాత్కాలిక జ్ఞానమును తిరిగి నీటితో అతనిని స్నానము చేయించుటకే లుప్తపఱచుట.

# శ్రీ గురు చరితము

## ఇరువది తొమ్మిదవ అధ్యాయము

**ఓమ్ అవధూత చింతనమ్ శ్రీ గురుదేవదత్త జయ ఓమ్**

**ఓం శ్రీదత్తాత్రేయాయ నమః ఓం శ్రీ గణాధిపతయే నమః**

గురుమూర్తి త్రివిక్రమభారతితో భస్మ మాహాత్మ్యమును ఈ క్రింది విధముగ చెప్పుచున్నారు.

త్రివిక్రమా! సావధానుడవయి వినుము. పూర్వము కృతయుగమున వామదేవుడను ఒక మహర్షి గలడు. అతడు గృహ దారవర్జితుడు, నిస్పృహుడు, బ్రహ్మవేత్తయు, జడలు ధరించి భస్మభూషిత సర్వాంగుడయి, వ్యాఘ్రచర్మ ధరుడయి భూమియందలి నానా క్షేత్రముల సంచరించుచు దైవవశమున క్రౌంచారణ్య మార్గమున పోవుచుండ అతని నొక మహాభయంకరమైన రాక్షసి చూచెను. చూచుటతోడనే హింసా స్వభావముగల ఆ రక్కసి ఆకలితో అతనిని భక్షింప నోరు తెరచుకొని పండ్లు పటపట కొఱకుచు సమీపించెను. వామ దేవుడు గొప్ప జ్ఞానియగుటచే ఉగ్రరూపమున ఆ బ్రహ్మరక్కసి వచ్చుచున్నను కొంచెమయినను భయపడక నిలుచుండెను. బ్రహ్మరక్కసి వచ్చి వామదేవుని పట్టుకొనెను. అప్పుడు వామదేవుని శరీరమందున్న కొంత భస్మము ఆ రక్కసి కంటుటచే దానికి పూర్వస్మృతి కలిగెను. దాని పాపమును నశించెను. సత్పురుషుల దర్శనమగుచో నెట్టివాడును తత్కాలమున పునీతుడు కాగలడు. ఏదిఅయిన ప్రయత్నముచే సాధించనగును, కాని సత్పురుషుల దర్శనభాగ్యము లభించుట కడు దుర్లభము. ఆ ఘోరమగు రాక్షసికి అట్టి మహాత్ముని స్పర్శమాత్రముచే, ఏనుగుల, గుఱ్ఱముల, మానవులగూడ భక్షించినను తరగని ఆకలి తత్కాలమున నశించెను. సముద్రమంతా త్రావినను తీరని దప్పికయు తీరిపోయెను, అందుతో పాటు దాని రోషము గూడ అర్ధక్షణమున నశించెను. అప్పుడా బ్రహ్మరాక్షసి మునిపాదములయందు పడి స్వామీ ఘోరసంసారమున పడియున్న నన్నుద్ధరింపుడు. మీ దర్శనభాగ్యముచే నా పాపరాసులన్నియు నశించెను. హేజగద్గురో ! నేను నేడు పాపవితుడనైతిని అనెను. అప్పుడు వామదేవులవారు ఆరక్కసితో నీవెవ్వడవు ? మనుష్య సంచారము లేని ఈ ఘోరరణ్యమున ఎందులకు సంచరించుచుంటివి. అని అడిగెను.

మునివాక్యములు విని బ్రహ్మరాక్షసి తన వృత్తాంతము నిట్లు చెప్పుచుండెను.
స్వామీ; మీకృపచే నిప్పుడు ఇంతవరకు పూర్వము నేననుభవించిన ఇరువదిఅయిదు జన్మలు స్పురణకు వచ్చెను. ఇప్పటికి ఇరువదిఅయిదు జన్మల క్రింద నేను దుర్జయుడనను పేరుతో యవన దేశమునకు రాజినయి ఉంటిని దురాచారుడనయి ప్రజలపీడించితిని. అనేక మందిని హింసించితిని. మదోన్మత్తుడనయి ఎందరో స్త్రీల వరించితిని. బలాత్కారముగగూడ ఎందరో స్త్రీలనుపహరించి భోగించితిని, రాజులజయించి వారి భార్యతలో వ్యభిచరించితిని. రూపవంతులయిన స్త్రీలను ద్రవ్యముతో వశపరచుకొంటిని ఒకరోజు భోగించిన స్త్రీని తిరిగి చూడక కారాగారమున నుంచెడివాడను. అవివాహితులేకాదు, సువాసినులేకాదు, రజస్వలలేకాదు, విధవలేకాదు ఇట్లు విధి నియమము లేక ఎంతో మందియో స్త్రీలను చెరిచితిని. నా భయమునకు ఆదేశమందలి బ్రాహ్మణులు భయపడి దేశాంతరముల పాలయిరి. ఎంతో మంది బ్రాహ్మణస్త్రీలను, క్షత్రియస్త్రీలను, శూద్ర స్త్రీలను, రజకస్త్రీలను, చండాలవనితలగూడ పాడుచేసితిని. ఇక వార వనితలసంగతి చెప్పజాలను. మద్యముత్రాగి మాంసము తినుచు ఉన్మత్తడనయి ఇటుల లెక్కలేని పాపముల సంపాదించిన నాకు క్షయరోగము వచ్చెను. శత్రురాజులు నా మీదకు దండెత్తివచ్చి నన్ను సంహరించి నారాజ్యమపహరించిరి. యమదూతలు నన్ను యలోకమునకు కొనిపోయిరి. పదివేల సంత్సరములు పితరులతో కూడ దారుణ నరకయాతనల ననుభవవించి తరువాత దేవతామానముతో వేలకొలది శిశ్నములుగల ఘోరమగు ప్రేతనయి దుర్గతి ననుభవించితిని. అటుపైన భూలోకమున వ్యాఘ్రమయితిని. తరువాత అజగరమయితిని. అయిదవ జన్మమున నక్కనయితిని. ఆరవజన్మమున ఊరపందినయితిని. ఏడవ జన్మమున కుక్కనయితిని. ఎనిమిదవ జన్మలో నక్కనయితిని. తొమ్మిదవ జన్మమున లేడిని, పదవజన్మమున కుందేలుని, పదకొండవ జన్మమున వానరమును, పన్నెండవ జన్మమున గ్రద్ధను, పదమూడవజన్మమున కప్పను, పద్నాలుగుకాకిని, పదిహేను ఎలుగుంటిని, పదహారు అడవికోడిని, పదిహేడు గ్రుడ్డిగాడిదను, పదునెమిది పిల్లిని, పంతొమ్మిది కప్పను, ఇరువది కాకిని, ఇరువదియొకటి చేపను, ఇరువది రెండు ఎలుకను, ఇరువదిమూడు గుడ్లబూగను, ఇరువదినాలుగు ఏనుగును, అయి పుట్టితిని. అట్టి నేను ఈ ఇరువది ఐదవ జన్మమున ఈ కీకారణ్యమున ఎంతో కాలమునుండి బ్రహ్మరాక్షసనయి తిరుగుచున్నాను. రాత్రి పగలు ఆకలి

దప్పులతో బాధపడుచు దుఃఖించుచున్నాను. మిమ్ములచూచి దుర్బుద్ధినయి భక్షించు నుద్ద్యేశముతో మీ మీదపడితిని. మీ స్పర్శమాత్రముననే నాకుజాతిస్మరణ కలిగెను. మీరు విశ్వకారకులు. ఘోరమగు సంసారయాతన నుండి నన్నుద్ధరింపుడు. మీమహాత్మ్యమును తెలుసుకొను సామర్థ్యము నాకు లేదు. నన్నుద్ధరించుటకుగాను తమ రిచ్చుటకు వచ్చినటులనాకు తోచుచున్నది అని ప్రార్థించెను.

అప్పుడు వామదేవుడు సంతసించి నీవు నన్ను స్పృశించినపుడు నా శరీరమందలి భస్మము నీకు అంటుట తటస్థించెను. అందుచే నీకింద జ్ఞానోదయమయ్యెను. భస్మమహిమ అపారము కాననే ఈశ్వరుడు భస్మను సర్వాంగములయందు ధరించును, భస్మ మహిమను శంకరుడే గుర్తెరుగును. భస్మమహిమ నీకు తెలియగలందులకు ఒక కథ చెప్పెద వినుము.

పూర్వము ద్రవిడదేశమున కర్మభ్రష్టుడయిన ఒక నీచబ్రాహ్మణుడు కలడు. వారు శూద్రస్త్రీరతుడయి ఉండుటచే బ్రాహ్మణులు, తల్లిదండ్రులు, దాయాదులు వానిని బహిష్కరించిరి. చౌర్యముచే ధనమార్జించుచు పరకాంతలతో వ్యభచరించుచుండెను. ఇట్లుండ ఒకనాడు ఒక శూద్రుడు ఇతనిని చంపి కొనప్రాణముతో నున్న నతని నూరిబయట ఒక గోతిలో పడవేసెను. అదే సమయమునకు అచ్చట సమీపమున నున్న ఒక భస్మరాశిలో దొర్లుచున్న ఒక కుక్క ఇతను మరణించెనని తలచి భక్షించగలందులకు వచ్చి ఇతని శరీరము మీద నెక్కెను. ఆకుక్క శరీరమందలి భస్మము ఇతడు మరణించు సమయమునకు వక్షఃస్థలమునకు లలాటు మందును, బుజములయందును పడెను. యమకింకరులు పాశములతో నితనిని యమలోకమునకు కొనిపోవచ్చిరి. అంతలో శివదూతలు విమానముతో వచ్చి యమదూతలతో వీడు భస్మభూషితండుడయి కైలాసనివాసమునకు యోగ్యుడయి యుండ నితనిని మీరెట్లు విచారణలేక యమలోకమునకు కొనిపోవవచ్చితిరి, అని కోపముతో వారల హింసించ యమదూతలు చేయునదిలేక యమలోకమునకు పోయి యమునితో నో యమధర్మరాజా! ఇక ముందు మాగతియేమి ? మీ యజ్ఞ ననుసరించి మేము ఒక పాపాత్ముని తీసికొనిరాగలందులకు భూలోకమునకు పోతిమి. శివదూతలు పరుగెత్తుకొనివచ్చి మమ్ముల కొట్టి తరిమి వేసిరి. ఇక మీద భూలోకమున కెట్లు పోగలము. అని చెప్ప యముడు సత్వరముగా శివదూతలున్న చోటికి వచ్చి మీరు మాకింకరుల కొట్టుటకు కారణమేమి ?

గంగలో ఇసుక రేణువులవలె అనేక పాపములతో కూడిన ఇతడు శివపురవాసమున కెట్లర్హుడు ? అని కోపముతో పలికెను. యముని వాక్యమును విని శివదూతలు ఇటుచూడుము అనిరి.

ఇతనిలలాటమున, వక్షఃస్థలమున, బాహుమూలమున, మణిబంధము లయందును భస్మము ప్రకాశించుచుండ మీ దూతలెట్లు ఇతనిని కొనిపోవవచ్చిరి? శివుడు భస్మాంకితులయిన మానవులకు శాశ్వత కైలాసమిచ్చెద, అట్టివారిని మీరు కైలాసమునకు తప్పక కొనిరండని మాకాజ్ఞ ఇచ్చెను. మేము దయతో మీ దూతలను ప్రాణములతో వదిలిమితి. ఇక మీ దూతలకు భస్మదిగ్ధగాత్రుల జోలికి పోవద్దని బుద్ధి చెప్పుము. భస్మము ధరించువారికి ఎట్టి దోషములు నుండవు. అట్టివారు స్వర్గమునకే అర్హులు. అని శివదూతలు చెప్పిరి. అప్పుడు యముడు శివదూతలకు ప్రదక్షిణ నమస్కారము లొనర్చి తన కింకరులతో కలసి యమలోకమునకు వచ్చి వారలతో ఓ దూతలారా ! వినుడు. ఇకమీదట భస్మము ధరించువారి జోలికి పోకుడు. అట్టివారు యమలోకమునకు అర్హులుకారు. భస్మత్రిపుండ్రముల రుద్రాక్షమాలల నెవ్వరు ధరింతురో అట్టివారిని దూరముగ త్యజించుడు. అని ఆజ్ఞాపించెను.

వామదేవుడు బ్రహ్మరాక్షసితో భస్మమహిమ వింటివి గదా ! నేను ఆదరముతో నిత్యము భస్మముధరింతును. ఈశ్వరునకు ప్రియమయిన భస్మమును ఎవ్వరు ధరింపరు ? భస్మమాహాత్మ్యమును పూర్తిగ వర్ణించ నెవ్వరితము ? అన చెప్ప నా బ్రహ్మరాక్షసి వామదేవునితో మహాత్మా నన్నుద్ధరించుడు. నేను ఇరువదిఅయిదు జన్మల క్రిందట మహాపాపినయి నుండియు నీరులేనిచోట బావులు త్రవ్వించిరి. బ్రాహ్మణునకు వృత్తి కల్పించితిని. ఆ పుణ్యప్రభావముచేతనే నేటికి మీదర్శనమయ్యెను. ఆ జన్మమున నేను మరణించి యమదూతలు నన్ను తీసికొనిపోయి యముని వద్ద నుంచిరి. యముడు చిత్రగుప్తుని పిలిచి నాపుణ్య పాపముల విచారించెను. అప్పుడు చిత్రగుప్తుడు నా పాపముల చెప్పి నేనాజన్మ యందొనర్చిన ఆ కొలదిపుణ్యమును పేర్కొనెను. అప్పుడు యమధర్మరాజు నాతో నీవు ఇరువదిఅయిదు జన్మముల పాపఫల మనుభవింతువు, ఇరువదిఅయిదవ జన్మమున నీ పుణ్యము ఫలించునని చెప్పెను. కాననే నేడు మీపాదముల దర్శించు పుణ్యము నాకు లభించెను. స్వామీ! వామదేవా! నన్నుద్ధరించుడు. భస్మమున నేమో అది యెట్లు తయారు చేయవలయునో దానినెట్లు ధరించవలయునో విస్తరముగ సెలవిండని ప్రార్థించ వామదేవుడు

బ్రహ్మరాక్షసితో నిట్లు చెప్పుచుండెను.

పూర్వము మందరపర్వతమున శివుడు పార్వతీసమేతుడై సభచేసెను, ప్రమథగణములు త్రింశత్కోటిదేవతలు, అష్ట దిక్పాలకులు శివుని సేవించుచుండిరి. గంధర్వులు, ఖేచరులు, పన్నగులు, విద్యాధరులు, కింపురుషులు, సిద్ధులు, సాధ్యులు, మొదలగు వారందరాసభకు వచ్చిరి. వశిష్ఠుడు, నారదుడు, బృహస్పతి, పితృగణములు మొదలగు గలవారును ఆ సభకు వచ్చిరి. ఊర్వశి మొదలగు అప్సరసలు సప్త మాతృకలు చండిక మొదలగు శక్తులు ఈశ్వరుని సేవించుచుండిరి. మహాకాళుడు మహానీలుడు నందికేశ్వరుడు మణిభద్రుడు, వీరభద్రుడు మొదలగు వారు దండముల ధరించి శివుని సేవించుచుండిరి. భృంగిరిటుడు, భూతనాథుడు మొదలగు రుద్రగణములు శివుని పార్శ్వమున నుండిరి. కొందరు ఆయుధముల ధరించియు, కొందరు అస్త్రములు ధరించియు, నానావర్ణములు, నానారూపములతో ప్రథగణములు శివుని సేవించుచుండిరి. ఇట్టి గణములతో కూడుకొని శివుడు సింహాసనమున కూర్చుండెను. ఆ సింహాసనము ఏడు ప్రభలు కలదై యుండెను. మొదటి ప్రభ రత్నఖచితమయి ఎఱ్ఱని కాంతితో, రెండవది సువర్ణనిర్మితమయి పచ్చగను, మూడవ ప్రభ రత్నచిత్రితమయి నల్లని వర్ణముతో, నాల్గవది తెల్లని కమలములచే నలంకరింపబడియుండెను. అయిదవ ప్రభ ముత్యములు వైడూర్యములచే నలంకరింపబడి యుండెను. ఆరవ, ఏడవ ప్రభలుకూడ నానావిధములయిన రత్నములతో నిర్మింపబడి యుండెను. అట్టి సింహాసనమున కోటిసూర్యులతో సమానముగా ప్రకాశించు శివుడు కూర్చొనియుండెను. జడలను ధరించి కపాలమును చేతపూని, చంద్రుడు శిరోభూషణముగా గలవాడయి సర్పములనే కుండలములుగ చెవుల ధరించి, నల్లని కంఠముతో నాగాభరణుడయి శివుడు ప్రకాశించుచుండెను. పెద్దపులి చర్మమును ధరించి కర్పూరముతో సమానమగు తెల్లని ఆకారము కలవాడయి భక్తవత్సలుడగు పశుపతి సింహాసనమున కూర్చొని యుండెను. అట్టి శివునకు సర్వాంగముల యందును సర్పములే భూషణముగా శోభిల్లుచుండును. పదిభుజములు కలవాడయి త్రిశూలము నొక చేతను, డమరు నొకచేతను, ఖడ్గము నొకచేతను, పానపాత్రము నొకచేతను మృగము నొకచేతను, ఖట్వాంగము నొకచేతను, పరశువు నొకచేతను, బాణము నొకచేతను, అంకుశము నొకచేతను ధరించి యుండెను.

శంకరునకు అయిదుముఖములు కలవు. ఒక ముఖము పాల మీది

నురుగువలె, కళంకములేని చంద్రునివలె భస్మ భూషితమయి ప్రకాశించుచుండెను. ఇది పడమటిముఖము రెండవముఖము ప్రాతఃకాల సూర్యునివలె, దానిమ్మపుష్పము వలె ప్రకాశించును. ఇది ఉత్తరపు ముఖము, మూడవ ముఖము అర్ధచంద్రుడు భూషణముగా గలిగి జడల ధరించి ప్రకాశించు చుండెను. ఇది తూర్పుముఖము, నాల్గవ ముఖము కోరలతో భయంకరమయి నల్లని వర్ణము కలదయి ప్రకాశించును. ఇది దక్షిణముఖము. ఈ ముఖమునుండి అగ్ని జ్వాలలు వచ్చుచుండును. అయిదవ ముఖము వ్యక్తావ్యక్తమగను, సాకారనిరాకారముగను సగుణనిర్గుణముగను ఉండును. ఇది ఇతరులకు అలక్ష్యమగును భక్తులకు మాత్రవే కనపడుచుండును. ఇట్లు అయిదుముఖములతో ప్రకాశించు సర్వేశ్వరుడు పార్వతీ సమేతుడు సింహాసనమున కూర్చొనియుండెను. పార్వతీమాత సౌందర్యము వర్ణనాతీతము. ఆభరణములు లేకనే ప్రకాశించు తల్లి నానాలంకార శోభితురాలయి యుండెను. ముక్తాహారములు రత్నఖచిత కిరీటము ధరించి, కంఠమును పుష్పహారములతో ప్రకాశించుచుండెను. అందలి మకరందము నాస్వాదించుటకయి ఝుంకారములు చేయుచు పరిసరప్రదేశముల తుమ్మెదలు గుంపులు గుంపులుగా తిరుగుచుండెను. అట్టి జగన్మాత యొుక్క నాసికయందు ముక్కెర జాజ్వల్యమానముగ ప్రకాశించు చుండెను. చక్కనిఅధరోష్ఠము రత్నముల వరుసవలె దంతములు కలిగిన పరమేశ్వరి దానిమ్మ పుష్పమువంటి వస్త్రము ధరించి పచ్చని రవికను తొడుగుకొని యుండెను. రత్నఖచితమైన నూపురములు పాదములందును, రత్నకంకణములు మణిబంధముల యందును గలిగి ఇటుల సర్వాలంకారభూషితురాలగు జగన్మాతయైన శంభుని కాంత యొుక్క సౌందర్యము నెవ్వరు వర్ణించసమర్థులు ఇట్లు సభతీర్చియుండ సనత్కుమారులవారు లేచి శివుని సమీపించి సాష్టాంగముగ నమస్కరించి వినయముతో ఇట్లు ప్రశ్నించిరి.

శంభో! జయజయ ఉమాకాంతా! నీవు విశ్వకర్తవు. భక్తులకు ధర్మార్థకామ మోక్షముల నొసంగుదాతవు. మీవలన ఇదివరకు సమస్త ధర్మముల విని యుంటిని. ఇవి

అన్నియు బహుప్రయాససాధ్యములు. కాన తమరు దయ యుంచి సంసారతారకము సర్వపాపక్షయకరము స్వల్పసాధ్యము బహుఫలప్రదము అయిన తరణోపాయము ఏదిఅయిన ఉన్న సెలవిండు, మర్త్యులకు శుభకరమును, హితకరమునైన పరమ ధర్మమును తమవలన వినగోరితినని



ప్రశ్నించ ఈశ్వరుడు సభలోనివారందరు వినుచుండనిట్లు చెప్పెను.

ఋషులారా ! వినుడు. భస్మధారణము వేదశాస్త్ర సమ్మతమయిన పరమధర్మము. అందుచే శీఘ్రముగ అనంత పుణ్యము లభించును. అని చెప్ప సనత్కుమారుడు స్వామీ! భస్మమెట్లు తయారు చేయవలయును ? ఎట్లు ధరించవలెను. ఆ విధానము దయతో సెలవిండని ప్రార్థించ శివుడిట్లు చెప్పెను.

గోమయముతో భస్మముతయారు చేయవలయును అగ్నియే భస్మమునకు దేవత భస్మవిధానము జాబాలోపనిషత్తు నందు విపులముగ చెప్పబడినది.

పూర్వము దేవతలచే జరుపబడిన యజ్ఞగుండములందరి భస్మము బహుపుణ్యప్రదము. వేదమంత్రములతో ఆ భస్మమును తీసికొని అందు నుదకముంచి దానిని అంగుష్ఠముతో కలిపి మూడు రేఖలుగ ముఖమున కనుబొమ్మలతో సమానముగ ధరించవలయును. మొదలు మధ్యమ అనామికలతో రెండు రేఖల దిద్ది అంగుష్టముతో ఆ రెండు రేఖల మధ్యనుండి మధ్యరేఖ భస్మముతో దిద్వలయును. ఇట్లు చేయుటయే త్రిపుండ్రము అనబడును. ఇందులో మూడు రేఖలును వరుసగా అకార ఉకార మకారములగను, గార్హపత్య దక్షిణాగ్ని ఆహవనీయములను త్రేతాగ్నులుగను, సత్వరజస్తమో గుణములుగను, ఋగ్వే యజుర్వేద సామవేదములుగను, బ్రహ్మ విష్ణు మహేశ్వరులుగను భావించవలయును. ముక్తి కాముడయి భస్మమమును ధరించువానికి

జన్మరాహిత్యము కాగలదు. సకాముడు పూర్ణకాముడగును. బ్రహ్మచారులు, గృహస్థులు, వానప్రస్థులు అందరును భస్మము ధరించదగును, ఉపపాతకములు మహాపాతకములు భస్మము ధరించుటచే నశించును. స్త్రీహత్య వీరహత్య, ఆత్మహత్య మొదలగు పాపములుకూడను భస్మధారణముచే నశించును, విధి పూర్వకముగ సమంత్రకముగ శ్రద్ధాభక్తులతో భస్మము ధరించవలయును. భస్మము యొక్క మహిమ యపారము. విధి తెలియనివారు శ్రద్ధాభక్తులతో ధరించినను ముక్తి నొందగలరు. పరద్రవ్యాపహారము, పరస్త్రీ సాంగత్యము, పరనింద మొదలగు పాపములుగూడ భస్మధారణచే పోవును, ఇతరుల పీడించుట, అన్యుల క్షేత్రారాములను భంగమొనర్చుట, అసత్యమాడుట, చాడీలు చెప్పుట, వేద విక్రయము, కూటసాక్ష్యము. మొదలగు పాతకములు గూడ నశించును. నీచప్రతిగ్రహములవలన వచ్చిన పాపము పోవును. కన్యావిక్రయము, మాంస, గోరస, లవణాదుల విక్రయించిన పాపము పశ్చాత్తాప పూర్వకముగ భస్మము ధరించుటనే నశించును.

పునీతలయినవారును భస్మమును ధరించుట శ్రేయోధాయకము, భస్మము, భస్మము ఎన్నిపపాములనో నశింపచేయనుగాని, శివనిందయు, చేయువారి పాపముల నశింపచేయదు. కంఠమున రుద్రాక్షమాలయము, ఫాలమున భస్మముగల వాడు లోక పూజ్యుడగును. భస్మమును ధరించుటచే సర్వతీర్థములందు స్నానము చేసిన ఫలము వచ్చును. అట్టివాని పితరులు గూడ తరించెదరు. భస్మమును ధరించువారు ఇహలోకమున సుఖముగ దీర్ఘాయుష్మంతులయి జీవింతురు. భస్మమును ధరించుటచే సమస్త వ్యాధులు నశించును. అట్టివాడు దేహాంతమున విమానము నధిష్టించి స్వర్గమునకుపోవును. స్వర్గమున కొంతకాలమునుండి అచ్చటనుండి బ్రహ్మలోకమునకు వెళ్లి అచ్చటి భోగములననుభవించి అచ్చటినుండి వైకుంఠమునకు వెళ్లి అచ్చట మూడు బ్రహ్మకల్పములుండి అచటినుండి కైలాసమునకు వెళ్ళి అచ్చట శివునితో సాయుజ్యము పొందును.

కాన నో సనత్కుమారా ! సర్వోపనిషత్తులయొక్క సారము నీకు చెప్పితివి. కాన మీరందరు భస్మమును ధరించి ధన్యులు కండని చెప్పెను. అప్పుడు శివుని యాజ్ఞను శిరసావహించి సనత్కుమారుడు మొదలగు వారు వారివారి స్థానములకు వెళ్ళిరి.

అని వామదేవుడు బ్రహ్మ రాక్షసితో భస్మ మహిమను నీకు చెప్పితిని. నా

శరీరమందలి భస్మము కొంచెమంటిన మాత్రముననే నీకింత జ్ఞానము కలిగెను అని చెప్పుచు కొంత భస్మమును చేతతీసికొని అభిమంత్రించి ఆముని బ్రహ్మరాక్షసికివ్వగా నదియు భక్తితో తన శిరమున త్రిపుండ్రవిధానముగా భస్మమును ధరించెను. వెంటనే దాని పిశాచ శరీరము పోయెను. దివ్యదేహధారి అయ్యెను. అప్పుడది బ్రహ్మానందముతో వామదేవుడు ప్రదక్షిణ నమస్కారము లొనర్చి, ఇంతలో ఆకాశము నుండి సూర్యునివలె ప్రకాశించెడి విమానము రాగా దాని నధివసించి స్వర్గమును చూరగొనెను.

వామదేవుని వలన నట్టి నీచకార్యమునకు నిట్టి సద్గతి లభించెను. వామదేవుడు కేవలము శివుని అవతారము. జగదుద్ధరణకు గాను మానవుడయి అవతరించెను. భస్మ మహాత్మ్యము వర్ణనాతీతము. అట్టి భస్మము మహాత్ములహస్తములనుండి లభించిన దాని మహిమ మరీ వర్ణనాతీతము మంత్రములెన్నియో కలవు గాని గురూపదేశము ద్వారా లభించిన మంత్రమే సాధకునకు ఫలప్రదమగును. కానవేదశాస్త్రములు “నాస్తితత్వం – గురోఃపరం” అని చెప్పెను. ఈ విషయమంతయు సూతుడు శౌనకాదిమహర్షులకు చెప్పెనని గురుమూర్తి తన శిష్యుడగు త్రివిక్రమ భారతీస్వామి వారికి చెప్పిరి. త్రివిక్రమభారతియు స్వామివారివలన భస్మమహిమను విని వారికి నమస్కరించి ఆజ్ఞగైకొని స్వస్థానమునకు వెళ్లెనని సిద్ధముని నామధారకునితో చెప్పెను.

**ఇది గురుచరితమందలి ఇరువది తొమ్మిదవ అధ్యాయము సమాప్తము.**

**దిగంబరా దిగంబరా శ్రీపాదవల్లభ దిగంబరా**

# శ్రీ గురు చరితము

## ముప్పదియవ అధ్యాయము

**ఓమ్ అవధూత చింతనం శ్రీగురుదేవదత్త జయ ఓమ్**

**ఓం శ్రీదత్తాత్రేయాయ నమః ఓం శ్రీ గణాధిపతయే నమః**

**ఓం శ్రీ గురుభ్యోనమః**

నామధారకుడు సిద్ధముని పాదములకు నమస్కరించి స్వామీ యోగీశ్వరా! జయ జయ. మీకృపవలన అవిద్యా సాగరమున మునుగుచున్న నేనుద్ధరింపబడితిని. మీసాంగత్యము వలన పరమార్థము లభించెను. మీరు విశ్వపాలకులు, గురు చరిత్ర సుధారసమును నాకు పానము చేయించుచున్నారు. పతితుని ముఖమునుండి చతుర్వేదముల పఠింపచేయుటయు, త్రివిక్రమభారతికి భస్మమాహాత్మ్యమును బోధించుటయు మీవలన నింటిని. ఆ పై కథావృత్తాంతమును దయతో సెలవిండని ప్రార్థించెను. అప్పుడు సిద్ధముని సంతోషముతో నామధారకుని ఆలింగనమొనర్చి శిష్యాగ్రణీః నీవు కడుధన్యుడవు. కాననే గురుకృపకు పాత్రుడవయితివి. నీగురు భక్తికి సంతసించితిని. పైకథా వృత్తాంతమును చెప్పెద వినుము.

గురుమూర్తి మహిమ సర్వత్ర విఖ్యాతమయ్యెను. మందుడనమున నేను త్రిమూర్త్యవతారమయిన స్వామివారి మహిమను పూర్తిగవర్ణించ నెంత సమర్థుడను ? వారు మానవ దేహము ధరించి పావనమగు తమ చరిత్రమును లోకమునకు ప్రదర్శించిరి. అనేకమంది భక్తులు వారి ఖ్యాతి విని దూరము నుండి వచ్చి వారిని సేవించి వారివలన అభీష్టసిద్ధి నొందు చుండిరి. దీనులు శ్రీమంతులగుచుండిరి. వంధ్యలు పుత్రవంతులయిరి. అంధులు చక్షుష్మంతులయిరి. అపస్మారాదిరోగములు వారి దర్శనమాత్రముననే ఇనుము బంగారమగునటుల వారి కృపా దృష్టిచే భక్తుల సర్వాభీష్టములు సిద్ధించెననుటలో చిత్రమేమియులేదు. ఇక నచ్చట జరిగిన చిత్రమయిన గురులీలను చెప్పెద సావధానముగ వినుము.

మాహూరను పట్టణమున గోపీనాథుడను పేరుకల ఒక ధనికుడయిన బ్రాహ్మణుడు కలడు. అతనికి కొంతమంది పుత్రులు పుట్టి మరణించిరి. అప్పుడు దంపతులు దత్తాత్రేయుని ఆరాధించగా నొక పుత్రుడు కలిగెను. వానిని తల్లిదండ్రులు సంతోషముతో పోషించిరి. అయిదు సంవత్సరములు రాగా ఉ

పనయనమొనర్చిరి. పన్నెండవ సంవత్సరమున అతనికి వివాహము చేసిరి. తల్లిదండ్రులు తమ పుత్రుని, కోడలిని చూచుకొని సంతోషపరవశులయిరి. ఆ నూతన దంపతులు రతీమన్మథులవలె అన్యోన్యము అనురూపము గలవారయి సమవయస్కులయి పరస్పర ప్రేమతో శోభించుచుండిరి. ఇట్లు కొంతకాలము సుఖముగ గడిచెను. దంపతులు పరస్పర విరహమును సహించక అన్యోన్యప్రేమతో సుఖముగ కాలము గడుపుచుండ దైవవశమున ఆ బాలుడు రోగగ్రస్తుడయ్యెను. తల్లిదండ్రులు ధనికులగుటచే అనేక చికిత్సల చేయించిరి. కాని నిష్ప్రయోజనమయ్యెను. అన్నమునందును రుచి తగ్గెను. అతని భార్యయు పతివ్రత కావున భర్త ఎంత భుజించునో తానును అంతమాత్రమే తినుచుండెను. ఇట్లు మూడు సంవత్సరములు గడచెను. వ్యాధి దినదినమునకు ప్రబలమగుచుండెను.

భర్త ఎటుల క్షీణించుచుండెనో అట్లే అతని భార్యయు భర్త పాదోదకమునే త్రాగుచు క్షీణించుచుండెను. బంధువులు నివారించినను వారి మాటలు లెక్కచేయకుండెను. ఆభరణముల త్యజించి భర్తనే ప్రాణముగ సేవించుచుండెను. ఎన్నియో జపముల హోమముల చేయించిరి. కాని ప్రయోజనము లేకపోయెను. శరీరమున దుర్గంధము వ్యాపించెను. వైద్యులు చికిత్సకు వచ్చుట మానిరి. జ్యోతిష్కులు నిరాశగ చెప్పిరి. వైద్యులనడుగ ఈరోగము ముదిరినది. భగవంతునికి తప్ప మానవమాత్రులకు దీనిని నయముచేయ సాధ్యము కాదనిరి. వైద్యుల మాటలు విని ఆ బాలుని తల్లిదండ్రులు స్వామీ! నిన్ను ఆరాధించగా ఈ పుత్రుడు మాకు నిధి వలె లభించెను. సంతోషపడితిమి. ఈ బాలుని నీవు రక్షించనిచో మావంశము నిర్వంశమగును. మేము ప్రాణముల త్యజించెదము అని పరిపరివిధముల దుఃఖించుచుండ ఆ రోగగ్రస్తుడగు బ్రాహ్మణ బాలుడు తల్లిదండ్రుల నాలింగనమొనర్చి నా కొరకు దుఃఖించి ఏమి ప్రయోజనము ? జన్మాంతరము ఎంత ఋణము మీ వద్ద తీసికొంటినో అది తీరువరకే మీకును నాకును సంబంధము. అని చెప్ప మహా దుఃఖముతో తల్లిదండ్రులు బాలుని మీద పడి ఏడ్చుచు నాయనా ! మా ఆశ నిరాశ చేసి మమ్ముల దుఃఖ సముద్రమున ముంచిపోవుట న్యాయమా ? వార్ధక్యమున మమ్ము రక్షించు వారెవరు ? అని యనగా బాలుడు సర్వము ఈశ్వరాధీనమయి యుండును. మనుష్య ప్రయత్నము ఎందులకు కొరగాదు. తల్లివలన ఒక ఘడియ త్రాగిన పాల ఋణమును కూడ కుమారుడు తగిన ప్రత్యుపకార మొనర్చియు

తీర్చుకొనజాలడు. మీకు కష్టముల నిచ్చుటకుగాను నేను మీగర్భమున జన్మించితినేగాని నావలన కొంచమయినను సుఖమును పొందరయితిరి. నేనేమి చేయుదును ? అని తల్లిదండ్రుల నూరడించి, తన భార్యతో ప్రాణేశ్వరీ ! నా నిమిత్తము వ్యర్థముగా నింత కష్టపడుచున్నావు. నాజీవిత దినములు పూర్తి అయినవి. నీకు జన్మాంతరమున నేను వైరినయియుండవచ్చు కాననే ఈ జన్మమున నీకింత కష్టము కలిగించుచుంటిని. నా జీవితానంతరము నీవు మాయింటనే యుంటివేని మా తల్లిదండ్రులే నిన్ను పుత్రునిగా భావించి కాపాడగలరు. ఇచ్చట నుండుట కష్టమని తోచినచో మీ పుట్టి నింటిని పొమ్ము దురదృష్టవంతుడనగు నన్ను వివాహమాడుటచే చక్కని నీ సౌందర్యము, సౌభాగ్యము నశించెను. అని చెప్ప ప్రతి వాక్యములు విని ఆ పతివ్రత మూర్ఛిల్లి కొంతసేపటికి తేరుకొని దుఃఖముతో భర్తపాదముల తన శిరముంచి ఇట్లనుచున్నది. స్వామీ! ప్రాణరక్షకా ! నేను త్యాగార్హు రాలను కాను. స్త్రీలకు భర్తయే గతి. మీ దేహమెచ్చట నుండునో నా శరీరము అక్కడనే యుండును. మిమ్ముల వదలి నేనుండను. ఇందెట్టి సందేహము లేదు. అని అనెను. ఆ దంపతుల వాక్యములు విని తల్లిదండ్రులు అట్లే నేలమీద పడి దుఃఖించుచుండిరి. అప్పుడు సావిత్రయను నా పతివ్రత తన యత్త మామలతో నిటుల చెప్పుచున్నది.

మీరు చింతించకుడు. నా భర్త జీవించగలడు. నా ప్రార్థన నంగీకరించుడు. నేనొక క్షేత్రమునకు పోదలచితిని. నా భర్తతో సహా నన్ను అచ్చటకు పంపుడు, లోకులు గంధర్వ నగరమున నరసింహసరస్వతి యను పేరుతో దత్తాత్రేయుల వారే అవతరించి యున్నారనియు, వారి మహిమ అపారమనియు చెప్పుచున్నారు. నేను నా భర్త నక్కడకుతీసికొని పోయెద వారి దర్శనమాత్రముననే నా భర్త కారోగ్యము సిద్ధించగలదు. అని అత్తమామల ప్రారి&ంచవారందుల కంగీకరించిరి. రోగియగు నాకుమారుని ఒక ఆందోళికయందు పరుండబెట్టి కొద్ది పరివారముతో ఆమె వెంట పంపిరి. ఆమె భర్తను తీసికొని పోవుచు అత్తమామలతో మీరు స్థిరముగనిర్భయముగ నుండుడు. భగవంతుడు నా ప్రాణప్రియుని రక్షించును. అని ధైర్యముచెప్పి వారలకు నమస్కరించవారలు సౌభాగ్యవతివికమ్ము. ఈ బాలుడు చిరంజీవి యగుగాక అని ఆశీర్వదించి సాగనంపిరి.

హా! ప్రాణనాథా! నా గతి యిట్లాయెనా ? పూజకొరకు దేవాలయమునకు పోవ ఆ దేవాలయము కూలి అతడు చచ్చెననుటుల. ఒకడు ఎండలో డస్సి

ఒక వృక్షచ్ఛాయ నాశ్రయింప నా వృక్షము విరిగి అతడు మరణించి నటుల దప్పి తీర్చుకొనుటకు కొలనులో నడుగిడ నందొక మొసలి వానినే భక్షించి నటుల నా స్థితి సంభవించెను. ఎంత దురదృష్టవంతురాలను. పరమ పాపిని, పతి ఘాతకురాలను. అత్త మామలగూడ విడచి యింత దూరమువచ్చితి. ఏమిచేయగలను అని దుఃఖించుచుండ నగరవాసులందరు అచ్చటకు వచ్చి ఆమెను ఓదార్చిరి. అచ్చట ముత్తైదువలు ఆమెను సమీపించి అమ్మాదుఃఖించి ఏమిప్రయోజనము ? కర్మను తప్పించుకొనగలవారెవ్వరు ? అని బోధించిరి. ఇట్లెంతమంది చెప్పినను ఆమె భర్తయొక్క గుణముల స్మరించుచు ఓ సోదరసోదరీమణులారా ? నేనేమి చెప్పదు ? ఇచ్చట స్వామివారు గలరనియు, వారి దర్శనముచే నా భర్తకు ఆరోగ్యము చేకూరునని నమ్మి ఇంత దూరము నా భర్తను తీసికొని వచ్చితిని. ఇప్పుడు నాకెవ్వరు శరణు. నా ప్రాణేశ్వరుని వదలి నేనెట్లు జీవించగలను. నేను బాల్యము నుండియు గౌరీశంకరుల పూజించితిని. వివాహసమయమున సుమంగళీత్వము కొరకు గౌరీపూజ యొనర్చితిని. ఎవ్వరేమి వ్రతము చెప్పిన దానిని స్థిరసౌభాగ్యము నుద్దేశించి చేసితిని. అంతయు వ్యర్థమయ్యెను. నాకంఠ సూత్రము అపహరింపబడెను. గౌరమ్మవారికి నా మీద ఆగ్రహము వచ్చెను. నా పుణ్యమంతయు నీటగలిసెను. ఇక నేనెక్కడకు పోవుదును ? నా భర్త అందరితో సమానుడుకాదు. నా భర్తయే నాకు ప్రాణము. నేనేమిచేయుదునని భర్తముఖము చూచుచు పరిపరివిధముల దుఃఖించుచుండెను.

భర్త శవముమీదపడి ఏడ్చుచు జరిగినదినముల స్మరించుచు ఆహా ! ఎంతదురదృష్టవంతురాలను ! ప్రాణేశ్వరా ! నన్నెందులకు వదలి వెళ్లితిరి ! నన్ను పేక్షించుట ధర్మమా! నిన్ను చంపుటకు గాను నీతల్లిదండ్రులకు ఎడముగా ఇంతదూరము కొనివచ్చితి. దశరథుడు శ్రావణుడను మునిపుత్రుని సంహరించి తల్లిదండ్రులకు దుఃకము కలుగ జేసినటుల నేనును అట్లొనర్చితిని. సువార్త విని మీ తల్లిదండ్రులు ప్రాణత్యాగ మొనర్తురు. ఈ విధమున ముగ్గురి ప్రాణముల హరించిన మహాపాపినగుచున్నాను. లోకులందరు నన్ను పతిఘాతినిగా చెప్పుదురు. నేను నీకు భార్యనుకాను. తీక్ష్ణమయిన కత్తివలె నీ ప్రాణ మపహరించితిని. తల్లిదండ్రులు నీ మరణసమయమున దగ్గరనున్నచో ఇంత దుఃఖముండదు. అందుకు నేను విఘ్న మొనర్చితిని. నేనెక్కడకు పోదును. ఎంత దుదృష్టవంతురాలను. నిన్ను వదిలి వేరు శయ్యయందు పరుండి ఎరుగను.

ఈ విషయములను స్మరించిన నాగుండె పలుగుచున్నది. ఇక నేనెట్లు జీవించగలను. ప్రపంచములో బాలవిధవఅను జనాపవాద మేరీతి భరింపగలను. కేశవపనమొనర్చుకొని నేనెటుల నుండగలను. నీ ప్రేమను ఆధారముగ చూచుకొని నా తల్లిదండ్రులు ఎన్నిపర్యాయములు నన్ను పిలువవచ్చినను నేను వెళ్ళనయితిని. మీ సుఖమునకు ఉపేక్ష కలుగునని నాతల్లిదండ్రులగూడ త్యజించితిని. ఛత్రమువలె రక్షకులై మీరుండ నేను లోకమున మాన్యత నొందితిని. ఇప్పుడు నిందాస్పదురాలనయి నేనెటుల జీవింతును ? అత్తమామల ముఖ మెట్లు చూడగలను. నన్ను చూచుటతోడనే వారుమరణింతురు. గృహమరణ్యమగును. నిన్ను ఆరోగ్యము కొరకు తీసికొనివచ్చి నీ ప్రాణము తీసిన రాక్షసినయితిని. అని నానా విధముల దుఃకించుచుండెను. ఆ సమయమునకు ఒక సిద్ధపరుషుడు భస్మరుద్రాక్షభూషితుడయి త్రిశూలమును హస్తమునందు పూని అచ్చటకు వచ్చి ఆమెతో నిట్లనుచున్నారు.



మూర్ఖురాలా ! ఎందుకు దుఃఖించెందవు. లాటమునందు లిఖితమయినదానిని ఎవరయిన తప్పింపగలరా ! ఎవరి ఆర్జితమును వారు తప్పక అనుభవించవలసియే యుండును. ఎవరికర్మ వారివెంటనే నడచుచుండును. ఎనిమిది దినముల దుఃఖించినను పోయిన ప్రాణములు

రాగలవా ? ఎవరు ప్రపంచమున చిరకాలము జీవించెదరు ? మృత్యువునకు వశము కాని వారెవ్వరో చెప్పుము నా భర్త నా భర్త యని దుఃఖించుచున్నావు. భర్త ఎక్కడనుండి వచ్చెను. నీవెక్కడనుండి వచ్చితివి నదియందు కట్టెలకువలె, వృక్షమునందు పక్షులకువలె ఒక సమయ మునందున సంయోగము, మరుసటి సమయమున వియోగము కలుగచుండును. చచ్చువాడెవడు ? పుట్టువాడెవడు? నీటియందు బుడగలవలె కర్మయోగమున పంచభూత సమ్మేళనముతో శరీరము లేర్పడుచుండును. తిరిగి నశించుచుండును. అస్థిరములగు దేహములందు పుత్రుడని, భర్తయని, భార్యయని భ్రమను కల్పించుకొని మయామోహములో పడి మానవులు మునిగి తేలుచుందురు. ఆత్మ స్వరూపమును తెలిసికొనలేక పంచభూతాత్మకమగు నశించు దేహమును భర్తయని తలచుచున్నావు. మాయయందలి సత్వ రజస్తమో గుణములు జీవునకు కర్మానుసారముగ సుఖదుఃఖముల నొసగుచుండును. ఇట్టి కర్మానుభవము ఋషులకు దేవతలకును తప్పదు. ఎంత వారును కాలమునకు బి కావలసినవే. మానవుల మాట చెప్పనేల. ఇట్టి సంసారము మాయాకల్పితమని గుర్తెరిగినవారు ఒకరు పుట్టిన సంతసించరు, మరొకరు మరణించిన దుఃఖించరు. దేహము ప్రారబ్ధము ననుసరించును. కొందరు గర్భముననే, మరికొందరు బాల్యమునను, యౌవనమున, వార్ధక్యమున మరికొందరు మృతినొందుదురు. పూర్వార్జిత పుణ్య పాపముల నను సరించియే సుఖదుఃఖములేమి, స్త్రీ పురుషుల సంయోగ వియోగములేవి. జరుగుచుండును.

ఒకవేళ పుణ్యకర్మల నాచరించి దుష్కర్మల నశింపజేయవచ్చునేమో గాని కాలము యొక్క బారినుండి తప్పించుకొనుటకు దేవ దానవులకు గూడ తరముగాదు. ఇదివరకు ఎన్నియో జన్మలు నీకును గడిచియుండును. నీ వెంతమందికో భార్యవయి యుండవచ్చును. ఈ శరీరము చర్మము, రక్తము, మాంసము, ఎముకలు, శ్లేష్మము, మలము, మూత్రములచే నిండి కడుజుగుప్సితమయి యుండును. ఇట్టి పాంచ భౌతిక దేహమువలననేమి ప్రయోజనము. జన్మ వచ్చినందుకు ప్రతివారును సంసార సాగరము నుండి తరించు మార్గమే చూచుకొనవలయును అని యిట్లు స్వామివారు ఆ పతివ్రతకు బోధించ ఆమెకు సగము దుఃఖము తగ్గెను. కొంచెము జ్ఞానముదయించెను. అప్పుడామె చేతులు జోడించి ఆ సాధువు యొక్క పాదములకు నమస్కరించి స్వామీ: నన్నుద్ధరింపుడు. తరించుమార్గము చూచుకొనుమని సెలవిచ్చితిరి.

అదెట్లోనాకు సెలవిండు. అట్లే ఆచరించెద. అని చెప్ప ఆ సాధువు ఆమె వాక్యములు విని ప్రసన్నుడయి స్త్రీలు తరించవలసిన విధానమును చెప్పబోవుచున్నారు. ఆ విషయము పై అధ్యాయమున రాగలడు.

**ఇది గురుచరితమున ముప్పదియవ అధ్యాయము సమాప్తము.**

**దిగంబరా దిగంబరా శ్రీపాదవల్లభ దిగంబరా**

**గీ॥ గురుని వద్ద జేరి కుటిలంబులును మాని**
**పటుతరముగ వారి పాదయుగము**
**నమ్మియుండు వాడు నదవరతంబాత్మ**
**పదము గాంచునంచు బలుకు శృతులు**

**– "గురువాక్సుధారసము"**

# శ్రీ గురు చరితము

## ముప్పది ఒకటవ అధ్యాయము

**ఓమ్ అవధూత చింతనమ్ శ్రీగురుదేవదత్త జయ ఓమ్**

**ఓం శ్రీ దత్తాత్రేయాయ నమః ఓం శ్రీ గణాధిపతయే నేమః**

**ఓం శ్రీ గురుభ్యోమనః**

యోగీశ్వరుడు ఆ పతివ్రతతో స్త్రీల ధర్మముల నిట్లు చెప్పుచున్నాడు. ఓ సాధ్వీమణీ నీకు సువాసినుల ధర్మము, విధవాస్త్రీల ధర్మము చెప్పుచున్నాను వినుము. స్కాంద పురాణమున కాశీఖండమందు స్త్రీల ధర్మములు విపులముగా చెప్పబడినవి ఆ విషయమునే చెప్పుచున్నాను. పూర్వము కాశీపట్టణమున అగస్త్య మహర్షి యుండెను. అతని భార్య లోపాముద్ర పతివ్రతారత్నము వారిద్దరు కాశీ పట్టణమునకు అలంకారముగ నుండిరి. వింధ్య పర్వతము అగస్త్యునకు శిష్యుడయి యుండెను. పర్వతములు దేవతారూపమున శిలారూపమున గూడ నుండును. ఒక సమయమున నారదుడు లోకముల పర్యటించుచు వింధ్యపర్వతము వద్దకు వచ్చి నీకు ఎందును కొదవలేదు. కాని ఎత్తులో మాత్రము మేరుపర్వతమునకు తీసిపోదువనెను. అప్పుడు వింధ్యపర్వతమునకు రోషము వచ్చి క్షణమున మేరు పర్వతముకన్న నెత్తుగ పెరుగసాగెను. సూర్య మండలమును దాటిస్వర్గమును సమీపించెను. అందుచే వింధ్య పర్వతమునకు దక్షిణ దిగ్భాగమున సూర్యరశ్మి లేకపోవుటచే ఆదేశమంతయు అంధకార బంధురమయ్యెను. యజ్ఞములు లోపించెను. అప్పుడు ఋషులందరు ఇంద్రుని తాను చేయునది లేక దేవతల వెంటనిడుకొని బ్రహ్మలోకమునకు వెళ్ళి వింధ్య పర్వతము పెరుగుదలను గూర్చి, దాని వలన లోకములకు గలిగిన అనర్థము గూర్చియు బ్రహ్మతో చెప్పెను. అప్పుడు బ్రహ్మదేవుడు ఆలోచించి దేవతలతో నిట్లనెను.

కాశీ పట్టణమున వింధ్య పర్వతమునకు గురువయిన అగస్త్య మహర్షి నివసించుచున్నారు. మీరు వారి వద్దకు వెళ్ళి దక్షిణదిక్కున తగిన సత్పురుషులు లేకున్నారు. మీరు దయతో అచ్చటివారల నుద్ధరించుటకుగాను అచ్చటకు వెళ్ళి నివసించుడని వారల ప్రార్థించుడు. అప్పుడు అగస్త్యుల వారు దక్షిణదిక్కుకు ప్రయాణము చేయుచు వింధ్యపర్వతమును సమీపించెదరు. అప్పుడు వింధ్యము శిరసా నమస్కరించును. అప్పుడు అగస్త్యుడు నీవికమీద లోకోపద్రవము చేయక

భూమిమీద పడియుండుమని ఆశీర్వదించును. మీ కార్యము నెరవేరును. అని బ్రహ్మ చెప్ప ఇంద్రుడు బృహస్పతి మొదలగు వారితో కలిసి కాశీపట్టణము వచ్చి అగస్త్యుల వారి ఆశ్రమము ప్రవేశించిరి. అగస్త్యుడు బృహస్పతి పురోహితుడుగా గల దేవతలను అర్ఘ్యపాద్యములిచ్చి పూజించెను. అప్పుడు బృహస్పతి దేవతలు వినుచుండ నిట్లు చెప్పెను.

ఈ లోపాముద్రాదేవితో సమమగు పతివ్రత ఎచ్చటను లేదు. అనసూయ, సావిత్రి, అరుంధతి, శతరూప, పార్వతి, మేనక, సునీతి, మొదలుగా గల జగద్విఖ్యాతి గాంచిన వతివ్రతలకన్న నీమె కడుమిన్న. సందర్భమువచ్చెను కాన ఓ దేవత లారా! మీకు వతివ్రతాలక్షణముల చెప్పెద వినుడు.

భర్త యొక్క ఉచ్ఛిష్ట భోజనము పతివ్రతకు ముఖ్యమగు ఆహారము. భర్త యొుక్కయుు, అతిథుుల యొుక్కయుు పూజ అహోరాత్రముులు చేయుచుండవలయును. భర్త ఆజ్ఞ లేనిదే దానధర్మములు చేయరాదు. భర్త నిలుచున్న తాను కూర్చుండరాదు. ఆయన కూర్చుండిన వారి ఆజ్ఞ ననుసరించి కూర్చుండవలయును. భర్త నవమానపరచరాదు. భర్తను హరి యను భావముతో సేవింపవలయును. శయన కాలమున అతని సుఖింపచేసి అతను నిద్రించిన తరువాత నిద్రించవలెను. భర్త యొక్క పేరు భార్య చెప్పరాదు. భార్య ధరించు కంచుకము భర్త యొక్క శరీరమున కంటరాదు. అట్లయినచో భర్త ఆయుష్యము క్షీణించును. భర్త నిద్ర నుండి లేచుటకు పూర్వమే తాను మేల్కొని గృహమును శుద్ధిపరచవలయును. శంకరుడను భావముతో అర్ఘ్యపాద్యములిచ్చి భర్తను పూజింపవలయును. అతను గ్రామాంతరము వెళ్లినపుడు భూషణముల ధరింపరాదు. భర్త కోపించిన క్షమింపుడని ప్రార్థింపవలయును. అతను కోపమున అనిన మాటల మనసున ఉంచరాదు. భర్త గ్రామాంతరము నుండి రాగా ఎన్ని కార్యములున్నను వాటిని త్యజించి భర్తను ఎదుర్కొనవలయును. భర్త ఆజ్ఞ ననుసరించియే భార్య నడచుకొనవలయును. పరగృహములకు పోరాదు అట్లొనర్చిన అనేక దోషములు వాటిల్లును. అవసరమైన కార్యముండి వెళ్ళినను వెంటనే రావలయును. స్వతంత్రముతో పరగృహముల చరించు స్త్రీ గుడ్లగూబ అయి జన్మించును.

ఈ లోపాముద్రయను పతివ్రత పరగృహమునకు పొరపాటుగనైన పోదు గాననే ఇంత ఖ్యాతి ఈమెకు వచ్చెను. భర్త యొక్క పూజా ద్రవ్యములను తాను స్వయముగ సమకూర్చవలయును. భర్త చిత్తము ననుసరించి హితమగునటుల

పాకము చేయవలయును. భర్త గ్రామాంతర మేగినప్పుడు గోవున కాహారమిడి గోశేషమును భుజింపవలయును. గృహమును శుభ్రముగా నుంచవలయును. భర్త ఆజ్ఞ లేనిదే వ్రతోపవాసముల చేయరాదు. నగరమున ఉత్సవము జరుగుచున్నను వెళ్లరాదు. భర్త సంతోషముగా నున్నపుడు తాను దుఃఖితురాలై యుండరాదు. భర్త విచారముగా నున్నతరి తాను హర్షముగా నుండరాదు. రజస్వల అయిన రోజున మౌనముగా నుండవలయును. వేదధ్వని వినరాదు. నాల్గవ రోజున స్నానమొనర్చి భర్తముఖము చూడవలయును. భర్త గ్రామమున లేనిచో భర్త రూపమును హృదయమున స్మరించి సూర్యుని దర్శించి గృహము ప్రవేశించవలయును. భర్త యొక్క ఆయుష్యాభి వృద్ధికిగాను కుంకుమ, పసుపు, మంగళసూత్రము మొదలగు వాటిని ఆదరముతో ధరించుచుండ వలయును, దరిద్రులతోడను, నీచజాతి స్త్రీల తోడను, పతిని నిందించు స్త్రీలతోడను, పతివ్రత సంభాషించరాదు. అత్తమామల, బావమరదుల, ఆడబిడ్డల త్యజించి విభక్తముగా నుండగోరు స్త్రీ రాబోవుజన్మమున ఆడకుక్కఅయి జన్మించును. దిగంబరముగా స్నానముచేయరాదు. రోలురోకలి మొదలగు వాటి మీద కూర్చొనరాదు. భర్తతో వివాదమాడు స్త్రీ దుఃఖమనుభవించును. భర్త అభాగ్యుడయినను నపుంసకుడయినను రోగి అయినను అతనిని పతివ్రత దేవునిగ భావించవలయును.

భర్తకు అభిమతములగు భూషణములను వస్త్రములను మాత్రమే ధరింపవలయును. ఇంటికి అవసరమయిన వస్తువులేమి అయిన నున్న తాను స్వయముగ చెప్పరాదు. పిల్లలచే చెప్పింపవలయును. సమక్షమున నెవ్వరు లేనిచో సంజ్ఞతో కావలసిన పదార్థము భర్త యొక్క మనస్సుకు వచ్చునటుల చేయవలయును భర్తకు దైవవశమున నేదిలభించునో అంతమాత్రముచేతనే తానును సంతృప్తినొందవలయును. ఇరుగుపొరుగు శ్రీమంతుల చూచి భర్త అసమర్థుడని నిందింపరాదు. యాత్రికులు యాత్రకు పోవుచుండ అట్టి ఇచ్ఛ పతివ్రతకు జనించరాదు. పతిసేవయే యాత్రగను పతిపాదోదకమే తీర్థముగను పతివ్రత భావించవలయును. అట్టి పతివ్రతను చూచి త్రిమూర్తులు సంతోషించెదరు. పతికి కోపముతో ప్రత్యుత్తరమిచ్చు స్త్రీ కుక్క అయి జన్మించును. ఆ పై జన్మమున నక్క అయి గ్రామ బాహ్యమున సంచరించును. అత్తమామల యెదుట పెద్దగా మాటలాడరాదు. పెద్దగా నవ్వరాదు. భర్త కోపించి కొట్టిన, కోపముతో చచ్చిపొమ్మని దూషించినచో ఆ స్త్రీ వ్యాఘ్రమై పుట్టు గ్రుడ్డిదై

జన్మించును భర్త లేకుండచూచి పిండివంటల చేసికొని భుజించు స్త్రీ గ్రామ సూకర్మమై జన్మించును. పై జన్మమున కపోతపక్షియై దాని మలమునే అది తినుచుండును. భర్తతో నిష్ఠురముగ మాటలాడు స్త్రీ ఏడుజన్మములు మూగదై పుట్టును. పరపురుషుల కామముతో వీక్షించు స్త్రీ అంగహీనురాలై దారిద్ర్య మనుభవించును. కాన పరపురుషుల పతివ్రతలు కన్నెత్తి చూడరాదు.

ముందు భర్త సంతోషించిన త్రిమూర్తులు సంతోసించెదరు. ఋజువాక్యములతో భర్తను సంతోషపరచు వారి పాద సంవాహన మొనర్చుచుండవలయును. స్త్రీకి బంధువులు గాని ఆప్తులు గాని సోదరులు గాని తల్లిదండ్రులుగాని ఏమియు నీయజాలరు. పతివ్రతకు భర్త వలననే సర్వము లభించగలదు. గురువు, దేవుడు, తీర్థము, సర్వము పతివ్రతకు భర్తయే భర్త జీవించి యుండ స్త్రీ పవిత్రురాలుగ భావింపబడును. భర్త మరణించిన ఆమె అస్పృశ్యురాలుగను, అమంగళిగను, ప్రేతతో సమముగ పరిగణింపబడును. సంతానములేని స్త్రీ కడు దూష్యముగ భావింపబడును. ప్రయాణము చేయువారికి విధవ ఎదురైనచో మరణము తప్పదు, కాని పుత్రవతియగు విధవయైనచో ప్రమాదము లేదు. విధవ వలన నాశీర్వచనము నొందరాదు. ఇట్టి దోషము వైధవ్యమున నుండుటచే పతివ్రతలగు స్త్రీలు భర్తతో సహగమన మొనర్చెదరు. భర్త లేనిచో వైభవము లెందులకు పనికివచ్చును? దేహముతో నేమి ప్రయోజనము? చంద్రుని వెంట చంద్రిక పోయినరీతిని. మేఘముతో కూడా మెరుపు అస్తమించివ రీతిని పతివ్రత భర్తతో పాటు తన జీవితమును త్యజించును. గాననే శ్రుతిస్మృతులు సహగమనము మహాధర్మమని ప్రతిపాదించినవి. సహగమన మొనర్చు స్త్రీ నలువది రెండు తరముల వారిని తరింపజేయును. భర్తతో సహగమనమునకు పోయెడి స్త్రీ అడుగడుగునకు వెయ్యి అశ్వమేధ యాగముల ఫలము నొందును. ఏ స్త్రీ సహగమన మొనర్చునో ఆమె భర్త పాపియై యమపాశములచే గట్టబడి యమలోకమునకు గొనిపోవ బడుచున్నను పతివ్రత తన ప్రభావముచే గరుడుడు సర్పము నీడ్చుకొనిపోవునటుల భర్తను యమపాశముల నుండి తప్పించి స్వర్గమునకు గొనిపోవగలదు. యమదూతలు ఆమెను చూచి దూరముగా పారిపోవుదురు.

యమదూతలు మనకు కాలము వలన గాని, మరి ఎవ్వరి వలన గాని భయములేదు గాని పతివ్రతలనిన భయమగును. అని అన్యోన్యము

చెప్పుకొందురు. సూర్యుడు తన తీక్షణ కిరణముల పతివ్రత మీద ప్రసరింప చేయజాలడు. అగ్ని కాల్చజాలడు అట్టి పతివ్రత భర్తతో సహ స్వర్గమున శాశ్వతసుఖము ననుభవించును. ఏ స్త్రీ సహగమన మొనర్చునో ఆమెకు శరీరమున కెన్నిరోమములు కలవో అన్నికోట్ల సంవత్సరములు భర్తతో సహ స్వర్గసుఖము లనుభవించగలదు. ఏ కులమున పతివ్రత జన్మించునో ఆ కులము ధన్యము. ఆమె భర్త ధన్యుడు ప్రసంగవశమున దురాచారులగు స్త్రీలను గురించి చెప్పెద వినుడు. వ్యభిచారిణియగు స్త్రీ ఇహపరముల అనర్థమునే పొందును. తాను నరకమున పడుటయేగాక తన పాపముచే స్వర్గముననున్న ఇరువది యొక్క తరముల వారిని గూడ ఘోర నరకముల పడవేయును. పతివ్రత పాదస్పర్శచే భూమి పవిత్రమగును. సూర్యుడు చంద్రుడు తమ కిరణములచే పతివ్రతను స్పృశించి పావనులమైతిమని తలంచెదరు. పతివ్రత దృష్టిపడిన మాత్రమున మానవులు పవిత్రులయ్యెదరు. ప్రతి యింటను స్త్రీలు కలరు గాని ఏమి ప్రయోజనము. కులము నుద్ధరించెడి స్త్రీ ఏ ఇంటనుండునో అదియే ఇల్లు. పతివ్రత భార్యగా కలజన్మమే జన్మము. ఎన్ని జన్మలయందో పుణ్యము చేసిననే అట్టి పతివ్రత భార్యగాలభించును. అట్టి భార్యవలననే పుణ్యము సిద్ధించును. ఎవనియింట సాధ్వియగు భార్యలేదో వాని గృహమే అరణ్యము, వాని జన్మ వ్యర్థము. భార్య లేనివాడు కర్మల కనర్హుడు. గంగాస్నానము వలన వచ్చుడి పుణ్యము పతివ్రతల దర్శనము వలన వచ్చును.

అని ఇట్లు పతివ్రతాధర్మముల నా యోగీశ్వరుడు ఆ పతివ్రతతో చెప్పెను. ఇది గురుచరితమందలి ముప్పది ఒకటవ అధ్యాయము సమాప్తము.

**దిగంబరా దిగంబరా శ్రీ పాదవల్లభ దిగంబరా**

**శ్లో॥ అశ్వత్థ సేవామాదిశ్య పుత్రో యోఽదాత్ఫలప్రదః ।**
**చిత్ర కృత్ వృద్ధి వంధ్యాయై శ్రీదత్తశ్శరణంమమ ॥**

తా॥ 60 ఏండ్ల గొడ్రాలి భక్తికి సంతసించి ఆమెకు సంతాన మొసగుట. ఈ అధ్యాయ పారాయణముచే సంతానము లేని వారికి సంతాన ప్రాప్తి కాగలదు.

– ០ –

**గీ॥ పద్మనయను మీది భక్తి యోగంబెల్ల**
**ముక్తి యోగమనుచు మొదలెరుంగు**

**వారి వారి వారి వారి జేరిన వారి**
**త్రోవ బోవవలదు దూతలారా. - శ్రీ బమ్మెఱ పోతనామాత్య.**
**శ్రీ మదాంధ్రభాగవతము షష్ఠమస్కంధము.**

తా॥ కమలాక్షుండగు భగవంతునియందు గల భక్తి యోగము కేవల మోక్షప్రదంబని ముఖ్యముగా దెలిసినవారున్ను, అట్టి తెలిసిన వారి నాశ్రయించిన వారున్ను, ఆశ్రయించిన వారి ననుసరించిన వారున్ను, అనుసరించిన వారిని జేరినవారున్ను, వున్నటువంటి మార్గముననేపోవద్దని యమధర్మరాజు యమదూతలకు ఆజ్ఞాపించెను. అనగా భగవద్భక్తులగు సత్పురుషుల నాశ్రయించిన నాలుగవ మెట్టు వారికే యమ బాధ లేకయుండగా అట్టి సత్పురుషసాంగత్యము నిరంతరము జేయు వారికి యమ బాధలు లేవని చెప్పనక్కరలేదు. గనుక నిత్యము సత్సాంగత్యము జేయుచుండవలెను.

# శ్రీ గురు చరితము

## ముప్పది రెండవ అధ్యాయము

**ఓమ్ అవధూత చింతనం శ్రీగురుదేవదత్త జయ ఓమ్**

**ఓం శ్రీదత్తాత్రేయాయ నమః ఓం శ్రీ గణాధిపతయే నమః**

**ఓం శ్రీ గురుభ్యోమనః**

యోగీశ్వరుడు ఆ పతివ్రతతో నిట్లు చెప్పుచున్నారు. కాశీపట్టణమున బృహస్పతి అగస్త్య మహర్షి యొక్క ఆశ్రమమున పతివ్రతా ధర్మములను సహగమన పద్ధతిని చెప్ప దేవ ఋషులందరు తిరిగి ఇట్లు బృహస్పతిని ప్రశ్నించిరి. మహాత్మా మీరు సహగమనము మహాధర్మమని చెప్పితిరి. ఒకవేళ భర్త దూరదేశమున మృతి నొందును. లేదా భర్త మరణించు సమయమునకు భార్య గర్భవతిగ గాని, పసిబాలుని తల్లిగగాని యుండినచో సహగమన మెట్లు చేయనగును. ఈ సంశయమును వారింపుడని ప్రశ్నించ బృహస్పతి ఇట్లు చెప్పుచుండెను.

దేవతలారా ! వినుడు. శవము లభించని పక్షమునను, భార్య గర్భవతిగ నున్నను, స్తన్యపాన మొనర్చు పసి బాలుడున్నను సహగమన మొనర్చరాదు. అట్లొనర్చిన దోషమే వాటిల్లును. అట్టి స్త్రీ యావజ్జీవ వైవిధ్యమును పరిపాలించవలయును, అట్లొనర్చిన సహగమనము చేసిన ఫలము రాగలదు. భర్త మరణించిన తరువాత స్త్రీలు కేశముల నుంచు కొనరాదు. అట్లొనర్చినచో ఆమె కేశములు భర్తకు పాశములగును నిత్యము శిరస్నాన మొనర్చవలయును. దినమున కొక పర్యాయమే భుజించవలయును. శాకాహారమయినను, ఫలాహారమయినను, క్షీరపాన మయినను చేసి జీవించవలయును. ప్రాణములు నిలుచుటకు ఎంత అవసరమో అంతమాత్రమే భుజింపవలయును. మంచమున పరుండరాదు. మంగళస్నానముల చేయరాదు. గంధ పుష్ప తాంబూలముల విసర్జించవలయును. సంతానములేని విధవలు భర్తకు పితృతర్పణాదులు తిలలతో నాచరింపవలయును. దేవుని పూజించునపుడు తన భర్తృరూపమున భావించి పూజింపవలయును. వ్రతోపవాసముల యథాశక్తి నాచరింపవలయును. తన భర్తకు ప్రియమయిన వస్తువుల బ్రాహ్మణులకు దాన మివ్వ వలయును. మాఘ, కార్తిక, వైశాఖ మాసములయందు

స్నానాదిధర్మముల నాచరించవలయును. వైశాఖమాసమున జలదానము, కార్తిక మాసమున దీపదానము, మాఘమాసమున ఘృతదానము చేయుచుండ వలయును. ఎండకాలమున నిర్జల స్థలముల చలివేంద్రముల నేర్పాటు చేయవలయును. శివుని పూజింపవలయును. శివుని అభిషేకమునకు గాను జలమును తీసికొని ఇవ్వవలయును. అతిథులకు యథాశక్తి అన్నదానమును చేయుచుండవలయును. తీర్థయాత్ర లొనరచ్చువారికి ఛత్రపాదుకల నొసంగవలయును. బ్రాహ్మణులకు ఉదకపాత్రములను కదళీఫలములను, గుడోదకములు దాన మొనర్చుచుండ వలయును. ఏ దానము చేసినను భర్త యొక్క నామమును ఉచ్చరించి సంకల్ప పూర్వకముగా చేయవలయును. కాంస్య పాత్రనిండ నెయ్యి యుంచి బ్రాహ్మణునికి దాన మొనర్చుచుండవలయును.

తాను భూమియందు శయనిందురు మంచమును బ్రాహ్మణునికి దాన మొనర్చవలయును. శక్తియుండిన సాలంకృత గోదానము చేయవలయును. ఖర్జూరంబులు, అపూవములు, శక్తి ననుసరించి బ్రాహ్మణునకు ఇచ్చుచుండవలయును, చలికాలము శీత నివారణము కొరకు, కట్టెలు, కంబళు ళ్ళ, మొదలగు వాటిని దానము చేయుచుండవలయును. శక్తిగల వారు సంవత్సరగ్రాసముతో సద్బ్రాహ్మణునకు గృహదాన మొనర్చవలయును. గంధపుష్పములతో కేశవుని పూజింపవలయును. పార్వతీపరమేశ్వరులకు రుద్రాభిషేకవిధిగ పూజలు చేయుచుండవలయును. శివాలయములందు శకంరునికి ప్రీతిగ దీపమాలలర్పించ వలయును. రవికలు తొడగరాదు. తెల్లని వస్త్రమునే ధరించవలయును. ఎఱ్ఱని వస్త్రములు, నల్లని వస్త్రములు, చిత్రవర్ణములు గల వస్త్రములు ధరించిన దోషము వాటిల్లును. పుత్రవతి అయినచో పుత్రుని ఆజ్ఞ ప్రకారము నడుచుకొనవలయును. ఈ విధముగ వేదశాస్త్రములందు చెప్పబడిన రీతిని ఎవ్వరాచరింతురో అట్టి వారికి గూడ సహగమనము ఆచరించిన ఫలము వచ్చును. అట్టి స్త్రీ తన పుణ్యప్రభావముచే తన భర్త నరకముననున్నను అతనిని స్వర్గమునకు తీసికొనిపోగలదు పతివ్రతయగు స్త్రీ భాగీరథితో సమానము. ఆమెభర్త శంకరునితో సమానము గాన నిట్టి దంపతులే లోకపూజ్యులు.

అని ఇట్లు బృహస్పతి దేవతలతో చెప్పెనని ఆయోగీశ్వరుడు పతివ్రతతో చెప్పి, అమ్మా నీకు చెప్పవలసినదంతయు చెప్పితిని నా వాక్యములు వింటివి. రెండు మార్గములు పురుషార్థసాధనములే. ధైర్యమున్నచో సర్వోత్తమమగు

సహగమన మాచరింపుము. లేనిచో వైధవ్య ధర్మాచరణ మాచరింపుము. అట్లయినను నీవు కృతార్థురాలవు కాగలవు. అని చెప్పి తన హస్తమును ఆమె శిరమున నుంచిరి.

అప్పుడామె వినయముతో నాతపసితో ఇట్లనుచుండెను. స్వామీ! యోగీశ్వరా! మీరే నాకు తల్లిదండ్రులు. నేను విదేశమునకు వచ్చితిని. బంధువు లెవ్వరు నాకిచట లేరు. మీరే అంతకాలబంధువులగను, స్నేహితులుగను, ఆప్తులుగను, నాభాగ్యమున తటస్థించితిరి. మీరు రెండుమార్గములను నాకు సూచించితిరి. అసిధారతో సమమగు వైధవ్య ధర్మములు కష్టసాధ్యముగ గస్పట్టుచున్నవి. యౌవనమున నున్న నేను, ఈ కలియుగమున నిందాపవాదములకు పాత్రురాలనగుట కిష్టములేదు. గాన భర్తతో సహగమన మొనర్చుటయే నాకు సమ్మతము. అని చెప్పి వారి పాదములకు నమస్కరించెను. యోగీశ్వరుడు ఆమెను లేవదీసి అభయమిచ్చి అమ్మా అట్లయిన సహగమన మొనర్చుము. భర్తయొక్క స్థానము పొందుటయే సమ్మతమేని, నేను చెప్పినటుల చేయుము. నీవు గురుమూర్తిని చూడవలయునని భర్త యొక్క ఆరోగ్యము తప్పింపగలరు. కాలము దుర్జయము. బ్రహ్మాదులుగూడ కాలము దాటజాలరు. బ్రహ్మలిఖితము అపరిహార్యము దుఃఖించి యేమి ప్రయోజనము లేదు.

హరిశ్చంద్రుడంతటి వాడు చండాలుని గృహమును నీరుమోసెను. బలి పాతాళమునకు త్రొక్కబడెను. రావణుడంత వాడు కాలముచే కబళింపబడెను. దుర్యోధనుడు బంధుసమేతముగా భారతయుద్ధమున కాలగ్రస్తుడయ్యెను. స్వచ్ఛంద మృత్యువు అయిన భీష్ముడు యుద్ధమున పడవేయబడెను. పరీక్షిత్తు సర్పముచే కఱవడెను. అనంతావతారములే పుట్టి పుట్టి లయము నొందుచుండును. మానవులు, దానవులు, దేవతలు అందరు కాలమున కధీనులే. కాలము అందరిని జయించును. కాలము నెవ్వరు జయింపజాలరు. కాననే కాల మజేయ మందురు. కాలము అందరిని జయించునది అయినను అట్టి కాలమును జయించగల శక్తి గురుమూర్తికి మాత్రము కలదు. కాని ఆ గురుమూర్తియు, భావికులపట్ల ప్రసన్నుడగును. అమ్మా నీకొకమాట చెప్పెద అట్లు చేయుము. సంగమమున గురుమూర్తియున్నారు. నీవా ఇంతదూరము వచ్చితివి. కాన వారిని దర్శించి మాత్రము నీవు నీప్రియునితో అగ్నిప్రవేశ మొనర్చుము. అని చెప్పి కొంత భస్మమును ఆశవమునకు పూసి నాల్గు రుద్రాక్షలు నామె కొసంగి ఆమెతో రెండు కర్ణములకును రెండు రుద్రాక్షలు కంఠమునకును

కట్టుము. ఇంకొకమాట చెప్పెద, నీవు గురుదర్శనమునకు వెళ్లినపుడు శిష్యులు వారి పాదములకు రుద్రాభిషేకము చేయుచుందురు. ఆ తీర్థము నీవు చల్లుకొని ఈ ప్రేత సర్వాంగములపై చల్లుము. సువాసినులకు వాయనము లొసంగుము. బ్రాహ్మణులకు యథాశక్తి దానములొనర్చి సహగమన మొనర్చుమని అయోగి చెప్పి అచ్చటనుండి వెడలి పోయెను.

ఆ పతివ్రతయు వారు చెప్పినటుల షోడశకర్మాధికారియగు బ్రాహ్మణుని రప్పించి తాను స్నానమొనర్చి పట్టు వస్త్రము ధరించి అలంకార మొనర్చుకొని భర్తశవమునకు చేయవలసినౌపాసనాది సంస్కారముల జరిపించితానే, చేతనగ్గిపూని వశమును నదీతీరమునకు గొని పోవుచుండెను. తారుణ్యముతో భూషణభూషితురాలై ఆమె లక్ష్మివలె ప్రకాశించచుండెను. వేలకొలది స్త్రీలు అచటకు వచ్చి ఆమె దృఢనిష్ఠకు సంతసించి తలలూపుచుండిరి. కొంతమంది అయ్యో ఎంత దురదృష్టవంతురాలు, ఏమియు సుఖమెరుగదు, ఆనందముతో భర్తతో శరీరము సగ్నియందర్పింప బోవుచున్నది అనిరి మరికొంతమంది ఆమెకు బోధించెదము, వ్యర్థముగా ప్రాణము లర్పించుట ధర్మముగాదు, పుట్టినింటికి బొమ్మనెదము. అని ఆలోచనలు సలుపుచుండిరి. కొంతమంది నిజమైన పతివ్రతయున నీమెయే. ఈమె ఎంత ధన్యురాలు. ఈమెను కనిన తల్లిదండ్రులెంత ధన్యులో. సహగమనముచే నిరువది యొక్క తరముల తరింపజేయుచున్నది అని ప్రశంసించుచుండిరి. ఆమె శవమును వాహకుల ద్వారా నదీతీరమునకు తెచ్చెను. అచ్చట చితి ఏర్పరుపబడెను. ఆమె ముత్తైదువలకు వాయనము లొసగెను. కంఠసూత్రములు, కుంకుమ, పసుపు, కాటుక వీటితో కూడా మూసివాయనములిచ్చెను. బ్రాహ్మణులకు ద్రవ్యదానము చేసి అందరిని ప్రార్థించి నమస్కరించి చిరునవ్వుతో ఆజ్ఞయిండు నేను పితృగృహమునకు పోయెద. దీపావళి సమీపించుచున్నది. అందుకుగాను తల్లిదండ్రులు నన్నాహ్వానము చేయుచున్నారు. శంకరుడు నాకు తండ్రి. గౌరియే నాకు తల్లి అని ఇట్లు గ్రామస్థులతో చెప్పి తన వెంటవచ్చిన వారితో మీరు మీ గ్రామములకు పొండు. చింతించకుడు. అత్తమామ లడిగినచో సుఖముగ నిచ్చుట నున్నామనుడు. లేనిచో వారల చంపిన పాపము మీకు రాగలదు. అని చెప్పవారందరు దుఃఖనిమగ్నులైరి. అప్పుడామె యోగి చెప్పిన వాక్యముల స్మరించి వారిచ్చిన రుద్రాక్షల రెంటిని ఽశవము కర్ణములకును మరిరెంటిని కంఠమునకు కట్టి అచట బ్రాహ్మణులతో ఓ బ్రాహ్మణులారా ! నాకొక సంకల్పము

గలదు. మీ యాజ్ఞ అయినచో నేను గురుమూర్తిని దర్శించివచ్చి సహగమన మొనర్చెదనని వారల ప్రార్థించ వారును అమ్మా తొందరగా రమ్ము. అస్తమయమునకు పూర్వమే శవమునకు సంస్కారము జరుపుట ధర్మము, అని చెప్పిరి. వారి యాజ్ఞతో నామె శ్రీ నృసింహసరస్వతీస్వామి వారున్న సంగమ క్షేత్రమునకు ప్రయాణమయ్యెను.

అనేకమంది స్త్రీలు పురుషులు కుతూహలముతో నామె వెంట వచ్చుచుండిరి. ఆమె స్వామివారి దర్శనమునకు పోవుచు ఇట్లనుకొనుచుండెను. స్వామీ! నేను దౌర్భాగ్యరాలను, కాననే నన్నుపేక్షించితివి. నీవు శరణాగత రక్షకుడవు. దాతవు గూడను. నీ కీర్తి జగద్విఖ్యాతము కాని దురుదృష్టురాలనగు నాయందు నీకనుగ్రహమెట్లు రాగలదు. నీవు ఇచ్ఛా మాత్రముచే జగత్తును సృజించ సమర్థుడవు. స్థితి కాలమున పోషింతువు, త్రిమూర్తి స్వరూపుడవు. అష్టసిద్ధులు, నవనిధులు నీకు దాస్య మొనర్చుచుండును. కాని నేను కుబుద్ధినాగుట చూచి నన్నుపేక్షించితివి. లోకమున ఎవరైన నొకరికి అపకారము చేసినచో వారు రాజునకావిషయము చప్ప రాజుదండార్హుని దండించును. రోగగ్రస్తుడగు వాడు వైద్యుని శరణు పొందవైద్యుడు తగిన ఔషధ మొసంగి రోగ నివారణ చేయును. అట్లే నీవు త్రిమూర్తి స్వరూపుడవు. భక్త జనాధారుడవని నీ కీర్తి విని ఇంతదూరము వచ్చితిని. నిన్నే స్మరించుచు స్వకీయుల గూడ మరచి ఇరువది గ్రామముల దాటి నీ దర్శనముచే నా భర్తకు ఆరోగ్యము గలుగ గలదను ఆశతో వచ్చితి. ఇందు నాదేమి అపరాధము గలదు. నాతో సమానులగు స్త్రీలు వారి వారి భర్తలతో పుత్రపౌత్రులతో సుఖించుచున్నారు. నేను దురదృష్టురాలను. శిలతో సమమగు నాయందు మీ కృప ఎట్లు ప్రసరించును. నాకోరిక లన్నియు నెరవేరెను. మనో రథము ఫలించెను. నీ ఖ్యాతియు లోకప్రసిద్ధిగాంచెను. మీ యాజ్ఞగైకొని మీకీర్తిని తీసికొని భర్తతో పరలోకమునకు పోయెద. అని ఇట్లు చింతించుచు సంగమమును సమీపించి అచ్చట అశ్వత్థమూలమున కూర్చునియున్న స్వామివారిని చూచి దూరమున నుండి సాష్టాంగముగా నమస్కరించెను.

అప్పుడు వారు సువాసిని ! నీవు దీర్ఘసౌభాగ్యవతివి కమ్మని దీవించిరి. మరల నమస్కరించ అష్టపుత్రవతివి కమ్మనిరి. అచటి వారందరును పకపక నవ్వుచు స్వామీ! ఈమె భర్త మరణించెను; శవమును శ్మశానమున నుంచి మీయాజ్ఞను గైకొని భర్తతో సహగమన మొనర్చగలందరులకుగాను నీమె వచ్చెనని

చెప్పిరి. అప్పుడు స్వామివారు నవ్వి ఈమెకు స్థిర సౌభాగ్యముండ భర్త ఎటుల మరణించెను. నానోటనసత్యమెన్నడు రాజాలదు. శవమును తీసికొనిరండు చూచెదమనిరి. వెంటనే కొంతమంది స్వామివారి శిష్యులు పరుగెత్తుకొని పోయిరి. ఇంతలో నలుగురు బ్రాహ్మణులు అచటకు వచ్చి స్వామివారి పాదములకు రుద్రసూక్తముతో నభిషేక మొనర్చి స్వామివారిని షోడశోపచారములతో పూజించిరి. ఇంతలో బ్రాహ్మణులు శవమును తెచ్చి గురుసన్నిధానమున నుంచిరి. అప్పుడు స్వామివారు శవముమీద కప్పబడిన వస్త్రమును బంధనముల తొలగింపజేసి, తమ శిష్యులద్వారా పాదతీర్థమును శవముమీద చల్లించిరి. అనంతరము వారు కృపాదృష్టితో ఏకాగ్రముగా శవమువైపు దృష్టి ప్రసరింపజేసిరి. వారి అమృత దృష్టి పడుటతోడనే శవమునందు చైతన్యము ప్రవేశించెను. జీవమువచ్చెను. అవయవముల కదల్చుచు నిద్రపోయి లేచినవాని వలె నా బ్రాహ్మణకుమారుడు సావధానుడై లేచి కూర్చుండి సిగ్గుపడుచు ఇదియేమిటి ! నావస్త్ర మేమయ్యెను ? నగ్నుడనైయుంటి నెందులకు ? అని అనుచుండ భార్య వానికి వస్త్రమిచ్చెను. ఆ వస్త్రము ధరించి ఆ బాలుడు కూర్చుని తన భార్యతో ఇదియేమిటి ? నన్నిక్కడకు తెచ్చితివి ! ఈ యతీశ్వరులెవరు ? ఇంత నిద్ర నాకెటుల వచ్చెను. నన్నెందులకు లేపవయితివి ? అని ప్రశ్నించ ఆమె చిరునవ్వులు నవ్వుచు భర్తతో జరిగిన వృత్తాంతమంతయు చెప్పెను. భార్యాభర్త లిరువురు లేచి



స్వామివారి పాదములయందు శిరముంచి ఆనందాశ్రువులచే పాద ప్రక్షాళన మొనర్చిరి. అచట కూడిన జనులందరు ఆనందభరితులైరి. ఆదపంతులు స్వామివారినిటుల స్తుతించిరి.

స్వామీ! మేము పాపాత్ములము. ఓ త్రిమూర్త్యవతారా మీ పాదములు మరచితిమి. మీరు జగద్గురువులు. శరణాగతవరవ్రతులు. సచ్చిదానంద స్వరూపులు! పరాత్పరా! త్రాహిత్రాహి. గురునాథా! కృపాబ్ధే! భక్తాభీష్ట వరప్రదా, జయజయ. త్రాహిత్రాహి. మీరు శంకరులు. భక్తుల రక్షించుటకుగాను ఇట్లు మానవులై అవతరించితిరి. ఓ దేవశిఖామణి భక్తుల నిరంతరము ఆపదలనుండి మీరు రక్షించుచుందురు. సర్వభూతాంతర్యామీ! దేవా! మీకు ఎనమస్కారము. మీరు మాయను నడపించువారలు. మనోవాక్కుల కగోచరులు. ఈ త్రిభువనములు మీలీలలే. మాకు జన్మలేకుండునటుల చేయుడు. మీరు నిష్కళంకులు, జీవమాత్రుల కృపతో రక్షించువారలు. ఇహపరముల నొసంగువారలు చిన్మాత్రాకారులు కరుణాసాగరులు. స్వామీ! నృసింహసరస్వతి మాయపరాధముల క్షమించి రక్షింపుడని భక్తితో దంపతులు స్తుతించ స్వామివారు సంతసించి ఇట్లనిరి. మీదోషములన్నియు పోయెను. మీరు పూర్ణాయుష్మంతులై అష్టపుత్రుల బడసెదరు. దేహాంతమున ముక్తి పొందగలరు అని ఆశీర్వదించిరి.

అక్కడివారందరు జయజయ ధ్వానములు చేసి స్తుతించిరి. అందొక ధూర్తుడగు బ్రాహ్మణుడు స్వామివారిని గూర్చి స్వామీ! నాకొక సంశయము గలిగెనుఉ. నివారించుడు, వేదశాస్త్రములు బ్రహ్మలిఖితము తప్పదని చెప్పుచున్నవి. ఈ బ్రాహ్మణుడవపమృత్యువుచే మరణించక రోగగ్రస్తుడయి మరణము నొందెగదా ! కాలమృత్యువుగదా ! తిరిగి ఎట్లుజీవించెను ? బ్రహ్మలిఖిత మేమయ్యెను ? అని ప్రశ్నించ స్వామివారు ఆ బ్రాహ్మణునితో నిట్లనిరి. ఈ బ్రాహ్మణునకు ఈ జన్మమున బ్రహ్మ లిఖితము ముప్పది సంవత్సరములైనను ముందురాబోవు జన్మమున శతాయుష్మంతుడు కానున్నందున బ్రహ్మను ప్రార్థించి రాబోవుజన్మయందలి శతాయుష్యము ఈ జన్మకు సంక్రమించునటుల చేసితినని చెప్పిరి. అచ్చటివారందరు స్వామివారు అమానుష్యమైన అత్యద్భుతమగు ప్రభావమునకు సంతసించి వారి వారి గృహములకు వెళ్ళిరి. స్వామివారి ఖ్యాతి దిగంత విఖ్యాతమయ్యెను. దంపతులు స్నానమొనర్చి స్వామి వారిని భక్తితో పూజించిరి. ఇంతలో సూర్యాస్తమయము కాగా గురుమూర్తి ఆ దంపతులతో గూడ గాణగాపురమున నున్న మఠమునకు

వచ్చిరి. ఇట్టి గురుచితము నెవరు భక్తితో విందురో, పఠింతురో వారలకు గురుమూర్తి సమస్త కోరికల నిచ్చును. అని ఇట్లు సిద్ధముని నామధారుకునితో చెప్పెను.

**ఇది గురుచరితమున ముప్పదిరెండవ అధ్యాయము సమాప్తము.**

**దిగంబరా దిగంబరా శ్రీపాదవల్లభ దిగంబరా**

**శ్లో॥ విధవిధర్మమాదిశ్య అనుగమంచాక్ష భస్మతః ।**
**అజీవయ న్మృతం విప్రం శ్రీదత్తశ్శరణం మమ॥**

తా॥ స్వామివారు పతివ్రత యొక్క భక్తికి సంతసించి మరణించిన ఆమె భర్తను జీవింపజేయుట.

నోటు : 30,31,32 కలిపి పారాయణ చేయవలయును.

**శ్లో॥ మనోగతి రవిచ్ఛిన్నా హరౌప్రేమ పరిప్లుతా ।**
**అభిసంధి వినిర్ముక్తా భక్తి ర్విష్ణు వశంకరీ ॥**

**– నారద పాంచరాత్రము**

తా॥ మనస్సు ప్రేమార్ద్రమై తైలధారారూపంబున నిష్కామముతో భగవంతుని వంకకు నిరంతరము ప్రవహించుట భక్తి యగును.

# శ్రీ గురు చరితము

## ముప్పది మూడవ అధ్యాయము

**ఓమ్ అవధూత చింతనం శ్రీగురుదేవదత్త జయ ఓమ్**

నామధారకుడు సిద్ధముని పాదములకు నమస్కరించి భక్తి యుక్తుడయి స్వామీ: గురుమూర్తి బ్రాహ్మణ దంపతులతో కలిసి మఠమునకు వచ్చిరని చెప్పితిరి. పై కథా వృత్తాంతమును చెప్పుడని ప్రార్థించ సిద్ధముని ఇటుల చెప్పచున్నారు.

మరునాడు దయము దంపతులు గురుమూర్తి వద్ద చేతులు జోడించుకొని కూర్చుండియుండిరి. అప్పుడా పతివ్రత స్వామీ : నేను దుఃఖముతో బాధపడునపుడు ఒక యతివచ్చి కొన్ని ధర్మముల నుపదేశించి నాల్గు రుద్రాక్షల నొసగెను, ఆ రుద్రాక్షలను నా భర్త చెవులకు, కంఠమునకు రెండేసి కట్టుమని, స్వామి వారి పాదతీర్థముచే శవమును ప్రోక్షించు మనియు, గురుమూర్తి దర్శనమొనర్చి సహగమనము చేయుమనియు చెప్పి వెడలెను. ఇప్పటికి ఆ రుద్రాక్షలు నా భర్త కంఠమున నున్నవి. వారెవరో తెలియదు అని అనెను. అప్పుడు స్వామివారు నవ్వుచు మీ భక్తికి చూచి నేనే ఆ రూపమున వచ్చితిని. రుద్రాక్షల మహిమ అద్భుతము సుమా! నీవు భక్తురాలవుగాన రుద్రాక్షల మహిమ చెప్పెద వినుము.

శ్రద్ధతో గాని, శ్రద్ధలేక గాని, రుద్రాక్షల నెవ్వరు ధరింతురో వారిని పాపము స్పృశించదు. రుద్రాక్ష 'ధారణముచే కడు పుణ్యము సిద్ధించునని శ్రుతిస్మృతులు చెప్పుచున్నవి. సహస్ర సంఖ్యాకములైన రుద్రాక్షల నెవ్వడు ధరించునో వాడు రుద్రునితో సమానుడు. సహస్రము లభించనిచో రెండు భుజములయందును పదునారు, పదునారును శిఖయందొ కటియు, చేతులకు ఇరవది నాల్గు, కంఠమున ముప్పది రెండు చెవులయందు ఆరు, ఆరు, మస్తకమున నలుబది రెండు, వక్షః స్థలమున నూటఎనిమిది ఇట్లెవడు ధరించునో వాడు కుమారస్వామితో సమానుడు. రుద్రాక్షలతో పాటు ప్రవాళములు, స్ఫటికములు, వైడూర్యములు, మౌక్తికములు కలిపియు మాలగ ధరించవచ్చును. రుద్రాక్షలు ధరించువారికి సద్గతి నిశ్చయము. రుద్రాక్షమాలతో జపమొనర్చుటచే అనంతఫలము లభించును. రుద్రాక్షలు ధరించనివాని జన్మ వ్యర్థము. రుద్రాక్షలు చెవులయందు ఆభరణముగ ధరించి స్నానమొనర్చుటచే గంగాస్నాన ఫలము

లభించును. రుద్రాధ్యాయముచే రుద్రా నభిషేకించిన రుద్రుని పూజించిన ఫలము వచ్చును. రుద్రాక్షలలో ఏక వక్త్రములు పంచ వక్త్రములు, ఏకదశ ముఖములు ఇట్లనేక రకములుండును. రుద్రాక్షలు ధరించుటచే చతుర్విధ పురుషార్థములు సిద్ధించును. ఈ రుద్రాక్షల మహిమ తెలియ గలందులకు ప్రాచీనమైన ఆఖ్యానమును చెప్పుచున్నాను వినుము.

పూర్వము కాశ్మీరదేశమున భద్రసేనుడను రాజు గలడు. అతనికి సుధర్ముడను పేరు గల మంత్రి గలడు. రాజుకు తారకుడను కుమారుడును, మంత్రికి సద్గుణుడనువాడును జన్మించిరి. ఆ బాలురు చిన్ననాటి నుండియు అన్యోన్యము స్నేహితులై కలసి క్రీడించుచుండిరి. కలసియే చదువుచుండిరి. బాలురిద్దరు బాల్యము నుండియే రుద్రాక్షలు ధరించుచు భస్మత్రిపుండ్రములను ధరించి నియమముతో శివుని పూజించుచుండిరి. తల్లిదండ్రులు బంగారు ఆభరణములచే అలంకరించి నను వాటిని త్యజించి రుద్రాక్షలనే ఆదరముతో ధరించుచుండిరి. ఇట్లుండ ఒక దినమున వారి ఇంటికి పరాశరమహర్షి దైవవశమున వచ్చెను. రాజు మహర్షిని అర్ఘ్యపాద్యములతో పూజించి సింహాసనమున కూర్చుండబెట్టి స్తుతించి, చేతులు జోడించుకొని వారితో నిట్లు విన్నపము చేసికొనుచున్నాడు.

మునీశ్వరా! మా పిల్లలకు ఏమిఅయిన పిశాచ మావేశించెనేమొ తెలియదు. మేము ఆభరణముల నలంకరించ వాటిని దూరముగా పారవేయుచున్నారు. రుద్రాక్షలనే ఎప్పుడు ధరించుచున్నారు. మామాటల వారలు లక్ష్యము చేయుట లేదు. మీరు భూతభవిష్యత్తులు తెలిసిన మహానుభావులు. మీరు చెప్పిన విందురేమో! ఈ పిల్లల పూర్వజన్మ వృత్తాంతమును మాకు దయతో సెలవిండని ప్రార్థించెను. అప్పుడు పరాశరముని ఆ రాజుతో ఇట్లు చెప్పుచుండెను.

రాజా! నీకుమారుని యొక్కయు, మంత్రికుమారుని యొక్కయు విస్మయకరమైన పూర్వజన్మ వృత్తాంతమును చెప్పెద వినుము. అది వినిన ఈ పిల్లలు రుద్రాక్షలు ప్రేమతో ధరించుటకు కారణము నీకే తెలియును.

పూర్వము నందిగ్రామమున నొక వారవనిత కలదు. ఆమె రూపలావణ్యములు వర్ణనాతీతములు. ఐశ్వర్యమున కంతులేదు. నవయౌవనమున నుండియు వేశ్య అయినను పతివ్రతయను కీర్తి నొందెను. అన్న వస్త్రైములచే సాధువుల నారాధించును. ఆమె తన భవనమున కెదురుగా నొక నాట్యమండపమును నిర్మించెను. అచ్చట సర్వాభరణ భూషితురాలై

సఖీజనముతో కలిసి నిత్యము నృత్య మొనర్చుచుండును. ఆమె ఒక కుక్కుటము, ఒక మర్కటమును ప్రేమతో ఆ నాట్య మంటపమున పోషించుచుండెను. ఆమె శివభక్తురాలగుటచే వాటికి కంఠమున నలంకారముగ రుద్రాక్షమాలలు కట్టి వాటికి కూడా నృత్యకళ నేర్పుచుండెను. ఇట్లుండ ఒక గొప్ప శివభక్తుడగు వైశ్యుడు రుద్రాక్షమాలల ధరించి భస్మభూషితుడై రత్న కంకణములచే శోభిల్లెడి తన హస్తమున నొక దివ్యమైన రత్న లింగమును ధరించి ఆ మార్గముననే పోవుచుండ ఆ వేశ్యాంగన అతనికి నమస్కరించి గౌరవముగా తీసికొనివచ్చి నాట్య మంటపమున కూర్చుండబెట్టెను. ఆమె వైశ్యుని వద్ద నున్న కంకణమును, రత్న లింగమును చూచి వాటిని అతనివలన తీసికొనవలయునని కోరి తన చెలికత్తెతో నిటుల చెప్పెను.



నీవు ఆ షావుకారు ఆ రత్నలింగమును అమ్మునేమో తెలిసికొనుము, నేను దానిని వెల చెల్లించి తీసికొందును. లేదా అతనికి నాతో సుఖించ కోరికయున్నచో మూడురోజులతనికి భార్యయై సుఖమిచ్చెద అడుగుమనెను. అప్పుడా చెలికత్తె వైశ్యునితో ఆ విషయము చెప్ప ఆ వైశ్యుడు నవ్వి ఆమె పతివ్రతయని పేరు పొందినది. అట్టి మీనాయిక మూడు దినములు దృఢవ్రతురాలై పత్నీసుఖమిచ్చిన నేనీలింగమును, కంకణమును నిచ్చెద కాని మీరు వ్యభిచారమే వృత్తి గాగలవారు మీ వాక్యము సత్యమని ఎట్లు నమ్మగల? లోకుల మోసగించు మీ జాతికి

ధర్మమెక్కడిది. దినమున కొకనిని మీరు వరించెదరు. అని యన ఆ వేశ్యకాంత అతనితో నేను నిజముగ మూడు దినములు మీకు మనో నాక్కాయములతో ధర్మపత్నినయి యుండి రమింపజేసెద. ఇందులకు సూర్యచంద్రులే సాక్షులు అని చెప్పుచు ఆ లింగముపై చేయి యుంచి ప్రమాణము చేసెను. దానిని నమ్మి అతను ఆ రత్న కంకణమును ఆమె చేతి కిచ్చుచు, ఈ లింగము నాకు ప్రాణముతో సమము దీనికి హాని సంభవించిన నేను ప్రాణముల త్యజించెదను గాన భద్రముగా నుంచుమని చెప్పెను. ఇంతలో సూర్యుడస్తమించెను. ఆమె వైశ్యుని శయనాగారమున కాహ్వానించెను. వైశ్యుడామెతో ఈ లింగము పవిత్రమైనది గాన రతి సమయమున ఆ స్థానమున నుండ తగదని చెప్ప ఆమె ఆ లింగమును నాట్య మండపముననే మధ్య స్తంభ సమీపమున భద్రపరచి వైశ్యునితో సహ తన శయన గృహము ప్రవేశించెను.

వారు గృహమున క్రీడాసక్తులయి యుండ దైవ వశమున నాట్య మండపమునకు నిప్పంటుకొనెను. క్షణములో నా మంటపము కర్పూరము వలె దగ్ధమయ్యెను. అది చూచి వైశ్యుడు హాహాకార మొనర్చుచు వచ్చి నా ప్రాణలింగము నశించ నేనెట్లు బ్రతుకగలనని దుఃఖించెను. సమీపస్థులు నిప్పు చల్లార్చి చూచిరి, గాని లింగము కనిపించదాయెను కాలిపోయెను. దానితో పాటు అక్కడ కట్టిన కుక్కుట మర్కటములు కూడ భస్మమైపోయెను. వైశ్యుడు విలపించుచు, కాష్ఠములచే చితిపేర్చి అగ్ని ప్రజ్వలింపచేసి యందు దుమికి మరణించెను. నాగరకులందరు విస్మయముతో దుఃఖించుచుండిరి. అప్పుడా వేశ్య హాదైవమా ఏమి ఆయెను: నాకు ఈ దినమున పతిహత్య సంభవించెను. నా ప్రాణేశ్వరుడు నశించిన నేనెట్లు బ్రతుకగలను. నేను పతివ్రతనని ప్రసిద్ధినొందితి కాన నేనిప్పుడు అగ్నియందు నితనితో సహగమన మొనర్చుట ధర్మము అని నిశ్చయించి అచ్చట నున్న బ్రాహ్మణులకు నమస్కరించి తనకున్న భూషణముల వస్త్రముల ధనముతో సహా దానమొనర్చి, చందనకాష్టములచే అగ్నిని ప్రజ్వలింపజేసి నేను భర్తతో సహా సహగమన మొనర్చుచున్నాను. ఆజ్ఞయిండని అచటివారల ప్రార్థించెను. ఆమె మాటలు విని ఆమె బంధువులు సోదరులు ఇదియేమి ధర్మము? మతి హీనురాలా: మనము వేశ్య కులము వారలము గదా, అసంఖ్యాకులు మన గృహములకు వచ్చెదరు. ఇతనే నీకు భర్త ఎట్లు కాగలడు? వేశ్యా ధర్మము నీకు తెలియదు. రోజుకొక నూతనుడు మనతో రతిచేయ వచ్చుచుండును. లింగమేమిటి? ధర్మమేమిటి? లోకులు

నిన్ను చూచి పరిహసించెదరు అని అనిరి.

ఆమె వారి వాక్యముల నిరాదరించి అచటివారితో నేను ఇతనికి మూడు దినములు భార్యగా నుందునని సూర్యచంద్రుల సాక్షిగ ప్రమాణము చేసితిని. కావున ధర్మమునుబట్టి నేనితనికి ధర్మపత్నినే యగుదును. అట్టి నా భర్త మరణించిన నేనెట్లు జీవించెద? భర్తతో సహగమన మొనర్చి స్త్రీ అడుగడుగునకు అశ్వమేథ ఫలము నొందగలదని శాస్త్రములు చెప్పుచున్నవి. ఏ స్త్రీ సహగమన మొనర్చునో ఆ స్త్రీ తండ్రియొక్కయు, భర్త యొక్కయు, తల్లి యొక్కయు, ఇరువది తరములు తరింపజేయును. అని శృతులు చెప్పుచుండ అట్టి పుణ్యమును వదిలి నేను ఈ అపారమగు సంసారమున జీవించి ఏమి ఫలము? ఎప్పటికి అయినను మరణించక తప్పదు. కాన సహగమన మొనర్చెదనని చెప్పి అగ్నికి నమస్కరించి ప్రదక్షిణ మొనర్చి ఈశ్వరుని స్మరించి అగ్ని సమీపమునకు పోయి దానితో దుమికెను.



వెంటనే పంచవక్త్రుడు నాగయజ్ఞోపవీతియగు సదా శివుడు నందివాహనమధిష్ఠించి ప్రత్యక్షమై తన పది భుజములతో నామెను పట్టుకొనెను. అగ్ని శమించెను. అప్పుడు శివుడామెకు ప్రసన్నుడై వరము కోరుకొనుమనెను. నీ ధైర్యమును పరీక్షించుటకుగాను నేనే వైశ్యుడనై వచ్చితిని. ఆ లింగము నా రూపమే. నేనే మాయతో అగ్నిని కల్పించితి. నీ మనస్థయిర్యము కనిపెట్ట

గలందులకు నేనగ్ని ప్రవేశమొనర్చితి. నీవు నిజమగు పతివ్రతపు నీ భక్తికి సంతసించితి. దీర్ఘాయుష్యమును, ఐశ్వర్యమును ఆరోగ్యమును ఇంక ఏమి అయిన కోరికలున్నచో కోరుకొనుమనెను. అప్పుడా వేశ్య శివునితో స్వామీ తుచ్ఛములగు స్వర్గమర్త్యపాతాళములయందలి సుఖములతో పనిలేదు. నన్ను బంధుమిత్ర పరివార సమేతముగా కైలాసమునకు కొనిపొందు. మీ సన్నిధిని, మీ పాదకమలమునకు భృంగమునైయుండెద. సంసార సముద్రము నుండి నన్ను తరింపజేయుదని ప్రార్థించెను. శివుడు అట్లే ఆమెకు పరివారముతో గూడ కైలాసమిచ్చి అంతర్థితుడయ్యెను.

ఓ రాజా! నాట్యమంటపమున మరణించిన కుక్కుట మర్కటములే మర్కటము నీకుమారునిగను, కుక్కుటము మంత్రికుమారునిగను జన్మించినవి. పూర్వజన్మమున రుద్రాక్షల ధరించుటచే ఆ సంస్కారమును బట్టి వీరలు జ్ఞానవంతులై శివభక్తులై రుద్రాక్షలనే ప్రేమతో ధరించుచున్నారు. రుద్రాక్షల ధరించువారి పుణ్యమునకు మితిలేదు, అని పరాశరుడు ఆ రాజునకు చెప్పెనని గురుమూర్తి దంపతులకు చెప్పిరి. ఇట్లు సిద్ధముని నామధారకునితో గురుచరితమును చెప్పెను.

**ఇది గురుచరితమందలి ముప్పదిమూడవ**
**యధ్యాయము సమాప్తము.**
**దిగంబరా దిగంబరా శ్రీ పాదవల్లభ దిగంబరా**

**శ్లో॥ వేశ్యాసత్యైతురుద్రాక్ష మాహాత్మ్యయుతత్కృతం ॥**
**ప్రసాదం ప్రాహయస్సత్యై శ్రీదత్తశ్శరణంమమ ॥**

తా॥ రుద్రాక్షలు ధరించిన పుణ్యముచే కోడి, కోతి రాజు
యొక్కయు మంత్రి యొక్కయు కుమారులై పుట్టుట;
వేశ్య తన పాతివ్రత్య ప్రభావముచే ముక్తి నొందుట.

# శ్రీ గురు చరితము

## ముప్పది నాల్గవ అధ్యాయము

**ఓం అవధూత చింతనం శ్రీగురుదేవదత్త జయ ఓం**

**శ్రీ గణేశాయ నమః శ్రీ నృసింహ సరస్వత్యై నమః**

గురుమూర్తి దంపతులతో నిట్లు చెప్పుచున్నారు. పరాశరుని వలన నారాజు తన కుమారుని యొక్క పూర్వజన్మ వృత్తాంతము రుద్రాక్ష మాహాత్మ్యమును విని భక్తితో చేతులు జోడించుకొని ఇట్లు ప్రశ్నించెను. స్వామీ, మీవలన రుద్రాక్షమాహాత్మ్యమును వింటిని. పూర్వ జన్మమున నజ్ఞానముచే రుద్రాక్షల ధరించిన పుణ్యమున వీరు జ్ఞానము గలవారైరనియు, భక్తిగలవారై భస్మ రుద్రాక్షల ప్రీతితో ధరించుచుండిరనియు సెలవిచ్చితిరి. తమరు త్రికాలజ్ఞులు కాన నాకుమారుని భవిష్యత్తు తమవలన వినగోరుచున్నాను. కాన తాము దయయుంచి చెప్పుడని ప్రార్థించెను.

అప్పుడు పరాశమహర్షి రాజుతో ఓ రాజా! నీవు నీ కుమారుని భవిష్యత్తును ప్రశ్నించుచున్నావు. నేను నిజము చెప్పిన నీకు దుఃఖము కలుగును. కాన నేనెట్లు చెప్పగలనన నారాజు మహర్షితో స్వామీ, ఎట్టి దుఃఖమునకును కష్టమునకును ప్రతీకార మొనర్చి మమ్ము రక్షించు సామర్థ్యము తమకు గలదు గాన సంశయింపక సెలవిండని ప్రార్థింప నాపరాశర మహర్షి ఇట్లు చెప్పుచున్నారు. నీ కుమారునకు బ్రహ్మ పన్నెండు సంవత్సరములు మాత్రమే ఆయుష్యము లిఖించెను. అందు ఇంకను ఏడు దినములు మాత్రమే మిగిలియున్నవి. ఎనిమిదవ రోజు నీకుమారుడు మృతిచెందును అని చెప్పెను. ఆ మమర్షి వాక్యము విని రాజు అట్లే మూర్ఛిల్లి తిరిగి లేచి ఏడ్చుచు మహర్షి పాదముల మీద పడి స్వామీ మిమ్ము శరణుపొందుచున్నాను. రక్షించుడు రక్షించుడు అని దీనుడై ప్రార్థించెను. రాజు భార్యయు దుఃఖార్తురాలై పరాశరమహర్షి పాదములపై పడి పుత్రునిరక్షింపుమని దీనురాలై ప్రార్థించెను.

అప్పుడు ఋషి వారల నోదార్చి అభయమిచ్చి మీరు భయము విడనాడి ఉమాకాంతుని సదాశివుని శూలపాణిని ఆరాధించుడు. శివుని మీరు అనన్య భక్తితో శరణుపొందితి. రేని శివుడే మీకుమారుని రక్షించును. ఆ విధానము చెప్పెద వినుమని పరాశరుడు ఆ రాజుతో శివమహిమ నీక్రింది విధమున చెప్పుచున్నాడు.

ఎవ్వనిచేతను జయింపబడని కాలమును జయించుట కొక ఉపాయము గలదు. స్వర్గ మర్త్య పాతాళములందు ప్రసిద్ధిగాంచిన దేవుడు శివుడు. అట్టి శివుడు. సచ్చిదానంద స్వరూపుడు. నిష్కళంకుడు. అట్టి శివుడు సృష్ట్యాదియందు మాయయందలి రజోగుణముతో బ్రహ్మదేవుని సృజించి అతనికి సృష్టివిధానము తెలియుగలందులకు నాలుగు వేదములను ఉపనిషత్తులను గూడ ననుగ్రహించెను. అట్టి వేదములలో ప్రధానమయిన యజుర్వేదమందు శివుని మహాత్మ్యమును ప్రకటించు రుద్రాధ్యాయము గలదు. రుద్రుడవ్యయుడు నాశరహితుడు. అట్టి రుద్రుని స్వరూపమును వర్ణించు రుద్రాధ్యాయము యొక్క మహిమ నిరుపమానము బ్రహ్మదేవుడు తన దక్షిణముఖముతో యజుర్వేదమును అందలి రుద్రాధ్యాయ సహితముగా సృష్ట్యాదియందు ఋషుల కుపదేశించెను. బ్రహ్మ వలన మరీచ్యాది మహర్షులు, వారి ద్వారా వారి శిష్య ప్రశిష్యులును ఈ రుద్రాధ్యాయమును ఉపదేశమొందిరి. ఈ విధమున శివుని మహిమను వర్ణించు రుద్రాధ్యాయము జగత్తున ప్రసిద్ధి చెందెను. రుద్రాధ్యాయముతో సమమగు మంత్రము వేరొండు లేదు. అది పఠించువారికి చతుర్విధ పురుషార్థములనివ్వ సమర్థము. గొప్ప పాపము లొనర్చువారు గూడ రుద్రమును జపించిన పవిత్రులై పరమపదవి నొందుదురు. బ్రహ్మదేవుడు రుద్రాభిషేకము చేయబడిన ఉదకమును అమృత తీర్థముగా చేసెను. అట్టి తీర్థమున స్నానముచేసినవారికది తారకము కాగలదు. అట్టి తీర్థము దుష్కర్మల నశింపజేయును. దానిని సేవించువారు సంసారమునుండి తరించెదరు. సుకృతము గాని దుష్కృతముగాని ఎవరు పూర్వజన్మమున చేయుదురో వారు వాటి ఫలమును ఈ జన్మమున తప్పక అనుభవింతురు.

పూర్వము బ్రహ్మదేవుడు సృష్ట్యాదియందు తన వక్షఃస్థలమునుండి ధర్మమును, పృష్ఠభాగమునుండి అధర్మమును నిర్మించెను. అందు అధర్మమాచరించువారు. ఇహపరముల దుఃఖముల ననుభవించెదరు. అధర్మమునకు మహా భయంకరము లగు కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములు పుత్రులు. వ్యభిచారము కామము యొక్క పుత్రుడు. ఇట్లే కామము ద్వారా చేయబడు దుష్కార్యములు గూడ కామము యొక్క పుత్రులనియే తెలియవలెను. క్రోధముతో చేయబడు హింస బ్రహ్మహత్యాది పాశములు క్రోధము యొక్క సంతానము. దేవబ్రాహ్మణ ద్రవ్యాపహరణము, కన్యావిక్రయము, దాతృత్వము లేకుండ ద్రవ్యము కూడబెట్టుట ఇవి

లోభసంతానములు.

యమధర్మరాజు ఒక దినమున తన దూతల పిలిచి మీరు నాయాజ్ఞ ననుసరించి భూలోకమున అధర్మమాచరించు వారిని నాలోకమునకు గొనిరండని ఆజ్ఞాపించెను. యముని యాజ్ఞను శిరసావహించి యమదూతలు పాశముల చేతపూని భూలోకమునకు వచ్చిరి, గాని ప్రతివారును రుద్రమును పఠించుచుండుటచే వారల సమీపించజాలక భయపడి యమలోకమునకు పరుగిడిపోయి యమునితో ఇట్లు చెప్పసాగిరి.

యమ ధర్మరాజా! జయజయ. మీయాజ్ఞ ననుసరించి మేము భూలోకమునకు వెళ్లితిమి. కాని అచ్చట వారు పఠించు రుద్రాధ్యాయమను అగ్నిచే దహింపబడి వారల సమీపించజాలక తిరిగి వచ్చితిమి. ఇక మీదట మేము భూమికి పోజాలము. మాగతియేమి? గ్రామ గ్రామముల, నదీతీరముల, దేవాలయముల యందు రుద్రాధ్యాయమును బ్రాహ్మణులు పఠించుచుండ నా గ్రామమును సమీపించు శక్తిగూడ మాకు లేకపోయెను. ఎన్ని ప్రాయశ్చిత్తములు చేసినను పోని పాపముల నాచరించిన వారును రుద్రపారాయణ మొనర్చి పునీతులగుచున్నారు. రుద్రము మాపాలిటి కాలకూటము. అట్టి భూమికిమేమెట్లు పోగలము. ఓ యమధర్మరాజా! బ్రహ్మదేవుడు నిర్మించిన రుద్రమను విషము మమ్ముల బాధింపకుండ చేయుమని యమదూతలు ప్రార్థించిరి. దూతల వాక్యములు విని యముడు కోపముతో శిరము కంపింపజేసి వెంటనే బ్రహ్మలోకమునకు వెళ్లి బ్రహ్మకు ప్రణమిల్లి ఇట్లనెను.

పద్మాసనా ! చతుర్ముఖ ! జయజయ. నేను మీయాజ్ఞకు బద్ధుడనయి యమలోకాధిపత్య మొనర్చుచున్నాను. నా దూతలు పాపాత్ముల కొని రాగలందులకు భూలోకమునకు పోయిరి. మహాపాపులు గూడ మీరొసగిన రుద్రపారాయణమను అగ్నిచే దగ్ధులై భీతిల్లి వచ్చిరి. నానరకము శూన్యమయినది. శూన్యమగు నరకమున నేనేమి రాజ్యము చేయగలను. ఇవ్విధమున నందరు ముక్తినొందినచో సృష్టి ఎట్లు జరుగగలదు. కాన ఏమి అయిన ఉపాయ మాలోచించి సృష్టిపరంపర నిర్విఘ్నముగ జరుగునట్లు చేయుడు. మీరు మానవులకు రుద్రము నెందులకిచ్చితిరి. అని ఇట్లు అడుగ బ్రహ్మదేవుడు కొంచె మాలోచించు యమునితో నిట్లు చెప్పుచున్నాడు.

ఇప్పటి నుండియు ఎవరు నియమము లేక దుర్మార్గులై భక్తిహీనులై శయనించుచు, నడచుచు, శుచిత్వము లేక జపింతురో, పఠింతురో వారి

పాపములు నశింపక పోగా అట్టివారు మహాపాపులుగ పరిగణింపబడుదురు. కాన నట్టివారు యమయాతన కర్హులేగాన వారల నీవు నీ దూతల ద్వారా యమ లోకమునకు గొనిపోయి శిక్షించుము. భక్తితో నియమముతో పఠించువారు వందనీయులు గాన వారి జోలికి మాత్రము పోవలదని నీదూతల కాజ్ఞాపింపుము. రుద్రజపముతో సమానమగు పుణ్యము మరి యెందులేదు. పూర్వజన్మార్జిత పాపముచే మానవుడు అల్పాయువగును. అట్టి పాపము గూడ రుద్రజపముచే నివర్తించును. సంపత్తియు, జ్ఞానము, బలము, వర్చస్సు, మేధ ఇవి అన్నియు రుద్రపారాయణముచే లభించును. రుద్రాభిషేక తీర్థముతో స్నానమొనర్చువారు పావనులయ్యెదరు. రుద్రమును జపించువాడు చిరంజీవియగును. అట్టి వానిని చూచి మృత్యువు భయపడును. శతరుద్రముతో శివు నేభిషేకించువారు. శతాయుష్మంతులగుదురు. కాన ఓ యమధర్మరాజా! ఈ విషయమును నీవు గ్రహించి నీదూతలతో నికమీద భక్తితో రుద్రపారాయణ చేయువారి జోలికి మాత్రము పోవద్దని చెప్పుమన యముడు బ్రహ్మకు నమస్కరించి సెలవు తీసికొని యమలోకమునకు వచ్చి తన దూతలకు నట్లే చెప్పెను.

కాన ఓ రాజా! నీ కుమారునకు రానున్న మృత్యువు తొలగి దీర్ఘాయుష్యము సిద్ధించవలయునన్న నీవు నూరుమంది సద్బ్రాహ్మణుల నాహ్వానించి వారిచే పదివేల రుద్రములచే శివునకభిషేకింపచేయుము. అట్లొనర్చితివేని నీకుమారుడు పదివేల సంవత్సరములు జీవించును. అఖండైశ్వర్యముతో రాజ్యమునుభవించును, అని పరాశరుడు చెప్ప రాజు పరాశరమహర్షినే యాచార్యునిగ నియమించి వారు చెప్పినటుల గొప్ప మంటపమేర్పరచి శతసంఖ్యాక బ్రాహ్మణుల రప్పించి నూరు కలశములతో నుదకము తెప్పించి అఖండధారగ నహోరాత్రులు ఏడుదినములు శివున కభిషేకము చేయించెను. నిత్యము అభిషేకతీర్థముతో రాజకుమారునకు స్నానము చేయించుచుండిరి. ఎనిమిదవదినము సంప్రాప్తముకాగా బాలునకు మృత్యువు సమాసన్నమైనందున యమదూతలు పాశములతో రాగా వారిని చూచి అతడట్లే మూర్ఛనొందెను. పరాశరుడును, రుద్రము జపించు బ్రాహ్మణులును బాలుని మీద మంత్రాక్షతల జల్లిరి. అందుచే యమదూతలు బాలుని సమీపించజాలక దూరము నుండి పాశముల బాలుని మీద వేయ ప్రయత్నించుచుండిరి. ఇంతలో కైలాసము నుండి శివదూతలు దండహస్తులై వచ్చి యమదూతలు పారద్రోలిరి.

శివదూతలచే కొట్టబడుచు యమదూతల చేయునది లేక యమలోకమున కేగిరి. అప్పుడు పరాశరుడు రుద్రాభిషేక తీర్థముచే బాలుని ప్రోక్షించి రక్షించెను. బాలుడు లేచి కూర్చుండెను. బ్రాహ్మణులు వేదమంత్రములతో రాజకుమారు నాశీర్వదించిరి. రాజు మహానందముతో పరాశరుని బ్రాహ్మణులను పూజించెను. సత్కరించెను. అన్నదాన మొనర్చెను. మహోత్సవ మొనర్చి సభచేసి పరాశరుని

సింహాసనమున కూర్చుండబెట్టి పూజించుచుండ నారదు డచ్చోటికి దైవ వశమున వచ్చెను. నారదుని చూచుట తోడనే సభలోని వారందరు దిగ్గున లేచిరి. రాజు నారదున కెదురేగి స్వాగత మొనర్చి తీసికొని వచ్చి ఉత్తమాసనమున కూర్చుండ బెట్టి చేతులు జోడించుకొని వినయావనతుడై వారితో ఓ దేవర్షీ! నారదమహర్షీ ! మీరు సమస్తలోకములయందు అవ్యాహతముగ తిరుగుచుందురు. ఎందైన ఏమియైన అపూర్వవిషయము గలిగిన సెలవిండని ప్రార్థించెను.

అంతనారదుడిట్లనెను. ఓ రాజానేనిప్పుడు కైలాసమునుండి వచ్చుచున్నాను.



అచ్చట నేనొక అపూర్వము చూచితిని. చెప్పెద వినుము. మహామృత్యువు దూతలతో గూడ నీకుమారుని గొనిపోవరాగ శివదూతలు వచ్చి వారల పరాభవించి వెడలకొట్టిరి. అప్పుడు యమదూతలు చేయునది లేక యమలోకమునకు పోయి యమధర్మరాజుతో జరిగిన విషయము చెప్పిరి. యముడు కుపితుడై వీరభద్రుని సమీపించి మా దూతలు నిజకర్మచే గతాయువగు

రాజపుత్రుని గొనిపోవరాగా మీ శివదూతలు నిష్కారణముగ మా దూతల నెందుకు దండించిరని ప్రశ్నించ వీరభద్రుడిట్లనెను. ఆ రాజకుమారునకు పదివేల సంవత్సరములు ఆయుష్యముండ నీవు చిత్రగుప్తునితో సరిగ నాలోచింపక దూతల నెటుల పంపితివి? నీ పుణ్యము మంచిదిగాన మా దూతలు మీ దూతల ప్రాణములతో వదలిరి. అని చెప్పెను. అప్పుడు వెంటనే యముడు చిత్రగుప్తుని పిలిపించి రాజకుమారుని ఆయుష్యపరిమితి చక్కగ విచారించి చెప్పుమనెను. చిత్రగుప్తుడు తన పుస్తకముల తెరచి చూడ అందు ఆ బాలునకు పన్నెండు సంవత్సరములే ఆయుష్యమనియు, కారణాంతరమున ఆగండము తప్పిన పదివేల సంవత్సరములు జీవించుననియు వ్రాయబడియుండెను. ఆ విషయము యముడు చూచి వీరభద్రుని తన పొరపాటునకు క్షమాపణ కోరుకొని తన పురమున కేగెను.

ఈ విషయము నేను కనులార గాంచినది అని చెప్ప ఆ రాజు నారదుని పూజించెను. నారదుడు అట నుండి వీణ మీటుచు ఆకాశ మార్గమున నేగెను. పరాశరమహర్షియు రాజుచే పూజింపబడి తన యాశ్రమమునకు పోయెను. బ్రాహ్మణులందరు రాజుచే సత్కరింపబడి వారి వారి గృహముల కేగిరి. ఆ రాజకుమారుడు రుద్రాధ్యాయమహిమచే మృత్యువును జయించి పదివేల సంవత్సరములు నిష్కంటకముగ రాజ్యపరిపాలన మొనర్చెను. ఇది అంతయు రుద్రాధ్యాయమహిమయని శ్రీ నృసింహాసరస్వతీస్వాములవారు ఆ దంపతులతో చెప్పిరి. స్వామి వారికి రుద్రాధ్యాయమన్న కడు ప్రేమ. కాన గురుమూర్తిని భక్తులు రుద్రాభిషేకముతో నర్చించెదరు. అని ఈ కథావృత్తాంతమును సిద్ధముని నామధారకునితో చెప్పెను. గురుమూర్తి చరిత్రను భక్తితోవినువారు భవసాగరమును సులభముగా దాటుదురు.

**ఇది గురుచరితమున ముప్పది నాల్గవ అధ్యాయము సమాప్తము.**

**దిగంబరా దిగంబరా శ్రీపాదవల్లభ దిగంబరా**

**శ్లో॥ శతరుద్రీయ మహాత్మ్యం మృతరాట్ సుతజీవనం ।**
**సత్యై శశంస సగురుః శ్రీదత్తశ్శరణంమమ ॥**

తా॥ రుద్రాభిషేకము యొక్క ప్రభావము వలన మృతుడైన రాజకుమారుడు జీవించుట.

# శ్రీ గురు చరితము

## ముప్పది అయిదవ అధ్యాయము

**ఓమ్ అవధూత చింతనం శ్రీగురుదేవదత్త జయ ఓమ్**

**ఓం శ్రీ గురుదేవదత్త, ఓం శ్రీ గణాధిపతయేనమః**

**ఓం శ్రీ గురుభ్యోనమః**

నామధారకుడు సిద్ధమునితో స్వామీ! గురుమూర్తి దంపతులతో రుద్రాధ్యాయమాహాత్మ్యమును చెప్పిన విషయమును మీ వలన వింటిని. ఆపయిన జరిగిన కథా వృత్తాంతమును సెలవిండు అని ప్రార్థించ సిద్ధముని ఇట్లు చెప్పుచుండెను.

ఒక దినమున నా దంపతులు ఉదయమున లేచి స్నానమొనర్చి గురుమూర్తిని దర్శింపవచ్చిరి. అప్పుడు ఆ పతివ్రత స్వామివారిని చేతులు జోడించుకొని ఇట్లు వేడెను. స్వామీ ముందు నాకు సద్గతి కలుగగలందులకు ఏది అయిన మంత్రముపదేశింపుడు అని ప్రశ్నించగా గురుమూర్తి ఇట్లు చెప్పుచుండిరి.

స్త్రీలు తరించుటకు పతిసేవయే చాలును. స్త్రీలకు మంత్ర ముపదేశింపరాదు. అట్లెవరయిన ఉపదేశించిన ఉపదేశించినవారి మంత్రమునకుగూడ మహా హాని వాటిల్లును. ఈ విషయము నీకు తెలియగలందులకు పురాతనమగు నొక ఇతిహాసమును చెప్పుచున్నాను వినుము.

పూర్వము దేవదానవులకు ఘోరమగు సంగ్రామము జరిగెను. యుద్ధమున దేవతలచే మృతినొందిన రాక్షసుల వారి గురువగు శుక్రాచార్యులు తన మృతసంజీవినివిద్యచే జీవింప జేయుచుండిరి. అట్లు జీవించి తిరిగి రాక్షసులు దేవతలమీదికి యుద్ధసన్నద్ధు లగుచుండిరి. దేవేంద్రు డది గ్రహించి కైలాసమున కేగి ఈశ్వరునితో శుక్రాచార్యుని వలన దేవతలకు కలుగుచున్న అపకారమును గూర్చి చెప్పెను. శివుడు కోపించి నందీశ్వరునితో శుక్రాచార్యుని అట్లే పలుకురమ్మని చెప్పనందీశ్వరుడు శుక్రడున్న స్థానమునకు వెళ్లి ధ్యాననిష్ఠుడయిన శుక్రుని అట్లే పట్టుకొనిరాగా శివుడతనిని అగస్త్యుడు సముద్రమును పానము చేసినటుల భక్షించెను. కాని మంత్రప్రభావముచే శుక్రుడు మరణించక కొంతకాలమునకు శివుని మూత్రద్వారము నుండి శుక్రరూపమున బయటకు వచ్చెను. అంతకు పూర్వము భార్గవుడను పేరుగల ఇతడు శివుని శుక్ర సంపర్కముచే శుక్రుడని లోకవిఖ్యాతుడయ్యెను. ఇట్లు బయటకు వచ్చి తిరిగి

యథాపూర్వముగ రాక్షసుల బ్రతికించుచుండెను. అప్పు డింద్రుడు బృహస్పతిని సమీపించి అతనితో గురోత్తమా: శుక్రుడు చనిపోయిన రాక్షసుల బ్రతికించుచున్నాడు. అట్లు జరుగకుండ మీరేమయిన విఘ్నమాచరింపవలయును. మీరు మమ్ముల నుపేక్షించుట ధర్మముగాదు. మీరు మాకు పూజ్యులు. బుద్ధిసూక్ష్మమున మీరు శుక్రునికి తీసిపోరు.

కాన ఎట్లయిన మమ్ముల రక్షింపుడని ప్రార్థించెను. అప్పుడు బృహస్పతి సంతసించి సంజీవినీమంత్రము శుక్రునివద్దనే కలదు. మనము ఏది అయిన ఉపాయముచే ఆ మంత్ర ప్రభావము నశించునటుల చేయవలయును. నేను నాకుమారుడగు కచుని అతని వద్దకు విద్యార్థిగ పంపెద. అతను ఎట్లయిన శుక్రుని వద్ద నుండి మంత్రమును గ్రహించి రాగలడు. అని దేవేంద్రుని సమాధానపరచి బృహస్పతి తన కుమారుడయిన కచుని పిలిచి నీవు దేవకార్యము కొరకు విద్యార్థిరూపము ధరించి శుక్రుని వద్దకు పొమ్ము. దేవతల నిందించి అయినను అతని విశ్వాసము సంపాదించి మనోవాక్కాయకర్మలతో నాతని సేవించి అతని వద్ద నుండి సంజీవినీమంత్రమును ఎటులయిన గ్రహించి రమ్ము అని చెప్పెను. కచుడు బృహస్పతి చెప్పినటుల విద్యార్థి రూపముతో శుక్రాచార్యుని గృహమున కేతెంచి అతనికి నమస్కరించి చేతులు జోడించుకొని నిలువబడెను. శుక్రుడు నీవెవ్వడవు? ఎందులకుగాను వచ్చితివని ప్రశ్నింప కచుడు శుక్రునితో స్వామీ! నేను మీ కీర్తి విని విద్యార్థినయి వచ్చితిని. బ్రాహ్మణబాలుడను. మీరు అనాథరక్షకులు. భక్తులకు చింతామణివంటివారు. మీ చరణసేవ చేసెద. నన్ను శిష్యునిగ పరిగణింపుడని ప్రార్థించెను. ఆ మాటలు విని శుక్రుడు విచారించుచుండ అచ్చట శుక్రాచార్యుని కుమార్తె అయిన దేవయానియను కన్యారత్నము కచుని చూచి అతని నిరుపమానమగు సౌందర్యమును చూచి ఇతను నాకు పతి అయిన బాగుండును అని మనమున భావించి తండ్రితో ఈ బాలుని మీరు శిష్యునిగ నంగీకరింపుడు అని చెప్ప పుత్రికయందలి వాత్సల్యముతో శుక్రుడు కచుని శిష్యునిగ నంగీకరించెను.

ఇట్లు కొన్ని రోజులు జరుగ రాక్షసులు ఈ కచుని దేవ పక్షమువానిగను కపటవేషముతో తమ గురువు వద్దనుండి విద్యారహస్యముల గొనిపోవ వచ్చినవానిగను గ్రహించిరి. శుక్రుడు కచునకు విద్య చెప్పిన తమకు భంగము వాటిల్లునని భావించి ఒకనాడు సమిధల తెచ్చుటకుగాను కచును వనముల కేగ అతనితో బాటు దైత్యులుగూడ వెళ్లి అరణ్యమున అతనిని సంహరించి

సమిధల తామే తెచ్చియిచ్చిరి. సాయంకాలమయినను కచుడు రానందుకు దేవయాని చింతించి తండ్రిని సమీపించి కచుడేమయ్యెను? అతను రానిది నేను భుజపించను అని యన శుక్రుడు తన ధ్యానదృష్టితో కచుడరణ్యమున మృతుడయియుండుట తెలిసికొని సంజీవనీమంత్ర ప్రభావముతో బ్రతికించెను. కచుడు శుక్రుని ఆశ్రమమునకు సుఖముగ తిరిగి వచ్చెను.

ఇట్లు కొంతకాలము జరుగ రాక్షసులు ద్వేషపూరితులయి ఒకనాడు కచుని అరణ్యమున సంహరించి శుక్రుడు తిరిగి బ్రతికించునేమో యను సందేహముతో వాని శవమును ముక్కలుముక్కలుగా ఖండించి దశదిక్కుల చిమ్మివైచిరి. సాయంకాలమయినను కచుడు తిరిగి రానందులకు దేవయాని తండ్రిని సమీపించి కచుడు నా ప్రాణ స్నేహితుడు అతను ఇంకను తిరిగిరాలేదు. అతను రానియెడల నేను విషయము భక్షించి మరణించెదనని చెప్పెను. శుక్రుడు పుత్రికయందలి వ్యామోహముచే, వాత్సల్యముచే దివ్యదృష్టితో కచుడు ఖండఖండములుగ ఖండింపబడెనని గ్రహించి తన మంత్ర ప్రభావముచే తిరిగి బ్రతికింపజేసెను కచుడు ఆశ్రమమునకు ఆశ్రమమున చేరెను, దేవయాని సంతోషించెను. అప్పుడు రాక్షసులు గుమిగూడి మనము కచుని సంహరించినను పుత్రికయందలి ప్రేమచే మాటిమాటికి బ్రతికించుచున్నాడు. ఒక ఉపాయము చేసెదము గాక అని నిశ్చయించుకొని ఏకాదశీదినమున కచుని అరణ్యమున సంహరించి భస్మమొనర్చి ఆ భస్మమును పానీయమున కలిపి శుక్రునిచే త్రాగించిరి. శుక్రుడును విచారించక విశ్వసించి త్రాగెను. మామూలు ప్రకారము కచుడు రానందున దేవయాని దుఃఖించుచు తండ్రిని సమీపించి తండ్రితో నా ప్రాణ స్నేహితుడు నేడు రాడాయెను. ఏమయ్యెనో ఏమోయని దుఃఖించెను. అప్పుడు శుక్రుడు జ్ఞానదృష్టితో బాహ్యమున చూచెను. ఎక్కడను కచుడు కనబడకపోయెను. అప్పుడు అంతర్దృష్టిచే చూడ తన ఉదరముననే జీర్ణమయి యుండి నటుల గోచరించెను. అప్పుడు కుమార్తెతో కచుడు నా ఉదరమున జీర్ణమయి యున్నాడు. నేనతనిని బ్రతికించితినేని నేనే మరణించవలసి వచ్చును. అతనితో నీకేమి ప్రయోజనము అని యన ఆమె నేనతనిని కామించితిని. అతనికి భార్యనయి మేమిద్దరము నీవద్దనే యుండెదము. అట్టి నా ప్రియుని బ్రతికించనిచో మీఎదుట నేనిక్కడే ప్రాణముల వదలేదను. అని దుఃఖింపసాగెను. ఆ మాట విని కుమార్తెతో అతనిని బ్రతికించినచో నేను మరణించెదను. అప్పుడు నిన్ను కన్యాదాన మొనర్చువారెవరు? అని యన దేవయాని అందరిని జీవింప

జేసెడి మీకు మరణ మెట్లు రాగలదు. ఇది ఏమిచిత్రము అని అనెను. అందుకు శుక్రుడు పుత్రీ, జీవింపజేసెడి సంజీవినీ మంత్రము నావద్దనే గలదు. నేనే మరణించిన నన్ను బ్రతికించు వారెవ్వరు? అని యన కుమార్తె బద్ధహస్తురాలయి తండ్రీ! మీరా మంత్రమును నాకుపదేశింపుడు. కచుని బ్రతికించుడు, కచుడు మీ ఉదరమును చీల్చికొని రాగా నేను మీరుపదేశించిన మంత్రము పఠించిమిమ్ముల బ్రతికించెదనని పాదము లకు నమస్కరించెను.

అప్పుడు శుక్రుడు పుత్రీస్త్రీలకు మంత్రోపదేశము చేయరాదు. పతిభక్తియే స్త్రీలకు ధర్మము. అట్లెవరైన స్త్రీలకు మంత్రోపదేశము చేసినచో ఆ మంత్ర ప్రభావమునకే కీడు వాటిల్లును. అని అనెను. అప్పుడు దేవయాని మీరు మీ మంత్రమును సుఖముగ నుండుడు. ఇక నేను బ్రతుకను. అని క్రిందపడి మూర్ఛిల్లెను శుక్రుడు పుత్రికయందలి వ్యామోహముతో కుమార్తెను లేవదీసి చేయునది లేక సంజీవినీ మంత్రమును ఆమెకు ఉపదేశించెను. కచుడును ఉ దరమునుండి ఆ మంత్రమును వినుట తటస్థించెను. ఉదరముననున్న కచుడు జీవించి శుక్రుని పొట్టను చీల్చికొని బయటకు వచ్చెను. అప్పుడు దేవయాని మంత్రము నుచ్చరించి తండ్రిని బ్రతికించెను. అప్పుడును కచుడు మంత్రమును వినుట తటస్థించినందున కార్యము సానుకూలమయ్యెను అని సంతసించి శుక్రుని సమీపించి నమస్కరించి ఆచార్యా నామనోరథము నెరవేరినది. నేనిచ్చట నున్న రాక్షసులు ద్వేషముతో నన్ను హింసించుచున్నారు. కాన మీయాజ్ఞ అయినచో వెళ్లెదననెను. శుక్రుడును సంతసించి పొమ్మనెను.

కచుడు పోవుచుండ దేవయాని అతని వస్త్రమును పట్టుకొని నేను నిన్ను ప్రేమించితిని. నీ ప్రాణముల మూడు సారులు కాపాడితిని. నన్ను వివాహమాడి ఇచ్చుటనే సుఖముగ నుండుమని బలాత్కరించెను. అప్పుడు కచుడు నీవు గురుపుత్రివి గాన నాకు సోదరివగుదువు. ప్రాణముల రక్షించినందున తల్లితో సమానురాలవు కాన నేనెట్లు నిన్ను వివాహమాడగలను అని నిరాకరించెను. ఆమె కోపించి నీ విద్య వ్యర్థమగు గాక! కపటముచే మా తండ్రి వద్ద విద్యాభ్యాసమొనర్చితివి గాన ఈ విద్యను నీవు విస్మరింతువు గాక అని శపించెను. అప్పుడు కచుడు నీవు అనవసరముగా నన్నిట్లు శపించితివి గాన నీకిక మీద బ్రాహ్మణుడు భర్తగ లభించడు. బ్రాహ్మణేతరుడే నిన్ను వరించును. ఇది గాక మీ తండ్రి శాస్త్రవిరుద్ధముగ పుత్రికావ్యామోహముతో నీకు

మంత్రోపదేశము చేసెను గాన ఈ సంజీవినీమంత్రమున కికమీద ఎట్టి ప్రభావమును లేకపోవును గాక అని శపించి స్వర్గమునకు పోయెను. దేవతలందరు కచుని ఉపకారమునకు సంతసించిరి.

కాన ఓ సాధ్వీ ! స్త్రీలకు మంత్రోపదేశము కూడదు. పతిసేవయే వారలకు పరమధర్మము. గురువుల యొక్క ఆజ్ఞననుసరించి వ్రతముల ఉపవాసముల సేయవచ్చుననిరి. అప్పుడా సావిత్రియను పతివ్రత స్వామీ! ఏమి అయిన వ్రతము నుపదేశింపుడు మీపాదస్మరణ పూర్వకముగ మీ రుపదేశించిన వ్రతమును శ్రద్ధతో నాచరించి తరించెదనని ప్రార్థించెను. అప్పుడు గురుమూర్తి సంతసించి మీ దంపతులకు సర్వసౌఖ్యముల నొసగునట్టియు, స్త్రీలకు స్థిర సౌభాగ్యము ఘటింపజేయు నట్టియు ఒక వ్రతము చెప్పెద వినుమని ఇట్లు చెప్పిరి.

పూర్వము ఋషు లీవిషయముననే సూతుని ప్రశ్నింప సూత మహర్షి ఋషుల కేమి చెప్పెనో దానినే మీకు చెప్పుచున్నాను. స్త్రీలుగాని, పురుషులు గాని, నిర్వికల్పుడు, నిరామయుడు అయిన ఈశ్వరుని ఆరాధించుచో సర్వాభీష్టముల నొందగలరు. నిరక్తులుగాని. విషయా సక్తులు గాని ఎవ్వరయిన భక్తితో పూజించుచో ఈశ్వరుడు వారిపట్ల ప్రసన్నుడగును. సంసారసముద్రమును అనాయాసముగ తరించగోరు వారు సోమవార వ్రతముచే శివుని ఆరాధించి సంతోషపెట్టవలయును. ఈశ్వరారాధనము వలన సర్వాభీష్టములు సిద్ధించును. ఈశ్వరా రాధనారూపమైన సోమవార వ్రతము వ్రతములలోకెల్ల నుత్తమమైనది. సోమవార వ్రత మాచరించువారు ఉపవాసముండిగాని నక్తభోజనమొనర్చి కాని శివుని ఆరాధించవలయును బ్రహ్మచారులు, గృహస్థులు, స్త్రీలు. కుమారికలు, భర్తృహీనులైన విధవలు గూడ నీ వ్రతము నాచరింపనర్హులు. ఈ వ్రత ప్రభావము తెలియగలందులకు గాను స్కాందపురాణమందలి ఒక ఇతిహాసమును చెప్పెద వినుము.

పూర్వము చిత్రవర్మయను రాజు ఆర్యావర్తనము పాలించుచుండెను. అప్పుడు పుణ్యాత్ముడు, ధార్మికుడు, శూరుడు ఇట్టి రాజు అఖండైశ్వర్యములతో తులతూగుచు చాలకాలము సంతానములేక శివుని పూజించి అతని అనుగ్రహమున ఒక కుమార్తెను పొందెను. రాజు కుమార్తెయొక్క సౌందర్యాతి శయమునకు సంతసించి జ్యోతిష్కుల పిలిచి కుమార్తెయొక్క జన్మలగ్నము పరీక్షించి జాతకము చెప్పుడని వారల ప్రార్థించవారిట్లు చెప్పిరి.

ఈ బాలిక పార్వతివలె సర్వమంగళ రూపముతో దమయంతినిబోలి యుండును. కీర్తిలో భాగీరథికి సరి. గుణములల లక్ష్మితో సమురాలు. సీతతో పాతివ్రత్యమును తులతూగును. ఈమె భర్తతో కలసి పదివేల సంవత్సరములు భూమిని పరిపాలించును. అని చెప్పిరి. రాజు సంతసించి జాతకము చెప్పినవాలర యథేచ్ఛగ ధనముచే సత్కరించెను. తన కుమార్తెకు సీమంతినియని నామకరణమొనర్చి సుఖముగ నుండ ఒక దినమున ఒక బ్రాహ్మణుడు రాజసభకు వచ్చి సీమంతిని జాతకము చూచి నిర్భయముగ ఓరాజా నీ కుమార్తె సర్వసులక్షణములుగల దైనను పదునాల్గవ సంవత్సరమున వైధవ్యము రాగలదు అని చెప్పిపోయెను. రాజు ఆ మాటలు విని మూర్ఛనొంది లేచి దుఃఖించి సర్వము ఈశ్వరాధీనము నేనేమి చేయుదునని తలచుచుండెను.

ఇట్లుండ సీమంతినికి ఏడు సంవత్సరములు రాగా రాజు ఇటుల చింతింపసాగెను. బ్రాహ్మణుడు ఈమెకు పదునాల్గు సంవత్సరములకు వైధవ్యము వచ్చునని చెప్పెను. నేనీబాలికకు వివాహమెట్లు చేసెదనని భార్యతో గూడ విచారనిమగ్నుడగుచుండెను. సీమంతిని ఒక దినమున చెలికత్తెలతో కలసి ఉ ద్యానవనమున విహరించుచు చెలికత్తెలద్వారా తనకు 14వ సంవత్సరమున వైధవ్యము వచ్చునని తెలిసికొని అల్పవయస్కురాలైనను కడు దుఃఖించుచుండెను. ఒకనాడు దైవవశమున యాజ్ఞవల్క్యుని భార్య మైత్రేయియను సతీరత్నము తమ భవనమునకురాగా సీమంతిని ఆమె పాదములకు నమస్కరించి ఆమెతో తల్లీ నన్నుద్ధరింపుము. నాకు స్థిరసౌభాగ్యము లభించెడి ఉపాయమేమి అయిన నన్ను నుపదేశింపుమని దీనురాలై ప్రార్థించ ఆ బ్రహ్మవాదియగు మైత్రేయి సీమంతినితో అమ్మా నీవు సోముని సేవించుము. శివుని అనుగ్రహముచే స్థిర సౌభాగ్యము నీకు సిద్ధించును అన ఆ బాలిక తల్లీ ఆ వ్రతమేమిటో, ఎట్లొనర్చవలయునో, ఆనతిమ్మని ప్రార్థించ మైత్రేయి సీమంతినితో నిట్లు చెప్పుచున్నది.

నీవు సోమవారవ్రత మాచరింపుము మనస్సు స్థిరము చేసికొని సోమవారము ప్రాతఃకాలము స్నానముచేసి ఉపవాస విధిగ గౌరీహరుని భక్తితో నారాధించుము. శివపూజ యొక్క మహిమచెప్పెద వినుము. అభిషేకముచే పాపములు నశించును. పీఠపూజచే సామ్రాజ్యము లభించును. గంధాక్షత పుష్పాదులచే పూజించిన సౌభాగ్యము, సౌఖ్యము లభించును. ధూపముచే సౌందర్యము, దీపముచే కాంతియు, నైవేద్యములచే భోగములు, తాంబూలార్పణముచే

లక్ష్మియు, నమస్కార మాత్రమున చతుర్విధ పురుషార్థ సిద్ధియు, మంత్రజపమువలన అష్టఐశ్వర్య ప్రాప్తియు, హోమముచే కోశసమృద్ధియు, స్తోత్రమొనర్చుటే సర్వసమృద్ధియు, బ్రాహ్మణ భోజనముచే సర్వదేవతా తృప్తియు కలుగగలదు.

ఓ కన్యకా ! నీవు ఈ విధముగ సోమవారవ్రతమాచరించుము. నీ క్లేశములు తొలగును. దురితము నశించును. భయము సంభవించినను హరుడు రక్షించి కాపాడును. గౌరీహరుల పూజచే సర్వపాపములు క్షయించును. అని మైత్రేయి చెప్పి వెడలెను. అప్పటినుండియు సమీంతిని శ్రద్ధతో సోమవారవ్రతమాచరించి చేయుచుండ తండ్రియు చూచి సంతసించెను.

సీమంతిని తండ్రియైన చిత్రవర్మయు దైవము మీదనే భారముంచి యుక్త వయస్సున తన కుమార్తెకు వివాహమొనర్చుట ధర్మమని తలచి మంత్రులద్వారా విచారించి నలుని వంశమందు జన్మించిన ఇంద్రసేన మమారాజు పుత్రుడయిన చంద్రాంగరవ్మకిచ్చి గొప్ప వైభవముతో తనకుమార్తెకు వివాహము జరిపెను. వివాహమునకు వచ్చిన రాజుల గౌరవించెను. బ్రాహ్మణుల సత్కరించెను. అల్లుడయిన చంద్రాంగదునకు పారిబర్హముగ ననేక రత్నములు దాసదాసీజనముల గూడ నొసంగెను. వివాహమున కేతెంచినవారందరు రాజుచే సత్కరింపబడి వెళ్లిరి.

చిత్రవర్మ కుమార్తెయందలి వ్యామోహముతో తన అల్లుడైన చంద్రాంగదుని తన ఇంటనే ఉంచుకొనెను. ఇట్లుండ సీమంతినికి 14 సంవత్సరములు పూర్తికాగా నొకరోజున చంద్రాంగదునకు యమునా నదియందు జలక్రీడచేయ కోరిక కలిగెను. కొంత పరివారముతో నతడు నదికేగి యొక పడవ నెక్కి జలక్రీడ నొనర్చుచుండెను. పరివారము నదికి ఉభయతటముల నిలువబడియుండిరి. అదేసమయమున ప్రవాహ మధ్యమున ఆ పడవ మునిగెను. జనులు హాహాకారమొనర్చిరి. నావికులు నదిలోదూకి ఎంతయోశోధించిరిగాని చంద్రాంగదుని శరీరము కనబడలేదు. వెంటనే కొంతమంది చిత్రవర్మని సమీపించి మీ అల్లుడు చంద్రాంగదుడు యమునానదిలో మునిగిపోయెను. ఎంతవెతికినను కనబలేదు అని చెప్పిరి. ఆ మాటలు విని రాజు మూర్ఛిల్లెను. సీమంతిని ప్రాణములు విడువ నుద్యుక్తురాలయ్యెను. అందరు యమునానదికి వచ్చిరి. ఎంత శోధించినను వారలకు శవమయినను గోచరము కాలేదు. అప్పుడు సీమంతిని ఇటుల దుఃఖించెను.

దేవా ! త్రిపురాంతకా ! శరణువేడిన నన్ను రక్షించవైతివి. నేనొర్చిన వ్రతమిట్లు నిష్ఫలమయ్యెను. నన్నుపేక్షించుట ధర్మంఆ! ఇట్లొనర్చుట నీ కపకీర్తిగదా ! నాకు 14వత్సరములకువైధవ్యము వచ్చునను భీతిలో మైత్రేయిని ప్రార్థించ ఆమె సోమవారవ్రతమాచరించుము నీకు సౌభాగ్యము వర్ధిల్లునని చెప్ప నేనట్లొనర్చితిని శంకార ! ఇక నా గతియేమి ? అని దుఃఖించుచుండ మంత్రులు పురోహితులు ఆమె కెంతయో బోధించిరి. ఇంతలో ఈ వృత్తాంతము తెలిసి చంద్రాంగదుని తండ్రియగు ఇంద్రసే9న మహారాజు భార్యతో గూడ శోకసాగరమున మునిగి అచ్చటకు వచ్చెను. అందరును హాహాకారములు చేయుము శిరమున వక్షఃస్థలమును కాదు కొనచు దుఃఖింపసాగిరి. సీమంతిని హా ! ప్రాణనాథా ! ఎటకేగితివని దుఃఖించుచు నేను జీవించి ఏమిప్రయోజనము. సహగమన మొనరర్చెదననెను అచట విద్వాంసులు శవము కనిపించనది సహగమనమెట్లు చేయనగును. అతను జీవించెనో మరణించెనో మనమెట్లు నిర్ణయించగలము అని చెప్పిరి. విధి లిఖితము తప్పింపరాదు కాన మీరుదుఃఖించక మీ గృహమునకు పొందు అని చెప్పిరి. ఇంద్రసేనుడు పుత్రదుఃఖముతో కృశించుచు రాజ్యమునందు దృష్టియుంచక యుండుటచే దాయాదులు అతనిని భార్యసమేతముగా కారాగారమున నుంచి రాజ్యమహపరించిరి. ప్రాణముల త్యజించ నుద్యుక్తురాలగు సమీంతనితో తండ్రి అమ్మా ! నాకు నీవు తప్ప వేరు సంతానములేదు. లోకులు నిందించిన నిందింతురుగాక. నీవు ఒక సంవత్సరము వైధవ్యారణ మొనర్చుచు నుండుము. అని బ్రతిమాలుకొనెను ఆమెయు తండ్రి మాటలు విని శోకార్తురాలయ్యెను. సోమవారవ్రతము మాత్రము నియమముతో యథాపూర్వకముగ నాచరించుచుండెను.

ఇక నారాజకుమారుడు యమునాదిలో నిమగ్నుడు కాగా దైవవశమున నచ్చట నాగకన్యకలు విహరించుచుండిరి. వారు ప్రవాహమున కొట్టుకొనిపోవుచున్న రాజకుమారుని చూచి అతని సౌందర్యమున కాశ్చర్యముచెంది అతనిని నాగలోకమునకు గొనిపోయి అమృతమును ప్రోక్షించి జీవింపచేసి నాగలోకమునకు రాజయిన వాసుకి ఎదుటకు తీసికొని వెళ్లిరి. అప్పుడు చంద్రాంగదుడు రత్నఖచితములైన గోపురముల తోడను సువర్ణ భవనములచేతను చంద్రకాంతి వలె ప్రకాశించెడి పాతాళలోకరచనను చూచి అత్యాశ్చర్యపడెను. వాసుకి యొక్క సభయందు సభ్యులందరును సర్పములే. మధ్యపీఠమున సూర్యకాంతితో సమముగ ప్రకాశించుచు పచ్చని వస్త్రము

ధరించి అనేక ఫణములతో వాసుకి కూర్చుండి యుండెను. నవయౌవనముతో సర్వాభరణభూషితులగు నాగకన్యకలు సర్పరాజును సేవించుచుండిరి. అట్టి నాగరాజును ఈ రాజకుమారుడు చూచి సాష్టాంగముగ నమస్కరించెను. వాసుకియు నాగకన్యకలను శుభలక్షణములుగల ఈ కుమారుడెవ్వడు ? మీకెచ్చట లభించెను. అని ప్రశ్నించవారు ప్రభో ! ఇతనెవరో మాకు తెలియదు. మేము యమునానదిలో విహరించుచుండ మాకితను గోచరించెను. మీవద్దకు తెచ్చితిమనిరి. అప్పుడు వాసుకియే ఆ రాజకుమారునితో నీపేరేమి ? నీదేశమేమి? ఇచ్చటకు వచ్చుటకు కారణమేమి ? అని ప్రశ్నించ చంద్రాంగదుడిట్లు చెప్పుచుండెను.

భూలోకమున నిషధదేశమున నలుడను పుణ్యశ్లోకుడుండెను. అతని వంశమున ఇంద్రసేనుడను రాజునకు నేను జన్మించితిని. నేను మామగారియింటనుండ దైవవశమున జలక్రీడయొనర్చుచు యమునాజలమున మునిగితిని. ప్రవాహమున కొట్టుకొనిపోవుచుండ నన్ను నాగకన్యక లిచటకు తెచ్చిరి మీదర్శనముచే నా జన్మ సఫలమయ్యెను. కృతార్థుడనయితిని. పూర్వార్జిత పుణ్యముచే తిరిగి జీవించు భాగ్యము నాకు కలిగెను అని వినయముతో చెప్పెను. ఆ మాటలు విని నాగరాజు సంతసించి పుత్రా భయపడకుము అని ధైర్యము చెప్పి మీరు భూలోకమున ఏదేవుని ఆరాధింతురో చెప్పుమనియన చంద్రాంగదు డిట్లు హర్ష నిర్భరమానసుడయి చెప్పుచుండెను.

మాకు దేవుడు శంకరుడు. అట్టి సదాశివుడు దేవాధి దేవుడు. శివున వామాంగమున గౌరి ప్రకాశించుచుండును. ఏ దేవుడు తన రజోగుణముచే బ్రహ్మను సృజించి అతనిద్వారా జగమును సృజింపచేయుచున్నాడో అట్టి సదాశివుల మేము పూజింతుము. ఏ దేవుడు తన సత్వగుణముచే విష్ణువును నిర్మించి జగమును పాలించుచుండెనో అట్టి శివున మేమారాధింతుము. ఏదేవుడు తన తమోగుణముచే ఏకాదశరుద్రుల నిర్మించి ప్రళయకాలమున జగముల సంహరింపజేయునో, ఎవరు పంచ భూతాత్మకుడో, సర్వవ్యాపకుడో, చిన్మయుడో, నిరంజనుడో, మనోవాక్కులకుగూడ గోచరముకాడో, ఎవడు తక్షక శేషుల కుండలములుగ ధరించునో, వ్యాఘ్రచర్మము ధరించి త్రినేత్రుడయి చంద్రుని శిరోభూషణముగ ధరించునో, అట్టి మహేశ్వరుని మేము పూజింతుము, అని చెప్ప అతని వాక్యములకు నాగరాజు కడు సంతసించి ఆ రాజకుమారుని ఆలింగనమొనర్చి అతనితో రాజకుమారా ! నీవిచ్చటయుండి ఈ పాతాళలోకాధిపత్య మొనర్చుము. ఈ

పాతాళము కల్పవృక్షములతోడను, అమృతముతో నిండిన వాపీకూపతటాకాదుల తోడను శోభిల్లుచుండును. ఇచ్చట నుండువారికి స్వప్నావస్థయందేని రోగభయముగాని, మృత్యుభయముగాని లేదు. కాన సుఖముగ నీవిచ్చటనే ఉ ండుమని ప్రార్థింప ఆ రాజకుమారుడు ఆ నాగరాజుతో ఓ నాగరాజా ! నా తండ్రికి నేనొక్కడనే నొక్కడనే పుత్రుడను. నాకు నూతనముగ వివాహమయ్యెను. ఆమెయు పదునాలుగు సంవత్సరముల వయస్సుకలది అయినను వివుని నిత్యమారాధించుచుండును. నేను యమునానదిలో మరణించితినని తలచి వారెట్లుండిరో ? మీపాదకమలముల దర్శించితిని. నా ప్రాణముల రక్షించితిరి. నాస్వకీయుల జూడవలయునని నామనము తహతహలాడుచున్నది. అని చెప్ప వాసుకియు సంతసించి అనేక భూషణములను, వస్త్రములను, రత్నములను కల్పవృక్ష ఫలములను భార్యకుగాను కొంత అమృతమును ఇచ్చి ఒక నాగకుమారుని సహాయమునిగ నిచ్చి, మనోవేగములగల ఒక అశ్వమునధిష్టింపజేసి అతనిని సాగనంపుచు అతనితో నీకవసరమైనపుడు నన్ను స్మరించుము. నీకార్యము సఫలముచేసెదనని చెప్పి పంపివేసెను.

రాజకుమారుడు అశ్వము నధిష్టించి నాగపుత్రునితో సహక్షణకాలమున యమునానదీతీరమునకు తానెచ్చటమునిగెనో అచ్చటకే వచ్చెను. ఆ రోజు సోమవారమియనందున సీమంతినియు చెలికత్తెలతో కలసి నదీ స్నానమొనర్చుటకు గాను అచ్చటకే దైవవశమున వచ్చి ప్రవాహము నుండి వచ్చుచున్న రాజకుమారుని చూచి చెలికత్తెతో సఖీ ఒక నాగపుత్రునితో కలసి ఎవ్వరో మనోహరమయిన రూపముతో అశ్వము నధిష్టించి వచ్చుచున్నారు. ఎవరయిన రాక్షసుడు మనుష్య రూపమున వచ్చుచుండెనా ! ఇతని రూపము చూడ పూర్వమెప్పుడో చూచిన జ్ఞాపకము కలుగుచున్నది. నా భర్తవలెనున్నాడు. ఇదేమియని భయపడుచు అట్లే నిర్వణ్ణురాలయి చూచుండెను. రాజపుత్రుడును నదీతీరమునకు వచ్చి దూరముగనున్న సమీంతినిన చూచి ఆమె ఎవ్వరయి యుండవచ్చును. ముఖముచూసిన నాప్రియురాలు జ్ఞప్తికి వచ్చుచున్నది. కంఠ సూత్రముగాని ముక్తాహారములుగాని కుంకుమ మొదలగు శుభలక్షణములు గాని కనపడవయ్యె. ఈమె ఎవ్వరయి యుండవచ్చు అని విచారించుచు అశ్వమునుండి దిగి ఆ సీమంతినిని దగ్గరకు పిలిచి నీవెవ్వరవు ? నీ భర్త ఎచ్చట ? ఇంత బాల్యమున నీ ముఖమున శోకలక్షణములు కనబడుచున్నవి. నీ వృత్తాంతము చెప్పుమని ప్రశ్నించ ఆమెసిగ్గుపడుచు తనచెలికత్తెకు సూచించ ఆమె ఇట్లు చెప్పుచుండెను.

ఈమె పేరు సీమంతిని అందురు. చిత్రవర్మయొక్క కుమార్తె. చంద్రాంగదుని భార్య. కొంత కాలముక్రింద దైవవశమున ఈమె భర్త జలక్రీడకు గాను వచ్చి యమునా నదిలో మునిగిపోయెను. వైధవ్యముతో దుఃఖింతురాలయ్యి ఈ దినము సోమవారమగుటచే ఈమె స్నానార్థమిదటి కేతెంచెను, ఈమెయొక్క అత్తమామలు పుత్రదుఃఖముతో దుఃఖించుచుండ దాయాదులు వారిరాజ్య మపహరించి వారిని కారాగారమునందుంచిరి. ఇట్టి కష్టములు సంప్రాప్తమయినను ఈమె సోమవారమున శూలపాణిని ఆరాధించుట మానలేదు. అని ట్లు చెపచుండ సీమంతిని స్వయముగ అతనితో మీరెవ్వరు? మమ్ముల ప్రశ్నించుటకు కారణమేమి ? గంధర్వులా ! సిద్ధులా ! కిన్నరులా ! మనుష్యరూపముతో కనబడుచున్నారు. మీరు స్నేహభావముతో నన్ను ఇట్లు ప్రశ్నించుచున్నారు. మీపేరేమి ? అని పలుకుచు తన భర్త స్మృతికి వచ్చినందున దుఃఖము నాపజాలక అట్లె భూమిమీదపడి మూర్ఛిల్లెను.



ఆ దృశ్యము చూచి రాజకుమారుడు చకితుడై నేత్రముల వెంబడి అశ్రువుల ప్రక్షాళనమొనర్చు కొని ఆమెను సమీపించి చేయిపట్టుకొని దుఃఖించకుము. నాపేరు సిద్ధుడందురు. నీ భర్త సుఖముగనే ఉన్నాడు నేను చూచితిని. నీ వ్రతపుణ్య ప్రభావము వలన మూడుదినములకు నీ వద్దకు రాగలడు. అతను నా ప్రాణస్నేహితుడు. ఈ విషయమున సంశయింపకుము. శివునిమీద శపథము చేసి చెప్పుచున్నాను. అని రహస్యముగ ఆమెతో పలికి ఈ విషయ

మతిరహస్యము గాన నెవ్వరకు బహిర్గతము చేయవలదని చెప్పి అశ్వము నధిష్టించి నాగపుత్రునితో కూడ తన రాజ్యమునకు పోయెను.

సీమంతిని నేత్రములనుండి కన్నీరు కార్చుచు తనభర్త రూపమునే స్మరించుచు, ఆ వచ్చిన యువకుడు తన భర్తయేయని పోలికనుబట్టి సంశయించుచు, నాకంత అదృష్టామా! మరణించినవారు జీవించివచ్చుట ఎచ్చటనైన గలదా ! ఎవరయిన ధూర్తుడు ఇట్లు కపటవేషము ధరించియుండునా ! లేక మైత్రేయి చెప్పిన రవతమును నేను నియమముతో నాచరించుటచే గిరిజానాథుడు ప్రసన్నుడయ్యెనా! శివుడు ప్రసన్నుడయినచో దుఃఖమెట్లుండగలదు ! శివుడు ప్రసన్నుడయినచో దుఃఖమెట్లుడగలదు! దుర్లభమెద్దియులేదు. అని చింతించుచు చెలికత్తెతో కలసి తన గృహమునకు సీమంతిని వెడలెను.

రాజకుమారుడు తన నగరమును సమీపించి నాగపుత్రుని శత్రురాజులవద్దకు వెళ్లి మీరు చంద్రాంగదుడు మరణించెనని భావించి అతని రాజ్యమపహరించి వృద్ధులయిన అతని తల్లి దండ్రుల బంధించితిరి అతను పాతాళమునకు వెళ్లి సర్పరాజుతో స్నేహమొనర్చి నాగబలము వెంటనిండుకొని వచ్చుచున్నాడు. మీకు ప్రాణముల మీద తీపియుండెనేని వారల బంధవిముక్తుల చేసి వారి రాజ్యము వారి కొసగి అతనిని శరణునొందుడు లేనిచో మిమ్ములవతడు సర్వనాశనము చేయగలడు. అని చెప్పి పంపెను. వారు ఆసందేశము విని భయపడి తాము చేసిన దుష్కృతమునకు వగచి అతని నిందకు భయపడి వృద్ధులైన రాజదంపతుల కారాగార విముక్తుల చేసి వస్త్రభూషణాదులతో నలంకరింపజేసి సింహాసనమున కూర్చుంబడబెట్టి పాదములకు నమస్కరించి మా అపరాధముల మన్నించి మా ప్రాణరక్షణ చేయుడని వేడుకొనిరి.

నాగపుత్రుడు ఇంద్రసేన మహారాజుతో మీ కుమారుడు పాతాళ లోకము నుండి క్షేమముగా వచ్చివున్నాడని చెప్ప అట్టి అమృతతుల్యమగు వాక్యము విని హర్షోద్రేకముతో మంత్రుల పిలిపించి నగరము నలంకరింపజేసి పరివార సమేతుడై భార్యతో కలసి కుమారుని చూడ నగర బాహ్యమునకు వచ్చెను. ప్రజలందరు ఆనందభరితులైరి. వాయిద్యములు మ్రోగెను. జయజయ ధ్వానములు చెలరేగెను. చంద్రాంగదుడు తండ్రిని ఎదుర్కొని ప్రేమతో నమస్కరించెను. తండ్రియును కుమారుని ఆలింగమనొర్చి ఆనందాశ్రువుతో తడుపుచు కుమారా ! నీ వియోగముచే నేను శవమునైతిని. పోయిన ప్రాణము వచ్చినటుల తిరిగి నేడు నిన్ను చూడగలిగితిని. చిరంజీవిని కమ్మని దీవించెను.

అప్పుడు చంద్రాంగదుడు తల్లిని ఆలింగనమొనర్చుకొని అమ్మా! నేను పుత్రుడనుగాను, నీకు శత్రువును, నేను పాతాళమున సుఖముగానే ఉంటిని. మీకాదుఃఖము కల్గించితిని. తల్లి హృదయము నవనీతమువలె మృదువుగ నుండును. ఎవ్వడు కఠినహృదయుడయి తల్లి దుఃఖము గుర్తించడో వాడు మలముతో సమముగ చెప్పబడును అట్టివానిని మానవుడనుట చెల్లదు. తల్లికి దుఃఖము కలిగించు మూర్ఖుడు ఏడుజన్మములు సంతానవర్జితుడయి దారి ద్రవ్యముతో బాధనొందును. తల్లి ఋణము తీర్చుకొనుటకెవ్వరికిని శక్యముగాదు. తల్లియన సాక్షాత్తు భవానియని శాస్త్రములు చెప్పినవి. కాన తల్లికి మించిన దైవము లేదు అని ఇట్లు తల్లినోదార్చెను. మహోత్సవముతో ఇంద్రసేన మహారాజు తన కుమారుని నగరమును ప్రవేశింపజేసి రాజు భవనమునకు గొనిపోయెను. వెంటవచ్చిన నాగకుమారుని వస్త్రభూషణములచే సత్కరించి అతని లోకమునకు పంపిరి.

అప్పుడు ఇంద్రసేనమహారాజు చిత్రవర్మమహారాజు వద్దకు దూతల ద్వారా మీకుమార్తె వ్రత ప్రభావమున నా కుమారుడు జీవించి వచ్చెను. అనువార్తను తెలియజేసెను. దూతలద్వారా చిత్రవర్మ తనయల్లుడు సుఖముగ వచ్చుట తెలుసుకొని శుభవార్తను చెప్పిన దూతను వస్త్ర భూషణములచే నలంకరించి ఇంద్రసేన మహారజును సకుటుంబముగ రప్పించి మహోత్సవముతో సీమంతినిని వారికి అప్పగించెను. చంద్రాంగదుడు తాను పాతాళము నుండి తెచ్చిన అమృతమును రత్నములను సంకల్ప వృక్ష ఫలమును భార్య కొసగెను. మహోత్సవముతో చంద్రాంగదుడు భార్యతో తనపురమునకు విచ్చేసెను.

సోమవార వ్రత ప్రభావము వలన నాదంపతులు పదివేల సంవత్సరములు సుఖముగ రాజ్యపాలనమొనర్చిరి. గౌరీహరుల నర్చించుటచే సీమంతిని అట్టి ఫలము నందెను కాన ఓ సువాసినీ ! నేను నీయందలి ప్రేమతో ఇట్టి వ్రతముపదేశించితిని. దీని నాచరింపుము. మీకు సంతానము, సౌభాగ్యము అఖండితమయిన లక్ష్మియు కలుగగలదని ఆశీర్వదించిరి.

అప్పుడా దంపతులు గురునాథుని ఆజ్ఞ గైకొని తమ గ్రామమునకు పోవుటకు సిద్ధమగుచుండ వారి తల్లిదండ్రులు పుత్రదర్శన లాలసులయి అచ్చటకు వచ్చి జరిగిన విషయము విని ఆనందభరితులయు గురుమూర్తిని పూజించి మహోత్సవ మొనర్చి అఖండముగ బ్రాహ్మణ సమారాధనము గావించి గురుమూర్తి ఆజ్ఞ గైకొని ఆ దంపతులతో సహ తమ గ్రామమునకు వెళ్లిరి.

గురుమూర్తి అనుగ్రహము వలన ఆ దంపతులు అష్టపుత్ర బహుధనములో ప్రతి సంవత్సరము గురుమూర్తిని గణగాపురమున దర్శించి వెళ్లుచుండిరి. ఇట్లు సమస్త సుఖములను వారు గురు కృపచే నొందిరి.

కాన ఓ నామధారకా ! ఎవరయితే శ్రద్ధాభక్తులతో గురువు నారాధింతురో వారిపట్ల గురుమూర్తి ప్రసన్నుడగుననుటలో సంశయమేమియు లేదు. చక్కెరవలె సతిమధురమయిన ఇట్టి గురుచిత్రము నీకు చెప్పిరి. చేతికంకణము చూచుటకు అద్దము కావలయునా ? ప్రత్యక్షముగ అనుభవ గోచరమయిన సద్గురుమూర్తి యొక్క కీర్తిని విశేషించి చెప్పనవసరముండదు. ఓ శ్రోతలారా ! మీకు హితము చెప్పెదవినుడు. గురునాథుని భజించుడు. సర్వార్థసిద్ధి నొందుడు. ఈ గురుచరితమును చలివేంద్రము నిర్మింపబడినది. సర్వసులభము ఇందలి కథామృతమును యథేష్టముగ పానమొనర్చి ధన్యులు కండు.

**ఇది గురుచరితమున ముప్పదిఐదవ అధ్యాయము సమాప్తము.**

**దిగంబరా దిగంబరా శ్రీపాదవల్లభ దిగంబరా**

**శ్లో॥ కచాఖ్యానంస్త్రియో మంత్రానర్థా తార్థసుగభ్యాదం**
**సోమవ్రతంచయః ప్రాహశ్రీదత్తశ్శరణం మమ**

తా॥ పతివ్రతకు సోమవార వ్రత మహాత్మ్యమును స్వామివారు చెప్పుట.

**శ్లో॥ సత్యమేవేశ్వరో లోకే సత్యం పద్మాశ్రితాసదా ।**
**సత్యమూలాని సర్వాణి సత్యాన్నాస్తి పరం పదమ్ ॥**

**– శ్రీ మద్వాల్మీకిరామాయణము అయోధ్యాకాండము.**

తా॥ సత్యమే సర్వలోక వ్యవహారములకు మూలకారణమైనది. మానవుని సంపదయు సత్యముపైననే ఆధారపడియున్నది. సత్యము అను సూక్ష్మధర్మము సర్వపదార్థములలో అనుస్యూతమై యున్నది. లోకమున సత్యమును మించిన ఉత్తమ ధర్మము మరొక్కటిలేదు. అనగా సత్యము కంటే మానవునికి పరమ ప్రావ్యమగు ధర్మము వేరులేదు. ఇదిలేనినాడు ఇతర ధర్మము లెన్నియున్నను నిష్ప్రయోజనములే.

# శ్రీ గురు చరితము

## ముప్పదిఆరవ అధ్యాయము

**ఓం అవధూత చింతనం శ్రీగురుదేవదత్త జయ ఓం**

**శ్రీ గణేశాయ నమః శ్రీనృసింహసరస్వత్యై నమః**

నామధారకుడు సిద్ధముని పాదములకు నమస్కరించి జయజయ సిద్ధమునీంద్రా. మీరు భవసాగరతారకులు. బ్రహ్మజ్ఞానులు, అజ్ఞానతిమిర భాస్కరులు, అజ్ఞానమను రాత్రి యందు గాఢముగ నిద్రించుచున్న నన్ను గురుచిత్రమను భేరి మ్రోయించి మెలకువ నొందించితిరి. ఓ చిన్మయాత్మ స్వరూప ! మీ వలన నేను సంసారపారము నొందుచున్నాను. అని స్తుతించ సిద్ధముని అతని భక్తికి సంతసించి అభయమిచ్చి పైకథావృత్తాంతము నీకింది విధముగ చెప్పుచున్నారు.

నామధారకా! జ్ఞానప్రదమగు గురుచరితమును చెప్పుచున్నాను వినుము. గంధర్వపురమున జరిగిన గురుమహాత్మ్యమును అంతయు చెప్ప సమర్థుడగాను. అందలి సారమును మాత్రమే చెప్పెద.

ఆ నగరమున నొక వైదిక బ్రాహ్మణుడు కలడు. అతడు విద్వాంసుడు. విరక్తుడు. కర్మమార్గనిష్ఠుడు, ప్రతి గ్రహమొనర్చుడు. పరాన్నము భుజించడు. యాయావరవృత్తితో జీవనము జరుపుచుండును. అతిథుల పూజించుచుండును. అతని కొక భార్యగలదు. భర్త అట్లుండుట కామె కిష్టములేక ఎల్లప్పుడు ముఖము మాడ్చుకొని, కోపస్వభావముగా నుండును. ఆ గ్రామమున కెందరో భక్తులు వచ్చి మృష్టాన్నములతో బ్రాహ్మణులకు సమారాధానలు చేసి దక్షిణలిచ్చుచుందురు. అప్పుడు ఊరివారందరు సమారాధనలకు వెళ్ళి అచ్చట పక్వాన్నములను ప్రశంసించుచుండ ఆ బ్రాహ్మణుని భార్య ఆ మాటలు విని ఇట్లు విలపించసాగెను.

అయ్యో! దైవమా ! నేనెంత దురదృష్టవంతురాలను, దరిద్రుడైన ఇట్టి భర్తను పెండ్లాడినందున స్వప్నమందైన మృష్టాన్నము భుజించి ఎరుగను. కష్టములు మాత్రమే అనుభవించుచున్నాను. నాపూర్వార్జితము బట్టి ఇట్టి హీనుని భర్తగపొంది దారిద్ర్యమే నిత్యమనుభవించుచుంటిని. గ్రామములోని స్త్రీ పురుషలందరు నిత్యము సమారాధనలకు వెళ్ళి తృప్తిగ మృష్టాన్నముల కుడుచుచున్నారు. వారు పూర్వమెంత సుకృత మొనర్చిరో; ఎవరైన వచ్చి

పిలచినను నా భర్త సమారాధనకు పోడు గదా ! దైవమా ! నేనేమిచేతును అని విలపించుచుండును.

ఇట్లుండగ గణాగాపురమున కొక ధనికుడగు బ్రాహ్మణుడు వచ్చి బ్రాహ్మణుల దంపతీ సమేతముగ సమారాధన చేయదలచి ఈ వైదిక బ్రాహ్మణుని దూ భార్యాసమేతముగ భోజనమునకు రమ్మని ఆహ్వానించెను. అప్పుడతని భార్య భర్తను సమీపించి మీరు ఆమంత్రణము నంగీకరించుడు నాకు అందరితో పాటు మృష్టాన్నము తినవేడుక గలదు. మంచి దక్షిణయు, నూతన వస్త్రములు గూడ మనకు లభించగలవు. మీకు పూర్తిగ ఇష్టము లేకున్న మీ ఆజ్ఞ అయినచో నేనైన పోయెదననెను. ఆ బ్రాహ్మణుడు భార్యతో నేను పరాన్నము భుజించను. నీకంతగ కోరికయున్నచో వెళ్లుమనెను. అప్పుడామె సంతర్పణచేయు బ్రాహ్మణుని సమీపించి నా భర్తరాడు కాని నేను మాత్రము మీ సమారాధనమునకు వచ్చెదనను అతడు నేను దంపతులను పూజించి సమారాధన చేయు సంకల్పము చేసితిని గాన నీ భర్త రానిచో నీకు సమారాధనమున స్థానములేదు. వచ్చిన త్రోవ వెళ్ళుమనెను, ఆ మాటల కామె కడువగచి నారాయణా ఏమి ప్రారబ్ధము నేనేమిచేయుదును. ఎంత దైవహీనురాలను, ఇట్టి భర్తను చేసికొనుట వలన స్వప్నమందైన రుచికరమైన అన్న మెరుగనైతిని, అని చింతించుచు శ్రీనృషింహసరస్వతీస్వామి వారికగడకేగి నమస్కరించి వారితో నిట్లు చెప్పదొడగెను.

స్వామీ నా భర్త నామాట వినడు ఈ గ్రామమున గొప్ప సమారాధన జరుగనున్నది. దంపతులకు వస్త్రదక్షిణలతో భోజనము పెట్టదరట సమారాధన చేయువారాహానించినను నా భర్త అందులకంగీకరించుట లేదు. తమరు నాయందు దయయుంచి నా భర్తను పిలిచి సమారాధనకు వెళ్ళవలసినదని ఆజ్ఞాపించి నాయాత్మకు సంతోషము గలిగించుడు అని దీనురాలై ప్రార్థించెను.

ఆమె వాక్యములకు స్వామివారు నవ్వుకొని బ్రాహ్మణుని పిలిచి అతనితో నీవు నాయాజ్ఞప్రకారము బ్రాహ్మణ సమారాధనకు భార్యతో కలసి పొమ్ము. భార్యయొక్క మనోవాపనను పూర్తిచేయుట భర్తకు ధర్మము. కుల స్త్రీ యొక్క మనస్సు కష్టపెట్టరాదు. అని చెప్ప నా బ్రాహ్మణుడు గురుమూర్తితో నిట్లనెను. స్వామీ! నాకు పరాన్నము తినకూడదను నియమముగలదు కాని గురువాక్యమును విననివారు రౌరవనరకమున బడుదురుగాన మీయాజ్ఞ ననుసరించి అట్లే వెళ్లెదననెను. భార్యయు ఆనందించెను. భార్యాభర్తలు

సమారాధనకు వెళ్లిరి. యజమాని పితృ ప్రీతిగ సంకల్పించి దంపతుల పూజించి కూర్చుంబెట్టి పక్వాన్నములతో సహా వడ్డించి భుజింపుమనెను. అందరును భుజించ ప్రారంభించిరి.

ఆ బ్రాహ్మణ స్త్రీకి మాత్రము, తనతోపాటు పంక్తుల యందు కుక్కలు, పందులుగూడ, ఏకపంక్తిని భుజించుచున్నటుల గోచరించ ఆమె అసహ్యాపడి లేచి అందరితో పెద్దగ మీరేల శ్వసూకరములతో కలసి వాటి ఉచ్ఛిష్టముల భుజించుచున్నారు" అని ఆక్షేపించి తన భర్తతో గూడనట్లే చెప్పనతడు నిన్ను పెండ్లాడుటచే నాకీగతి పట్టినది అని చెప్పుచు పంక్తి నుండి లేచెను. అప్పుడు భార్యభర్త లిరువురు గురుమూర్తి వద్దకు వచ్చిరి. స్వామివారు ఆ బ్రాహ్మణితో నీమనోరథము ఫలించెనా ? వ్యర్థముగ భర్తను పీడించితివి. పరాన్నసుఖము తెలిసినదా ? అని అడిగెను. ఆమె గురుమూర్తి పాదములకు నమస్కరించి స్వామీ! నా అపరాధమును క్షమించుడు. లోభముతో నా భర్తకు గూడ దోషము ఘటింపజేసితిని. బలాత్కారముగ నా భర్తను పరాన్నమునకు గొంపోతిననెను.

బ్రాహ్మణుడు గురుమూర్తితో నీ దుర్మార్గురాలి వలన నాకిట్లే అనేక దోషములు వాటిల్లుచున్నవి. నా నియమము నేడు భంగమయ్యెను. అనియన గురుమూర్తి బ్రాహ్మణునితో నీవు భీతిల్లకుము. నేటితో ఆమె కోరిక పూర్తి అయ్యెను ఇందుచే నీకేమియు దోషము వాటిల్లదు. ఇక నుండి ఆమెయు నీ యాజ్ఞ ననుసరించును అని చెప్పి తిరిగి ఇట్లను చుండిరి.

దైవపితృకార్యములయందు బ్రాహ్మణుడు లభించక కర్మకు లోపప్రసక్తి వచ్చెనని తప్పక భోజనమునకు వెళ్లుట బ్రాహ్మణునకు ధర్మము. లేనిచో దోషము వాటిల్లును అని చెప్ప బ్రాహ్మణుడు వినయావనతుడయి స్వామీ! ఎవరి ఇంట భుజించనగునో, ఎవరియింట భుజించరాదో ఆ విషయమును పూర్తిగ నాకు సెలవిండని చెప్ప గురుమూర్తి ఇటుల చెప్పుచుండెను.

బ్రాహ్మణోత్తమా! వినుము. శిష్యుడు గురుగృహమున సంశయింపక భుజియింపవచ్చును. మేనమామ, పిల్లనిచ్చిన మామ, సాధువులు సోదరులు మొదలగువారి యింట భుజించవచ్చును. శ్రాద్ధములందు కర్మలోవ ప్రసక్తి వచ్చిన భుజించి మరునాడు గాయత్రీజప మొనర్చిన శుద్ధుడగును. తల్లి దండ్రులచే సేవచేయించుకొనువాని గృహమున, లోభి గృహమున భుజింపరాదు. కళత్రాదుల పీడించి బయట ధర్మమొనర్చువారియింట కుడువరాదు. గర్వియింటను, శస్త్రముతో జీవించువాని యింట, మల్లయుద్ధము చేయువాని

యింట, బహిష్కృతునియింట, యాచక వృత్తితో జీవించువానియింట ఇతరులకు మంత్రోపదేశమొనర్చి తద్వారా జీవించు బ్రాహ్మణునింట. క్రోధియింట, కులస్త్రీని త్యజించినవాని యింట, భర్తను త్యజించిన స్త్రీయింట భుజింపరాదు. స్త్రీజితునియింట, దొంగతనముచేసి జీవించువానియింట, జూదమాడువాని యింట, స్నానమొనర్చక భుజించువానియింట సంధ్యావార్చని వాని గృహమున, దానము చేయువారిని వద్దని అడ్డు చెప్పువారింటను, శ్రాద్ధముల ఆచరించని వారింటను, వడ్డీవ్యాపారముతో జీవించు వారింటను, ద్రవ్యాశతో జపమొనర్చు వారింటను, విశ్వాస ఘాతకునింటను, సాధువుల ద్వేషించువాని యింటను, గురునింద యొనర్చు వానియింట, కులదేవతల త్యజించువానియింట, విధినిషేధములు లేక అన్నిచోట్లను భుజించువాని యింట, పుత్రహీనుని యింట, కుమార్తెను అల్లుని అవమానపరచువానియింట, ఆశ్రమ ధర్మముల విడిచి అద్వైతము చెప్పువారి యింట. అనుభవము లేక బాహ్యమునకు అద్వైతము పలుకువారింట భుజింపరాదు.

ఇట్టి స్థలముల పరాన్నము భుజించుటకే ఇంద్రియ వైకల్యము అల్పాయుష్యము బుద్ధిమాంద్యము ఘటిల్లును. పరాన్నము భుజించు వారి పాపము వీరికి వచ్చును. పరాన్నము భుజించుటవలన వచ్చు పాపము గోభూసువర్ణదానముల స్వీకరించుట వలన వచ్చు పాపముకన్నా నధికము. అమావాస్య నాడు పరాన్నము భుజించునో మాసమొనర్చిన పుణ్యము నశించును. శూద్రునిచే నాహూతుడయి బ్రాహ్మణుడు బ్రాహ్మణ గృహమునకు భోజనమునకు పోరాదు. సంతానము కలుగు పర్యంతము కుమార్తెయింట భుజింపరాదు. సూర్య గ్రహణములయందు, సూతకములందు దానము పట్టరాదు ఎవరైతే ఆచారమును పాలింతురో వారికి దైన్యము లేదు. దేవతలందరు వారికి ఆధీనమయి యుందురు. అట్టివారు సర్వసుఖముల ననుభవింతురు. ప్రస్తుతము కలికాలమున బ్రాహ్మణులు మందాధులయి స్వాచారధర్మముల త్యజించిరి. కాననే దరిద్రులయి బాధపడుచున్నారు అని గురుమూర్తి చెప్ప బ్రాహ్మణుడు గురుమూర్తితో స్వామీ! మీరు త్రిమూర్త్యవతారులు. భక్తజనాధారులు, దయయుంచి ఆచార ధర్మముల బోధించుడని ప్రార్థించ గురుమూర్తి అతనితో మంచి ప్రశ్నచేసితివి. పూర్వము నైమిశారణ్యమునకు పరాశరమహర్షి రాగా ఋషులు వారిని సత్కరించి ఆచారముల ప్రశ్నించిరి. అప్పుడు పరాశరుడు ఆ మహర్షుల కేమిచెప్పెనో ఆ విషయమే నీకు నేను

చెప్పుచున్నాను. సావధానుడవయి వినుము అని ఈ క్రింది విధముగ చెప్పుచుండెను.

ప్రతివారును బ్రాహ్మముహూర్తమున మెలకువగాంచి వెంటనే గురువును స్మరింపవలయును. అట్లే బ్రహ్మ విష్ణు మహేశ్వరులను సూర్యాది నవగ్రహములను, సనకాదులను, నారదతుంబురులను, సిద్ధులను, సాధ్యులను, పితృదేవతలను సప్తసముద్రములను, సప్తద్వీపములను, సప్తర్షులను, భూదేవిని, గోవును, నమస్కరించి ప్రక్కనుండి లేచి మంమూత్రోత్సర్జన మొనర్చి, పాద ప్రక్షాళనము గావించుకొని ఆచమన మాచరించవలయును. ఇట్లే స్నానమునకు పూర్వము, తరువాత అధోవాయువు విసర్జించినపుడు, భోజనమునకుపూర్వము, తరువాతను తుమ్ము వచ్చిన తరువాతను ఆచమన మాచరించ వలయును. ఆచమనము కొరకు ఉదకము సమీపమున దొరకనపుడు కుడి చెవిని కుడిచేతితో స్పృశించ వలయును. దక్షిణకర్ణమున ఉదక దేవతలుందురుగాన ఆచమన ఫలము వచ్చును. అరుణోదయమువరకు మానసికస్నాన మాచరించి ఇష్ట దేవతల స్మరించవలయును. అరుణోదయముకాగా ఉపవీతమును నివీతిగ ధరించి మలమూతోత్సర్జస మాచరింపవలయును. నిలువబడి మలమూత్రోత్సర్జన మొనర్చువారు నరక మనుభవింతురు. నిర్ఋతి దిక్కువగా వెళ్లి వస్త్రముచే శిరస్సు కప్పుకొని మౌనముగ మలమూత్రోత్సర్జన మొనర్చవలయును.

పగలు ఉత్తర ముఖముగను, రాత్రి దక్షిణ ముఖముగను కూర్చుండవలయును. సూర్యచంద్రుల, నక్షత్రముల చూడరాదు. నీరు లభించనపుడు గంగను స్మరించి మట్టిపెళ్లతో శౌచమాచరించవలయును. తిరిగి ఉదకము లభించగా యథావిధిగా శౌచము చేసికొనవలయును. అంతదనుక నేమియు భుజింపరాదు. పుణ్యవృక్షములక్రింద, దేవాలయ సమీపమున మలమూత్రముల విసర్జింపరాదు. శుభ్రముగ మృత్తికను తీసికొని మలమూత్రస్థానముల, పాదముల, హస్తముల శుభ్రముగ కడుగుకొనవలెను. రాత్రియందు, సంకటములయందు, మార్గమందు యథాశక్తి శౌచ మాచరించవలయును. ఇట్లు శౌచమాచరించుటచే ధర్మము సిద్ధించును. పై విధమున శౌచవిధి నాచరించి తరువాత ఉదకము కుడి చేతి లోనికి ఉద్ధరిణితో తీసికొని కేశవాది నామముల నుచ్చరించుచు ఆచమనము చేయవలయును. ఈ విధానము గురువు వలన గ్రహించవలయును. స్నానము, వమనము, భోజనము, ఫలహారము, శ్మశానగమనము, ఇతరుల పాదప్రక్షాళనము ఈ

నిమిత్తముల యందు ఆచమన మాచరించవలయును. ఆచమనము చేయుటచే ఆయుష్యము, ఆరోగ్యము వృద్ధి నొందును. ముఖ దుర్గంధ నాశనము కొరకు దంత ధావనము చేయవలయును. ముళ్ళ చెట్లు నారికేళ వృక్షము, ఖర్జూరము, మొగలి మొదలగు చెట్ల కాష్టములతో దంతధావనము చేయరాదు. చండ్ర, మేడి, మఱ్ఱి, ఉత్తరేణి మొదలగు పుణ్య వృక్షముల పుల్లల తీసికొని దంతధావన మొనర్చి ఆ పుల్లలను నైరృతి దిక్కుగ పారవేయవలయును. అనంతరము పన్నెండు పర్యాయములు గండూషము లాచరింపవలయును. తరువాత స్నానము చేయవలయును.

ప్రాతః స్నాముచే తేజస్సు బలము, ఆయుష్యము వృద్ధిగాంచును. దుఃస్వప్న దోషము నశించును. ప్రజ్ఞ వృద్ధిగాంచును. దారిద్ర్యము, చింతలు, శోకము తొలగును, సంకటములందు, రోగము వచ్చినపుడు, జలము లభించనపుడు , అశక్తియందు భస్మస్నానము, గోధూళిస్నానము, భౌమస్నాము, (మట్టి) ఆచరించవలయును. విష్ణుస్మరణము, గురదర్శనము, తల్లిదండ్రుల పాదతీర్థమును ప్రోక్షించుకొనుట ఇవి చేయుటచే స్నానముచేసిన ఫలము సిద్ధించును. దృఢగాత్రుడు జలస్నానమే చేయవలయును. ఆశక్తులు గృహస్థులు ఉష్ణోదకముతో స్నానమాచరింప వచ్చును. ఉష్ణోదకముతో స్నానముచేయునపుడు సంకల్పము తర్పణము చేయరాదు. ఉష్ణోదకమును, శీతోదకముతో కలిపి గాయత్రి మొదలగు మంత్రములతో నభిమంత్రించి స్నానమాచరింప వలయును. పుత్రోత్పత్తి, సంక్రాంతి, శ్రాద్ధము, వ్రతములు, పర్వకాలములయందు వేడి నీటి స్నానము నిషిద్ధము. నదియందు నదికి (ప్రవాహమునకు) ఎదురుగ స్నానము చేయవలయును. మంగళ స్నానము (తలంటు) ఆదివారమున జ్వరప్రదము, సోమవారమున కాంతిహానియు, మంగళవారము మరణమును, బుధవారము ఐశ్వర్యమును, గురువారము ధనహానియు, శుక్రవారము పుత్రహానియు, శనివారము సంపత్తును ఇచ్చునుగాక విచారించి ఆచరించవలయును. ముత్తైదువలగు స్త్రీలు నిత్యము శిరఃస్నాన మాచరించరాదు. ఆశక్తి యందు గంగను స్మరించుకొనుచు ఆర్ద్ర (తడి) వస్త్రముతో శరీరమును శుభ్రపరచుకొనినచో స్నానఫలము రాగలదు. కాషాయాము రక్తము జీర్ణ వస్త్రము వీటిని ధరించి చేయబడు పుణ్యము రాక్షసులకు పోగలదు.

బ్రాహ్మణులకు శ్వేతవస్త్రము శ్రేష్ఠము విష్ణుభక్తులగువారు, గోపిచందనముతో ఊర్ధ్వపుండ్రములను, భస్మముతో త్రిపుండ్రములను ధరించవలయును, ఆయుష్కాముడు మధ్య వ్రేలితోడను, ముముక్షువు భగవన్నామ స్మరణమొనర్చుచు అనామికతోగాని తర్జనితో గానిఊర్ధ్వపుండ్రము ధరించవలెను. ఇట్లు ఊర్ధ్వపుండ్ర త్రిపుండ్రముల ధరించినచో హరిహరులు సంతోషించెదరు.

దర్భలతో పవిత్రము ధరించి పితృతర్పణముల చేయవలయును. దర్భ లభించనిచో గరిక మొదలగు తృణములు దర్భకు ప్రతి నిధిగ వాడవచ్చును. దర్భకు మూలమున రుద్రుడు, మధ్యమున విష్ణువు, అగ్రభాగమున శివుడు నివసింతురు, కాన దర్భ పాపనాశనము, దానముచేయునపుడు జపాదులందు, వేదాధ్యయనము, హోమములయందు పితృకర్మలయందు సువర్ణ రజతముద్రికల ధరించవలయును. బంగారు ఉంగరము దేవకర్మలందును, వెండి ఉంగరము పితృకర్మల యందును ప్రశస్తము. బంగారు ఉంగరము అనామిక వ్రేలికిన వెండి ఉంగరము తర్జనియందును ధరించవలయును. యోగ పట్టమును ధరించవలయును. నవరత్న ముద్రికను ధరించువారికి పాపముండదు. యోగపట్టమును ధరించుట, గయశ్రాద్ధము పాదుకలు ఇవి జీవత్పితృనకు నిషిద్ధములు. స్నానమొనర్చి తిలకము ధరించి సంధ్యావందన మాచరించవలయును.

ప్రాంతఃకాలమున నక్షత్రములుండ ప్రారంభింపబడు సంధ్య ఉత్తమమనియు, నక్షత్రముల లోపించిన తదుపరి చేయబడు సంధ్య మధ్యమమనియు, ప్రొద్దెక్కి చేయబడు సంధ్య అధమమనియు, అట్లే సాయంకాలము సూర్యప్రకాశముండగ ప్రారంభింపబడు సంధ్య ఉత్తమము. సూర్యుడు అస్తమించిన తరువాత ఆచరింపబడు సంధ్య మధ్యమము నక్షత్రోదయము తరువాత చేయబడునది అధమము. అట్లే మధ్యాహ్న కాలమున మాధ్యాహ్నికసంధ్యయు ఆచరింపవలసియున్నది. శిఖ బంధించి ఆచమన మొనర్చి ప్రాణాయామముచేసి ఉదకముతో తన అవయవములను, ప్రోక్షించుకొనవలయును. అనంతరము మంత్రించిన ఉదకమును పానమొనర్చవలయును.

సూర్యునకు అర్ఘ్యమును మూడుపర్యాయములు ఇవ్వవలయును. నిత్యము మందేహులను రాక్షసులు ముప్పది మూడు కోట్లమంది సూర్యగమనమును నిరోధింతురు. మనచే నివ్వబడు అర్ఘ్యము వజ్రాయుధమయి వారల

పారద్రోలును. కాన అర్ఘ్యము సూర్యునకు ప్రతివారు ఇచ్చుట శ్రేస్కరము. అర్ఘ్యమిచ్చిచేత ఉదకము తీసికొని ఆ సూర్యుడేనేను. సూర్యుడే పరమాత్మ అని భావించుచు ఆ ఉదకమును తన చుటు ప్రదక్షిణముగ పడునటు త్రిప్పవలయును. అనంతరము గాయత్రీ జపమాచరించవలయును. కాష్ఠాసనమున జపించుటచే దుఃఖము యశోహానియు, ఋణబాధయు రాతిమీద జపించుటచే వ్యాధియు, కుశాసనమున వశీకరణమును, పాపనాశనము, రోగనివృత్తియు, భస్మముయందు ఆరోగ్యము, కంబళమున సుఖము. కృష్ణాజినమున జ్ఞానము వ్యాఘ్రాజినమున లక్ష్మియు, మోక్షము సిద్ధించును గాన విచారించి తగు ఆసనమున కూర్చొని మనస్సును ఏకగ్రాపరచి మంత్రజప మాచరించవలయును.

మంత్రము జపించువారిని పాపమునుండి రక్షించును. 'మ'యన మనస్సు. 'త్ర' యనత్రాణము అని అర్థము పఠించువారిని రక్షించునది గాన మంత్రమని సార్థకనామ ధేయమయ్యెను. 'జ' అన జన్మవిచ్ఛేదకము 'ప' అన పాపనాశనము. అని ఇట్లు జపశబ్దార్థము శాస్త్రములచే నిర్వచించబడెను. గాయత్రీమంత్రము అన్ని వేదములకు మూలము. గాయత్రీ మంత్రజపముచే ఏవదపాఠఫలము లభించును. గాయత్రీ జపమొనర్చని వాని జన్మ వ్యర్థము. జపమాలను చేత ధరించి మంత్రజప మొనర్చవలయును. మాలను ప్రాతఃకాలమున నాభికమలమందును, మధ్యాహ్నమున హృదయస్థాన మందు , సాయంకాలము ముఖసమీపమునందును ఉంచుకొని జపింపవలయును. ప్రవాళములు (పగడములు) స్పటికములు మౌక్తికములు స్వర్ణమణులు, రుద్రాక్షలు, కుశగ్రంథులు వీటితో చేయబడిన మాలలు క్రమముగ శ్రేష్ఠములు, మాలను త్రిప్పునప్పుడు శబ్దము కారాదు. మంత్రమును ఇతరుల వద్ద కూలిగా ద్రవ్యమును తీసికొని జపించరాదు. జపించునపుడు గోళ్ళతో శరీరమును గోకికొనుట. ఇతరులతో సంభాషించుట చేయరాదు. అగతిన నట్లు జరిగిన భగవంతుని స్మరించవలయును. జపించునపుడు నిద్ర, ఆవలింతలు, అధోవాయువులు వచ్చినచో కుడిచెవి స్పృశించి సూర్యునిగాని గోవునుగాని చూడవలెను. మంత్రము జపించి సూర్యునిస్తుతించి దిగ్దేవతలకు తల్లిదండ్రులకు గురువునకు నమస్కారము లాచరించి తన గోత్రము నుచ్చరించి తానాచరించిన సంధ్యాకర్మ ఫలమును ఈశ్వరున కర్పింపవలయును. అనంతరమగ్నియందు అష్టదేవతలకు

హెూమము చేయవలయును. తరువాత వేదముగాని గీతలు మొదలగు భక్తి గ్రంథములగాని పఠించవలెను. పితరుల, దేవతల, ఋషులు తర్పణములచే తృప్తిపరచవలయును. ఈ విధానము శాస్త్రము తెలిసిన పెద్దలద్వారా గ్రహించవలెను. దీపావళినాడు యముని స్మరించి అతని నామముల నుచ్చరించుచు యముని ప్రీతిగ తర్పణమిచ్చిన పాపములు రోగములు నశించును. శనిపీడి తొలగును. అపమృత్యువుగూడ తొలగును. మాఘమాసమున కృష్ణాష్టమినాడు భీష్మునకు ప్రీతిగ తర్పణ మిచ్చిన సంవత్సర పాపము నశించును. ఇటుల నిత్యము ఎవరు సత్కర్మ నాచరింతురో వారు ఇహపరముల సుఖముల ననుభవింతురని శ్రీగురుమూర్తి బ్రాహ్మణునకు చెపెప్పనని సిద్ధముని నామధారకునకు నిత్యము మానవులచే నవశ్యకర్తవ్యమైన ఆచారపద్ధతి నుపదేశించెను.



**ఇది గురుచరితమున ముప్పది ఆరవ అధ్యాయము సమాప్తము.**

**దిగంబరా దిగంబరా శ్రీపాదవల్లభ దిగంబరా**

**శ్లో॥ బ్రాహ్మణ్యాదుస్స్వభావంయోనివార్యాహ్నిక ముత్తమం,**
**శశంస బ్రాహ్మణాయాసౌ శ్రీదత్తశ్శరణంమమ.**

భా॥ పరాన్న భోజనము శ్వసూకరోచ్ఛిష్టముతో సమానమని నిరూపించుట.

సూ॥ త్రి సత్యస్య భక్తిరేవ గరీయసీ, భక్తి రేవ గరీయసీ ॥

**- నారదభక్తి సూత్రములు**

తా॥ భగవంతునకు నామరూపాదులు లేవు. అయినను జోధనార్థము భగవంతుడు పరము, నిత్యము, సత్యము అని వచించిరి. అట్టి భగవంతునకు భక్తి సేయుటయే, అనగా వానిని త్రిశుద్ధిగా ప్రేమించుటయే ఉత్తమ భజనంబమగును, ముమ్మాటికినదే యుత్తమము.

# శ్రీ గురు చరితము

## ముప్పదిఏడవ అధ్యాయము

**ఓం అవధూత చింతనం శ్రీ గురుదేవదత్త జయ ఓం**

**శ్రీ దత్తాత్రేయాయ నమః శ్రీ గణపతయే నమః శ్రీ గురుభ్యో నమః**

నామధారకుడు పై కథను చెప్పమన సిద్ధముని ఇట్లు చెప్పుచున్నాడు. సాక్షాత్తు నారాయణ స్వరూపుడైన గురుమూర్తి బ్రాహ్మణునితో తిరిగి ధర్మముల చెప్పుచున్నాడు.

నీచజాతి వాని వలన వేదముల పరలికించిన గురుమూర్తికి ధర్మముల చెప్పుటలో నేమి ప్రయాసః గురుమూర్తి గృహస్థ ధర్మముల చెప్పుచున్నారు. ప్రతివారును ఇంట మంచి గంధము, నేతిని, మణులను, తిలనను, కృష్ణాజినమును ఉంచుకొనవలయును. గోవును పోషించవలయును. దేవపూజ నిత్యము తప్పక చేయువలయును. దేవాగారమును శుభ్రముగ నుంచుకొనవలయును. ఆసనమున సుఖియై కూర్చొనిత్రికాలముల దేవుని పూజించవలయును. అవకాశము లేనిచో ప్రొద్దున షోడశోపచారములతోను మధ్యాహ్నమున పంచోపచారములతోడను సాయంకాలమున నీరాజన మాత్రమైనను సమర్పించి భగవంతుని ఆరాధించ వలయును. మానవుడై జన్మించి భగవంతుని పూజించనివాడు ఘోర నరకమున పడును. అగ్ని యందుగాని జలమునందుగాని సూర్యునియందుగాని దేవుని పూజింపవచ్చును. మానసికపూజ స్వర్గాపవర్గముల నొసంగును. మధ్యములకు మండలమున పూజయు, అధములకు విగ్రహముల పూజయు అవసరము. గోవును, బ్రాహ్మణునిగూడ భగవద్భావముతో పూజింపవచ్చును. గురువును పూజించుటచే త్రిమూర్తులు సంతసింతురు కలియుగమున మానవులకు గురువు నందు భగవద్భావము కలుగుట దుర్లభమని తలచి అట్టివారికి గాను భగవంతుడు సాలగ్రామశిల, నర్మదబాణము, ఇట్లు శిలారూపము దాల్చెను. కాన సాలగ్రామార్చనము. శివ తింగార్చనము చేయవలయును సర్వపాపములు క్షయించును.

గురూపదేశమంది అతను చెప్పిన విధమున విగ్రహారాధన మొనర్పవలయును. భక్తితో నారాధించువారికి శిలయు, కాష్టముగూడ దేవుడై అభీష్టముల నొసంగును.

పీఠమున కూర్చుండి సంకల్పము నాచరించి, ప్రాణాయామ మొనర్చి

పూజాద్రవ్యముల స్వయముగ పరిశీలించి ఉదకముతో ప్రోక్షించవలెను. తన ఇష్టదేవతా విగ్రహమును ఎదుట సింహాసనమున నుంచి దక్షిణమున శంఖమును, వామభాగమున ఘంటను ఉంచవలెను. దేవుని మీదనున్న వెనుకటి నిర్మాల్యమును తొలగించి దీపమువెలిగించి గణపతిని పూజించి, గురువును స్మరించిపీఠపూజ నాచరించవలయును. ముందుగ ద్వారపాలకుల పూజించి తన ఇష్టదేవతారూపమును హృదయమునభావించి ఆరూపమే బాహ్యముననున్న విగ్రహమందు ఆహ్వాన మొనర్పవలయును. భగవంతుడే స్వయముగ వచ్చి తన ఎదుటన్నుటుల భావించుచు వరుసగ సింహాసనము, పాద్యము, అర్ఘ్యము, ఆచమనీయము, మధుపర్కము స్నానము, మొదలగు ఉపచారములతో పూజించి ఆవుపాలు మొదలగు పంచగవ్యములతో వేదమంత్రముల పఠించుచు అభిషేక మొనర్చి శుద్ధవస్త్రముతో భగవంతుని విగ్రహము తుడిచి పీఠముమీద నుండి శ్రద్ధతో వస్త్రము, గంధము, యజ్ఞోపవీతములిచ్చి పూజించి అనంతరము సుగంధద్రవ్యముతో పుష్పములతో, అక్షతలతో పూజింపవలెను.

తెల్లని పుష్పములు శ్రేష్ఠములు, పచ్చని, ఎరుపు పుష్పములు మధ్యమములు. నల్లని విచిత్రపు రంగులుకల పుష్పములు అధమములు. పురుగులు తినిన పుష్పములు వారి క్రింద బడినవి, క్రిందటిరోజున త్రెంపబడిన పుష్పములు దేవపూజకు వర్జ్యములు. మారేడుదళములకు పైనియమము వర్తించదు. పద్మములు, నాగకేసరములు సంపెంగ, మల్లె, జాజి, కలువ ఈ జాతి పుష్పములు పూజకర్హములు. జిల్లేడు పుష్పము విష్ణుపూజ కర్హముగాదు. బూరుగుపువ్వు పూజకర్హము కాదు. శివుని వెలగ, మొగిలి, దానిమ్మ, వకుళము ఈ పుష్పములతో పూజింపరాదు. గణపతిని తులసితోడను దేవిని గరికతోడను పూజింపరాదు, ఇట్లు విచారించి దేవుని పూజించి ధూపమర్పింపవలెను. అనంతరము దీపము సమర్పించి నైవేద్యము భగవంతుని ఎందుట నుంచవలయును; దేవుడు భేజించినటుల భావించి అనంతరము భగవంతుని హస్తప్రక్షాళన మొనర్చి తాంబూలమును ఫలసమేతముగ నర్పించి నీరాజన మీయవలయును. అనంరతము భగవంతుని పాదములయందు పుష్పాంజలి సమర్పించి ప్రదక్షిణ మొనర్చి సాష్టాంగముగ నమస్కరింపవలెను అట్లే తల్లిదండ్రుల, గురువుల, బ్రాహ్మణులగూడ నమస్కరింపవలయును.

నమస్కార విధానము చెప్పెద వినుము. తల్లిదండ్రుల సమీపించి పాదములకు నమస్కరించవలయును. పూజ్యులు, పెద్దలు వచ్చుట చూడ ఎదురేగి నమస్కరింపవలయును. సభకు ఒక్క పర్యాయమే నమస్కరించవలెను.

గురువులకు నమస్కరించునపుడు తన కుడిహస్తముతో గురుని కుడిపాదమును, ఎడమహస్తముతో ఎడమపాదమును స్పృశించి సాష్టాంగముగ మోకాలు, వక్షఃస్థలము, ముఖము భూమికి తగునటుల సాగిలబడి నమస్కరించవలయును. మోకాలు మొదలు పాదాంతము తన హస్తముతో స్పృశించవలెను. తల్లి తండ్రి, గురువు, పోషకుడు, భయహర్త, అన్నదాత, సవతితల్లి, పురోహితుడు, జ్యేష్ఠభ్రాత, పితృభ్రాత, మాతృభ్రాత, జ్ఞానవృద్ధులు వీరందరుగూడ గురువుతో సమానులుగాన నమస్కారమునకర్హులు.

అజ్ఞానులు, తనకన్న తక్కువ వయస్సుగలవారు స్నానముచేయువారు, సమిధలు, పుష్పములు మొదలగు వస్తువుల గొనివచ్చువాడు, హోమము చేయుచున్నవారు, ధనగర్వితులు, కోపముతో నున్నవారు, మూర్ఖులు వీరికి నమస్కరింపరాదు. శవమునకు నమస్కరింపరాదు. ఏకహస్తముతో నమస్కరింపరాదు.

ప్రతివారును అయిదు విధములైన పాపములను నిత్యము గావింతురు. అవి పంచసూనములని అనబడును. ఇట్టి పాపముల చేయనిగృహస్థే ఉండడు. అవియేవన కత్తి, తిరుగలి, రోకలి వీటితో నిప్పుతో, నీటితో చీపురుకట్టతో జరుగు పాపములు, ఈ పాపములు పోగలందులకు వైశ్వదేవము చేయవలయును. అనగా వంటచేయబడిన పదార్థమును దేవతలకు పితరులకు, భూతములకు, ఋషులకు, అతిథులకుకూడ నర్పించి శేషించిన పదార్థము యజ్ఞశేషమని భావించి భుజించవలయును. అట్లొనరర్చుటచే నిత్యము గృహస్థునిచే చేయబడు పంచసూనములను పాపముల వలన కలుగు దోషము నశించి దేవతలవలన చిత్త శుద్ధికలవాడగును.

భోజనకాలమున ఎవరైన నతిథిగావచ్చిన కులముగాని గోత్రముగాని ప్రశ్నించక భగవంతుడను భావముతో భోజన మిడవలయును. యమధర్మరాజు అతిథి పూజ చేయువారిని నాలోకమునకు గోనిరావద్దని తన దూతలతో చెప్పెను. అతిథి పూజచే సర్వదేతల పూజించిన ఫలము వచ్చును. అతిథికి పాదప్రక్షాళన మొనర్చిన పితృదేవతలు తృప్తులగుదురు. అతిథి భుజించిన బ్రహ్మా విష్ణు మహేశ్వరులు తృప్తిగాంతురు. అతిథి గారి బ్రహ్మచారిగాని భిక్షకువచ్చిన వైశ్వదేవము నైవేద్యము కాకున్నను తప్పక భిక్షనివ్వవలయును. అట్టివారికి ఇవ్వబడిన ఒక కబళము మేరువంతయగును. వారు త్రాగు పానరీయము సముద్రమంతగా వృద్ధియగును. అట్టి అతిథిని విడనాడి భుజించువాడు మరుజన్మయందు కుక్కయై తరువాత గాడిదయై పుట్టును. వడ్డించుపుడు

పంక్తిభేదము చేయుట మహాపాపము భుజించువారు పాదములు, చేతులు, ముఖము నీటిచే కడుగుకొని భుజించవలయును. మౌనముగా తూర్పుముఖముగా కూర్చుండి భుజింపవలయును.

వడ్డించుచోట నీటితో ఆలికి మ్రుగ్గువేసి అందు దేవతల నాహ్వానించి అచ్చుటపత్రముంచి వడ్డించవలయును. మండలము చేయక భుజించువారి యన్నరసము, రాక్షసుల, పిశాచముల పాలగును. పితృకార్యములందు ఉత్తరపు ముఖముగ భుజింపవలయును. మూలలకు ముఖముండునటుల కూర్చొని భుజింపరాదు. గృహస్థుడు వెండి బంగారము తామ్రపాత్రలందును, పద్మపలాశ పత్రములందును భుజింపవచ్చును. లోహపాత్రలందు, వస్త్రమందు, భూమిమీదను భుజించరాదు. కాంస్యపాత్రయందు భుజించుటచే ఆయుష్యము వర్చస్సు వృద్ధియగును. కాంస్యపాత్ర భోజనము, అభ్యంగనము, తాంబూలము ఇవివిధవలకు, యతులకు నిషిద్ధము. పతితుల ప్రక్కన నిడుకొని భుజించరాదు. కొంచెము అన్నమును భుజించునపుడు కుడి ప్రక్కన నేలమీద చిత్రగుప్తుని పేరుతో బలిగా నర్పించి భుజింపవలయును. భగవంతుడే తనలో నుండి భుజించుచున్నాడనియు, తినబడు అన్నము బ్రహ్మ స్వరూపమనియు భావించుచు భుజింపవలయును. ముఖములో నిముడునంత మాత్రమే ముద్ద చేసి నోట పెట్టుకొనవలయును. నెయ్యి, పాయసము, లవణము పత్రములో శేషముంచరాదు. ఎడమ పాదమున చేయి పెట్టి భుజింపరాదు. మోకాలుకు బయట చేయి పెట్టుకొని భుజించరాదు. చప్పుడగు నటుల తినరాదు నీరు త్రాగరాదు. నిలువబడి గాని తిరుగుచు గాని నీరు త్రాగరాదు. రజస్వలను, కుక్కను, చండాలుని చూచుచు భుజించరాదు.

స్త్రీలు నల్లని వస్త్రము ధరించిగాని, గోచి లేకగాని వడ్డించరాదు. భుజించి లేచి గండూషము లాచరించి హస్తము కడుగుకొన వలయును. పాదప్రక్షాళన మొనర్చవలయును. ఆహారము జీర్ణము కాగలందులకు అగస్త్యుని, కుంభకర్ణుని, బడబాగ్నిని స్మరించవలయును. తామస పదార్థముల భుజించరాదు. కుక్కలు, కాకులు పిల్లలు స్పృశించిన అన్నము తినరాదు. చద్ది అన్నము తినరాదు. రాత్రులందు సప్తమీ ఆదివారములందు ఉసిరిక పచ్చడి తినరాదు. భుజించి తాంబూలము వేసికొనవలయును. యుతులు, బ్రహ్మచారులు, విధవలు, రజస్వలలైన స్త్రీలు తాంబూలము వేసికొనరాదు. సాయంకాలము పురాణములు సద్గ్రంథములు పెద్దలవలన వినవలయును.

సూర్యుడస్తమించు సమయమునకు తిరిగి సంధ్యవార్చి హోమ మొనర్చి

గురువందన మాచరింపవలయును. రాత్రులందు లఘువుగ భుజించవలయును. జాము ప్రొద్దుపోవువరకు సద్గ్రంథముల పఠించి తాను దినమంతయు చేసిన కర్మనంతను ఈశ్వరున కర్పించి శయనించవలయును. తూర్పు, దక్షిణముల శిరముంచి గాని ప్రవాసములందు పడమరగ శిరముంచిగాని శయనించవలెను. ఉత్తరముగ శిరముంచి ఎన్నడును శయనింపరాదు. భర్తతో శయనించు స్త్రీ నీల వస్త్రము ధరింపరాదు. రతికాలమున దీపముండరాదు. రజస్వల అయిన స్త్రీలో నాల్గవ దినమున రమించిన ఆల్పాయుష్మంతుడగు కొడుకు కలుగును. అయిదవ దినమున కన్యక, ఆరవ దినమున పుత్రుడు జన్మింతురు. స్త్రీ, పురుషులు రతికాలమున ఎట్టిభావము గలవారుగ నుందురో అట్టి సంతానమే కలుగును అని ఈ విధమున గురుమూర్తి బ్రాహ్మణునితో ఆచార ధర్మ ముపదేశించి ఆచారమును పరిపాలించువారింట దైన్యముండదు. వారు ఆయుష్మంతులై పుత్రపౌత్రాభివృద్ధి నొంది సుఖింతురు. వారికి కలికాల భయము లేదు. వారు కాలమృత్యువు గెలుతురు. అపమృత్యువు వారలనేమి చేయగలదు? కాన బ్రాహ్మణా నీకు ఆచార ధర్మముచెప్పితిని. నీవు పరాన్నమిక మీద విసర్జించి ధర్మఆచరించి సుఖింపుమని ఆశీర్వదించిరి. బ్రాహ్మణుడును భార్యతో కలసి గురుమూర్తికి నమస్కరించి ఆజ్ఞతీసికొని వెళ్ళి అట్లే ఆచరించి ఇహపర సౌఖ్యముల నొందెను. ఇట్టి గురుచరితము నెవ్వరు శ్రద్ధతో విని ఆచరించెదరో అట్టివారు మూర్ఖులు సహితము ఉత్తమజ్ఞాన సంపన్నులు కాగలరని సిద్ధముని నామధారకునితో చెప్పెను.

**ఇది గురుచరితమున ముప్పది ఏడవ అధ్యాయము సమాప్తము.**

**దిగంబరా దిగంబరా శ్రీపాదవల్లభ దిగంబరా**

**శ్లో॥ సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతిచ యాచతే ।**
**అభయం సర్వభూతేభ్యః దదామ్యేతద్వ్రతం మమ**
**- శ్రీ మద్వాల్మీకి రామాయణము యుద్ధకాండము**

తా॥ ఒక్కసారి నాకు ప్రపన్నుడైన వానికి నేను నీ వాడను నీ భృత్యుడనగు నన్ను బ్రోవుము" అని వాగ్రూపమున ప్రార్థించిన వానికి భయహేతువులైన సర్వభూతముల నుండి భయము లేకుండునట్లు బ్రోతును. ఇది నా దీక్ష. అనగా ఎట్టి తారతమ్యమును గదునింపక, అశ్రయించినదే తడవుగా ప్రతివానికిన రక్షణ నిత్తునని భావము.

(శరణాగతుని విషయమున తనకర్తవ్య నిష్ఠకు ప్రతిజ్ఞారూపమున ఇందు శ్రీరాముడు తెలుపుచున్నాడు. దీనిని శ్రీరామ చరమ శ్లోకమందురు.)

# శ్రీ గురు చరితము

## ముప్పదిఎనిమిదవ అధ్యాయము

**ఉపాసనాకాండ ప్రారంభము**

**ఓం అవధూత చింతనం శ్రీగురుదేవత్త జయ ఓం**

**శ్రీ దత్తాత్రేయాయ నమః శ్రీ గణపతయే నమః శ్రీ గురుభ్యో నమః**

**జయ జయ శ్రీనృసింహసరస్వతీ జయ జయ**

నామధారకుడు సిద్ధముని పాదములకు నమస్కరించి గురుమహాత్మ్యమును వినిన కొలదియు ఇంకను వినవలయునను తృష్ణ అధికమగుచున్నది. కాన దయయుంచి తరువాత జరిగిన గురుచరిత్రను నాకు వినిపించి నా మనస్సును శాంతి పరచుడని ప్రార్థించ సిద్ధముని ఇట్లు చెప్పుచున్నాడు.

నీ ప్రశ్నవలన నాకును కడు సంతసమైనది. నీనిమిత్తము గురు కథను మధ్య మధ్య మరచుచున్న నాకు తిరిగి స్మరించు భాగ్యము ఘటించుచున్నది.

గంధర్వపురమున జరిగిన చిత్రమైన గురులీల నొకటి చెప్పుచున్నాను వినుము. గురుమూర్తి మహాత్మ్యమును విని అనేక మంది ధనికులైన భక్తులు గణగాపురము వచ్చి గురుమూర్తిని దర్శించి వారికి శిష్య సమేతముగ పక్వాన్నములతో భిక్షలు చేయుచుండెడి వారు. ఇట్లు నిత్యము అచట బ్రాహ్మణ సమారాధనలు జరుగుచుండెడివి. బ్రాహ్మణ సమారాధనమే లేని దినమే కాన రాకుండెను.

ఇట్లుండ నొకదినమున కాశ్యవగోత్రజుడైన భాస్కరుడను పేరుగల ఒక బీద బ్రాహ్మణుడు స్వామివారికి భిక్ష చేయవలయునను కోరికతో గణగాపురము వచ్చి భక్తితో స్వామి వారి పాదములకు సాష్టాంగమున వందన మాచరించెను. బీద వాడగుటచే ముగ్గురకు మాత్రము సరిపోవు తండులములను మిగిలిన పదార్థములను పై ఖర్చుకుగాను తగినంత ద్రవ్యమును తన వ్రస్తమున మూటగట్టికొని వచ్చి మఠమున నివసించెను. ఆ దినమున సమారాధనము చేయువారలచే నాహ్వానింపబడి అందరితో పాటు తానును భుజించి రాత్రికాలమున స్వస్థముగ మఠముననే నిద్రించెను. ఇట్లెన్నిదినములో గడచెను. అతనికి తాను తెచ్చిన స్వల్ప పదార్థముతో స్వామివారికి భిక్ష చేసెదనని చెప్పుటకుగూడ సిగ్గుచుండెను.

స్వామివారి శిష్యులు ఇతని వలన ఇతని అభిప్రాయమును గ్రహించి అతనిని

పరిహసించి ఒక్కరికైన సరిపోని పదార్థముతో శిష్యసమేతముగ స్వామివారికి భిక్ష ఎట్లు చేయగలవు ? అట్లు చెప్పుటకు నీకు సిగ్గయిన లేదా ? రేపు నీవు తెచ్చిన పదార్థము వండి బీదవారికి మాధూకరము పెట్టుమనిరి. ఇటుల మూడునెలలు జరిగెను. నిత్యము స్వామివారితో పాటు తానును సమారాధనమున భుజించి రాత్రి తాను తెచ్చిన సామాగ్రిమూట తలక్రింద నిడుకొని నాకు స్వామివారి భిక్షచేయు భాగ్యము లేకపోయెగదా ! అందరు నన్ను పరిహసించుచున్నారు. దైవహీనుడు నేనేమి చేయుదునని విచారించుచు నిద్రించుచుండెను.

గురుమూర్తి సర్వజ్ఞులుగా భాస్కరుని భక్తికి సంతసించి ఒక దినమున నతనిని పిలిచి రేపు నీవే మాకు భిక్షయొనర్చుము. శుచిగ పాక మొనర్చుము. అన అతడు ఆనందభరితుడై మరునాడు పణ్యవీధికి వెళ్లి తన వద్దనున్న ద్రవ్యముతో నెయ్యి శాకములు తెచ్చి స్నాన మొనర్చి పాకముచేయ ప్రారంభించెను. అదే దినమున మరియొకరు స్వామిని భిక్షకు ప్రార్థించ స్వామివారు ఈ దినమున భాస్కరుడు భిక్షచేయునుగాక వీలులేదనిరి. బ్రాహ్మణులందరు హా దైవమా ! నిత్యము స్వామి వారితోపాటు మృష్టాన్నము భుజించుచుంటిమి. నేడీ బీద బ్రాహ్మణుడెట్లు తటస్థమయ్యెనని చింతించుచుండ గురుమూర్తి అది గ్రహించి వారలతో మీరందరు నిత్యమువలె కుటుంబ సమేతముగా వచ్చి నా వద్దనే భుజింపుడని యనిరి. గ్రామస్థులు స్వామివారి వద్ద శిష్యులచే నివ్వబడిన పదార్థము చాల గలదు గాన మనకందరకుగూడ పాకము చేయింతురని భావించి వెళ్ళిరి.



గురుమూర్తి భాస్కరుని పిలిచి ఈ దినము ఎక్కువ మంది బ్రాహ్మణులు భోజనమున కేతెంచెదరు. కాన శీఘ్రముగ పాకము చేయుమన నా బ్రాహ్మణుడు పాకము సిద్ధమయ్యెననెను. స్వామివారు బ్రాహ్మణునితో నీవు నదివద్దకు వెళ్ళి బ్రాహ్మణులతో పాకము సిద్ధమైనది గుర్వాజ్ఞ అయ్యెను గాన మీరందరు శీఘ్రముగ భోజనమునకు రండని పిలుపుమని చెప్ప నా బ్రాహ్మణుడు నదికి వెళ్ళి బ్రాహ్మణులతో పాకము సిద్ధమయినది మిమ్ముల భోజనమునకు రమ్మని గురుమూర్తి చెప్పిరని యన వారు నీవు చేసిన పాకముతో స్వామివారికి భిక్షయొనర్చుము, స్వామివారు మా కందరకు వంట చేయించెదరు. ఆలస్యము కాగలదు. ఇప్పుడే వచ్చి ఏమి చేసెదము ? కాన రామని నిరాకరించిరి.

అప్పుడా బ్రాహ్మణుడు గురుమూర్తితో స్వామీ భిక్షకు దయచేయుడు. బ్రాహ్మణులు నేడు మా గృహములందే భుజించెదమని ఏమేమో చెప్పుచు పరిహసించుచున్నారని చెప్ప స్వామివారు నేను బ్రాహ్మణులందరితో కలసి భిక్షచేయుదును కాని ఒంటరిగ నీ భిక్ష స్వీకరించువాడను గాను అని యన బ్రాహ్మణుడు స్వామి వారి మహిమ తెలిసిన వాడుగటచే వారి వాక్యము కామధేనువని మనస్సున విశ్వసించియు స్వామి వారితో స్వామీ ! మీయాజ్ఞకు నేను బద్ధుడను. కాని నా వాక్యమును వారు విశ్వసించుట లేదు నేనేమి చేయుదునన స్వామి వారు తన శిష్యుని పిలిచి నీవు వెళ్ళి బ్రాహ్మణులునందర వెంటనే భోజనమున కాహ్వానింపుము అని పంప అతడు గురుమూర్తి ఆజ్ఞను వారలతో చెప్ప వారందరు స్నానము లొనర్చి మఠమునకు వచ్చిరి.

అప్పుడు స్వామివారు బ్రాహ్మణునితో నీవు వీలరనందరను కుటుంబ సమేతముగ నిచ్చట భుజింపుడని ప్రార్థించు మన నతడట్లొనర్చెను. అచటచేరిన బ్రాహ్మణులు అతనిని పరిహసించిరి. నీవు వండిన పదార్థము ఇంత మందికి ఏమి సరిపోవును ? ఒక్కొక్కరకు ఒక్క మెతుకైన రాదుకద ! మమ్ముల నాహ్వానించుటకు నీకు సిగ్గయిన లేదా ! అని అనుచుండిరి. గురుమహిమ తెలిసిన వృద్ధులు మాత్రము అతనిని పరిహసించకుడు గురుమూర్తి చెప్పమన్న రీతిని అతడు పలికెను. అతనిదేమి దోషమనిరి. బ్రాహ్మణులు వరుసలుగ కూర్చుండిరి. విస్తళ్లు వేయబడెను. భాస్కరుడు గురుమూర్తికి భక్తితో షోడశోపచారములతో పూజ యొనర్చి నీరాజన మిచ్చెను.

గురుమూర్తి భాస్కరునితో నీవు చేసిన పాకమును పాత్రలతో సహా తెచ్చి నా సమక్షమున నుంచుమనెను. అతడట్లొనర్చెను. తన శాటీ వస్త్రమును ఇచ్చి

దానితో నా పాకమును కప్పుమన నతడట్లొనర్చెను. స్వామివారప్పుడు తన కుండలములోని ఉదకమును చేత తీసికొని మంత్రించి ఆ ఉదకమును పాకముమీద చల్లి నీవు వస్త్రవమును తీయక పాత్రాంతరములతో పదార్థముల తీసికొని యథేష్టముగ వడ్డిపుమని యాజ్ఞాపించిరి. భాస్కరుడట్లొనర్చెను. తీసిన కొలదియు పదార్థములు నిండుచుండెను. ఆ ఆశ్చర్యము చూచి అనేక మంది బ్రాహ్మణులు వడ్డనకు లేచిరి. ఏ పదార్థము ఏ పాత్ర నుండి ఎంత తీసిన తక్షణమే ఆ పాత్రము పూర్వమువలె పూర్తిగనుండెను. వడ్డన పూర్తి అయ్యెను. అందరును భుజించుటకు ప్రారంభించిరి. భాస్కరుడు బ్రాహ్మణుల స్వస్థమనస్కులై భుజించుడు కావలసిన పదార్థముల యథేష్టముగ నడుగుడని ప్రార్థించెను. బ్రాహ్మణులు కంఠమువరకు తింటిమి ఇట్లెన్నడును భుజింపమైతిమనిరి. అందరును భుజించి హస్తముల కడుగుకొనిరి. అందరికి తాంబూలము లివ్వబడెను. భుజించిన వారి విస్తళ్లు తీసివేయబడి స్థలము శుద్ధము చేయబడెను. అప్పుడు గురుమూర్తి గ్రామములో ఇంకెవరైన బ్రాహ్మణులు, స్త్రీలు, బాలురుగూడ భుజించకనున్న వచ్చి భుజింపుమని ఆజ్ఞ నీయ నట్లే గ్రామస్థులైన బ్రాహ్మణులు స్త్రీలు, బాలురు, అందరు భుజించి వెళ్లిరి.

స్వామివారు గ్రామస్థులైన శూద్రులను అంత్యజులను స్త్రీ పుత్రసమేతముగ పిలిపించి వారలకుగూడ భోజనమిడుమని ఆజ్ఞనీయ బ్రాహ్మణుడట్లొనర్చెను గురుమూర్తి బ్రాహ్మణునితో అందరు భుజించిరా ! గ్రామములో నెవరైన భుజించని వారున్నచో వచ్చి భుజించుమని డంగోరా (దండోరా, చాటింపు) వేయించుమని ఆనతిచ్చిరి. బ్రాహ్మణు డట్లొనర్చెను. అందరును భుజించినందున ఎవ్వరును రారయిరి. అప్పుడు గురుమూర్తి నీవు భుజించుమని బ్రాహ్మణునకు చెప్పిరి. అతడును భుజించెను. అప్పుడు గురుమూర్తి పాత్రముల మీద కప్పిన శాటీ తీయుమనెను. బ్రాహ్మణుడట్లేతీసి చూడవండిన పదార్థమంతయు నట్లే యుండెను. అప్పుడు గురుమూర్తి బ్రాహ్మణునితో నీవు ఈ పదార్థమును భీమా నదిలో పడవేసి రమ్ము. అందలి చేపలుగూడ నీ పదార్థముల భుజించగలవని చెప్ప ఆ బ్రాహ్మణుడును నట్లొనర్చెను.

ఆ దినమున జరిగిన ఈగురులీలను చూచి అందరు ఆశ్చర్యమందిరి. స్వల్పదార్థముచే గురుమూర్తి నాలుగువేల మందికి పైగా అన్నదానము చేసిరి. గురుమూర్తి బ్రాహ్మణుని భక్తి శ్రద్ధలకు సంతసించి నీవు లక్ష్మీసంపన్నుడవై

పుత్ర పౌత్రాభివృద్ధినొందుమని ఆశీర్వదించిరి.

కొంతమంది విజ్ఞులు గురుమూర్తి అన్నపూర్ణను స్మరించెను గాన అన్నము అక్షయమయ్యెననిరి. మరికొందరు పూర్వము దూర్వాసుడు శిష్యసమేతముగ పాండవుల పరీక్షింప రాగా ద్రౌపది కృష్ణుని స్మరింప కృష్ణుడేతెంచి ద్రౌపదిని సంకటము నుండి రక్షించుట వింటమి. ఈ గురుమూర్తి భాస్కరుని అవమానమునుండి రక్షించి కాపాడుట నేడు చూడగలిగితిమి అనిరి, స్వామివారు మనుష్యమాత్రులుగారు. త్రిమూర్త్యవ తారులే గాకున్న నింతటి సామర్థ్య మెవ్వరికైన కలుగునా! ఇట్టి శ్రీవారి మహిమ నెన్న నెవ్వరి తరము. ఇట్టివారిని మనుష్యునిగా తలచువారు తప్పక నధోగతి పాలగుదురు.

ముగ్గురకు సరిపోని పదార్థముతో నాలుగువేల మందికి అన్నదానమొనర్చిరి. మరణించిన వానికి ప్రాణములిచ్చిరి. ఈ చిత్రముల కనులార గాంచితిమి. త్రివిక్రమ భారతికి విశ్వరూపము జూపిరి. గ్రామ మధ్యమున గొడ్డుబోతు బఱ్ఱెతో పాలు పితికించుటయును చూచితిమి. హీనజాతి వానిచే వేదముల పలికించిరి. భక్తునకు కాశీ గయా ప్రయాగల నొకే రోజున దర్శింపజేసిరి. ఇట్టి అమితమైన మహిమ లెన్నియో కనులార చూచితివి. ఇట్టి సామర్థ్యము ఈశ్వరస్వరూపులైవారికే తప్ప మరి యొక్కడ గాంచము. ఎంతయో శ్రమపడిననే ఆరాధించిననే దేవతలు ప్రసన్నులగుదురు. గురుమూర్తి అట్లుగాక దర్శనమాత్రముననే భక్తుల కామముల పూర్తి చేయుచున్నారు. అని అందరును గురులీలల వెయ్యినోళ్లతో కొనియాడిరి. ఇట్లు గురుమూర్తి ఖ్యాతి సర్వత్ర విఖ్యాతినొందెను. ఎందరో గురుమూర్తికి శిష్యులగుచుండిరి. నానా రాష్ట్రముల నుండి గురుమూర్తిని సేవింప వచ్చుచుండిరి. శిష్యమనోభావన ననుసరించి గురువు వారల పట్ల ప్రసన్నుడగు చుండునని ఇట్టి గురుచరిత్రమును సిద్ధముని నామధారకునకు చెప్పెను.

**ఇది గురుచరిత్రమున ముప్పది ఎనిమిదవ అధ్యాయము సమాప్తము.**

**దిగంబరా దిగంబరా శ్రీపాదవల్లభ దిగంబరా**

**శ్లో॥ త్రిపుంపర్యాప్తపాకేన భోజయామాసయో నృణాం ।**
**సిద్ధశ్చతుస్సహస్రాణి శ్రీదత్తశ్శరణం మమ ॥**

భా॥ ఒక బీదబ్రాహ్మణుని యందు దయగల వారై స్వామి అతను తెచ్చిన కొద్ది పదార్థముచే వేలమందికి అన్నదాన మొనర్చుట.

# శ్రీ గురు చరితము

## ముప్పదితొమ్మిదవ అధ్యాయము

**ఓమ్ అవధూతచింతనం శ్రీ గురుదేవదత్త జయ ఓమ్**
**గురుదేవదత్త శ్రీ గణపతయే నమః శ్రీ సరస్వత్యై నమః**
**జయ జయ శ్రీ నృసింహ సరస్వతీ**

సిద్ధముని నామధారకునితో ఓ నామధారకా! గురుమూర్తి అనుగ్రహమువలన అరువది (60) సంవత్సరముల వనితకు సంతతి కలిగెను. అట్టి అపూర్వమగు గురుమహాత్మ్యమును చెప్పెద సావధానుడవయి వినుము.

గణగాపురమున శౌనకగోత్రీయుడు ఆపస్తంభ యజుర్వేద శాఖీయుడయిన సోమనాథుడను బ్రాహ్మణుడు కలడు. అతడు వేదశాస్త్ర ప్రమాణముగ నిత్యము సత్కర్మలనాచరించుచుండును. అతనికి పతివ్రతయగు 'గంగ' యను భార్యకలదు. ఆమెకు ఆరువది సంవత్సరములు వచ్చినను సంతానము లేనందున గొడ్రాలను వాడుక ఆమె విషయమున వచ్చెను. ఆమె నియమముతో పతి సేవ చేయుచుండును. అటుల నిత్యము గురుమూర్తియైన నృసింహ సరస్వతీస్వామి వారి మఠమున కేతెంచి స్వామివారికి నమస్కరించి, పూజచేసి, నీరాజన మిచ్చి పోవుచుండిరి. ఇట్లు కొంత కాలము జరుగనొక రోజున ఆమె తన దర్శనమునకు రాగా ఆమె భక్తికి శ్రద్ధకు సంతసించి నవ్వుచు నావృద్ధురాలితో నిట్లనిరి; ఓ గంగా బాయీ! నీవు నిత్యము నా దర్శనమునకు వచ్చి నీరాజనమిచ్చి పోవుచున్నావు. కాని నీకోరిక ఏదియో ఇంతవరకు వెల్లడించవైతివి. నేడు నేనడుగుచుంటినిగాన సంశయింపక నీమనోవాసన ఏమియో చెప్పుము పరమేశ్వరుడు నీయభీష్టమును సిద్ధింప చేయును. అని అనిరి. గురుమూర్తి వాక్యమును విని ఆమె దోసిలియొగ్గి నమస్కరించి ఇట్లనుచున్నది.

స్వామీ! పుత్రులు లేని స్త్రీని గతి లేదనియు, అట్టి స్త్రీ ముఖము చూడరాదనియు వేదములందు గలదని పెద్దలందురు. నేను పాపినగుటచే నా గర్భము ఫలించనందున నా జన్మవ్యర్థమయ్యెను. పుత్రులు లేని గృహము అరణ్యముతో సమానము. నిత్యము స్త్రీలు పిల్లల నెత్తుకొని నదీ స్నానమున కేతెంచెదరు. నేనట్టి భాగ్యమును చేసికొన నైతిని. సంతానహీనుకాలగు స్త్రీ యొక్క పితరులుగూడ పిండోదకము లిచ్చువారు లేకపోవుటచేత నధోగతి

పాలగుదురట. నాకు ఇప్పటికి ఆరువది సంవత్సరములు వచ్చెను. ఇట్లీజన్మ సంతానరహితమై వ్యర్థమాయెను. మీ యనుగ్రహము వలన ముందు జన్మలోనైన పుత్రవంతురాలను కావలయునను మనోవాసనతో మీసేవ చేయుచుంటిననెను.

స్వామివారు ఆమెతో నీ సేవకు సంతసించితిని. ముందు జన్మ సంగతి ఎవరు చెప్పగలరు. ఒక జన్మ విషయము రెండవ జన్మలో స్మృతిలో నుండుటయు అసంభవము. ఈ జన్మలో నీవు నన్ను సేవించితివి గాన ఈ జన్మయందే నీకు ఒక పుత్రికయు పుత్రుడును గూడ కలుగు గలరని యాశీర్వదించిరి. స్వామివారి వాక్యములు విని ఆమె లోపల విశ్వసించి వారితో స్వామీ! నాకు ఆరువది సంవత్సరములు వచ్చేగదా ! బహిష్టు కాలము గూడ దాటిపోయెను. నాకు సంతానము కలుగు మార్గమేమియో గోచరించుటలేదు. నేనెన్నియో వ్రతముల నాచరించితిని, తీర్థయాత్రలు చేసితిని. అశ్వత్థప్రదక్షిణల నాచరింపుమని అందరు చెప్ప నింత పర్యంతము ఈ జన్మలో గాకున్న ముందు జన్మకైన పుత్రవంతురాల నగుదునను ఆశతో నశ్వత్థ ప్రదక్షిణల నాచరించుచున్నాను. నేటికి నాకు ఈ జన్మయందే సంతానము కలుగునట్లు ఆశీర్వదించితిరి. మూర్ఖురాలనై ఇంత పర్యంతము అశ్వత్థమును సేవించితినన స్వామివారు నవ్వుచు నామెతో నిట్లనరుచున్నారు.

అశ్వత్థమును నిందింపకుము. అశ్వత్థ సేవకడు పుణ్యప్రదము. నీవు ఇక మీద సంగమమున నేను అనుష్ఠానమొనర్చు అశ్వత్థమునకు ప్రదక్షణ మొనర్చుము. నీకు సంతానము కలుగును. పురాణములందు అశ్వత్థ వృక్షముయొక్క మాహాత్మ్యము విస్తరించి చెప్పబడెను. అశ్వత్థ వృక్షము నారాయణ స్వరూపమగుటచే నేనును అశ్వత్థవృక్ష సమీపమున నేనివసింతును అని గురుమూర్తి చెప్పగా ఆమె అశ్వత్థ వృక్షమాహాత్మ్యమును విస్తరించి చెప్పుడు నా మనసు స్థిరపడును అని అడుగ స్వామి వారు ఆమెతో బ్రహ్మాండ పురాణమున అశ్వత్థమహిమ వర్ణింపబడెను. ఆ విషయమే చెప్పుచున్నాను వినుము అని ఇట్లు చెప్పుచుండిరి.

బ్రహ్మాపుత్రుడైన నారదుడు బ్రహ్మావలన అశ్వత్థ వృక్ష మహాత్మ్యమును విని భూలోకమందలి ఋషుల ఆశ్రమమునకు రాగా ఆశ్రమ వాసులగు ఋషులు అతనికి స్వాగతము చెప్పి అశ్వత్థ మాహాత్మ్యము ప్రశ్నించ నారదుడు ఋషులకు నీ క్రింది విధముగ నశ్వత్థ మాహాత్మ్యమును చెప్పెను.

ఋషులారా ! నేను లోకముల పర్యటించుచు బ్రహ్మ లోకమునకు పోయి బ్రహ్మకు నమస్కరించి తండ్రీ! అందరు అశ్వత్థ వృక్షము విష్ణుస్వరూపమందురు. అట్టి వృక్షము నెట్లు సేవించవలెనో అట్టి అశ్వత్థ మాహాత్మ్యమును నాకు విస్తరించి చెప్పుడని ప్రార్థించ చతుర్ముఖుడు నాతో నేమి చెప్పెనో ఆ విషయమే మీతో చెప్పుచున్నాను వినుడు.

అశ్వత్థ మూలమున బ్రహ్మ నివసించును. మధ్య భాగమున విష్ణువు, అగ్రమున రుద్రుడు నివసింతురు. దక్షిణ శాఖలందు శూలపాణియు, పశ్చిమశాఖలందు విష్ణువు, ఉత్తరశాఖలందు బ్రహ్మయు నివసింతురు. ఇంద్రాది దేవతలు తూర్పు శాఖలనుందురు. బ్రాహ్మణులు, ఋషులు, గోవులు, వేదములు, యజ్ఞములు, మూలాంకురములనుందురు నదులు సప్తసముద్రములు, శాఖలందుండును. అకారము మూలముగను, ఉకారము స్కంధముగను. మకార మగ్రముగను ఇట్లు అశ్వత్థమును ప్రణవముగ తెలిసికొని ఉపాసింపవలెను. అశ్వత్థము కల్పవృక్షము భక్తులకు సమస్తకామనల నిచ్చుట యందు సమర్థమైనది. అని నారదుడు చెప్ప ఋషులు అశ్వత్థ సేవావిధానమును విస్తరించి చెప్పుమని ప్రార్థించిరి. అప్పుడు నారదుడిట్లు చెప్పుచున్నాడు.

ఋషులారా ! వినుడు, ఆషాఢ, పుష్య, చైత్రమాసములందును, గురు శుక్ర మౌఢ్యము వచ్చినప్పుడు, చంద్రాను కూల్యము లేనప్పుడు, అశ్వత్థ సేవ నారంభించరాదు. శుభదినమున శుచియై యశ్వత్థ ప్రదక్షిణల నారంభించవలయును, రాత్రి, అపరాహ్ణము మొదలగు నిషిద్ధ కాలములందు అశ్వత వృక్షమును స్పృశింపరాదు.

అశ్వత్థ సేవచేయువారు అబద్ధములాడరాదు. జూదమాడరాదు. ఇతరుల నిందించరాదు. శిరఃస్నాన మొనర్చవలయును. శుభ్రమైన వస్త్రముల ధరించి అశ్వత్థసేవ నారంభించవలయును. రెండు కలశములతో ఉదకము తెచ్చి గంగా యమునల నందాహ్వానించి, సంకల్పమొనర్చి ఆ ఉదకముతో ఏడు పర్యాయములు అశ్వత్థమును తడుపవలెను. తిరిగి స్నాన మొనర్చి శు చియైషోడశోపచారములతో వృక్షమును పూజించ వలెను. ఎనిమిది భుజములుగల శ్రీ మహావిష్ణువుగ ధ్యానింపవలెను. లక్ష్మి సమేతుని, పీతాంరునిగ,భుజముల శంఖము, క్రము, వరముద్ర, ఖడ్గము, చాపము, అభయరుద్ర మొదలగునవి ధరించియున్నటుల ధ్యానించవలెను. వస్త్రముతోగాని, దాపముతో గాని వృక్షమును చుట్టి ప్రదక్షిణల నాచరించవలెను.

మందగతిగ మౌనముగ గాని భగవంతుని నామముచ్చరించుచుగాని ప్రదక్షిణ చేయవలయును. ప్రతి ప్రదక్షిణకు నమస్కరించవలయును. రెండు లక్షల ప్రదక్షిణముల నొనర్చిన బ్రహ్మహత్య నశించును.

అశ్వత్థ ప్రదక్షిణలవలన వ్యాదులు నశించును ఋణబాధలు తొలగును. గ్రహబాధలు తొలగును. పుత్రకాములు మనోవాక్కాయములతో నశ్వత్థ ప్రదక్షిణల చేసిన తప్పక వారలకు సంతానప్రాప్తియగును. చతుర్విధ పురుషార్థములనొసంగెడి అశ్వత్థసే పుత్రప్రదమనుటలో ఆశ్చర్యమేమియులేదు. శనివారమును అశ్వత్థము స్పృశించుచు మృత్యుంజయ మంత్రమున జపించుచో కాలమృత్యువుగూడ తొలగును. అపమృత్యువు మాట చెప్పనేల. శని చాలనివారు "కోణస్థః, పింగళో, బభ్రుః, కృష్ణః, రౌద్రః, అన్తకః, యమః, సౌరిః, శనైశ్వరః, మందః, పిప్పలాదేన సంస్తుతః" అని శని నామముల పఠించుచు అశ్వత్థ సేవ చేసిన శనిపీడ తొలగును. దృఢ మనస్సుతో సేవచేయువారు సర్వకామనల నొందగలరు, అశ్వత్థపు నీడను అమావాస్య గురువారములందు స్నానమొనర్చిన బ్రహ్మహత్య తొలగును. ఆ వృక్షము క్రింద చేయబడిన జపము అనంతఫల ప్రదమగును. అశ్వత్థవృక్షమును నాటినవారి పితరుల శాశ్వతసర్గము



నందెదరు. అశ్వత్థ వృక్షమును ఛేదించువారు వారి పితరులతో సహ నరకమనుభవింతురు. ప్రదక్షిణ పూర్తి చేసి ఉద్యాపన మాచరించవలయును. బంగారు అశ్వత్థమును బ్రాహ్మణునకు దానము చేయవలెను. తెల్లనిగోవును దానమియ్యవలెను అని ఇట్లు నారుదుడు ఋషులకు చెప్పెనని గురుమూర్తి ఆ గంగయను వృద్ధ స్త్రీకి చెప్పి ఆమెతో నీవు సంగమమున మన అశ్వత్థమును సేవించుము. నీకు సంతానము కలుగునని చెప్పెను.

గురుమూర్తి వాక్యము విని ఆమె స్వామీ నాకు అరువది సంవత్సరములు వచ్చినవి. జన్మవంధ్యనని లోకమున పేరు గాంచితిని. అయినను గురువాక్యము కామధేనువని శృతిస్మృతులు చెప్పుచున్నవి. గాన మీ వాక్యము విశ్వసించి మీరు చెప్పినటుల నడుచుకొనెదనని చెప్పి వారి యాజ్ఞవడసి సంగమమున ఏగి షట్కాలములయందును స్నానమొనర్చి మూడు దినములు అశ్వత్థముతో పాటు గురుమూర్తికి గూడ ప్రదక్షిణలు పూజలు చేసెను. మూడవరోజు రాత్రి ఆమెకు స్వప్నములో నొక బ్రాహ్మణుడు కనబడి అభయమిచ్చి నీకోరిక నెరవేరును. రేపు ఉదయము గణగాపురమునున్న గురునాథుని వద్దకుపోయి ప్రదక్షిణ నమస్కారముల గావింపుము. నీకు వారేమిత్తురో దానిని భుజింపుము. నీ కార్యము తొందరగా ఫలించును అని చెప్పెను. ఆమెయు స్వప్నము నుండి మేల్కొని సంతసించి ఉదయమగుటతోడనే స్నానమొనర్చి అశ్వత్థమును సేవించి గణగాపురమువచ్చి గురుమూర్తికి ప్రదక్షిణ నమస్కారముల గావించెను. గురుమూర్తి నవ్వుచు ఆమెకు రెండు ఫలములనిచ్చి ఈ ఫలముల భుజించుము. నీకు ఒక పుత్రికయు ఒక పుత్రుడుగూడ కలుగునని చెప్ప ఆమె సంతసించి ఆ ఫలముల భక్షించి వ్రతసమాప్తి గావించెను.

ఆ సాయంకాలముననకే ఆమె యితుమతి అయ్యెను. మూడు దినములు నియమము ప్రకారము శ్వేతవస్త్రము ధరించి హవిష్యాన్నము తిని నాల్గవ దినమున స్నానమొనర్చి గురుదర్శన మొనర్చి అయిదవ దినమున భర్తతో సహ గురుమూర్తి సన్నిధానమున కేగి వారిని పూజించెను. గురుమూర్తి పుత్రవతిని కమ్మని ఆశీర్వదించిరి. ఆమె గురుమూర్తి వాక్య ప్రభావమువలన గర్భవతి యయ్యెను.

గ్రామస్థులందరు ఆశ్చర్యపడి సోమనాథుడు ఎంతటి భాగ్యవంతుడు. గంగాబాయి ఎంత అదృష్టవంతురాలు. ఇంత వృద్ధాప్యమున స్త్రీ గర్భవతియగుట ఎందేని గలదా ! అని అనుకొనుచుండిరి. సోమనాథుడు సంతోషముతో

పుంసవనము సీమంతము అను గర్భవతికి చేయదగిన సంస్కారముల గావించెను. గంగాబాయి గురుమూర్తి ఆజ్ఞ ప్రకారము ముత్తైదువులకు వాయనములిచ్చెను.

గ్రామస్థులు ఆమె నెరిసిన తలకట్టుతో సంతోషముగ వాయనము లొసంగుట చూచి ఇట్లనుకొనుచుండిరి. ఈమె ఎంత అదృష్టవంతురాలు. గురుమూర్తి ఈమెకు ప్రసన్నుడయ్యెను. త్రిమూర్తిస్వరూపులగు దత్తాత్రేయులవారు నృసింహ సరస్వతీ రూపమున భక్తుల నుద్ధరించుట కవతరించిరి. గురుమూర్తిని భక్తితో నర్చించువారికి చతుర్విధ పురుషార్థములు సులభసాధ్యములనుటలో సందియములేదు. అని అందరు చెప్పుకొనుచుండిరి. ఆమెయు స్త్రీలకు వాయనములిచ్చి గురుమూర్తిని సమీపించి నమస్కరించి స్వాఈమ! మీ యనుగ్రహము వలన పవిత్రురాలైతిని. మీరు అనాథులకు నాథులు. త్రిమూర్తి స్వరపులు విభోః జయ జయ అని స్తుతించి వారి యనుమతి నొంది గృహమున కేగెను. కొంతకాలమునకు ఆమెకు నవమాసములు నిండ ఒక శుభదినమునొక శుభసమయమున ఆడశిశువు జన్మించెను. జ్యోతిష్కులు జన్మలగ్నము చూచి ఈ కన్యక అష్టపుత్రులుకలదగును. ఈమె వలన వంశాభివృద్ధి కాగలదు అనిరి. సోమనాథుడు వారల సత్కరించెను. సూతకము వెళ్ళగా స్నానమొనర్చి భార్యాభర్తలు కుమార్తెను వెంటనిడుకొని గురుమూర్తిని సమీపించి గురుమూర్తి పాదముల సమీపమున పుత్రికనుంచి భక్తిభావముతో సాష్టాంగవందన మాచరించిరి. గురుమూర్తి వారల నోదార్చిరి. అప్పుడు ఆమె స్వామీ! మీ యాజ్ఞ ప్రకారము సరస్వతి ఉదయించెను. పుత్రునిగూడ ననుగ్రహించుడన గురుమూర్తి ఆమెతో సంశయింపకుము. పుత్రుడుగూడ మీకు కలుగుగలని ఆశీర్వదించిరి. ఆ కన్యకను తీసుకొని దంపతులతో అచ్చటి వారలు వినుచుండ నా కన్యాలక్షణములు ఇటుల చెప్పుచున్నారు.

ఈమె దీర్ఘ సముగంళియై పుత్రపౌత్రులు గాంచును. వేధపారగుడై జ్ఞానియైన భర్తకు ఈమె లభించును. ఈమె వంశము ఐశ్వర్యముతో తులతూగును. ఈమె పాత్రివ్రత్యము ధర్మశీలత చూచి దక్షిణదేశపు చక్రవర్తి ఈమె దర్శనము చేయగలందులకు రాగలడు అని చెప్ప ఆమె స్వామీ! నాకు పుత్రునిగూడ ననుగ్రహించుడన గురుమూర్తి ఆమెతో యోగ్యుడగు అల్పాయుష్మంతుడైనవాడు కావలయునా ? లేక మూర్ఖుడైన దీర్ఘాయువు గావలయునా చెప్పుమనిరి. ఆమె స్వామి! నాకు యోగ్యుడు కుమారుడు కావలయును. అతనికి అయిదుగురు

సంతాన ముండవలయును. అనియన స్వామి వారు నవ్వి అట్లే కాగలదని అనుగ్రహించిరి. దంపతులు గురుమూర్తి అనుమతి నొంది గృహమునకు పోయిరి. వారికి అచిరకాలముననే ఒక పుత్రుడు కలిగెను. గురుమూర్తి ఆశీర్వదించినరీతిని అతడు వేదశాస్త్రపారంగతుడై అయిదుగురు పుత్రులు గలవాడయ్యెను. ఆ కన్యక గూడ విద్వాంసుగు జ్ఞానియగు దక్షితుడు అనువాడు భర్తగ లభించెను. ఇట్లందరు గురుమూర్తి కృపకు పాత్రులగుటచే నైహికముగ సర్వసుఖముల ననుభవించిరి. కాన ఓ నామధారకా ! గురుకృప యనిట్టిది. ఎవ్వరికి మనోనిశ్చయము దృఢముగ నుండునో వారికి ఫలసిద్ధి తక్షణమే లభించును. గాన ప్రతివారును నిర్వ్యాజమైన భక్తితో గురుసేవ జేసి ధన్యులు కావలసినది నామధారకునితో సిద్ధముని గురుచరిత్రము నందలి ముప్పది తొమ్మిదవ అధ్యాయమును చెప్పెను.

**ఇది గురుచరిత్రమున ముప్పది తొమ్మిదవ అధ్యాయము సమాప్తము.**

**దిగంబరా దిగంబరా శ్రీపాదవల్లభ దిగంబరా**

**శ్లో॥ అశ్వత్థ సేవానూశ్రిత్య పుత్రో యో...దా త్ఫలప్రదః**
**చిత్రకృత్ వృద్ధ వంధ్యాయై శ్రీదత్తశ్శరణంమమ॥**

తా॥ 60 ఏండ్ల గొడ్రాలి భక్తికి సంతసించి ఆమెకు సంతానమొసగుట.
ఈ యధ్యాయ పారాయణముచే సంతానము లేనివారికి సంతాన ప్రాప్తి కాగలదు.

**శ్లో॥ సున్దరే సున్దరోమారః, సున్దరే సున్దరీ కథా ।**
**సున్దరే సున్దరీ సీతా, సుందరే సుందరం వనమ్ ।**
**సున్దరే సున్దరం కావ్యం, సున్దరే సున్దరం కపిః ।**
**సున్దరే సున్దరం మంత్రం, సుందరేకింన సుందరమ్ ?॥**

**– శ్రీ మద్వాల్మీకి రామాయణము సున్దరకాండము**

తా॥ సుందరకాండమున పరమాత్ముడగు శ్రీరాముడు సుందరుడు. కథ సుందరమైనది. జగజ్జనని శ్రీ సీతామాత సుందరమైన మహిళారత్నము. శ్రీ సీతారములు కడు ప్రేమతో జీవితము గడపిన వనము సుందరము. క్యా రచన సౌందర్యము గలది శ్రీ సీతా శోకనివారణ దక్షుడగు శ్రీ హనుమంతుడు అతి సుందరుడు. ఈ కాండములో మంత్రము సహితము సుందరము. వేయేల, సుందరకాండమున సుందరము కానిది ఏదియును లేదని భావము.

# శ్రీ గురు చరితము

## నలుబదియవ అధ్యాయము

**ఓమ్ అవధూతచింతనం శ్రీ గురుదేవదత్త జయ ఓమ్**

**శ్రీ సద్గురు పరబ్రహ్మణేనమః శ్రీ గురువేదత్త జయ ఓం**

ఓ నామధారకా గురుమూర్తి ప్రభావమువలన శుష్కకాష్టము వృక్షమయ్యెను. అట్టి అపూర్వమగు కథను చెప్పుచున్నాను వినుము.

గురుమూర్తి గంధర్వపురమున నుండ యజుర్వేదమునకు సంబంధించిన గార్గ్యగోత్రజుడైన నరహరియను పేరుగల బ్రాహ్మణుడొకడు కుష్ఠరోగముచే పీడింపబడి గురుమూర్తి వద్ద కేతెంచి భక్తి భావముతో ప్రణమిల్లి చేతులు జోడించుకొని ఇట్లు ప్రార్థించుచున్నాడు.

గురుదేవ ! జయజయ. మీరు భక్తవత్సలురు. మీ ఖ్యాతి దిగంతఖ్యాతిగాంచి యున్నది. పరంజ్యోతి స్వరూపులు. నేను భూమియందు జన్మించితిని గాని నా జన్మ పాషాణము వలె వ్యర్థమయ్యెను. కుష్ఠరోగినని అందరు నన్ను నిందించుచున్నారు. వేదమును పఠించితిని. అయినను అంగహీనుడనగటుచే నన్నెవ్వరును భోజనమునకైనను పిలుచుటలేదు. ప్రొద్దునలేచి ఎవ్వరును నా ముఖమైన వీక్షించరు. ఇట్టి నేను బ్రతికి ఏమి ప్రయోజనము. వెనుకటి జన్మమున ఏదియో పాప మొనర్చి యున్నందున ఇట్టి వ్యాధిచే బాధ నొందుచున్నాను. వ్రతములు ఆచరించి, తీర్థములు సేవించి, దేవతల గొలిచితిగాని వ్యాధి శమించనయ్యెను. తమ క్యాతి విని తమ వద్దకు వచ్చితిని. తమరు ఈ దీనునియందు కృప చూపరేని నిశ్చయముగ ప్రాణముల విడచెదనెను.

అప్పుడు భక్తవత్సలుడు గురుమూర్తి అతనిని కరుణించి ఇట్లు చెప్పిరి.

ఓ బ్రాహ్మణా ! నీ దోషము నశించి నీ దేహము దివ్య దేహము కలగదు. అందుకు నేనొక ఉపాయము చెప్పెద. ఆచరించుమని యనుచుండ నా మార్గమున నొకడు నాలుగు సంవత్సరముల క్రింద నరకబడి ఎండిన మేడికొమ్మ నొదానిని తీసికొనిపోవుచుండ గురుమూర్తి వీక్షించి ఆ బ్రాహ్మణునితో నీవతనివద్ద నుండి ఆకాష్ఠమునుఒని తీసికొని సంగమునన్న సంగమేశ్వరుని ఎదుట పాతి నిత్యము స్నాన మొనర్చి అశ్వత్థ వృక్షమును పూజించి తిరిగి స్నాన మొనర్చి జలపూర్ణములైన రెండు కలశములతో త్రికాలములందును ఈ

మేడికొమ్మకు అభిషేక మొనర్చుము. ఇట్లు చేయుచుండ నే దినమునీ కట్టెపల్లవించి వృక్షమగునో ఆనాటికి నీ పాపము నిశ్శేశముగ నశించును. నీవు అప్పుడు శోభనాంగుడ వయ్యేదవు అనిరి.

ఆ బ్రాహ్మణుడు గురుమూర్తి వాక్యమును శిరసావహించి ఆ ఎండిన మేడికట్టను కొని తీసికొనిపోయి సంగమము చేరి సంగమేశ్వరుని ఎదుట పాతి గురుమూర్తి చెప్పినటుల నిశ్చలమైన భక్తితో ఆహారమును గూడ త్యజించి ఆ కాష్ఠమునే సేవించుచుండెను. ఇట్లేడు దినములు గడచెను.

అతని ఘోరమైన దీక్షను చూచి అచ్చటి బ్రాహ్మణులు అతనితో నిట్లనిరి. ఓయీ! ఈ ఎండిన కట్టె నిట్లెందుక తడుపుచున్నావు. ఈ కట్టె వృక్షమగునా? గురుమూర్తి దయాస్వరూపుడు గాన నీలో నీ వ్యాధి కుదురునది కాదని చెప్పజాలక ఈ ఎండుకట్టెను సేవించుమని చెప్పెగాని ఈ కట్ట వృక్షమగుట కల్ల. నీ వ్యాధి నశించుటయు కల్ల. వ్యర్థముగా శ్రమ చేసెదవేల యన వారి మాటలు విని ఆ బ్రాహ్మణుడిట్లనుచుండెను.

గురువాక్యము కామధేనువు. గురుమూర్తి సత్య సంకల్పుడు. వారి వాక్యమెన్నడు వ్యర్థము కాజాలదు. నాకట్టి నిశ్చయము కలదు. ఈ కాష్టము తప్పక వృక్షము కాగలదు. నా ప్రాణము లున్నంతదనుక గురుమూర్తి ఆజ్ఞ ప్రకారము నడచెదను. ఇది నా దృఢ నిశ్చయము అని చెప్పి ఆ శుష్క కాష్ఠమునే గురూక్త రీతిన భక్తితో సేవించుచుండెను.

ఒక దినమున స్వామివారి శిష్యులు గురుమూర్తిని సమీపించి స్వామీ తమరు ఆ బ్రాహ్మణునకు శుష్కకాష్టమును సేవించమని ఆజ్ఞ నిచ్చితిరి. అతను ఉపవాస వ్రతముతో నీరైనత్రాగక నాకాష్టమునే సేవించుచున్నాడు. మేము వద్దని నివారించినను నాకు గురువాక్యమే ప్రమాణము. గురుమూర్తియే వారి వాక్యమును సత్యము చేసికొనగలరు. కాన నా ప్రాణము లున్నంతవరకు నా కర్తవ్యమును మాననని చెప్పుచున్నాడని యనిరి. శిష్యుల వాక్యము విని గురుమూర్తి ఎవరికి ఎట్టి భావము కలదో వారికి వారి భావము ననుసరించియే ఫలసిద్ధి కలుగుచుండును. గురువాక్య మందలి విశ్వాసమే శిష్యునకు కార్యసిద్ధికి హేతువగును. ఈ విషయము మీకు తెలియగలందులకు గాను స్కాంద పురాణమందలి ఒక కథను చెప్పెద వినుడు.

పూర్వము నైమిశారణ్యమున ఋషులు సూతుని గురు భక్తి ప్రభావమును గూర్చి ప్రశ్నించ సూతులవారు వారితో నిట్లుచెప్పుచున్నారు.

ఋషులారా! వినుడు గురుభక్తితో సమమగు సంసారము నుండి తరింపచేసెడి సాధనము మరియొకటి లేదు. గురువు యోగ్యుడా అయోగ్యుడా యని విమర్శ శిష్యుడు చేయరాదు. గురువును బ్రహ్మస్వరూపముగ భావించి భక్తితో సేవించవలయును. దృఢభక్తి కలవారికి సర్వము క్షణకాలములో సిద్ధించును. గురువు నెవ్వరు మనుష్య బుద్ధితో చూడక త్రిమూర్తి స్వరూపముగ భావించి సేవింతురో వారిపట్ల శూలపాణి ప్రసన్నుడగును. మంత్రము, బ్రాహ్మణుడు, దేవుడు దైవజ్ఞుడు, వైద్యుడు, గురువు వీరలయం దెవ్వరి కెట్టి భావన యుండునో వారికి తదనురూపముగ ఫలసిద్ధికాగలదు. ఇందులకు నిదర్శనముగ మీకొక ఇతిహాసమును చెప్పెద వినుడు.

పూర్వము పాంచాల నగరమున సింహకేతువను రాజు గలడు. అతనికి ధనంజయుడను పుత్రుడు కలడు. ధనంజయుడొకనాడు అడవికి వేటకు పోయెను. నిర్మానుష్యమైన కీకారణ్యమున నొక కిరాత దూతతో సహవేటాడి తిరిగి వచ్చుచూ అచట నొక జీర్ణమైన శివాలయమును గాంచెను. శబరు డచ్చట పడియున్న శివలింగమును తీసికొని రాజకుమారుని సమీపించి అతనితో నాకు శివపూజ చేసుకొనవలయునని కోరిక కలదు. తమరినే గురువుగ స్వీకరించుచున్నాను. పూజించి విధానమును సెలవిండన రాజు అతనితో నిట్లు చెప్పుచున్నాడు.

ఓ శబరుడా! ఈ లింగమును గృహమునకు గొనిపోయి శుచియగు స్థానమున నుంచి భార్యా సమేతుడవై నిత్యము సావధానముగ గంధపుష్పాద్యుపచారములచే పూజించి ధూప దీపము లర్పించి స్మశానమందలి చితాభస్మమును శివునకు నివేదించి మహానివేదన మర్పించి భార్యతో సహశివుని ప్రసాదమును స్వీకరించుము. అట్లు చేసితివేని శివుడు ప్రసన్నుడగును. అని చెప్ప శబరుడు రాజకుమారుని గురువుగ భావించి అతని ఉపదేశములు శిరసావహించి గృహమున కేగి భార్యా సమేతుడై నిత్యము శివలింగమును గురూపదిష్ట మార్గమున పూజించుచుండెను. నిత్యము స్మశానమున కేగి చితాభస్మమును తెచ్చి శివునకు భక్తితో పూజించుచుండెను. శబరియు భర్తతో కలిసి నిత్యము శివుని పూజించుచు శివుని ప్రసాదమును భక్తితో స్వీకరించు చుండెడిది. ఇట్లుండ నొనాకడు అతనికి స్మశానమున చితాభస్మము కనుపించదయ్యెను. చుట్టు ప్రక్కల గ్రామము లందలి స్మశానముల శోధించెను గాని ఎందును అతనికి చితాభస్మము లేశమైనను లభించదయ్యెను. అప్పుడతడు ఖిన్నుడై ఇంటికి చనుదెంచి భార్యతో

నేనేమి చేయుదును. నాకీనాడెచ్చటను చితాభస్మము. లభించదయ్యె గురువు చెప్పినరీతిని నేను నేడు శివపూజ నాచరించనైతిని. ఇక బ్రతికి ఏమి ప్రయోజనము. గురువాక్య ముల్లంఘించు వారికి నరకము దారిద్ర్యము, అధోగతియు సిద్ధించును. కాన నేను ప్రాణముల త్యజించెదనన శబరి అతనితో నిట్లనుచున్నది.

మీరు వ్యర్థముగ నెందుకు చింతించెదరు. మీకు నేను చితాభస్మ మిచ్చెద. నన్ను దగ్ధమొనర్చి అట్టి భస్మమును శివున కర్పించుడు. వ్రతభంగము మాత్రము చేయరాదు. నేను సంతోషముతో చెప్పుచున్నాను. ఉత్పన్నమైన ఈ దేహమర్పించి ధన్యురాలనయ్యెదనన భార్య మాటలు విని ఆ శబరుడు బాధపడి ఇట్లనుచున్నాడు. ప్రాణ ప్రియా! నీ ప్రాణముల నేనెట్లు హరించెద సూర్యచంద్రులు సాక్షిగ నిన్ను వరించితిని. నీ తల్లిదండ్రులు నన్ను స్త్రీ హంతకుడని దూషింపరా! శరీరము లుండినగదా ధర్మము లాచరించుట. నిన్ను దగ్ధ మొనర్చిన నాకు పాపమే ఘటించును. గాని శివుడు సంతసించునా! అనియన ఆ శబరి భర్తతో మీరు మాయా మోహములో పడి ఇట్లు విలపించుట ధర్మము కాదు. మీ కింత అజ్ఞానమేల. ఈ శరీరము స్వప్న దృష్ట శరీరమువలెను, జలబుద్బుదములవలెను నశ్వరమైనది. జన్మించు వారెప్పటికైనను మరణించుటయే నిశ్చయము. నా తల్లిదండ్రు లెప్పుడు నన్ను మీకర్పించిరో అప్పుడు మీకు అర్ధాంగినైతిని. అట్టి నాయందు భిన్న భావమేల! కాన భేదభ్రమ విడిచి నా దేహమును భస్మమొనర్చి శివుని పూజింపుడు. శివుడు ప్రసన్నుడు కాగలడని చెప్పి భర్త ఎంత బోధించినను వినక గృహము ప్రవేశించి ద్వారము బంధించుకొని గృహమును దగ్ధ మొనర్చుడని చెప్ప ఆ శబరుడు సంతసించి ధీరుడై గృహమును ప్రజ్వలింపజేసెను. క్షణమాత్రమున గృహము భస్మమయ్యెను.

అప్పుడతను నిత్యము వలె శివుని పూజించి ఆనంద నిమగ్నుడై భార్య దగ్ధమయ్యెనను మాట మరచి చితాభస్మను శివునకర్పించి శివప్రసాదమును చేతపూని నిత్యము ప్రసాదము స్వీకరించు నిమిత్తము భార్యను పిలుచు వాడుకరీతిని ఆనాడును శబరీ వచ్చి ప్రసాదము గొనిపొమ్ము అని అనెను. వెంటనే కృపానిధియగు శివుడు ప్రసన్నుడయ్యెను. గృహము గృహమునే ఉండెను. అందుండి శబరి నిజరూపముతో వచ్చి ప్రసాదము గ్రహించెను. శబరుడు విస్మితుడై భార్యతో నేను నిన్ను స్వయముగ దగ్ధమొనర్చితిని గదా! తిరిగి ఎట్లు జీవించితివని డుగ నామె మీరు గృహమున కెప్పుడు నిప్పుపెట్టితిరో

ఆ క్షణముననే నాకు గాఢమగు నిద్రపెట్టెను. ఇప్పుడు మీ పిలుపు విని నిద్ర నుండి లేచి వచ్చితిని, ఇదియంతయు శివలీలయై యుండును అని చెప్పుచుండ శివుడచట ప్రత్యక్షమయ్యెను. దంపతులు శివుని పాదముల మీద పడి నమస్కరించిరి. శివుడు వారి భక్తికి సంతసించి ఇహలోకమున నఖండసౌఖ్యమును పరత్ర సద్గతియు ననుగ్రహించెను.

కాన ఓ ఋషులారా ! గురూక్తియందు విశ్వాసముంచు వారికి మనోరథము తప్పక సిద్ధించునని సూతుడు శౌనకాదిమహర్షులకు చెప్పెనని గురుమూర్తి శిష్యులతో గురుభక్తి ప్రభావమును చెప్పి, ఆ బ్రాహ్మణుడు నా వాక్యమందు విశ్వాసముంచి, శుష్కకాష్టమును భజించుచున్నాడు. కార్యసిద్ధి భావము మీద ఆధారపడియుండును. కాన అతనికి కార్యసిద్ధి కాగలదు. అని చెప్పి దయాసముద్రుడగు గురుమూర్తి సంగమమునకు వెళ్ళి అతని భక్తికి అచ్చెరువంది కమండలో ఉదకమును చేతబూని ఆ శుష్కకాష్టమును ప్రోక్షించ అది క్షణమాత్రమున పల్లవించి అద్భుతముగ ఉదుంబర వృక్షమయ్యెను. అదే క్షణమున ఆ కుష్టురోగియు సువర్ణాంగుడయ్యెను. ఇది అంతయు ఓ నామధారకా! నేను కనులారా చూచితిని. అప్పుడా బ్రాహ్మణుడు సంతసించి ప్రణమిల్లి పులకితాంగుడై ఆనందాశ్రువుల కార్చుచూ ఈ క్రింది విధముగ స్తుతించెను.



## శ్రీ నృసింహ సరస్వతీ స్తోత్రం

శ్లో॥ ఇందుకోటి తేజకీర్ణ సింధు భక్తవత్సలం
నందనాత్రి సూనుదత్త మిందిరాక్ష శ్రీగురుం ।
గంధమాల్య అక్షతాది బృంద దేవవందితం
వందయామి నారసింహ సరస్వతీశ పాహిమాం ॥

శ్లో॥ కోట్యర్కంభం కోటిసుచంద్రకాంతం
విశ్వాశ్రయం దేవగణార్చి తాం ఘ్రిం॥
భక్త ప్రియం త్వత్రిసుతం వరేణ్యం
వందే నృసింహేశ్వర పాహి మాం త్వం ॥

తా॥ కోటి సూర్యులు కోటిచంద్రులతో సమమగు కాంతి కలిగి విశ్వాశ్రయమై, దేవతలచేతను పూజింపబడెడి భక్తిప్రియుడై, భక్తులకు వరము లొసగెడి అత్రి అనసూయలకు తనయుడై యుండి, కలియుగమున ధర్మసంస్థాపనకుగాను అవతరించిన ఓ నృసింహసరస్వతీస్వామీ నీకు వందనము, నన్ను రక్షింపుము.

( ) మోహపాశ అంధకార జాతదూర భాస్కరం
ఆయతాక్షపాహిశ్రియా వల్లభేశనాయకం ।
సేవ్యభక్తబృంద వరద భూయభూయ నమామ్యహం
వందయామి నారసింహ సరస్వతీశ పాహిమాం ॥

( ) మాయాతమోల్కం విగుణం గుణాఢ్యం
శ్రీవల్లభం స్వీకృత భిక్షువేషం ।
సద్భక్త సేవ్యం వరదం వరిష్ఠం
వందెను సింహేశ్వర పాహి మాం త్వం ॥

తా॥ మాయా పాశమును అంధకారములోనున్న భక్తులకు సూర్యుడవై నట్టియు, విశాలములౌన నేత్రములు కలిగి లక్ష్మీపతివై సేవించు భక్తబృందమునకు శ్రేష్టములైన వరంబు లొసగెడి ఓ నృసింహసరస్వతీస్వామీ నీకు మాటి మాటికి నమస్కారము. నన్ను రక్షింపుము.

() చిత్త జాతవర్ణపట్క మత్తవారణాం కుశం
సత్యసారశోభితాత్మ దత్తశియావల్లభం ।
ఉత్తమావతార భూతశిర్త్న భక్తవత్సలం
వందయామి నారసింహ సరస్వతీశ పాహిమాం ॥

() **కామాదిషణ్మత్త గజాంకుశంత్వాం**
**ఆనందకందం పరతత్వరూపం ।**
**సద్ధర్మగుప్త్యైవిధృ తావతారం**
**వందే నృసింహేశ్వర పాహి మాం త్వం ॥**

తా॥ చిత్తమందుదయించెడి కామ, క్రోధ, లోభ, మోహ, మద మాత్సర్యములనెడి మదపుటేనుగలకు అంకుశ మైనట్టియు, భక్తునందలి వాత్సల్యముతో శుద్ధసత్వము నుపాధిగ స్వీకరించి అత్యద్భుతమగు యత్యవతారము ధరించిన ఓ నృసింహసరస్వతీ స్వామీ ! నీకు వందనము.

() **వ్యోమవాయుతేజ ఆప భూమి కర్తృమీశ్వరం**
**కామక్రోధ మోహరహిత సోమసూర్యలోచనం ।**
**కామితార్థ దాతృభక్త కామధేను శ్రీగురుం**
**వందయామి నారసింహ సరస్వతీశ పాహిమాం ॥**

() **సూర్యేందుగుం, సజ్జనకామధేనుం**
**మృషోద్యపంచాత్మక భూతమస్మాత్ ।**
**ఉదేతియస్మిన్ రమతేస్త మేతి**
**వందే నృసింహేశ్వర పాహి మాం త్వం ॥**

తా॥ పంచభూతాత్మకమైన జగమునకు కర్తలై యుండియు, రాగద్వేషములు లేని భక్తులకు కామధేనువై వారికి కామితార్థముల నొసగెడి సూర్యచంద్రులు నేత్రములుగా గల ఓ గురుమూర్తీ ! నృసింహసరస్వతీ ! ఈశ్వరా! నీకు వందనము. నన్ను రక్షింపుము.

() **పుండరీక ఆయతాక్ష కుండలేందు తేజసం**
**రిండదురిత ఖండనార్థ దండధాం శ్రీగురుం ।**
**మండలీకమౌళి మార్తాండ భాసితాననం**
**వందయామి నారసింహ సరస్వతీశ పాహిమాం ॥**

() **రక్తాబ్జపత్రాయత కాంత నేత్రం,**
**సద్దండకుండీ పరిహాపితాఘం ।**
**శ్రితస్మితజ్యోత్స్న ముఖేందు శోభం**
**వందే నృసింహేశ్వర పాహిమాం త్వం ॥**

తా॥ కమలముల వలె విశాలములైన నేత్రములు కలిగి, చంద్రుని వలె నాహ్లాదకరమైన ముఖారవిందముతో నొప్పుచు భక్తుల ప్రచండదురితముల

పారదోలుటకా యనునటుల దండమును ధరించి కమండలమును హస్తమున గలిగి యతి వేషముననున్న ఓ శ్రీహరీ ! నృసింహసరస్వతీ ! స్వామీ ! నీకు వందనము నన్ను రక్షింపుము.

() వేదశాస్త్ర స్తుత్యపాద మాదిమూర్తి శ్రీగురుం
నాదబిందుకళాతీత కల్పపాదసేవ్య యం ।
సేవ్యభక్తబృంద వరద భూయభూయ నమామ్యహం
వందయామి నారసింహ సరస్వతీశ పాహి మాం ॥

() నిత్యంత్రయీ మృగ్యపదాబ్జధూళిం
నినాదసద్బిందు కళాస్వరూపం ।
త్రితాప తప్తాశ్రిత కల్పవృక్షం
వందే నృసింహేశ్వర పాహిమాం త్వం ॥

తా॥ వేదశాస్త్రములచే స్తుతింపబడు పాదపద్మముల గలవాడవై, నాదుబిందుకళలు స్వరూపముగా గలవాడై యుండియు వాటి కతీతుడవై, తాపత్రయములచే పీడింపబడుచు సేవించెడి భక్తులకు కల్పవృక్షమై విరాజిల్లెడి ఓ నృసింహ సరస్వతీ స్వామీ ! మాటిమాటికి నమస్కృతులు గావించెద. నన్ను రక్షింపుము.

() అష్టయోగతత్వ నిష్ఠతుష్టజ్ఞాన వారిధిం
కృష్ణవేణీ తీరవాస పంచనదీసంగమం ।
కష్టదైన్యదూక భక్త తుష్టకామ్యదాయకం
వందయామి నారసింహ సరస్వతీశ పాహిమాం ॥

() దైన్యాదిభీకష్టదవాగ్ని మీడ్యం
యోగాష్టక జ్ఞానసమర్పణోత్కం
కృష్ణానదీ పంచసరిద్యుతిస్థం
వందేనృసింహేశ్వర పాహిమాం త్వం ॥

తా॥ జ్ఞానాంబుధివై భక్తులు స్మరించినంతనే సంతసించి వారలకు అష్టాంగ యోగసిద్ధి ననుగ్రహించుచు, అష్టకష్టములతో బాధనొందుచు దీనులై శరణునొందిన భక్తులకు సమస్త కామ్యముల నొసంగుచు కృష్ణానదీ తీరమందలి నరసింహవాడి (అమరపురము) క్షేత్రమున నివసించి భక్తుల నుద్ధరించిన శ్రీ నృసింహసరస్వతీ స్వామీ! నీకు వందనము. నన్ను రక్షింపుము.

() నారసింహసరస్వతీశ అష్టకంచ యః పఠేత్
ఘోర సంసారసింధు తారణాఖ్యసాధనం ।
సారజ్ఞాన దీర్ఘ ఆయురారోగ్యాది సంపదాం
చారువర్గకామ్యలాభ నిత్యమేవ యః పఠేత్ ॥

() అనాదిమధ్యాంత మనంతశ క్తిం
అతర్క్యభావం పరమాత్మసం జ్ఞం ।
వ్యతీతవాగ్బుక్పద మద్వితీయం,
వందేనృసింహేశ్వర పాహి మాం త్వం ॥

ఫలశ్రుతి : యో నృసింహసరస్వత్యా అష్టకం పఠతీహ సః
దీర్ఘాయుసంస్మృతిం తిర్వాభీష్టం లబ్ధ్వామృతంలభేత్ ॥

తా॥ అనంత శక్తి కలవాడై జగము యొక్క ఆది మధ్యాంతములయందు ఏకరూపమున విరాజిల్లుచూ అవాఙ్మాన గోచరుడవైన ఓ నృసింహ సరస్వతీ! సద్గురుమూర్తి ! నీకు వందన మాచరించెదను. నన్ను రక్షించుము.

**ఫలశ్రుతి :** ఘోరమైన సంసారమునుండి తరింపజేయ సమరమైన ఈ అష్టక స్తోత్రము నెవ్వరు నిత్యము పఠింతురో వారు చతుర్విత పురుషార్థములను, దీర్ఘాయుష్యమును, ఆరోగ్యమును. సంపత్తును గూడ బడయుదురు.

ఇటు నరహరియను ఆ బ్రాహ్మణుడు గురుమూర్తిని స్తుతించి భక్తితో నమస్కరించెను. గురునాథుడాతని భక్త్యుద్రేకమునకు సంతసించి జ్ఞానరాశివి కమ్మని యాశీర్వదించిరి. ఎండిన కాష్టము వృక్షమగుటయు, కుష్ఠరోగియగు బ్రాహ్మణుడు దివ్యాంగుడగుటయు నచటి జనులు చూచి విస్మయము నొంది గురుమూర్తిని భక్తిభావనలతో ననేకవిధముల స్తుతించిరి. గురుమూర్తి అందరితోడను కలిసి సంగమము నుండి గణగాపురమునందలి తమ నిర్గుణ మఠము ప్రవేశించిరి. అందరు వారిని భక్తితో పూజించిరి. నరహరి బ్రాహ్మణుడు సంతోషముతో ఆ గ్రామమందలి యావన్మంది స్త్రీ పురుషులకు సంతర్పణ చేసెను. అప్పుడు గురుమూర్తి అతనిని దగ్గరకు పిలిపించి నీవు నా భక్తుడవు. నీకు ఐహికాముష్మిక సుఖముల ననుగ్రహించితిని. నీ సంతానము లోకమున విస్తృతిగాంచును. అని ఆశీర్వదించి అతనికి అష్టాంగయోగ ముపదేశించి యోగీశ్వరుడని నామకరణ మొనర్చిరి. నీవు చింతించకుము. నేను చెప్పినట్లు చేయుము. నీ కుష్ఠరోగము పోయెను గాన శీఘ్రముగ గృహమున కేగి దారాపుత్రాదుల తీసికొనివచ్చి నా సన్నిధినే నివసించుము. నీకు శుభమగును,

నీకు పుత్రులు కలిగెదరు. వారు న్ననర్చింతురు. మీ వంశమువారందరు నాకు భక్తులై యుందురు. అని చెప్పి అతనికి మంత్రరాజమైన విద్యా సరస్వతీ మంత్రము నుపదేశించిరి. నరహరియను బ్రాహ్మణుడు గురుమూర్తి చెప్పినటుల ఆచరించి గురుకృపకు పాత్రుడయ్యెను.

**ఇది గురుచరిత్రమున నలుబదియవ అధ్యాయము సమాప్తము.**

**శ్రీ దత్తాత్రేయస్సుప్రీణాతు.**

**దిగంబరా దిగంబరా శ్రీ పాదవల్లభ దిగంబరా**

**శ్లో॥ కారయిత్వా శుష్కకాష్ట సేవాంతద్వృక్షతాం నయన్ ।**
**విప్రకుష్ఠం జహారాసౌ శ్రీదత్తశ్శరణం మమ ॥**

భా॥ ఎండిన మేడి కట్టెకు నీరు పోయించి కుష్ఠురోగి యొక్క రోగమును నివారింపజేయుట.

# శ్రీ గురు చరితము

## నలుబది యొకటవ అధ్యాయము

**జయ జయ శ్రీనృసింహ సరస్వతీ**

**ఓం అవధూత చింతనం శ్రీగురుదేవదత్త జయ ఓం**

నామధారకుడు బద్ధాంజలియై సిద్ధమునితో యోగిపుంగవ! జయ జయ. మీ వలన రసవంతమైన గురు చరిత్రమును విని ధన్యుడనైతిని నేనిప్పుడొక ప్రశ్న వేయుచున్నాను. మా పూర్వీకుడైన సాయందేవుడు గురుమూర్తిని భక్తితో సేవించెనని వింటిని. అతనెటుల స్వామి వారికి శిష్యుడై వారిని సేవించెనొ సెలవిండని ప్రశ్నించ సిద్ధముని ఇట్లనుచున్నాడు.

నామధారకా ! సావధానుడవయి విస్తరించి నే చెప్పు గురుచరితమును వినుము. పూర్వము నా వలన నీ గురుచరిత మందు గోదావరీతీరమున వాసరక్షేత్రమున మీ పూర్వీకుడైన సాయందేవుడు గురుమూర్తిని భక్తితో పూజించుటయు, గురుమూర్తి ప్రేమకు పాత్రుడగుటయు వింటివి. స్వామివారు ఆ తరువాత అనేక దేశముల పర్యటించి అచటి భక్తుల నుద్ధరించి గంధర్వనగరము చేరిన తదుపరి వారి కీర్తి దశదిశల వ్యాపించెను. సకాములై భక్తులు వచ్చి పూర్ణకాములగు చుండిరి. గంధర్వ నగరమున స్వామివారు కలరను ఖ్యాతిని విని మీ పూర్వీకుడైన సాయందేవుడు ఆనందభరితుడై భక్తితో వారి దర్శనార్థ మొక దినమున గంధర్వ నగరమున కేతెంచెను. దూరముగ గంధర్వనగరమును కని సాష్టాంగముగ నమస్కృతులు గావించుచు గ్రామము ప్రవేశించి మఠమును సమీపించి పరాత్పర పరబ్రహ్మస్వరూపుడైన స్వామివారిని దర్శించెను. సాష్టాంగముగ పాదములకు నమస్కరించి తన శిరోజములతో స్వామి వారి పాదముల ధూళి తుడిచెను. చేతులు జోడించి ఇట్లు స్తుతించెను.

స్వామీ ! మీరు త్రిమూర్తి స్వరూపులు. మీ దర్శనము వలన నేను ధన్యుడనైతిని. మా పితరులు కృతార్థులైరి. మీ పాదదర్శనము వలన కోటి జన్మార్జిత పాపము నశించెను. సర్వవ్యాపక ! హేసద్గురో ! జగజ్జ్యోతిస్వరూప! శ్రీ నృసింహ సరస్వతీ ! జయజయ ! ఓ భక్తవత్సల ! నీపాదమహిమ వర్ణింప నేనెంతవాడను, మీ చరణములందే కోటి తీర్థములు కలవు. మీరు బ్రహ్మమే యనదగియున్నారు. అమృత పూర్ణకమండలమును హస్తమున ధరించి అందలి

ఉదకమును ప్రోక్షించి మృతుల జీవింపజేయుచున్నారు. స్వామీ ! మీరు దండమును ధరించి విష్ణుస్వరూపులై భక్తులయొక్క దైన్యమును దురితమును నశింపజేయుచున్నారు. మీరే శివ స్వరూపులై భస్మరుద్రాక్షలను ధరించి భక్తుల పాపముల నశింపజేయుదురు. మీ భక్తులకు మీరు చతుర్విధ పురుషార్థముల నిచ్చుచున్నారు. జగద్గురో, నృసింహసరస్వతీ! మీరు భవరోగమును నశింపచేయ సమర్థులు. మీ పాదములందే సర్వతీర్థములు కలవు. మీరు భక్తులపాలిటి కామధేవునువలు మీరు ఉదకము ప్రోక్షించి శుష్కకాష్టమును వృక్షముగ నొనర్చితిరి. గొడ్డుబోతుబఱ్ఱెను పాలిచ్చునట్లు చేసితిరి. వంధ్యకు సంతానము నిచ్చితిరి. అన్నపూర్ణ మీ సమక్షముననే కలదు. త్రివిక్రమభారతికి విశ్వరూపప్రదర్శన మిచ్చితిరి. మీ మహిమ అపారము, మీరు త్రిమూర్తి స్వరూపులై భక్తుల నుద్ధరించుచున్నారు ఇట్లు గద్గదధ్వనితో నుతించుచు ఆనందాశ్రువులతో, రోమాంచముతో మిగుల భక్తిచేసెను.

గురుమూర్తి అతని భక్తికి సంతసించి నీవు పరమభక్తుడవని చెప్పుచు అఘహరమైన హస్తమునతని శిరమున నుంచిరి. నీ భక్తికి సంతసించితిని. మీ వంశము వారందరు నాకు భక్తులు కాగలరు నీవు నాకు అతిప్రియమగు భక్తుడవు. తొందరగ సంగమమునకేగి స్నానమొనర్చి అశ్వత్థమును పూజించి మఠమునకు భోజనమునకు రమ్మనిరి సాయం దేవుడును సంగమమునకేగి



స్నానముచేసి అశ్వత్థమును పూజించి మఠమునకు వచ్చి స్వామి వారిని షోడశోపచారములతో పూజించెను. స్వామివారు అతనిని అందరి శిష్యుల కన్న మిక్కిలి ప్రేమతో భిక్షా సమయమున తమ ప్రక్కనే యుంచుకొనిరి.

భోజనమైన తరువాత సాయందేవుని స్వామివారు తమ వద్దకూర్చురండ బెట్టుకొని ఇట్లు ప్రశ్నించిరి. నీవు ప్రస్తు మెక్కడ కుటుంబ సమేతముగా నుంటివి? అందరు క్షేమమా అన అతడు స్వామివారితో వినయముగా స్వామీ! మీ అనుగ్రహము వలన ఉత్తర కాంచీగ్రామమున సకుటుంబముగ క్షేమముగనేయున్నాను. పుత్రులు బంధువులు సంసారమును దిద్దుకొనగలరు. మీ సేవచేయుచు మీ వద్దనే యుండి ధన్యుడ కాదలచితిననెను. అతని వాక్యము విని స్వామి వారిట్లనుచున్నారు. భక్తాగ్రేసరా ! నే నొకచోట నుండువాడను కాను. ఇట్టి నా సేవచేయుట కఠినము. ఒకచోట అరణ్యముననో మరొయిక సమయమున గ్రామమునచో ఇచ్ఛ వచ్చినటుల సంచరించుచుందును. నా సేవ వలన నీకు కష్టమేకలుగును అనిరి. అప్పుడు సాయందేవుడు స్వామీఁ నేను మిమ్ము సర్వాత్మనా శరణు పొందివచ్చితిని. నన్ను విడనాడకుడు. గురు సేవ వలనగదా మానవుడు కృతార్థుడగుట. చతుర్విధ పురుషార్థముల నొసగు గురుసేవ సుఖప్రదముగాని దుఃఖప్రదమెట్లు కాగలదు. గురుసేవ చేయువారికి నరకమే లేకనప్పుడు దుఃఖమెట్లు రాగలదు. కాన నన్ను నిరాకరించక నా సేవను స్వీకరించి నన్ను ధన్యునిగా చేయుడని మిక్కిలి భక్తితో ప్రార్థించ గురుమూర్తి నీ కంతటి దృఢ దీక్షయున్నచో నీ యిష్టప్రకారము నావద్ద నుండి దాస్యమొనర్చుమని చెప్పిరి. సాయందేవుడును సంతసించి భక్తితో వారిని సేవించుచుండెను. ఇట్లు మూడు నెలలు గడచెను. ఒక దినమున గురుమూర్తి అతని దృఢ భక్తిని పరీక్షింపగోరి సాయంకాల సమయమున శిష్యులనందర రావద్దని నిరాకరించి సాయందేవుని మాత్రము వెంట నిడుకొని సంగమమునకు వెళ్ళిరి. సంగమము చేరి అశ్వత్థ సమీపమున గురుశిష్యులిద్దరు సుఖాలాపములు జరుపుచుండిరి ఇంతలో సూర్యుడస్తమించెను. అప్పుడు సాయందేవుని భక్తినిష్ఠను స్వామివారు పరీక్షింపదలచిరి.

స్వామివారి సంకల్ప మాత్రముచే గొప్ప ఝంఝా మారుతము వీచసాగెను. వృక్షములు పడిపోవసాగెను. ముసలములవంటి ధారలతో వర్షము కురియసాగెను. సాయందేవుడు చలించని భక్తితో తనపై వస్త్రమును కప్పి స్వామి వారిని రక్షించుచుండెను. ఇట్లు రెండు జాములు వర్షముతో తడియుచు



గూడ స్వామివారిని సేవించుచుండెను. ఇంతలో వర్షము తగ్గి గొప్ప శీతవాతము వేయసాగెను. అప్పుడు స్వామివారు సాయందేవునితో చలిగాలి బాధించుచున్నది. నీవు గ్రామమున కేగి నిప్పుపట్టుకొనిరమ్ము. పోవునపుడు గాని, తిరిగివచ్చునప్పుడు గాని పార్శ్వ భాగములు (ప్రక్కల) చూడకు మనిరి గుర్వాజ్ఞను శిరసావహించి ఆ చీకటిలో బురదలో త్రోవ కనబడకున్నను గురుమూర్తి పాదముల ధ్యానించుచు బురదలో పడుచు లేచుచు ఎట్లో గ్రామము ప్రవేశించి గ్రామస్థుల నుండి కొంతనిప్పుకొన భాండమున తీసికొని, దానిని నెత్తిమీద పెట్టుకొని సంగమమునకు తిరిగివచ్చును. గురుమూర్తి ప్రక్కల చూడవద్దనిరి. ఎందులకనియో అని విచారించుచు నొక ప్రక్క చూడ ఐదు ఫణములతో నొక సర్పము తన వెంట వచ్చుచున్నటుల చూచి భయపడి మరియొక ప్రక్క చూడ టువైపున గూడ నొకి గొప్ప సర్పము వెంట వచ్చుటనతడు చూచి మిక్కిలి భయపడి పరుగెత్తుచు ఎట్లో సంగమము చేరెను.

అతనికి సంగమమున ననేక దీపముల ప్రకాశము, గొప్ప వేదధ్వనియు వినబడెను. గురు సమక్షమునకు రాగ నదియంతయు అదృశ్యమై గురుమూర్తి యొక్కడే అక్కడ అతనికి గోచరించెను. ఆకసము నిర్మలమై చంద్రునిచే శోభిల్లుచుండెను. స్వామివారి ఎదుట నగ్నిని ప్రజ్వలింపజేసి భయకంపితుడగుచు వారి ఎదుట నగ్నిని ప్రజ్వలింపజేసి భయకంపితుడగుచు వారి ఎదుట నిలువబడెను.

అతని వెంట వచ్చి సర్పములు స్వామివారి వద్దకు వచ్చి వారి యాజ్ఞగైకొని వెడలిపోయెను. అప్పుడు స్వామి వారు అతనితో నీ రక్షణ కొరకే ఈ సర్పముల నీ వెంటనంపితిని వ్యర్థముగ నెందులకు భయపడెదవని ఓదార్చుచు భయపడకుము, గురుభక్తి కఠినమని చెప్పితిగదా ! విచారించియే గురువను

సేవింపవలెను. దృఢ నిష్ఠతో గురువును సేవించువాడు కలివలనగాని, కాలమువలన గాని భయపడనవసరముండదని చెప్ప సాయందేవుడు గురుమూర్తి పాదములకు నమస్కరించి స్వామీ నాకు గురుభక్తి దృఢముగ నిలువ గలందులకు గురుభక్తి ప్రభావమును బోధించుడని ప్రార్థింప గురుమూర్తి సంతసించి సాయందేవునితో గురుభక్తి ప్రభావము నీ క్రింది విధముగ చెప్పుచున్నారు. సాయందేవా! బ్రహ్మముహూర్తమునకు ఇంకను కొంత వ్యవధి కలదు. అంతదనుక నీకు గురుభక్తి ప్రభావమును బోధించు కథ నొక దానిని చెప్పుచున్నాను సావధానుడవై వినుము.

పూర్వమొక సమయమున కైలాష శివకరమున పార్వతీ సమేతుడై శివుడు కూర్చొని యుండెను. అట్టి సమయమున పార్వతి శివుని గూర్చి గురు భక్తిని విస్తరించి చెప్పుడని ప్రార్థింప శివుడు పార్వతితో నిట్లు చెప్పుచున్నాడు.

గురుభక్తిచే సర్వము సిద్ధించును. శివుడే గురువను దృఢభావముతో శిష్యుడు గురువును సేవించవలయును. గురుభక్తి ప్రభావము తెలియగలందులకు ప్రాచీనమైన ఇతిహాసమును చెప్పెద వినుమని శివుడు పార్వతితో నిటుల చెప్పుచున్నాడు.

జనములు అనుష్ఠానములు చిరకాల మనుష్ఠించిననే ఫలించును. గురుభక్తి అట్లుగాక తత్కాలముననే ఫలించును. తపములు, అనుష్ఠానములు, యజ్ఞములు, దానములు ఒక సమయమున ఫలములేక పోగా విఘ్నములచే కొట్టబడుటయు సంభవించును గురుభక్తి యొనర్చువారికి యజ్ఞములు, దానములు చేసిన ఫలముగూడ రాగలదు. గురుభక్తి సులభము ప్రయాసమునేనిది. కాని మనస్సును స్థిర పణచుకొని దృఢ భక్తితో గురుకుల వాస మొనర్చవలయును. ఇందులకు నిదర్శనముగా నొక కథను చెప్పెద వినుము.

పూర్వము త్వష్టయను బ్రహ్మకొక కుమారుడుకలడు. ఆ బాలుడు ధర్మశీలుడు, సుందరాంగుడు. అతనికి తండ్రి ఎనిమిదవ సంవత్సరమున ఉపనయన మొనర్చి ఒక గురువు వద్ద గురుకుల వాసము చేయనియమించెను. ఇట్లుండ ఓక దినమున గొప్ప గాలి వాన వచ్చి గురువు గారి పర్ణశాల ఒకుఖులిపోయెను. అప్పుడు ఆ గురువు తన శిష్యుని పిలిచి నాకు నివసించుటకు ఒక చక్కని భవనము నిర్మించుము. ఆ గృహము సుందరముగ నుండవలయును. గృహమునకు కావలసిన సౌకర్యములన్నియు అందుండవలయును. అనెను, ఇంతలో గురుపత్ని వచ్చి యాబాలునితో నా కొకమంచి రవిక కావలయును.

అది దారములతో నేయబడరాదు. నాశరీర ప్రమాణమునకు తగి మంచి రంగులు కలదై యుండవలయును అనెను. గురు పుత్రుడు అతనితో నాకొక పాదరక్షల జత కావలయును. అవి పాదములకు సరిపోవలయును, వాటికి బురద అంటరాదు. నీటి మీద గూడ నడచుటకు వీలుగ నుండవలయును, వాటిని ధరించి ఎక్కడకు పోవలయునని కోరుకొనిన వెంటనే అచ్చటికి తీసికొని పోవుటకు తగియుండవలయును అనెను. ఇంతలో గురుపుత్రి ఆ బాలుని చేయిపట్టుకొని నాకు మంచి అందమైన కర్ణాభరణములు కావలయును. ఇంతియకాక ఆడుకొనుటకు ఒకే ఏనుగు దంతముతో చెక్కబడిన సుందరమైన బొమ్మరిల్లు తెచ్చిపెట్టుము, వంటచేసికొనుటకు పాత్రసామాను తెచ్చిపెట్టుము. వాటితో వంటచేసినను మసికాకూడదు. అని కోరెను.

శిష్యుడు వారల కోరికల తీర్చ గలందులకు వారివద్ద సెలవు తీసికొని అరణ్యమార్గమున పోవుచు ఇటుల చింతింపసాగెను. నేను బ్రహ్మచారిని. ఏమియు తెలియని వాడను, నా గురువు, గురుపత్ని, గురు పుత్రుడు, గురు పుత్రికయు కోరిన వాటిని నేనెట్లు సమకూర్చగలను? భోజనపత్రములు కూడ కుట్టుట చేతగాని నేను ఆ కార్యముల నెట్లు చేయసమర్థుడను? నా కెవరు ఆధారము? గురువు కోరినటుల చేయనిచో గురువు కోపించును గదా! నే నెవ్వరి శరణు వేడుదును! నాకు గురునే రక్షకుడు. ఆయనయే నాకు గతి, కృపానిధియగు గురుకరుణ నాయందుండిననే ఈ కార్యము సిద్ధించగలదని అనన్య భక్తితో గురుమూర్తినే శరణుపొంది ప్రాణమర్పించియైన గురు కార్యమును సాధింప నుద్యుక్తుడై అరణ్య మార్గమున పోవుచుండ ఆ బాలున కొక అవధూత గోచరించెను.

ఆ అవధూత బాలుని సమీపించి నాయనా ! నీ వెక్కడకు పోవుచున్నావు ? నీ ముఖము చింతాక్రాంతమై యున్నది. కారణమేమి? విస్తరించి చెప్పుమన ఆ బాలుడు ఆ అవధూతకు నమస్కరించి స్వామీ! మీరు నన్ను రక్షించుడు. చింతాసముద్రమున మునిగియున్నాను. మీ దర్శనము వలన నాకు ఆనందము లభించినది. చకోరములకు చంద్రుడు కనబడి నటుల నాకు మీ దర్శనమయ్యెను. నా పూర్వ పుణ్యము మంచిదిగాననే నేడు మిమ్ముల చూడగలిగితిని. ఓ దయా సముద్ర ! మీ పేరేమి? తమ రెక్కడ నుండి వచ్చుచున్నారు. ఈ నిర్మానుష్యమైన అరణ్యమున మిమ్ముల చూడ నాకు మీరు ఈశ్వరుడే కావచ్చునని తోచుచున్నది. మీ దర్శనముచే నా మనస్సు స్థిరపడినది నన్ను మీ దాసునిగ భావించి

ఓదయాసముద్ర! నన్ను రక్షించి కాపాడుడని చెప్పి యా బాలుడు అవధూత పాదముల శిరముంచి నమస్కరించెను. ఆ అవధూతయు దయగలవాడై ఆ బాలుని లేపి ఆలింగనమొనర్చి ఓదార్చి అతనివలన జరిగిన విషయమంతయు విని చింత్రాక్రాంతుడైన ఆ బాలునకు అభయమిచ్చి ఆ బాలునితో ఓ బాలిక! నేనొక విషయము చెప్పెద. నీవు నేను చెప్పినట్లా చరించితివేని నీ కార్యము సిద్ధించునని ఇట్లు చెప్పెను.

కాశీపట్టణమున విశ్వేశ్వరుడు గలడు. అట్టి విశ్వేశ్వరుని ఆరాధనము వలన సర్వాభీష్టములు సిద్ధించగలవు. కాశీ క్షేత్రము అయిదు క్రోసుల విస్తారముగలదై యుండును. అచ్చట బ్రహ్మ విశ్వేశ్వరుని ఆరాధించి సృష్టిచేయు సామర్థ్యమును బడసెను. విష్ణువుగూడ విశ్వేశ్వరుని ఆరాధించిం జగమును పరిపాలించు సామర్థ్యము గడించెను. నీవు సందేహము విడనాడి కాశీపట్టణమునకు పొమ్ము. నీ మనోరథము నెరవేరును నీవే విశ్వకర్మవు కాగలవు. శివుని అనుగ్రహముండిన చతుర్విధ పురుషార్థములు ఆయత్నమున సిద్ధించగలవు.

శివుడు దయాస్వరూపుడు. ఉపమన్యుడను ఒక భక్తుడు కొలది పాలకొరకు, సేవించ అతనికి క్షీర సముద్రము మీదనే ఆధిపత్యము నొసగెను. కాశీకి ఆనందకాననమనియు పేరు గలదు. అచ్చట శివుని ఉపాసించువారు పూర్ణమనోరథులై ఆనందమున తులతూగుదురు. కాననే దానికి ఆనందకాననమని సార్థకనామమేర్పడెను. కాశి సమస్త ధర్మములకు రాసి, జీవుల కది మోక్షస్థానము కాశీక్షేత్రమున నివసించినవారిని చూచిననే సమస్తదోషములు నశించును అట్టి క్షేత్రమహిమ వర్ణింపనెవ్వరితరము? అట్టి క్షేత్రముండ బాలుడా నీకు చింతయేమిటికి ? కాశీక్షేత్రమునకు తీర్థయాత్ర పోవువారికి అడుగునకు అశ్వమేధఫలము వచ్చును. ధర్మ, అర్థ, కామ, మోక్షములను చతుర్విధ పురుషార్థములు లభించును. సందేహింపనవసరము లేదు. అన ఆ బాలుడు వారితో స్వామీ నేనా అరణ్యముననున్నాను. కాశీ ఎక్కడ నున్నదో తెలియదు. ఈ సంసార సాగరమున మునిగిపోవుచున్న నాకు మీరు తారకులుగ దర్శనమిచ్చితిరి. నాకు జ్ఞాన ముపదేశించి రక్షింపుడు తరిపంజేయడు బాలుడను, ఏమియు తెలియనివాడను. తమరు దయయుంచి నన్ను కాశీక్షేత్రమునకు కొనిపొండు, అని వారి పాదముల మీద పడెను.

అప్పుడా అవధూత బాలునితో నీ వలన నాకు కాశీవాసము లభించునుగాక నిన్ను తప్పక కాశీకి తీసుకొని పోయెదను. అని చెప్పి బాలుని చేయి పట్టుకొని

క్షణకాలములో మనోవేగముతో కాశీ సమీపించి బాలునితో మనము కాశీకి వచ్చితిమి. నీవు యాత్రసలుపుమన నా బాలుడు వారితో స్వామీ నేను ఏమియు తెలియని వాడను. కాశీయాత్ర నేవిధముగ చేయవలయునో సెలవిండని ప్రార్థింప నాయవధూత కాశీయాత్ర విధానమును ఈ క్రింది విధముగ చెప్పుచున్నాడు.

ప్రథమమున మణికర్ణికయందు స్నానమొనర్చి వినాయకుని దర్శించి పాంచాలేశ్వరునకు నమస్కరించి తరువాత విశ్వేశ్వరుని దర్శింపవలెను. తిరిగి గంగకు వెడలి మణికర్ణికేశ్వరుని పూజించి కమలేశ్వరుని దర్శించి అనంతరము వాసుకేశ్వరుడు, పర్వతేశ్వరుడు, గంగాకేశవుడు, లలితా దేవి జరాసంధేశ్వరుడు, సోమనాథుడు, శూలకంతేశ్వరుడు, వరాహేశ్వరుడు, బ్రహ్మేశ్వరి, అగస్త్యేశ్వరుడు, హరిహరేశ్వరుడు, వైద్యనాథుడు, ధ్రువేశ్వరుడు, గోకర్ణేశ్వరుడు, హాటకేశ్వరుడు, వీరలను దర్శించి పూజించుము, అనంతరము చిత్రగుప్తేశ్వరుడు, పశు పతేశ్వరుడు, చంద్రేశ్వరుడు, అగ్నీశ్వరుడు, నాగేశ్వరుడు హరిశ్చంరదేశ్వరుడు, వీరలనుపూజింపుము. చింతామణి వినాయకుని, సోమనాథ వినాయకుని దర్శించి పూజించుము. చతుర్వక్త్రేశ్వరుడు, బ్రహ్మేశ్వరుడు చండీశ్వరుడు వీరలను పూజింపుము. భవానీశంకరుని పూజించి డుంఢిరాజుకు నమస్కరించి రాజరాజేశ్వర, లాంగూలేశ్వర, నకులేశ్వరులను పూజించుము. గంగేశ్వరుని పూజించి జ్ఞానవాపియందు స్నానమొనర్చి జ్ఞానేశ్వరుని పూజించి, నందికేశ్వరునకు నమస్కరించి మార్కండేశ్వరుని తారకేశ్వరుని, మహాకాళేశ్వరుని, దండపాణిని, మోక్షేశ్వరుని, వీరభద్రేశ్వరుని పూజించి, అవిముక్తేశ్వరుని సమీపించి భక్తితో పూజించుము.

పంచ వినాయకుల పూజించి భైరవుని పూజించి, మహాద్వారమునకు వచ్చి విశ్వనాథుని పూజించుము. ఈ విధమున అంతర్గృహయాత్రనొనర్చి ముక్తి మండపము ప్రవేశించి, శివా! నేను నీప్రీతికొరకు అంతర్గృహ యాత్ర సలిపితి. న్యూనాతిరిక్తముల క్షమించి ప్రసన్నుడవుకమ్మని ప్రార్థించుము. అచ్చట కొంచెము విశ్రమించి అచ్చటనుండి లేచి విశ్వనాథుని నమస్కరించి దక్షిణమానసయాత్ర సలుపుము, అది ఎట్లన మణికర్ణికకు వెళ్లి ఉత్తరవాహినియై గంగయందు స్నానమొనర్చి పంచ వినాయకులను నమస్కరించి డుంఢిరాజును పూజించి, భవానీశంకరులకు నమస్కరించి, ధర్మకూపమున స్నానముచేసి అచ్చట తీర్థశ్రాద్ధము చేసి ధర్మేశ్వరుని పూజించుము. గంగా కేశవులను పూజించి లలితాదేవుని పూజించుము.

జరాసంధేశ్వరునకు నమస్కరించి సోమనాథుని దర్శించి వరాహేశ్వరుని పూజించి దశాశ్వమేధ తీర్థమున స్నాన మొనర్చుము. సీతలేశ్వరుని దర్శించి బందీదేవుని పూజించి తిలభాండేశ్వరుని పూజించుము.

పంచ వినాయకుల పూజించి భైరవుని పూజించి, మహా ద్వారమునకు వచ్చి విశ్వనాథుని పూజించుము. ఈ విధమున అంతర్గృహయాత్రనొనర్చి ముక్తి మండపము ప్రవేశించి, శివా ! నేను నీ ప్రీతికొరకు అంతర్గృహ యాత్ర సలిపితి. న్యూనాతిరిక్తముల క్షమించి ప్రసన్నుడవుకమ్మని ప్రార్థించుము. అచ్చట కొంచెము విశ్రమించి అచ్చటనుండి లేచి విశ్వనాథుని నమస్కరించి దక్షిణమానసయాత్ర సలుపుము, అది ఎట్లన మణికర్ణికకు వెళ్ళి ఉత్తరవాహినియైన గంగయందు స్నానమొనర్చి పంచ వినాయకులను నమస్కరించి డుంఢిరాజును పూజించి, భవానీశంకరులకు నమస్కరించి, ధర్మకూపమున స్నానముచేసి అచ్చట తీర్థశ్రాద్ధముచేసి ధర్మేశ్వరుని పూజించుము. గంగా కేశవులను పూజించి లలితాదేవిని పూజించుము.

జరాసంధేశ్వరునకు నమస్కరించి సోమనాథుని దర్శించి వరాహేశ్వరుని పూజించి దశాశ్వమేధ తీర్థమున స్నాన మొనర్చుము. సీతలేశ్వరుని దర్శించి బందీదేవిని పూజించి తిలభాండేశ్వరుని పూజించుము. రేవాకుండమునను, మానస సరోవరమునను స్నానము చేయుము. అచ్చట శ్రాద్ధ మొనర్చి మానసేశ్వరుని పూజించుము. నీ మనోరథము నెరవేరును. కేదారకుండమున స్నానమొనర్చి కేదారేశ్వరుని, పూజించుము. గౌరీకుండమున స్నానమొనర్చుము వృద్ధకేదారేశ్వరుని, హనుమంతేశ్వరుని పూజించుము. రామేశ్వరుని దర్శించి కృమికుండమున స్నానముచేసి శ్రాద్ధమొనర్చుము. సిద్ధేశ్వరుని పూజించి స్వప్నకుండమున స్నానమొనర్చి స్వప్నేశ్వరుని పూజించి తరువాత సంగమేశ్వరుని పూజించి లోలారక్కకూపమున స్నానమొనర్చుము. తరువాత గతిప్రదేశేశ్వరుని దర్శించుము.

అర్క వినాయకుని, పరాశరేశ్వరుని పూజించుము. కురుక్షేత్రకుండమున స్నానముచేసి సువర్ణదానము మొదలగు దానము లొనర్చుము అమృతకుండమున స్నానముచేసి దుర్గా వినాయకుని పూజించి దుర్గాదేవి పూజించి అనంతరము (64) అరువదినాలుగు యోగిగణముల దర్శించి నమస్కరింపుము. తరువాత కుక్కుటద్విజునకు నమస్కరింపుము. కాశీలో దక్షిణభాగమున కుక్కుటద్విజుని దర్శించి పూజించువారికి దుస్వప్నములు

సుస్వప్నములు కాగలవు. తరువాత గౌరిదేవినిదర్శించి అచ్చట (7) ఏడు గవ్వలనుంచుము. తరువాత రేణుకను దర్శించుము. శంఖోద్ధారకుండమున స్నానముచేసి కామాక్షిని పూజించుము. అయోధ్యాకుండమున స్నానముచేసి అచ్చటనున్న లక్ష్మిని పూజించుము. లక్ష్మీకుండమున స్నానముచేసి లక్ష్మీనారాయణుల పూజింపుము. సూర్యకుండమున స్నానముచేసి అచ్చట శ్రాద్ధమాచరించి సూర్యుని పూజించి వైద్యనాథకుండమున స్నానమొనర్చి వైద్యనాథేశ్వరుని పూజించుము. గోదావరీ కుండమున స్నామునముచేసిగౌతమేశ్వరుని భక్తితో పూజించుము. అగస్తికుండమున స్నానమొనర్చి అగస్తీశ్వరుని పూజించుము. శుక్రకూపములో స్నానముచేసి శుక్రేశ్వరుని పూజించుము. అప్పుడు అన్నపూర్ణను సమీపించి భక్తి భావముతో నమస్కరింపుము. డుండిరాజును పూజించి జ్ఞాన వాపిలో స్నానమొనర్చి జ్ఞానేశ్వరుని పూజించి దండపాణిని పూజింపుము ఆనందభైరవుని పూజించి మహాద్వారమున సాష్టాంగముగ నమస్కారముచేసి విశ్వనాథుని దర్శించుము. ఇట్లు చేయుటచే దక్షిణమానసయాత్ర చేసినవాడ వగుదువు. ఇకనిప్పుడు ఉత్తర మానసయాత్రవిధిని చెప్పుచున్నాను వినుము.

సంకల్ప మొనర్చి పంచగంగయందు స్నానము చేయవలయును. అందుచే కోటిజన్మల పాపము నశించును. కిరణ, ధూతపాపి, పుణ్య సరస్వతి, గంగ, యమున ఇవియే వంద గంగలు, కృతయుగమున ధూతపాపయనియు, ద్వాపరమున బిందుతీర్థమనియు, కలియుగమున నదియే పంచగంగయని పిలువబడుచున్నది. ప్రయాగయందు మాఘమాసమున స్నానమొనర్చిన పుణ్యముకన్న కోటిరెట్లు ఫలము పంచగంగా స్నానమువలనసిద్ధించును. అట్టి పంచగంగలో స్నానమాడి బిందుమాధవుని దర్శించి గోపాలకృష్ణుని పూజించి నృసింహ భవనమునకు వెళ్ళి నృసింహుని దర్శించి తరువాత మంగళగౌరిని చూచి గభస్తీశ్వరుని, మధురాదిత్యుని దర్శించి తిరిగి విశ్వనాథుని దర్శించవలెను. అనంతనరము ముక్తిమంటపమునకు వెళ్ళవలెను. ఆదిత్యుని పూజించి కేశవేశ్వరుని, పాపభక్షేశ్వరుని, నవగ్రహములను, కాలభైరవుని, క్షేత్రపాలకుని, అచర్చించవలెను. కాలకూపమున స్నానమొనర్చి అచ్చట పితరులకు శ్రాద్ధమొనర్చి, కృత్తివాసేశ్వరుని చూచి అచ్చటనుండి వెడలి శంఖవాసియందు స్నానమొనర్చి ఆచమనము చేసి రత్నేశ్వరుని, సత్యేశ్వరుని, దక్షేశ్వరుని, చతుర్వక్త్రేశ్వరుని వరుసగ పూజించవలెను.

వృద్ధకాలకూపములో స్నానమొనర్చి కాలేశ్వరుని పూజించి తరువాత అపమృత్యు ఈశ్వరుని పూజించుము. మందాకినిలో స్నానముచేసి, మధ్యమేశ్వరుని, జంబుకేశ్వరుని, వక్రతుండ గణపతిని పూజించి దండఖాతకూపమున స్నానముచేసి శ్రాద్ధమొనర్చుము. తరువాత భూతభైరవుని, ఈశానేశ్వరుని చూచి జైగీషవ్యగుహను దర్శించి నమస్కరించి ఘంటా కుండమున స్నానముచేసి వ్యాసేశ్యరుని కందుకేశ్వరుని, భక్తితో పూజించుము. జ్యేష్ఠవాపియందు స్నానముచేసి జేష్ఠేశ్వరుని పూజించి సప్తసాగర తీర్థమునకు వెళ్ళి స్నానము చేసి వాల్మీకేశ్వరుని పూజించి భీమాతటముననున్న భీమేశ్వరుని పూజింపుము. మృతృపిండకుండ మందు పితృశ్రాద్ధ మొనర్చి పిశాచమోచక తీర్థమున స్నానమాడి కపర్ధేశ్వరుని పూజించి కర్కోటక వాటియందు స్నానముచేసి కర్కోటేశ్వరుని భక్తితో పూజించి ఈశ్వరగంగకు వెళ్లి అచ్చట స్నానదానము లాచరించవలెను. అగ్నీశ్వరుని పూజించి చక్రరుండమున స్నానము చేసి శ్రద్ధతో శ్రాద్ధమాచరించుము. ఉత్తరార్కుని పూజించి మత్స్యోదరియందు స్నానముచేసి ఓంకారేశ్వరుని, కపిలేశ్వరుని పూజించుము ఋణమోచన తీర్థమునను, పాప విమోచన తీర్థమునకు స్నానమాచరించుము. అట్లే కపాలమోచన తీర్థమున గూడ స్నానమొనర్చి కులస్తంభమునకు వెళ్లి నమస్కరించి వైతరణీ తీర్థమున స్నానము శ్రాద్ధము గోదానమును గూచ నొనర్చుము. అచ్చట నుండి కపిలధారకు వెళ్లి స్నానము చేసి వత్సతతో కూడిన గోదానము బ్రాహ్మణునకు చేయుము.

వృషభధ్వజుని పూజించి జ్వాలానరసింహునకు నమస్కరించి వరుణాసంగమమునకు వెళ్ళి స్నానము శ్రాద్ధము చేసి కేశవాదిత్యుని, ఆదికేశవునిగూడ పూజించుము. ప్రహోద తీర్థము కలదు. అచ్చట గూడ స్నానదానాదుల నాచరించవలెను. కపిలధారయను తీర్థమందును స్నానము చేయుము. త్రిలోచనేశ్వరుని అసంఖ్యాలేశ్వరుని పూజించి మహాదేవుని సమీపించి భక్తితో పూజించి ద్రుపదేశ్వరుని గూడ పూజించుము. గంగా యమునా సరస్వతియను మూడు లింగములు కలవు. వాటిని పూజించుము. కామ్యతీర్థము దర్శించి కామేశ్వరుని పూజించి తిరిగి పంచ గంగకు వెళ్లి స్నానము చేయుము. తిరిగి పంచ గంగకు వెళ్లి స్నానము చేయుము. తిరిగి మణికర్ణిక యందు స్నానము చేసి జలశాయిని పూజించి హనుమంతునకు నమస్కరించి మోదాదిపంచ వినాయుకుల పూజింపుము. అన్నపూర్ణను పూజించి

ధుంఢిరాజును దర్శించి జ్ఞానవాపియందు స్నానము చేసి జ్ఞానేశ్వరుని పూజింపుము. దండపాణిని మోక్ష లక్ష్మీవిలాసుని పంచపాండవుల, ద్రౌపదీ ద్రుపదుల దర్శించి, ఆనందభైరవుని, అవిముక్తేశ్వరుని దర్శించి పూజించి విశ్వనాథుని సమ్ముఖమునకు వెళ్లి స్వామీ ! నీ ప్రీతి కొరకు ఉత్తర మానసయాత్ర సలిపితిని, ప్రసన్నుడవు కమ్మని ప్రార్థించవలెను. సాష్టాంగముగ విశ్వనాథునకు నమస్కరించి అనంతరము పంచక్రోశయాత్ర సలుపవలెను. ఇట్టి గురుచరిత్రను శ్రద్ధతో వినువారు చతుర్విధ పురుషార్థముల నొందగలరు. అని సిద్ధముని నామధారకునకు చెప్పెను.

**ఇట్లు గురుచరిత్రమందు నలుబది ఒకటవ అధ్యాయము సమాప్తము.**

**దిగంబరా దిగంబరా శ్రీపాదవల్లభ దిగంబరా**

**శ్లో॥ భజన్తం కష్టంతోప్యాహసాయం దేవంపరీక్ష్యయః ।**
**గురుసేవావిధానం స శ్రీదత్తశ్శరణంమమ ॥.**

తా॥ సాయందేవుడు జడివానలో తడియుచు తనవస్త్రము గురువు గారి మీద కప్పి గురువును సేవించుట.

పరమసంత్ శ్రీ కబీర్ దాస్ గారి సూక్తులు !

1) భగవన్నామము విశ్వమంతటను నిండియున్నది. ఎఱిగినవానికి అది కరతలామలకము. ఎఱుగనివానికదిగ గన కుసుమము.

2) కంటిలోని పాపవలెనే భగవంతుడు హృదయములో నున్నాడు. మూర్ఖుడు దీని నెఱుంగజాలక బయట నెక్కడనో భగవంతుని వెదకుచున్నాడు.

3) పండితుడు వాదగహ్వరములలో దగుల్కొని చెంతనున్న పరమార్థమునే మఱచును. పాపము: దివ్యజ్యోతి తన యంతరంగరమున దేదీప్యమానముగ బ్రకాశించుచుండ దానిని బయట వెదకుచుండును.

4) విత్తునందు జెట్టును, జెట్టునందు విత్తును నిమిడియున్నట్లే బ్రహ్మము నందు ప్రపంచమును, ప్రపంచమునందు బ్రహ్మమును భేదములేక యిమిడియున్నవి.

5) పృథ్వీతలము నొక కాగిదముగను, వృక్షరాజిని లేఖినిగను, సప్త సముద్రములను సిరాబుడ్డిగ నొనర్చినను, భగవన్మహిమ నభివర్ణింపజాలము.

# శ్రీ గురు చరితము

## నలుబది రెండవ అధ్యాయము

**ఓమ్ అవధూత చింతనం శ్రీగురుదేవదత్త జయ ఓమ్**

**శ్రీ గణేశ్వరా నమస్కారము**

సిద్ధముని నామధారకునితో నిట్లు చెప్పుచున్నారు. గురుమూర్తి సాయందేవునితో సాయందేవ ! వినుము. అవధూత బ్రహ్మచారితో కాశీ యాత్ర విధానమును తిరిగి ఇట్లు చెప్పుచున్నారు.

బాలకా ! వినుము. సంకల్ప మొనర్చి స్వర్గద్వార భువనమున కేగి అచ్చట గంగాకేశవుల పూజించి హరిశ్చంద్ర మంటపమున కేగుము. హవిష్యాన్నమును భుజించి మరునాడు ప్రాతఃకాలమున గంగాస్నాన మొనర్చుము. ధుండిరాజుకు పూజచేయుము. గంగకు నమస్కరించి విశ్వనాథుని దర్శించి భవానీశంకరుల పూజింపుము. ముక్తి మండపము ప్రవేశించి నమస్కరించి తిరిగి ధుండిరాజువద్దకు పొమ్ము. తిరిగి మహా ద్వారమున కేగి విశ్వేశ్వరుని పూజింపుము. మోదాది పంచ వినాయకులకు నమస్కరించి దండపాణిని దర్శించి నమస్కరించుము. ఆనందభైరవుని పూజించి మణి కర్ణికకు తిరిగి వెళ్ళి ఈశ్వరుని సిద్ధి వినాయకుని పూజింపుము. గంగా కేశవుల పూజించి సిద్ధి వినాయకునికి నమస్కరించి రాజసిద్ధేశ్వరుని ధ్యానించి దుర్లభేశ్వరుని పూజింపుము. సోమనాథుని శూల కంతేశ్వరుని, వారాహేశ్వరుని దర్శించి దశాశ్వమేధ ఘట్టమునకు పొమ్ము.

బందీదేవిని పూజించి సర్వేశ్వరునికి నమస్కరించి కేదారేశ్వరుని, హనుమంతేశ్వరుని గూడ పూజయొనర్చుము. సంగమేశ్వరుని, లోలార్కుని అర్కవినాయకుని పూజించి దుర్గా కుండమున స్నానమొనర్చుము. దుర్గాదేవిని పూజించి దుర్గా గణేశ్వరుని దర్శించి, విష్వక్సేనేశ్వరుని దర్శించి కర్దమతీర్థమున స్నానము చేసి కర్దమేశ్వరుని పూజింపుము. కర్దమకూపమున కేగి అచ్చట సోమనాథుని పూజించి తరువాత విరూపాక్ష లింగమునకు పూజ యొనర్చుము. నీలకంఠుని పూజించి కర్దమేశ్వరుని పూజించుము. నాగనాథుని పూజించి చాముండాదేవిని మోక్షేశ్వరుని, వరుణేశ్వరుని భక్తితో పూజింపుము. వీరభద్రుని పూజించి వికటాక్షాదేవిని పూజింపుము. ఉన్మత్త భైరవుని, విమలార్జునుని, కాలకూటదేవిని పూజింపుము. మహాదేవుని నందికేశ్వరుని, భైరవుని, గణప్రియుని,

విరూపాక్షుని, యజ్ఞేశ్వరుని, విమలేశ్వరుని, భీమాచండీ వినాయకుని,రవిని, రక్తాక్షగంధర్వుని పూజింపుము. జ్ఞానేశ్వరుని అమృతేశ్వరుని, భీమాచండిని నరసముద్రము నుండి తరించుటకు పూజించుము. ఏకపాదవినాయకుని, భైరవుని, సంగమేశ్వరుని పూజింపుము. భూతనాథుని సోమనాథుని కౌలనాథుని పూజించి కపర్దేశ్వరుడను శివలింగమును పూజించుము.

నాగేశ్వరుడు, కామేశ్వరుడు, గణేశ్వరుడు, విశ్వేశ్వరుడు, చతుర్ముఖ వినాయకుడు, దేహళీవినాయకుడు, ఉద్దండ గణపతి వీరల పూజించుము. ఉత్కలేశ్వరుని, ఏకాదశ రుద్రులను, పూజించి తపోభూమియను చోటికి పొమ్ము. అచ్చట రామేశ్వరుని, సోమనాథుని, భరతేశ్వరుని, లక్ష్మణేశ్వరుని, శత్రుఘ్నేశ్వరుని, భూమీదేవిని, నహుషేశ్వరుని, రామేశ్వరుని పూజించుము అసంఖ్యాక తీర్థమునకు నమస్కరించి, అసంఖ్యాత లింగమునకు పూజ చేయుము. సిద్ధేశ్వరుడను గొప్ప లింగమునకు పూజ చేసి పరశుపాణి వినాయకుని పూజించి పృథ్వీశ్వరునకు నమస్కరించి, సరయూకూపమున స్నానమొనర్చి కపిలోద్ధారమను తీర్థమును స్నానమాచరింపుము. ఋషభధ్వజుని పూజించి, జ్వాలానృసింహస్వామి పాదములకు నమస్కరించి, వరుణా సంగము స్నానము చేసి పితరులకు శ్రాద్ధము పెట్టుము. సంగమేశ్వరుని పూజించి, వినాయకుని కేశవుని ప్రహ్లాదేశ్వరుని పూజించి, కపిలతీర్థము స్నానము చేసి త్రిలోచనేశ్వరుని పూజింపుము.

అనంతరము బిందుమాధవుని పూజింపుము. మంగళ గౌరిని పూజించి, వశిష్ఠవామదేవుల పూజించి పర్వతీశ్వరుని పూజించుము. అనంతరము సిద్ధివినాయకుని పూజించి సప్తవర్ణేశ్వరుని, సర్వగణేశ్వరుని పూజించి, మణికర్ణిక కేగి అచ్చట స్నానమొనర్చి విశ్వేశుని స్మరించి, మహాదేవుని పూజించి ముక్తిమంటపమున కేగి విష్ణుమూర్తిని, దండపాణిని, ధుంఢి రాజును పూజింపుము. అనందభైరవుని పూజించి ఆదిత్యేశ్వరునకు నమస్కరించి, మోదాది పంచవినాయకుల పూజించుము. తరువాత విశ్వేశ్వరుని పూజించి మోక్షలక్ష్మీ విలాసమునకు నమస్కరించి, విశ్వేశ, విశ్వాత్మ కాశీనాథ ! నీ యనుగ్రహము వలన పంచక్రోశయాత్ర చేసితిని. కాశీక్షేత్ర ప్రదక్షిణముచే అనేక జన్మార్జిత పాపములు నశించినవని చెప్పి శివుని ధ్యానించవలెను.

అనంతరము ముక్తి మంటపమునకు, స్వర్గ మంటపమునకు, ఐశ్వర్యమంటపమునకు, జ్ఞానమంటపమునకు, మోక్షలక్ష్మీ విలాసస్థానమునకు, ముక్తి మంటపమును ఆనంద మంటపమునకు, వైరాగ్య మంటపమునకు,

వెళ్ళి ఈ ఎనిమిది స్థానములకు నమస్కార మొనర్చుము. ఇట్టి కాశీయాత్రా విధానము నీకు చెప్పితిని. మరియొక విధముగ గూడ కాశీయాత్ర చేయువిధము చెప్పెదను ఓ బాలుడా ! వినుమని అవధూత చెప్పుచున్నాడు.

ముందుగ సచేలస్నానము చేసి తరువాత చక్రపుష్కరిణిలో స్నానమొనర్చి, దేవపితృతర్పణము గావించి, బ్రాహ్మణుల పూజింపుము. అచ్చట నుండి బయలుదేరి ద్రుపదాదిత్యేశ్వరుని పూజించి, దంపత్యేశ్వరునకు నమస్కరించి, ఆ సమీపముననున్న విష్ణుమూర్తిని పూజించి, దండపాణిని, మహేశ్వరుని పూజింపుము. ధుంఢిరాజును పూజించి జ్ఞానవాపియందు స్నానమొనర్చి, నందికేశ్వరుని పూజించి తారకేశ్వరుని పూజించుము. మహాకాళేశ్వరుని దర్శించి దండపాణివినాయకుని పూజించి విశ్వేశ్వరుని దర్శింపుము. ప్రతిపత్తునాడు మత్స్యోదర తీర్థమున స్నానము చేసి ఓంకారేశ్వరుని పూజించుము. త్రిలోచన మహాదేవులను రెండు లింగముల విదియు, తదియల వరుసగ నర్చింపుము. చవితినాడు కాంచీవాస లింగము నర్చించుము. పంచమినాడు రత్నేశ్వరుని, షష్ఠినాడు చంద్రేశ్వరుని పూజించుము. సప్తమినాడు కేదారేశ్వరుని పూజించుము. అష్టమి నాడు విశ్వేశ్వరుని ఆరాధించి దశమినాడు కామేశ్వరుని, ఏకాదశినాడు తిరిగి విశ్వేశ్వరుని, ద్వాదశినాడు మణికర్ణి కేశ్వరుని, త్రయోదశియందు అవిముక్తేశ్వరుని, చతుర్దశినాడు విశ్వేశ్వరుని పూజించవలయును. కాశీయందు నివసించువారు. ఈ విధమున యాత్ర చేయనిచో వారి యాత్రకు విఘ్నము వాటిల్లును. ఇక కృష్ణపక్షమున నెటుల కాశీయాత్ర సలుప వలయునో చెప్పెద వినుము.

వరుణానదియందు స్నానమొనర్చి శైలేశ్వరుని దర్శించి సంగమస్నాన మొనర్చి సంగమేశ్వరుని పూజించవలయును. స్వర్గతీర్థమున స్నానమొనర్చి స్వర్గేశ్వరుని పూజించవలయును మధ్యమేశ్వరుని మందాకినియందు స్నానమొనర్చి పూజించవలయును. మణికర్ణికా స్నానమొనర్చి ఈశానేశ్వరుని పూజించుము. హిరణ్యగర్భమును రెండు లింగములు గలవు. వాటిని పూజించుము. ధర్మకూపమున స్నానము చేసి గోపద్మేశ్వరుని పూజించుము. కపిలధారాతీర్థమున స్నానమొనర్చి ఋషభధ్వజలింగమునకు పూజగావింపవలయును. ఉపశాంతి కూపమున స్నానమొనర్చి ఉపశాంతేశ్వరుని ఆరాధించుము. పంచకూడా ప్రవాహమనుచోట స్నానము చేసి జ్యేష్టేశ్వరుని నర్చించుము. చతుస్సముద్రకూపమున స్నానముచేసి సముద్రేశ్వరుని సేవించుము. తరువాత దినమున శుక్లేశ్వరుని పూజించుము. దంఢఖాతతీర్థమున స్నానము చేసి 'వ్యాఘ్రేశ్వరుని పూజించుము.

శౌనకేశ్వరతీర్థమున స్నానమొనర్చి శౌనకేశ్వరుని పూజించుము. జంబుతీర్థమున స్నానమొనర్చి జంబుకేశ్వరు నారాధించుము. శుక్లపక్షమునను కృష్ణ పక్షమునను విశేషించి మోక్షేశ్వరుని, పర్వతేశ్వరుని, పశుపతేశ్వరుని, గంగేశ్వరుని, నర్మదేశ్వరుని గూడ పూజించవలయును. అనంతరము భక్తేశ్వరుని, గభస్తేశ్వరుని, మధ్యమేశ్వరుని, తారకేశ్వరుని పూజింపుము. అగ్ని ధ్రువేశ్వరుడు. ఊర్వశీశ్వరుడు, నకులేశ్వరుడు, ఆషాఢేశ్వరుడు, భారభూతేశ్వరుడు, లాంగులేశ్వరుడు, త్రిపురాంతకేశ్వరుడు, మనఃప్రకామేశ్వరుడు, ప్రీతేశ్వరుడు, మందాలికేశ్వరుడు, తిలపర్ణేశ్వరుడు గలరు. వీరల గూడ పూజించుము. ఇక శక్తియాత్ర చెప్పెద వినుము.

శుక్లపక్ష తదియనాడు గోప్రేక్షతీర్థములో స్నానమొనర్చి ఫాలనేత్రయను శక్తిని పూజించి, జ్యేష్ఠవాపిలో స్నానమొనర్చి జ్యేష్ఠాదేవిని అర్పించుము. అట్లే జ్ఞానవాపి యందు స్నానము చేసి శృంగార సౌభాగ్యగౌరిని ఆరాధించుము. విశాలగంగయందు స్నానమాడి విశాలగంగాదేవిని పూజించుము. లలితాతీర్థమున స్నానము చేసి లలితాదేవిని ఆరాధించుము. భవానీతీర్థమున స్నానమాడి భవాని అమ్మవారిని పూజించుము. బిందుతీర్థమున స్నానముచేసి మంగళగౌరిని అర్చించుము. ఇట్లు శక్తుల పూజించి లక్ష్మీదేవిని ఆరాధించుము. ఇట్లు తదియయందు పూజలు చేసి చతుర్థియందు చేయవలసిన యాత్రవిధానము చెప్పెద వినుము.

గౌరిపుత్రుడయిన గణేశునకు మోదకములర్పించుము. ఇట్లు చేసినచో తీర్థయాత్ర చేయువారికి ఎట్టి విఘ్నములు రాజాలవు. మంగళ ఆదివారముల యందు భైరవుని, సప్తమీ ఆదివారము సూర్యుని ఆరాధించుము. అష్టమి, నవమి తిథుల యందు చండీ అమ్మవారిని పూజించుము. ప్రతి నిత్యము అంతర్గృహయాత్రను తప్పక చేయవలయును. ఈ కాశీయాత్రా విధానము స్కాంద పూరాణములో కాశీ ఖండములో కలదు. అదియే నేను నీకు చెప్పితిని. ఓ బ్రహ్మచారీ ! నీ విటుల యాత్రచేసి నీ పేరుతో సోమేశ్వరుడను పేరుగల లింగమును స్థాపింపుము. నీ విటుల నాచరించితివేని నీ మనోరథము నెరవేరును. నీ చిత్తములో గురుభక్తి దృఢముగ గలదు. శంకరుడు తప్పక ప్రసన్నుడుకాగలడు. తప్పక గురుస్మరణ నిత్యము నిరంతరము చేయుచుండుమని చెప్పి ఆ అవధూత అక్కడనే అదృశ్యుడయ్యెను.

అప్పుడా బ్రహ్మచారి ఆశ్చర్యపడి అతనే తన గురువై యుండవచ్చునని

నిర్ణయించుకొని గురువు కృపామూర్తి గాననే నిర్హేతుకముగ వారి యనుగ్రహము నాయందు లభించెను. నేను ధన్యుడనైతిని. తప్పక నా కార్యము సిద్ధించును. నేను ఈశ్వరునియందు భక్తిలేని వాడనైనను గుర్వనుగ్రహము వలన నాకు ఈశ్వరానుగ్రహము గూడ సిద్ధించునని భావించి కాశీ ప్రవేశించి గురువు చెప్పిన విధానమున తాను భక్తితో కాశీ యాత్రను సాంగోపాంగముగ నాచరింప ఈశ్వరుడు ప్రత్యక్షమై బాలకా ! వరము కోరుకొనుమన, నా బ్రహ్మచారి తన గురువు, గురు భార్య, గురుపుత్రుడు, గురుపుత్రికయు కోరిన వాటినన్నిటిని చెప్పి అవిచేయు సామర్థ్యము తనకిమ్మని ప్రార్థించెను. అప్పుడు ఈశ్వరుడు బాలునితో ఓ బాలకా ! నీవు సర్వవిద్యాపారంగతుడ వగుదువు. ఇంతియ కాక నీవు ఇకమీద విశ్వకర్మయను పేరుతో వెలయగలవు. ఓత్వష్ట్ర కుమారా! నీకు సంకల్పమాత్రముననే సృష్టిచేయగల సామర్థ్య మనుగ్రహించితిని. అని చెప్పి శివుడు అంతర్ధానము నొందెను. అప్పుడు బ్రహ్మచారి శివుని వలన వరమునొంది, తన పేరుతో లింగ స్థాపన గావించి తన గ్రామము చేరి శివుని వరప్రసాదముచే గురువు వారి భార్యా పుత్ర పుత్రికలు కోరినవాటినెల్ల రచించి గురువును సమీపించి, గురుచరణములకు నమస్కరించి వారు వారు కోరిన వస్తువుల నెల్ల వారల కర్పించి నిలువబడెను.

గురువు సంతోషముతో శిష్యుని ఆలింగన మొనర్చి శిష్యాగ్రేసరా ! నీ భక్తికి సంతసించితిని, నీవు గురుభక్తిచే త్రిమూర్తుల వశపరచుకొంటివి. సర్వ విద్యాకుశలుడవై అష్టయిశ్వర్యములతో తులతూగుచు సుఖముగ నుండుచు, చిరంజీవివయి ఆచంద్రార్కము లోకోపకార మొనర్చు చుండుము. మీ వంశము అష్టసిద్ధులతో తులతూగుచుండును. మీ వంశము వారికి చింతలు కష్టములు కూడ నుండవు. మీ వంశము వారందరు చతుష్షష్టికళలయందు ఆరి తేరి యుందురు : అని గురువు శిష్యుని ఆశీర్వదించి పంపివేసెనని శివుడు పార్వతికి చెప్పి తిరిగి ఓ పార్వతీ ! గురుభక్తి ఎట్టిదో తెలిసికొంటివా. ఏక భావముతో గురువును భజించవలెను. భవసాగరమును దాటవలయుననిన గురుభక్తియే ఆధారము.

గురువును త్రిమూర్తుల యొక్క అవతారముగ భావింపవలయును. వేద శాస్త్రములు "యస్యదేవే పరాభక్తిః యథా దేవే తథా గురౌ, తస్మైతే కథితా హ్యర్థాః ప్రకాశంతే మహాత్మనః." దేవునియందు ఎంత భక్తియో అంత భక్తి గురువునందు ఉంచవలయును. అట్టివానికే గురువు చెప్పిన బోధ అనుభవమునకు రాగలదు. అని ఇట్లు గురుభక్తియే జన్మసంసిద్ధికి

ముఖ్యకారణముగ చెప్పినవని" గురుభక్తి మాహాత్మ్యమును శివుడు పార్వతికి చెప్పెనని గురుమూర్తి సాయందేవునకు చెప్పెను. ఇంతలో సూర్యోదయ మయ్యెను. అంధకారము నశించెను. సాయందేవుడు సంతసించి గురుమూర్తి పాదములకు నమస్కరించి, స్వామీ ! అట్టి దృఢ భక్తి సర్వకాలముల యందు నాకుండునటుల చేయుమని ప్రార్థించుచు, స్వామీ, తమరు నాకు కాశీయాత్రా విధానమును చెప్పుచున్నప్పుడు ఏమి అద్భుతమో గాని తమతో కలిసి నేను కాశీ క్షేత్రములో నున్నటుల నాకనుభవమయ్యెను. అది స్వప్నమో ఏమియో నాకు తెలియుట లేదు. కాశీక్షేత్రమును ప్రత్యక్షముగ చూచితి, అని చెప్పి భక్తితో ప్రణమిల్లి ఇట్లు స్తోత్రముచేసెను.

### సాయందేవుని స్తోత్రము

**జయజయ పరమపురుషా : పరాత్పరా : పరమహంసా.**
**భక్తజన మానసహంసా : శ్రీ నృసింహ సరస్వతీ :**
**() అదౌ బ్రహ్మ త్వమేకమేవ జగతాం వేదాత్మమూర్తిం విభో**
**పశ్చాతోక్షణితలే వినాశి దితిజే కృత్వావతారం విభో**
**హత్వాదైత్యమనేక ధర్మ చరితం భూత్వాత్మజోఽ త్రేర్భహే**
**వందేఽహం నరకేసరీ సరస్వతీ శ్రీపాద యుగ్మాంబుజమ్ ॥**
**శ్లో ॥ ప్రాగ్బ్రహ్మత్వమజోఽ క్రియోఽపి బహుళం స్యామిత్య భూద్ధీస్తయా**
**సృష్ట్వాయివాండభువంతతో జగదిదం సృష్ట్వాస ధర్మంగుణైః**
**స్త్వైస్స్వం భో రమయన్ విహంసి సదరీ నత్రావ తీర్యానిశం**
**వందే శ్రీ నృహరే సరస్వతీ వరం తే శ్రీ పదాబ్జద్వయమ్.**

తా॥ సృష్టికి పూర్వము ఒక్కడవై సృష్టికాలముకాగా సంకల్ప మాత్రముచే మాత్రముచే బ్రహ్మాండరూపుడవై, స్థితి కాలమందు నీ రూపమైన జగమును నీవే పాలించి దుర్మార్గుల సంహరించి భక్తుల రక్షించుటకుగాను అవతరించిన ఓ నృసింహసరస్వతీ నీ పాదద్వంద్వములకివే వందనములు.

**() భూదేవాఖిల మానుషం విదుజనా బాధాయమానం కలిం**
**వేదాదుష్య మనేకవర్ణమనుజా భేదాది భూతోన్నతిం,**
**చేత్తాఽధర్మ తమాంధ కారహరణం జ్ఞానప్రదీపోజ్వలం,**
**వందేఽహం నరకేసరీసరస్వతీ శ్రీపాదయుగ్మాంబుజమ్.**
**శ్లో॥ కల్యాకృష్టహృదుజ్ఝితక్రతు నరత్రస్తాధ్వరాశీర్ముదే**
**ప్రాతస్సూర్య ఇవోదితోఽ సృజ మహా మోహాంధకారం గ్రసన్**

సద్ధర్మాశ్రమ సేతుమత్ర శిథిలప్రాయంసుధార్ధ్యంనయన్
వందే శ్రీ నృహరే సరసస్వతివరం తే శ్రీపదాబ్జద్వయమ్.

తా॥ కలిచే ధర్మము నశించి యజ్ఞయాగములు లోపించగా దేవతల ప్రార్థన ననుసరించి, భూమిని అవతరించిన ఓ నృసింహానరస్వతీ నీ పాదద్వంద్వములకివే వందనములు.

() ధాతస్త్వం హరిశంకరాదిగురవో జాతాగ్రజన్మం విభో
హేతుః సర్వవిభోజనాయతరణం జ్యోతి ః స్వరూపం జగత్ ।
చాతుర్థాశ్రమస్థాపితం క్షితితలే పాతుస్సదా సేవ్యయం
వందేఽహం నరకేసరీ సరస్వతీ శ్రీపాదయుగ్మాంబుజమ్.
సర్వానంద విధానరూపమమలం సత్వం సుఖం మూర్తిమత్
ప్రాదుష్కృత్య జనత్రయాంతర మృగ క్రీడావనం పావనం
సంసారా వటమగ్నముద్ధరసిభో స్వీకృత్య తుర్యాశ్రమం,
వందే శ్రీనృహరే సరస్వతీ వరంపే శ్రీపదాబ్జద్వయమ్.

తా॥ సంసార సముద్రమున మునిగి దరిగానకయున్న భక్తజనుల తరింపజేయగలందులకు అవతరించి, తురీయాశ్రమమును స్వీకరించి, లోకుల నుద్ధరించుచున్న ఓ నృసింహ సరస్వతీ : మీ పాద ద్వంద్వమునకు నమస్కారములు.

() చరితం చిత్రమనంత కీర్తిమతులం పరిభూత భూమండలే
మూకం వాక్య దివాంధకస్య నయనం వంధ్యాంద పుత్రందదత్
సౌభాగ్యం విధవా చ దాయక శ్రియం దత్వా చ భక్తం జనం
వందేహం నర కేసరీ సరస్వతీ శ్రీపాదయుగ్మాంబుజం.

శ్లో॥ మూకే గాంధృశమన్ధకే సుచనయం వంధ్యాసు చాసూన్మృతే
సౌభాగ్యం విధవాను పల్లవమహో దత్తం సుశుష్కేంధనే
ఏవం భూతియాన్ తవైష మహిమా త్రైలోక్య సంస్థాక్షమో
వందే శ్రీ నృహరే సరస్వతీ పరంతే శ్రీపదాబ్జద్వయమ్.

తా॥ స్వామీ ! మీ చరితము లోకాతీతము. మూగవారికి మాటలాడు శక్తి ననుగ్రహించితిరి. గ్రుడ్డి వానికి నేత్రము లిచ్చితిరి. గొడ్రాలికి సంతాన మిచ్చితిరి. ఎండిన కట్టెను పల్లవింప చేసితిరి. మీ మహిమను నేనెంత వర్ణింప సమర్థుడను? మీ పాదకమలములకు నమస్కరించెద. స్వామీ ! ఓ నృసింహ సరస్వతీ !

() దురితా ఘోర దరిద్రదావ తిమిర హరణం జగజ్జ్యోతిషం
సుర ధేను సురపాదపాజితజనా కరుణాబ్ధి భక్తార్తిహా,

**నరసింహ సరస్వతీశ్వర విభో : శరణాగతం రక్షణం**
**వందేహం నరకేసరీ సరస్వతీ శ్రీపాదయుగ్మాంబుజమ్**
**ముక్తావాసి ముముక్షు కల్పవిటపిస్ భో కామినాం కామధుక్**
**దారిద్రానలమేఘ : దుష్కృవ దవాగ్నే : తాపితారామ తే**
**ప్రత్యన్విష్ట రజఃపదం శ్రుతవివాదాతీతత్వం మహత్**
**వందే శ్రీనృహరే సరస్వతీ వరం తే శ్రీపదాబ్జద్వయమ్.**

తా॥ దురితమును దారిద్ర్యమును పోగొట్టి జగత్తుకు జ్ఞానజ్యోతిస్సు నొసంగుచు కామధేనువు, కల్పవృక్షముల వలె భక్తుల కోరికలనెల్ల సఫలమొనర్చుచు ముక్తులకు ముముక్షువులకు సహిత మాధారమై వేదములకు గూడ గోచరించని స్వరూపము గల ఓ నృసింహసరస్వతీశ్వర ప్రభో : నీ పాదారవిందద్వంద్వ మున కివే సహస్రవందనములు.

() **గురుమూర్తి చరణారవింద యుగళస్మరణేకృ తేనిత్యశ ః**
**చరితం క్షేత్రమనేక తీర్థసఫలం సరిదాది భాగీరథీ,**
**తురగామేధ సహస్రకోవిదుజనాః సమ్యగ్ధదన్ తత్ఫలం**
**వందేహం నర కేసరీ సరస్వతీ శ్రీపాదయుగ్మాంబుజమ్.**

శ్లో॥ **భో యోగీశ్వర భావితం తవ పదం తీర్థాశ్రయంసజ్జనా**
**జీవం కామిసుదైవతం చ కమలాలీలాస్పదం నిర్మలం.**
**విద్వద్వాదకరండకం సుకృతసంస్థానం మహత్పావనం**
**వందే శ్రీనృహరే సరస్వతివరం తే శ్రీ పదాబ్జద్వయమ్.**

తా॥ ఓ యోగీశ్వర ! నీ పాదములు తిర్థములతో సమము, సత్పురుషులకు జీవనాధారము, కామముతో సేవించు వారికి నీ పాదములే వారలకు కామములనివ్వ సమర్థములు మిక్కిలి పావనములు. లక్ష్మికి నివాసస్థానములు. ఓ నరసింహ సరస్వతీ అట్టి నీ పాదద్వంద్వమునకు నమస్కృతులు గావించెద.

() **నోశక్యం తవనామమంగళస్తవం వేదాగమాగోచరం**
**పాద ద్వంద్వ హృదయాబ్జ మంతరనిధాయ త్వాం భూమిపం,**
**భూయో భూయ స్మర న్నమామి మనసా శ్రీసద్గురుం పాహిమాం**
**వందేఽహం నరకేసరీ సరస్వతీ శ్రీపాద యుగ్మాంబుజమ్.**
**వేదాగోచర తే చరిత్ర మమలం శక్తోఽత్ర కః కృత్స్నశ**
**వక్తుం వహ్న్యాభినేంచు భూ ఖ పవనా త్మేతీహ మూర్త్యష్టకం,**
**ఏతద్విశ్వమయం న చాన్యదిహ వా ఓంకార రూపేశిత :**

**వందే శ్రీనృహరే సరస్వతీ వరంతే శ్రీపదాబ్జద్వయమ్.**

తా॥ వేదములకు గూడ గోచరము గాని నీ చరిత్ర మెవ్వరు వర్ణింప సమర్థులు? నీవు ఓంకార స్వరూపుడవు. పంచభూతములు, సూర్యచంద్రులు, జీవాత్మ ఇవి ఎనిమిది నీ రూపములు గాన నీవు విశ్వరూపుడవు. అట్టి నీ పాదారవిందముల హృదయమున నిలిపి నిన్ను స్మరింతును. ఓ నరకేసరి: సరస్వతి : సద్గురో : నీ పాదరవిందములకు నమస్కారము.

**శ్లో॥() కుండీ దండ ధరం ప్రశాంతమమలం సన్యాపిరూపం తవ**
**శ్రీ భీమామరజాయుతి స్థితమజధ్యేయం శరణ్యంమయి,**
**జ్ఞానంతారకమీశ సత్యమనిశం బ్రహ్మాన్థిరీకుర్వదో**
**వందే శ్రీనృహరే సరస్వతీ వరం తే శ్రీపదాబ్జద్వయమ్.**
**భక్తానాం తరణార్థ సర్వజగతాం దీక్షాందదన్యోగినాం**
**సుక్షేత్రం పురగాణగస్థిత ప్రభో దత్వాచతుష్కామదం,**
**స్తుత్వా భక్తి సరస్వతీ గురుపదం జీత్వాద్య దోషాదికం**
**వందేఽహం నరకేసరీ సరస్వతీ శ్రీపాదయుగ్మాంబుజమ్.**

తా॥ కలియుగమున భక్తుల నుద్ధరించగలందుల కవతరించి భీమా అమరదాసంగమమున గణగాపురమున నివసించి దండకమండలముల ధరించి యతీశ్వర రూపమున నున్న దత్తాత్రేయ: శ్రీనృసింహ సరస్వతీ: నీ పాదారవిందములకు నమస్కారము. నా దోషముల పోగొట్టి నాకు స్థిరమైన జ్ఞానము ననుగ్రహించుము. నన్ను రక్షించుము.

**() ఏవం శ్రీగురు నాయకాష్టక మిదం స్తోత్రం పఠేన్నిత్యశః**
**సప్రాప్నోతి బలం శ్రియంచ సుధియం తేజోవపుఃపాటవం,**
**వర్చః పుత్రకళత్రమిత్రజసుఖం దీర్ఘాయురారోగ్యతాం**
**సంప్రాప్యైహికసౌఖ్య మనిశం చాంతే స ముక్తిం వ్రజేత్.**
**స్తవం శ్రీగురునాథ మష్టక మిదం స్తోత్రంపఠేన్నిత్యశో**
**తేజోదర్చబలోన్నతిం శ్రియకరం ఆనందవర్ధం వపుః**
**పుత్రాపత్యమనేక సంపద శుభదీర్ఘాయురాలోగ్యతాం**
**వందేఽహం నరకేసరీ సరస్వతీ శ్రీపాదయుగ్మాంబుజం.**

తా॥ నిత్యము ఈ గురునాథాష్టకమును శ్రద్ధతో పఠించువారికి గురునాథుడు తేజస్సును ఐశ్వర్యమును ఆరోగ్యమును, పుత్రపౌత్రాభి వృద్ధిని, దీర్ఘాయుష్యమును, ఐహిక సౌఖ్యమును, అంతమందు మోక్షమును గూడ ప్రసాదించును. అట్టి

గురుమూర్తి శ్రీనృసింహసరస్వతీ పాదారవిందములకు నమస్కారములు.

ఇట్లు స్తుతించుచు సాష్టాంగ వందన మాచరించి రోమాంచము గలవాడై గద్గదమైన కంఠస్వరముతో త్రిమూర్త్యవ తారా : జగద్గురో : మీరు దయామూర్తులు, మాకు మానవ రూపమున నగుపడుచున్నారు. కాని మీరు మానవ మాత్రులు కారు. మీరే విశ్వనాథులు. కాశీపురము మీయందే గలదు. మీరు కాశీక్షేత్రము గూర్చి చెప్పునప్పుడు నేను స్వప్నమో ఏమియో గాని కాశీ క్షేత్రము చూడగలిగితి. దేవా నాభాగ్యమే మని వర్ణించగలనని స్తుతించ శ్రీ గురుమూర్తి సంతసించి అతనితో నీకు నేను కాశీక్షేత్రము దర్శింపచేసితిని. మీ వంశము ఇరువది యొక్క తరముల వారికి గూడ కాశీయాత్ర ఫలము నేడు సిద్ధించెను. నీవు నిజమైన భక్తుడవు గాన నీవు నా సేవ చేయుచు నావద్దనే యుండుము. ఇక మీదమ్లేచ్ఛ సేవచేయక దారాపుత్రుల తీసికొని వచ్చి నావద్దనే నివసించుము. అని చెప్పి సాయందేవునితో సహ గణగాపురములోని మఠమునకు వచ్చిరి. ఆపై నేమి జరిగెనని నామధారకుడడుగ సిద్ధముని పై కథను క్రింది విధమున చెప్పుచున్నారు.

సాయం దేవుడు గురుమూర్తి ఆజ్ఞననుసరించి తన గ్రామమున కేగి గురుమూర్తికి తనయందు కలిగిన అనుగ్రహమును వారలతో చెప్పి, వారల వెంటనిడుకొని మహానందముతో గణగాపురము చేరి గురుమూర్తికి సాష్టాంగవందన మాచరించి చేతులు జోడించుకొని ఇటుల స్తోత్రము చేసెను.

ఓం నమోజీ: చంద్రమౌళి : మీరు త్రిమూర్తి స్వరూపులు. అజ్ఞానుల దృష్టికి మనుష్యులుగ కనబడుచున్నారు. మీ మహిమ అపారము కాన ఎవరికిని వర్ణింపతరముగాదు చకోరమునకు చంద్రదర్శన మైనటుల నాకు దయానిధులైన తమదర్శనము లభించెను. పూర్వమునాచే చేయబడిన పాపరాసులన్నియు భస్మమయ్యెను. నేను పునీతుడనైతిని. గంగా స్నానముచే పాపము నశించును. చంద్రుడు తన కిరణములచే తాపమును పోగొట్టును. కల్పవృక్షము దైన్యమును పోగొట్టును. సద్గురుచరణ దర్శనముచే పాపములు, తాపములు దైన్యము గూడ నశించును. గురునాథుడు తన దర్శనముననే చతుర్విధ పురుషార్థముల నీయ సమర్థుడు. అది నావిషయమున సార్థకమయ్యెనని చెప్పి ఈ క్రింది విధమున కర్ణాటక భాషలో రాగయుక్తముగ కీర్తించెను.

**క॥ () కండేనిందు భక్తజనరి భాగ్యనిధియా,**

**భూమండల దొళగె నారసింహ యతిరాయా । పల్లవి**

**సం॥భక్తజన సుభాగ్యోదయాకార ః మహీతలే యతీశ్వరః**
**దృష్టో మయా విశ్వతారః నరసింహ సరస్వతీ యతీశ్వరః**

తా॥ భూమండలమున భక్తజనులకు భాగ్యనిధియై అవతరించిన శ్రీ నృసింహ సరస్వతిని నేడు చూడగలిగితిని.

**() కండేనిందు దృష్టియింద వారిజాదళ పాదమన్ను,**
**హృదయ కమల దల్లి భజిసి సుఖమనీవ జగత్పతీయా, అనుపల్లవి.**
**సం. దృష్టో దృక్కమలయుగేన త్వత్పద కమలద్వంద్వమనేన**
**నష్టం స్మరతోఽఘం క్షణేన, సుఖదోషా నౌజగత్పతిః**

తా॥ హృదయమున భక్తితో ధ్యానించు వారికి సుఖమునిచ్చు జగత్పతియగు మీ చరణ కమలముల నేడు కనులార చూడగలిగితిని.

**() భక్త జనరిగె కామ్యఫలగళిత్తు సలహుతిరువ.**
**యోగినియరొడయ నారసింహ సరస్వతియ పాద కండే ॥**
**సం॥దీనబంధుః పూరయతీష్టం భోజనానాం దయాబ్ధిరిష్టం**
**యోగిజనానాంవందే శిష్టం నృసింహసరస్వతీ గరిష్ఠం**

తా॥ సంసారమున బాధపడుచున్న భక్తులకు అభీష్టముల నిచ్చి రక్షించుచు యోగులకు ప్రభువై యోగసిద్ధి ననుగ్రహించెడి నరసింహ సరస్వతీ గరిష్ఠుని నేడు చూచు భాగ్యము లభించెను.

**() వాక్యాకారణ నాగి జగదొళు దండ కమండలను ధరిసి**
**సగుణనెనిసి సుజనరిగె బలిద శ్రీగురుయతివరన్నా, కండేనిందు.**
**సం॥లక్ష్యో నాక్యైరాత్మా దండకమండలు ధృక్స్వం స యతిః**
**సగుణ బ్రహ్మత్వం సత్రీతిః న్యాసి శ్రేష్ఠో వై గురుమూర్తిః**

తా॥ మహావాక్య ప్రతిపాద్యమైన పరతత్వమే సగుణమై దండ కమండలముల ధరించి సత్పురుషుల ఇట్టి రూపముతో నుద్ధరించుచున్న ఓ నరసింహ సరస్వతీ: యతి సార్వభౌమ : నేడు మిమ్ము నేత్రానందముగ పొడగంటిని.

**() ధరెగె గాణగాపుర కైలాస హరిదాస రొడెయ నెనిసి**
**కరుణది వరవిత్తు పొరెవ అనుదిన గురుచరణమన్ను కండేనిందు.**
**సం॥హరిదాస ప్రియ తరుణానిలయ స్వభక్తపాలక ప్రేమాతిశయ,**
**చరణస్పర్శాత్తై కైలాసో భూద్గంధర్వపురమ్.**

తా॥ మీ చరణ స్పర్శ వలన నీ గంధర్వపురము భూకైలాస మయ్యెను. దయకు సముద్రమై ప్రేమతో భక్తులను పరిపాలించుటకుగాను అవతరించిన

మీ పాదముల నేడు కంటిని.

**క॥ () నేపద : కండెనమ్మా ఇందుకండేనమ్మా, భూమండల**
**దొళగె యతివరరాయచంద్రాయన్నా. ॥పల్లి॥**

**సం. భక్తసుభాగ్యో దయాకారః మహీతలే యతీశ్వరః,**
**దృష్టోమయా విశ్వతారః నరసింహసరస్వతీయతీశ్వరః.**

తా॥ యతులను నక్షత్రములలో చంద్రునివలె ప్రకాశించు మిమ్ముల నేడు కన్నులతో చూచుచున్నాను. భక్త జనుల భాగ్యమే సాకారమై వెలసినటుల భూమియందు యతీశ్వరుని రూపమున నున్న మిమ్ముల చూచితిని.

**కం. తత్వబోథయ ఉపనిషత్తత్వ చరితనా, వ్యక్తవాద**
**పరబ్రహ్మమూర్తిఎనిసువనా ॥కండే॥**
**జయ జయ భూమన్ సద్గురుమూర్తే జగద్ధితో ధృతనరమూర్తే**

తా॥ ఉపనిషత్ప్రదిపాదిత తత్వమునకు ఆదర్శకమైన చరిత్రమును లోకమునకు ప్రదర్శించే మీ పాదముల నేడు చూచుచున్నాను. భక్తుల రక్షించుటలో జాగుచేయనటువంటి దయాఘన నీకు జయ జయ.

**కం. శేశశయన పరవేషకాయకనా లేసుకృపేయ నిమేష**
**వెంబ భాషాపాలంనాక్రండెనిందు.**

తా॥ శేషశాయియే మీరు ఇట్టి యతీశ్వర దేహము ధరించితిరి. మీ కృపాకటాక్షము ఎవరియందు ప్రసరించునో వాడే కడు ధన్యుడు. అట్టి మిమ్ముల నేడు చూచితిని.

**క. గంథపరిమళదింద శోభితానంద సాగరనా । ఛందవుళ్ళ**
**యోగీంద్ర గోపీవృందవల్లభనా కండెనమ్మా.**

తా॥ ఆనందమునకు సముద్రుడవై గంధపరివళములచే శోభిల్లుచు యోగీంద్రులకు ప్రియమును ఘటింపజేయ నవతరించిన గోపీజన ప్రియుడైన కృష్ణుని ఈ రూపమున చూచుచున్నాను.

**కం. కరిరాయనెని పంగె వరద గురురాయనా, నరసింహ**
**సరస్వత్యంబ నారీ పురుషనామకనా. కండెనమ్మా.**

తా॥ కరిరాజైన గజేంద్రునికి మోక్షము నొసంగిన శ్రీమహావిష్ణువే (స్త్రీ పురుష) ప్రకృతి పురుషుల కభేదమును నరసింహ × సరస్వతి యను పేరుతో సార్థక మొనర్చి జగద్గురు రూపమున సంచరించుచున్న మిమ్ముల నేత్రానందముగ చూచితిని.

ఇవ్విధమున ఓ నామధారకా మీ పూర్వీకుడైన సాయందేవుడు గురుమూర్తి కన్నడ భాషలో స్తుతించగా గురుమూర్తి మిక్కిలి సంతసించి అతనిని ఓదార్చిరి.తల్లి పిల్లల దగ్గరకు తీయునటుల సాయందేవుని కుటుంబమును తన దగ్గర కూర్చుండచెట్టుకొని వారలయందు నిరుపమాన మగు ప్రేమను కనబరచెను. నామధారకా: ఆ దినమెంత ధన్యమో గదా : గురుమూర్తి వారల క్షేమసమాచార మడుగ సాయం దేవుడు క్షేమము చెప్పి తన ఇద్దరు పుత్రుల వారి పాదముల మీద పడవేసెను. ఇద్దరిలో పెద్దవాడగు నాగనాథుని శిరమున గురుమూర్తి కృపతో తమ దివ్యహస్త ముంచి సాయం దేవునితో ఈ నీ పుత్రుడు పూర్ణాయుష్మంతుడు కాగలడు. మీ వంశము వృద్ధిగాంచును. ఈ నా భక్తుడు లక్ష్మీసంపన్నుడు కాగలడు. ఇక మీద మీరు మ్లేచ్ఛసేవ చేయనవసరము లేదు. నా సేవచేయుచుండుడు. నాయనుగ్రహము వలన మీ వంశమునకు కీర్తిరాగలదు. మీరు సంగమమునకు వెళ్లిస్నానమొనర్చి అశ్వత్థమునకు పూజగావించిరండని జెప్ప సాయందేవు డటులనే యొనిర్చి గురుసమక్షమునకు వచ్చెను. ఆ దినము భాద్రపదశుద్ధ చతుర్దశిగాన భక్తులందరు గురుమూర్తి వద్దకువచ్చి వారినే అనంతస్వరూపముగ భావించి పూజలు చేయుచుండిరి. గురుమూర్తి సాయందేవునితో ఈరోజు అనంతవ్రతము చేయు దినము. భక్తులందరు అనంతుని పూజించుచున్నారు.నీవును ఈ దినమున అనంతవ్రత మాచరించుమని యన సాయందేవు డిట్లనుచున్నాడు.

స్వామీ ! మీరే మాకు అనంతులు. మీ పాదసేవయే మాకు అనంతవ్రతమని యన గురుమూర్తి ఇట్లుఅనుచున్నారు. పూర్వము కౌండిన్యుడను ఋషి ఆదరముతో నీవ్రత మాచరించెను. నీవును కౌండిన్య గోత్రము వాడవు గాన నీ వ్రతమాచరించుము. అన సాయందేవుడు గురుమూర్తితో స్వామీ : ఈ వ్రతము కౌండిన్యుడేవిధమున ఆచరించెనో ఈ వ్రతాచరణము వలన ఫలమేమియో దయయుంచి విస్తరముగ సెలవిండని ప్రార్థింప గురుమూర్తి సాయందేవునితో పై అధ్యాయమున అనంత వ్రతమును చెప్పగలరు.

**ఇట్లు గురుచరిత్రమున నలుబది రెండవ అధ్యాయము సమాప్తము.**

**దిగంబరా దిగంబరా శ్రీపాదవల్లభ దిగంబరా**

**శ్లో బంధముక్త్యతీ – తం పరం సుఖం**
**విందతీహజీ – వస్తుదైవికః**
**శ్రీ ఉపదేశసారము – ఎ "భగవాన్ శ్రీ రమణ మహర్షి"**

తా॥ దైవికుడగు పుణ్యచరితుడు అనగా తన్నుదానెఱిగ పుణ్యాత్ముడు బంధముక్తులు లేని పర సుఖ సిద్ధిని బొందును. పర సుఖ సిద్ధియందు బంధము గాని ముక్తిగాని యుండదు. ఆది ఆత్మసుఖము, సహజము, ఆత్మ ఆద్యంతరహితము, సచ్చిదానంద స్వరూపము, నిత్యము అగుట చేత ఆత్మకు బంధముక్తులు లేవు. దేహమో పంచభూత నిర్మితంబైన జడపదార్థము, అట్టి దానికి బంధముక్తులు కలవనుట యసంగతము. ఇక బంధముక్తులన నేమి యనిన. తన స్వరూప మెఱుంగకుండుటయే బంధము, దానినెఱుంగుటయే ముక్తి. అది సహజమైన పిమ్మట బంధము యొక్క స్మరణపోవును. బంధస్మరణ పోయిన తక్షణమే ముక్తిస్మరణము పోవును. అట్టి స్థితి బంధముక్త్యా తీతమైయుండును.

# శ్రీ గురు చరితము

## నలుబదిమూడవ అధ్యాయము

### ఓమ్ అవధూతచింతనం శ్రీ గురుదేవదత్త జయ ఓమ్

### అనంత వ్రతము

గణాధిపా నమస్కారము, గురుమూర్తి సాయందేవునితో ఇట్లు చెప్పుచున్నారు. పూర్వము నుండియు అనేకమందిచే ఆచరింపబడిన అనంత వ్రతమును చెప్పుచున్నాను, శ్రద్ధతో వినుము. పూర్వము పాండు పుత్రుడైన ధర్మరాజు ఈ వ్రతమాచరించి నష్టమైన రాజ్యమును తిరిగి పొందెను. కాన ఈ వ్రతము సర్వోత్తమ మైనది.

ధర్మరాజు కపటజూదములో కౌరవుల వలన రాజ్యమును గోలుపోయి సోదగులతోడను భార్యయైన ద్రౌపదితోడను సమేతుడై పన్నెండు సంవత్సరములు అరణ్యమున నివసించెను. అంత కష్టముననుభవించుచున్నను కృష్ణుని స్మరణ మానిన వారు కారు. కౌరవులు పాండవుల నరణ్యములకంపియు తృప్తి నొందక దూర్వాసుని వారల పరీక్షించ శిష్యసమేతముగ పాండవుల వద్దకు ఆతిథ్యమునకు పంపిరి. అట్టి సమయమున శ్రీకృష్ణుని సాహాయ్యముచే పాండవులు దూర్వాసుని శాపమునకు గురికాకుండ రక్షింపబడిరి. అరణ్యవాస మొనర్చుచు నానాతీర్థముల పర్యటించుచు, అనేక వ్రతము లాచరించుచు ఎంతయో కష్టమనుభవించుచుండ శ్రీకృష్ణుడు తనభక్తుల కష్టముల గ్రహించి భక్తవత్సలుడు గాన ఒనక దినమున పాండవులున్నచోటికి వచ్చెను. ధర్మరాజు కృష్ణున కెదురేగి పరబ్రహ్మస్వరూపుడైన శ్రీ కృష్ణునకు సాష్టాంగ వందన మాచరించి తన శిరోజములతో కృష్ణుని పాదములను శుభ్రపరచెను. పాద్యము అర్ఘ్యము మొదలగు ఉపచారములతో శ్రీ కృష్ణుని భక్తితో పూజించి తన జన్మ ధన్యమయ్యెనని తలచెను. ఇట్లు స్తుతించెను.

నారాయణ ! హృషీకేశ, భక్తవత్సల, జయ జయ, క్షీరాబ్దివాస పరంజ్యోతిః స్వరూప! నీవు విశ్వమును సృతింతువు. రక్షింతువు. సంహరింతువు. స్థూలమందు సూక్ష్మమందు గూడ నీవు నివసించియున్నావు. ఓ హృషీకేశ ! నీ పాదకమలములకు నమస్కారములు. నీవు దుష్టుల నిగ్రహించి సాధువుల రక్షించగలందులకు అవతరించితివని శృతి స్మృతులు చెప్పుచున్నవి. నీవు భూమికి భారమైనవారిని సంహరింతువని విందుము. అట్లయినచో మేమును ఈ భూమికి భారమైతిమి మమ్ముల నెందుకు సంహరింపవు. నీవు పాండవులు

నా ప్రాణసములని అందువు. అట్లయినచో మమ్ము ఇట్లు అరణ్యావాసములో నెందుకు పడవైచితివి ! నీవే మమ్ముల నుపేక్షించినచో నికమేమింక జీవించి ప్రయోజనమేమి అని ! ఇట్లు దీనుడై స్తుతించెను. భీముడు వచ్చి కృష్ణుని పాదములు పట్టుకొని కృష్ణప్రభో ! భక్తులమైన మమ్ముల నిట్లుపేక్షించుచున్నావేమని యడిగెను. అర్జునుడు వచ్చి కృష్ణుని పాదముల శిరముంచి నమస్కరించి కృష్ణా ! మా యందు నీకు కృపయేయుండిన ఈ వనవాసము ఇంత కష్టము మేమనుభవింతుమా ! పాండవులు నాకు ప్రాణములని నీవు లోకములో సంపాదించిన బిరుదును మా కష్టముల తొలగించి సార్థకము చేసికొనుమనెను. మాద్రీసుతులైన నకుల సహదేవులుకూడ వచ్చి కృష్ణునకు నమస్కరించి రక్షింపుడని ప్రార్థించిరి. ద్రౌపదియు వచ్చి కృష్ణుని పాదములపై బడి నమస్కరించి ప్రభో! నీవు మాకు చక్రరక్షకుడవు. మేము అరణ్యావాసము చేయుచున్నాము. మా బంధువులు రాజ్యము చేయుచున్నారు. నీవు ఛత్రమువలె రక్షకుడవైయుండ మాకింత కష్టమేల. కాన మా కష్టములు తొందరగ పోవు ఉపాయము సెలవిండని ప్రార్థించెను.

అప్పుడు కృష్ణుడు దయగలవాడై ధర్మరాజుతో ఓ పాండుసుత ! ధర్మరాజా ! నీకు ఒక వ్రతము చెప్పెద నాచరించుము. శీఘ్రముననే మీకు రాజ్యము రాగలదు. వ్రతముల లోనికెల్ల అనంతవ్రతము శ్రేష్ఠమైనది. కాన నావ్రతము నాచరించుము.

సర్వత్ర పరిపూర్ణుడైన యుండుటచేత నన్నే అనంతుడందురు. కాన అనంతుని వ్రతము చేయుటయనిన నన్ను పూజించుటయే, నేను కాలస్వరూపుడనై అహోరాత్రములు, పక్షములు, మాసములు, సంవత్సరములు, యుగములు, కల్పములు అన్నిటియందు వ్యాపించియున్నాను. భూత వర్తమాన భవిష్యత్తులయందు వ్యాపించియున్న నారాయణుడను నేనే. అట్టి నేను దుష్టుల సంహరించి భూమిని రక్షించు నిమిత్తము యదుకులమున వాసుదేవుడనై అవతరించితి. ధర్మరాజా! సంశయించకుము. బ్రహ్మావిష్ణు మహేశ్వరులు నా స్వరూపులే. రాసులు గ్రహములు, భువనములు, ద్వాదశరుద్రులు, అష్టవసువులు సప్తసముద్రములు, పర్వతములు. పాతాళాది అధోలోకములు, తృణములు, వృక్షములు, ఆకాశము, దిక్కులు సర్వము వ్యాపించియున్నాను. విశ్వాత్మకుడనైన నాకన్న నిరతమగు వస్తువే లేదు. ఇట్లుండియు నిర్వికారుడను, అవ్యయుడను, అజుడను, అట్టి నేను అనంతుడను గాన నా వ్రతమే అనంతవ్రతము. అట్టి

అనంతవ్రతమును విధివిధానముగ నాచరించుము అని చెప్ప ధర్మరాజు కృష్ణునితో అట్టి అనంతవ్రత మెట్లు చేయవలయునో, ఏ దినమున చేయవలెనో పూర్వ మెవ్వరైన నీవ్రత మాచరించి ఫలము నొందిరా చెప్పుడని ప్రశ్నించ కృష్ణపరమాత్మ ఈ క్రింది విధమున చెప్పుచున్నారు.

ఈ అనంత వ్రతము భాద్రపద శుక్లచతుర్ధశి మధ్యాహ్నమున నాచరించవలెను. శ్రద్ధతో నీవ్రత మాచరించితివేని శీఘ్రముగ రాజ్యప్రాప్తి మీకు కలుగును, పూర్వము ఈ వ్రతము నొక ఋషి యాచరించెను.

పూర్వము వశిష్ఠగోత్రమున సుమంతుడను నొక ధర్మనిష్ఠగల బ్రాహ్మణుడుండెను. అతడు భృగుగోత్రమందుద్భవించిన దీక్షయను భార్యను పెండ్లాడెను. వారికి సుశీలయను నొక పుత్రిక జన్మించెను. కొలది కాలమునకే సుమంతుని భార్య మరణించెను. మాతృహీనయైన సుశీల తండ్రివద్దనే పెరుగుచుండెను. చిన్నతనమైనను ఆ బాలిక గృహశుద్ధి పెరుగుచుండెను. చిన్నతనమైనను ఆ బాలిక గృహశుద్ధి చేయుచు ముగ్గులు పెట్టుచు భగవద్భక్తిగలదై యుండెను. సుమంతుడు భార్యహీనుడై నందున, భార్య లేనివాడు యజ్ఞాదికర్మలచేయు ననర్హుడుగాన, నతడు కర్మనిష్ఠగలవాడు గాన, తిరిగి వివాహహు చేసికొనెను. కానిదైవవశమున నామె కలహశీలము దుశ్శీలము దురాచారము నగుట తటస్థించెను. ఆమె సుశీలయందు ద్వేభావముగలదై భర్తకు గూడ విచారమునే కలిగించుచుండెను.

ఇంతలో సుశీలకు వివాహయోగ్యమగు వయస్సురాగా యుక్తవయస్సున కుమార్తెకు వివాహము చేయుట ధర్మమని తలచి కౌండిన్యుడను నొక ఋషికి ఆమెనిచ్చి వైదిక విధానముగ వివాహము చేసెను. సుమంతుడు పుత్రిక యందలి మమకారముతో కౌండిన్యుని తన యింటియందే ఉంచుకొనెను. సుమంతుని భార్య తన భార్యను ద్వేషించుట కౌండిన్యుడు గమనించి రెండు నెలలు గడచిన తరువాత మామగారితో నేను నా భార్యను తీసికొనివెళ్ళి మరియొకచోట నాశ్రమ మేర్పరచుకొందుననెను.

సుమంతుడు తన భార్య దుష్టురాలైనందులకు తన పుత్రికకు తనకు వియోగమగుచున్నదని తలచి ఇట్లు విచారించెను. హా పరమేశ్వరా! ఈమె నాకు భార్యకాదు. శత్రువు ఇట్టి పాపాత్మురాలివలన నా కుమార్తెతో నాకు వియోగము సంభవించుచున్నది. ఎవ్వనికి శాంత స్వభావము గల భార్య లేదో వానికి గృహము వనముతో సమానము. సంసార సముద్రమున మునిగిపోతిని

ఈ భార్యనాకు కర్మానుష్ఠానమునకు గాని తపస్సునకుగాని యోగ్యురాలు కాకపోయెను. ఏమి చేయుదును అని విలపించుచుండ కౌండిన్యుడు మామగారితో నిట్లనెను.

మీరు విచారపడకుడు. తపస్సుచేయువారు కలసియుండక వేరు వేరుగ నుండుటయే శాస్త్రసమ్మతము. నేను కొలది దూరముననే ఆశ్రమము నేర్పరచుకొందును. అప్పుడప్పుడు మిమ్ముల చూచుటకు రాగలను అని ధైర్యము చెప్ప సుమంతుడు కౌండిన్యునితో పన్నెండరోజులు మాత్రమిచ్చుట నుండి త్రయోదశి సర్వసిద్ధప్రదము గాన నా దినమున మీరు ప్రయాణముచేయుడన కౌండిన్యుడందుల కంగీకరించెను.

త్రయోదశిరోజున కౌండిన్యుడు భార్యతో సహ ప్రయాణము చేయబోవుచుండ సుమంతుడు భార్యతో మన కుమార్తె సుశీల అత్తవారింటికి జనుచున్నది. గాన దారి బత్తెముక్రింద నేమియైన ఆహారపదార్థము నిచ్చి పంపమన నామె కోపముతో నేనేమియు ఇవ్వనని చెప్పి ఇంటిలోనికేగి తలుపులు బిగించుకొని యుండెను. సుమంతుడు అయ్యో !

దైవమా నేనేమి చేయుదునని విలపించుచుండ సుశీల తండ్రితో మీరు విచారపడకుడు. ఏమియు ఈయనవసరములేదు, అని చెప్పెను. కాని సుమంతుడు పాకశాలలోనికి పోయి చూడనక్కడ కొంత గోధుమపిండి కనుబడ అదియొక మూటగట్టి కుమార్తె కిచ్చెను. సుశీలయు కౌండిన్యుడును ఒక శకటము మీద కూర్చొని మామగారి యాజ్ఞను తీసికొని ప్రయాణమైరి. వారు మధ్యాహ్నమున ఒక నదీతీరమునకు చేరిరి.



కౌండిన్యుడు అచ్చట శకటమునాపి నదియందు స్నానమొనర్చి అనుష్ఠానముచేయ ప్రారంభించెను. సుశీల నది యొద్దున కొంతమంది స్త్రీలు దీక్షావస్త్రముల ధరించి భక్తితో వేరువేరుగ కలశస్థాపనము చేసి పూజలు చేయుచుండ చూచి వారల సమీపించి అమ్మలారా ! మీరు ఏమి వ్రత మాచరించుచున్నారు ? అని ప్రశ్నించ వారు సుశీలతో నిట్లనుచున్నారు. మేము సర్వాభీష్టములనొసంగు అనంతవ్రత మాచరించుచున్నాము అని చెప్ప సుశీల ఆవ్రత మెట్లు చేయవలయనో చెప్పుడన వారిట్లను చున్నారు.

భాద్రపదమాసమందు శుద్ధ పక్షములో చతుర్దశితిథి నాడు ఇట్టి అనంతవ్రత మాచరించవలయును. పదునాలుగు ముళ్లుగల ఎఱ్ఱని తోరమును సిద్ధపరచుకొని నదీస్నానమొనర్చి పసుపు కుంకుమ ధరించి రక్త వస్త్రమును కట్టుకొని శుచియై రెండు కలశములనిండ నీరుపోసి పంచపల్లవములను, రత్నములను అందుంచి ఆ కలశముల పూజించి అచ్చట పూర్ణపాత్ర మీద వస్త్రముంచి అందు అష్టదళకములమును గంధముతో వ్రాయవలయును. దర్భతో శేషుని స్థాపించి పూజించవలయును. చతుర్భుజములతో శంఖచక్రములతో కూడిన అనంతుని అందు భావించి ధ్యానించవలెను. ఇట్లు పూజించి నూతన తోరమును కుడిచేతికి మంత్రముతో కట్టుకొని పాత తోరమును తీసివేయవలయును తోరమును ధరించి ప్రస్థగోధుమ అపూపవాయనము దక్షిణతోనూ బ్రాహ్మణునకు దానమొనర్చు ఇష్టజనులతో సహ భుజించవలయును. ఇట్లు పదునాలుగు సంవత్సరము లాచరించి ఉద్యాపన మొనర్చవలెను. ఉద్యాపనమునకు గాను పదునాల్గు కలశములతో మంటపారాధన మొనర్చి ఆ పదునాలుగు కలశములను బ్రాహ్మణులకు దానమొనర్చవలెను. అని సుశీలతో చెప్పి ఈ రోజు చతుర్ధశిగాన నీవును మాతో కలసి వ్రతమాచరింపుమని చెప్పి వారు ఆమెకు ఒక తోరమునుగూడ నిచ్చిరి. అప్పుడు సుశీల ఆ స్త్రీలతో కలసి వ్రతమాచరించి తండ్రిగారు ఇచ్చిన ఆ గోధుమ పిండిన బ్రాహ్మణునకు వాయనమిచ్చి అనంతుని తోరమును చేతికి కట్టుకొని ఆ స్త్రీలకు నమస్కరించి తన భర్త అనుష్ఠానమొనర్చు స్థలమునకు వచ్చెను.

తరువాత భార్యాభర్త లిరువురును శకటము నధిష్ఠించి కొంతదూరము వెళ్ళు సరికి దూరము వారికి అమరావతితో సమమగు ఒక నగరము కనబడెను. ఆ గ్రామస్థులు కౌండిన్యునకు ఎదురు వచ్చి స్వామీ ! మీరు తపోధనులుగనున్నారు. ఈ గ్రామమున నుండుడు అని ప్రార్థించి కౌండిన్యునకు చక్కని గృహమును

ధనమును ఇచ్చి సత్కరించిరి. కౌండిన్యుడు ఆ గ్రామమున మిక్కిలి సుఖముగ కాపురముండ నొకరోజునదైవవశమున తన భార్య చేతికి ధరించిన ఎఱ్ఱని తోరమును చూచి నీవు నన్ను వశముచేసికొనుటకు ఇట్టి ఎఱ్ఱని సూత్రమును కట్టుకొంటివా ? యని యధిక్షేపించెను. అప్పుడు ఆమె వినయముతో అది అనంతుని తోరమనియు, దాని మహిమవలననే తమ కంతటి సంపద లభించెననియు చెప్ప కౌండిన్యుడు కోపముతో మండిపడి అనంతుడెవడని చెప్పుచు ఆ తోరము తెంచి నిప్పులో పడవైచి ఈ ఐశ్వర్యము నా తపోబలమువలన సంప్రాప్తించ నీవు అనంతుడనుచున్నావు. నన్ను వశపరచుకొనుటకే ఈ తోరమును ధరించితివి. ఇదిగోచూడుము తోరమును నిప్పులో పడవేసితిని అని గర్వముతో పలికెను అప్పుడా సుశీల భర్త అట్లు చేయుట చూచి హాహాకార మొనర్చి నిప్పులోపడిన తోరమును తీసి ఆవు పాలలో నుంచెను.

అనంతుని దూషించి తోరమును నిప్పులో వేసిన దోషముచే వెంటనే అందరు శత్రువులైరి. ఐశ్వర్యము నష్టమయ్యెను. గోవులను దొంగలు హరించిరి. గృహమా దగ్ధమయ్యెను. కౌండిన్యునకు దీనత్వము సంప్రాప్తమయ్యెను. అప్పుడు కౌండిన్యుడు తనకు ఆకస్మికముగ వచ్చిన దారిద్ర్యమునకు కారణము అనంతుని దూషించి పాపమేయని గ్రహించి సర్వమును త్యజించి అనంతుని దర్శనమగు పర్యంతము అన్న పానీయములు గూడ తీసికొనని దీక్షపూని హాఅనంత అనంతయని అనంతుని వెదకుచు అరణ్యమార్గమున పోవుచుండ నచట పుష్పించిన ఫలించిన ఒక మామిడిచెట్టును చూచెను. ఆ వృక్షమున ఫలములున్నను ఒక పక్షిగాని, కీటముగాని ఆ ఫలముల ముట్టకుండుట చూచి ఆశ్చర్యపడి ఆ వృక్షముతో నీకు అనంతుడు తెలియునా ? చూచితివా ? యని యడుగ నా వృక్షము నాకు అనంతుడు తెలియదు. నీకు అనంతుడు కనబడుచో వారితో నాస్థితిని విన్నవించుడనెను. తిరిగి కౌండిన్యుడు కొంత దూరము పోగా అతనికొక ఆవు దూడతో సహా నిండు గడ్డితో గూడిన పొలములో నుండుట చూచెను. ఆ గోవుగడ్డిలోనున్నను గడ్డిని మాత్రము తినక కృశించుట చూచి ఆశ్చర్యపోయి నీకు అనంతుడు తెలియునా యనియడుగ ఆ గోవు నాకు తెలియదు. నీవు అనంతుని చూచినచో నా స్థితిని గూర్చి వారితో మనవి చేయుడనెను.

తిరిగి కౌండిన్యుడు పోవుచు ఒక ఎద్దును చూచి దానిని గూడ అనంతుడు తెలియునా యని యడగ నదియు వెనుకటి వాటివలెనె తనకు తెలియదనెను,

తిరిగి పోవుచు కౌండిన్యుడు రెండు సరస్సులు చూచెను. ఆ సరస్సులు రెండును నీటి తోడను కమలముల తోడను శోభిల్లుచు ఒక దానితో నొకటి కలసి యుండెను. కాని ఆ సరస్సు వద్ద నొక్క పక్షియు లేకుండుట చూచి వాటితో మీకు అనంతుడు తెలియునా యని యన మాకు తెలియదనెను తిరిగి పోవుచు కౌండిన్యుడు ఒక గాడిదను ఉనుగును గూడ చూచి అనంతుని గూర్చి ప్రశ్నించెన. అవి గూడ వెనుకటి వాటివలెనె మాకు అనంతుడు తెలియదనిరి. అప్పుడు కౌండిన్యుడు అనంతుని దర్శనము కానందున హాహాకార మొనర్చుచు ప్రాణ త్యాగ మొనర్చ సమకట్టి అట్లేక్రింద పడి మూర్ఛనొందెను. అదే సమయమున భక్తవత్సలుడైన అనంతుడే వృద్ధ బ్రాహ్మణ వేషమున అచ్చటకు వచ్చి ఓ బ్రాహ్మణుడా లెమ్ము ! అనంతా ! అనంతా ! అని అరచుచున్నావు. లెమ్ము ! అనంతుని చూపెదనని అతని చెయ్యి పట్టుకొని అరణ్యములో కొంతదూరము పోగా అచ్చట నొక గొప్ప నగరముకనబడెను. అందొక భవనములోనికి బ్రాహ్మణుని తీసికొనిపోయి అచట నున్న రత్నసింహాసనమున ఆవృద్ధ బ్రాహ్మణుడు కూర్చొని అనంతరూపముతో దర్శనమిచ్చెను. కౌండిన్యుడు భగవంతుడి అద్భుత రూపమును పొడగాంచి పాదములమీద పడి! బద్ధాంజలియై వినయముతో నిటుల స్తోత్రమొనర్చెను.

సచ్చిదానంతస్వరూపా! గోవిందా ! శ్రీవత్సాంకిత నీకు నమస్కారము. మీ దర్శనమాత్రముచే నా పాపము దుఃఖము నశించెను. మీరు త్రిమూర్త్యాత్మకులు, మిమ్ము శరణుపొందుచున్నాను. నారాయణా ! శ్రీనివాస ! జగద్వ్యాపక ! వైకుంఠవాస ! నిన్ను శరణుపొందుచున్నాను. అనంత బ్రహ్మాండనాయక ! పాపిని. భక్తిరహితుడనగు నా యపరాధము క్షమించి రక్షించుడు. మీరు శరణాగతరక్షకులు. మీరేగతి మిమ్మేనమ్మితిని. మీరే శరణు రక్షింపుడు అని భక్తితో ప్రార్థించ భక్తులకు చింతామణియగు అనంతుడు ప్రసన్నుడై కౌండిన్యునకు దారిద్ర్య నాశనము, ధర్మసమృద్ధి, వాశ్వత వైకుంఠము అను మూడు వరముల నొసంగెను. అప్పుడు కౌండిన్యుడు అనంతునితో ప్రభో ! మిమ్ము వెదకుచు వచ్చుచుండ ఒక మామిడిచెట్టు. ఒక ఆవు, ఒక ఎద్దు, రెండు కొలనులు గాడిద, ఏనుగు వీటిని చూచితిని. మిమ్ముగూర్చి యడుగ నవి మాకు తెలియదని చెప్పెను. అవియేమిటో దయతో చెప్పుడు...అనంతుడు కనబడలేదని ప్రాణత్యాగము చేసికొన పోవ ఒక వృద్ధ బ్రాహ్మణుడు కనబడి నన్ను ఇచ్చటకు గొనివచ్చెను. మూఢుడా ! ఏమియు తెలియనివాడను. కాన దయయుంచి

వారెవరో సెలవిండని ప్రార్థింప అనంతుడు కౌండిన్యునితో నిటుల చెప్పుచున్నాడు.

కౌండిన్య ! వినుము. ఒక బ్రాహ్మణుడు వేదశాస్త్రములు పూర్తిగ చదివియు విద్యాభిమానముతో నెవ్వరికి చెప్పకుండెను. ఆ పాపముచే నతడు మరణించి మామిడి వృక్షమై జన్మించెను. పూర్వము విద్యాదానము చేయని పాపమున ఆ వృక్షముయొక్క ఫలముల నెవ్వరును ముట్టుట లేదు. ఫలించని భూమిని దానముచేసిన పాపముచే నొకడు గోవుజన్మ నొందియు గడ్డితినలేక బాధపడుచున్నాడు. ధనికుడై యుండియు దాన ధర్మములు చేయని పాపముచే నొకడు ఎద్దైబాధపడుచున్నాడు. ఇద్దరు అక్కచెల్లెండ్రు పరస్పరము వారిలో వారే దానము చేసుకొనుటచే జంట కొలనులై జన్మించిరి. ఆ పాపమువలన నా ఉదకముగాని అందలి పుష్పములుగాని ఎవరికిని ఉపయోగపడకున్నవి. ఒకడు గొప్ప క్రోధముగలవాడై ఖరమై జన్మించెను. ఒకడు మదముతో గర్వించి నందున ఏనుగయి జననమందెను. నీకు గలిగిన పశ్చాత్తాపమునకు సంతసించి నేనే వృద్ధబ్రాహ్మణుడనై నీకు దర్శనిమిచ్చితిని. నీవు చూచిన వాటికన్నిటికి నీ యందలి దయతో నేను ముక్తి నొసంగితిని. ఓ కౌండిన్య నీవు ఈ శరీరాంతమున పునర్వసు నక్షత్రమందు నివసింతువుగాక.

ఓ ధర్మరాజా ! ఈ విధమున కౌండిన్యుడు అనంతుని వలన వరమొంది ఇహలోకమున నఖండసౌఖ్యమునంది వ్రత ప్రభావమువలన శాశ్వత స్వర్గమునందెను. కాన నీవును ఈ వ్రత మాచరించుము.నీ కష్టములు పోయి తొందరగ రాజ్య ప్రాప్తినొందగలవని కృష్ణుడుచెప్ప ధర్మరాజు తన సోదరులతో కలసి ఈ అనంతవ్రత మాచరించి వ్రతప్రభావము వలన శత్రువుల సంహరించి నష్టమైన రాజ్యముపొందెను. అట్లెందరో మహర్షులు ఈ అనంతవ్రత మాచరించి ధన్యులైరి. ఎవ్వరు ఈ వ్రత మాచరింతురో వారు తప్పక చతుర్విధ పురుషార్థములు నొందెదరు. కాన ఓసాయందేవా ! ఈ దినము చతుర్ధశిగాన కౌండిన్యునిచే నాచరింపబడిన వ్రమతును నీవు నీకుమారుడైన నాగనాథునితో గూడ నాచరింపుము. నీవు కౌండిన్యగోత్రమున జన్మించితిని గాన ఈ వ్రతమును నీవు తప్పక ఆచరింపుమని గురుమూర్తి చెప్పిరి.

అప్పుడు గురుమూర్తి ఆజ్ఞప్రకారము సాయందేవుడు ఆ దినమున గురుమూర్తిని అనంతుని పూజించి బ్రాహ్మణ సమారాధన గావించెను. గురుమూర్తి ఆజ్ఞబడసి తన కుటుంబమును గ్రామమున దిగవిడిచి

శ్రీగురుమూర్తిని సేవించుచు వారివద్దనే నివసించుచుండెను. ఓ నామధారకా ! మీ పూర్వీకుడైన సాయందేవుని విషయమున శ్రీగురుమూర్తి ప్రసన్నుడైన వృత్తాంతమును చెప్పితిని. అట్టి భక్తునివంశమున జన్మించినందున నీవును కడు ధన్యుడవని సిద్ధముని నామధారకునితో చెప్పెను.

**ఇట్లు గురుచరిత్రమందు నలుబడి మూడవ అధ్యాయము సమాప్తము.**

దిగంబరా దిగంబరా శ్రీపాదవల్లభ దిగంబరా

**శ్లో॥ కౌండిన్య ధర్మవిదితం అనన్తవ్రతమాహయః**
**కారయామాస తద్యోపి శ్రీదత్తశ్శరణం మమ॥**
**అనంతవ్రత మహాత్మ్యము**

**శ్లో॥ సత్సంగత్వే నిస్సంగత్వం**
**నిస్సంగత్వే నిర్మోహత్వం ।**
**నిర్మోహత్వే నిశ్చల తత్త్వం ।**
**నిశ్చలతత్త్వే జీవన్ముక్తి ఔ ॥**

**– శ్రీ ఆది శంకర భగవత్పాదాచార్యులు**

**"శ్రీ మద్భజగోవింద ద్వాదశ మంజరికా స్తోత్రం"**

తా॥ సత్పురుషుల సహవాసము వలన నిస్సంగమును, దాని వలన మోహము తొలగుటయు, మమత, మోహము తొలగగానే నిరూఢమైన బోధయు, అట్టి నిరూఢ బోధచే జీవన్ముక్తావస్థయ చేకూరును. అట్టి జీవన్ముక్తావస్థకు ప్రథమ సోపానము సత్సంగతి. కావున సత్సంగము తప్పక చేయుచుండవలయునని భావము.

# శ్రీ గురు చరితము

## నలుబదినాలుగవ అధ్యాయము

### ఓమ్ అవధూతచింతనం శ్రీ గురుదేవదత్త జయ ఓమ్

#### గణాధిపః నమస్కారము

నామధారకుడు సిద్ధమునితో ఆపైన నేమిజరిగెనో చెప్పుడని ప్రార్థించెను. అప్పుడు సిద్ధముని ఇట్లు చెప్పుచున్నాడు.

**నామధారకా :** వినుము. గణగాపురమున తంతుకుడను నొక సాలెవాడు కలడు. వాడు స్వామివారియందు భక్తి గల వాడగుటచే నిత్యము తన గృహకృత్యముల తీర్చుకొని స్వామి వారి మఠమునకు వచ్చి దూరము నుండి నమస్కరించి, స్వామి వారి మఠమును ఊడ్చుచు నీళ్ళు చల్లుచు స్వామి వారి సేవ నతి భక్తితో చేయుచుండెను. ఇట్లు కొంతకాలము జరుగ శివరాత్రి పర్వకాలము సమీపించెను.

అతని బంధువులందరు శ్రీశైలయాత్రకు పోవుచు అతనిని కూడ రమ్మనిరి. అప్పుడా సాలెవాడు వారలతో మీరు వ్యర్థముగ నంతదూరము పోవుచున్నారు. శ్రీశైల మల్లికార్జునుడు గురురూపమున మనవద్దనేయుండ మీరు మూర్ఖులై తెలిసికొనలేక పోవుచున్నారు. నేను మాత్రము రాజాలను. నాకు గురుమూర్తియే శ్రీశైల మల్లికార్జునుడు. వారి నివాసస్థానమే నాకు శ్రీశైలమని చెప్ప నతనిని మూర్ఖునిగా భావించి అతని బంధువులందరు శ్రీశైలయాత్రకు వెడలిరి. ఆ సాలె భక్తుడు నిత్యము వలె సంగమమున కేగి గురుమూర్తికి నమస్కరింప గురుమూర్తి అతనితో ఏమిరా : నీ బంధువులందరు శ్రీశైలమున కేగిరి గదా : నీ వెందులకు పోలేదని యడుగ వాడు స్వామీ : మీ పాదములయందే సర్వతీర్థములు కలవు. మూర్ఖులు గాన వారు మీ మాహాత్మ్యమును గ్రహింపజాలక అంతదూరము పాషాణమును దర్శించబోయిరి. అని చెప్పి నమస్కరించి ఇంటికి పోయెను. కొన్ని రోజులకు మాఘబహుళ చతుర్దశి శివరాత్రి పుణ్యకాలము వచ్చెను. ఆనాడు ఆసాలెభక్తుడు శివరాత్రి ఉపవాసమునకు సంకల్పమొనర్చి నిత్యమువలె బద్ధాంజాలియై గురుమూర్తికి నమస్కరించి కూర్చుండెను. అప్పుడు గురుమూర్తి అతనితో ఓరీ! నీకు శ్రీశైలయాత్ర ఘటించలేదుగదా ! నీ బంధువులందరు యాత్రవెళ్ళిరి. నీవెప్పుడయిన శ్రీశైలము చూచితివా! యని యడుగుగ వాడిట్లనుచున్నాడు.

స్వామీ ! మీ పాదములు తప్ప నింకేమియు నాకు తెలియదన నతని భక్తికి సంతసించి ఓరీ! నీకు నేడు శ్రీశైలము చూపెద. నీవు నేత్రములు మూసికొని చేతులతో నా పాదుకల గట్టిగ పట్టుకొనుము అని నతడట్లొనర్చెను. గురుమూర్తి క్షణములో నతనిని శ్రీశైలమందలి పాతాళ గంగ సమీపమునకు చేర్చి ఓరీ నేత్రముల తెరువుమనిరి. వాడు నేత్రములు తెరచి చూడ శ్రీశైలము అతనికగుపడెను. ఇద్విస్వప్నమో యేమి యని వాడాశ్చర్యపడుచుండ ఓరీ పిచ్చివాడవై అటుల చూచుచుంటివేమి ? నిన్ను శ్రీశైలమునకు తెచ్చితిని. నేనిక్కడ నుండెదనీవు క్షౌరకర్మ చేసికొనిస్నానమొనర్చి శ్రీశైల మల్లికార్జునుని పూజించి రమ్మని చెప్పిరి. వాడు అచ్చట తన గ్రామస్థులను చూచెను. వారును అతనితో ఓరీ మాతో రమ్మన రాకపోయితివి. ఎట్లు వచ్చితివని ప్రశ్నింపవాడు ఈ దినమున మధ్యాహ్నముబయలుదేరి గురుమూర్తితో సహా నొక ఘడియలో వచ్చితినన కొందరు అతను అబద్ధమాడుచున్నాడనియు, తమ వెంటనే కనబడకుండ చాటుగ వచ్చియుండెననియు భావించిరి.

తంతుకుడు క్షౌరము గావించుకొని స్నానమొనర్చి గంధపుష్పాది పూజాసామాగ్రుల గొని శ్రీశైలమల్లికార్జునుని దర్శనార్థము దేవాలయమున ప్రవేశించ నటచ నతనికి లింగమునకు బదులు గురుమూర్తియే గోచరించెను. అందరును గురుమూర్తినే పూజించుచున్నటుల గాంచి తన గురువు సాక్షాత్తు శంకరుడని దృఢపరచుకొనెను. అచ్చట పూజ గావించుకొని ప్రసాదము తీసికొని గురుమూర్తి సమక్షమునకు వచ్చి నమస్కరించ గురుమూర్తి అతనితో ఏమిరా! యాత్ర చేసికొంటివా ? ఇంక కొంతకాలం మిచ్చట నుందువా ! లేక వచ్చెదవాయని యడుగ వాడు గురుమూర్తితో నిటులను చున్నాడు.



స్వామీ ! నేను చూచిన చిత్రమును చెప్పుచున్నాను. నేను దేవాలయములోనికి పోగా అచ్చట మిమ్ములనే అందరు పూజించుచుండునటుల గాంచితిని. లింగము నాకు గోచరమే కాలేదు. సమీపముననున్న మిమ్ము గుర్తించలేక మూఢులు ఇంతదూరము ఎందులకు వచ్చుచున్నారో బోధపడుట లేదనియన గురుమూర్తి అతనితో ఓరీ! ఈశ్వరుడు అంతట నొకడే కలడు. కాని స్థలవిశేషమునుబట్టి మాహాత్మ్యముగూడ నుండును. అని చెప్పవాడు స్వామీ! మీరు పరిపూర్ణ బ్రహ్మస్వరూపులు. ఈ క్షేత్రముయొక్క స్థానమహాత్మ్యమును నాకు విస్తరించి చెప్పుడని ప్రార్థించ గురుమూర్తి నవ్వుచు ఓరీ స్కాంద పురాణమున నీ క్షేత్రమహిమ విస్తరించి చెప్పబడెను. ఆ విషయమే మీకు సంక్షేపముగ చెప్పుచున్నాను. శ్రద్ధతో వినుమని ఇట్లు చెప్పుచున్నాడు.

మాఘ మాసమున శివరాత్రి దినమున శ్రీశైలమున గొప్ప మహోత్సవము జరుగును. ఈ క్షేత్రమాహాత్మ్యము అపారము. నీకు తెలియగలందులకు ఒక పురాతన ఇతిహాసనుము చెప్పెద వినుము. పూర్వము కిరాత దేశములను విమర్షణుడను పేరుగల రాజొకడు పరిపాలించుచుండెను. అతడు బుద్ధిమంతుడు. బలాఢ్యుడు, నీతి శాస్త్ర నిపుణుడయి యుుండియు పరస్త్రీలంపటుడై గ్రాహ్యాగ్రాహ్య భక్ష్యాభక్ష్య విచారణలేక దురాచారుడై యుండెను. అట్లుండియు నిత్యము నీశ్వరుని భక్తితో పూజించుచుండును. శివరాత్రి మహోత్సవము గీతవాద్యములతో నీశ్వరప్రీతిగ గొప్ప వైభవముతో జరుపుచుండును. అతనికి కుముద్వతియను పతివ్రతారత్నము భార్యగాగలదు. ఆమె నా భర్త దురాచారుడయ్యు శివుని కడుబక్తితో పూజించుచుండును ఇందుల కేమికారణమో యని తలచి యొక దినమున నేకాంతముగా తన భర్తను మీపించి ప్రాణనాథా ! నేనొక ప్రశ్న చేయుచున్నాను. మీరన్యధా తలంచక నాకు తగు సమాధానము చెప్ప వేడెదను. మీరు దురాచారముగ నుందురు. పరస్త్రీవ్యసనము గల వారు. సర్వభక్షకులుగా నుందురు. ఇట్లుండిన మీకు శివుని యందు అంత భక్తికలుగుటకు కారణమేమియో గోచరించుట లేదు. ఈ విషయమును మీవలన వినగోరితినని ప్రశ్నింప ఆ రాజు సంసించి ప్రియులారా మంచి ప్రశ్న వేసితివి, నాకు పూర్వజన్మజ్ఞానము గలదు. కాన పూర్వజన్మ వృత్తాంతము చెప్పెద వినుము.

పూర్వము నేనొక గొల్లవాని యింటకుక్కనై జన్మించితిని అట్లుండ నొకవాడు శివరాత్రి సంప్రాప్తమయ్యెను. ఆ గ్రామబాహ్యమున నొక శివాలయము గలదు.

జనులందరు శివుని పూజించుట కచ్చట గుమికూడిరి. నేనును ఆకలిగొని అచట నేమైనా భోజ్యపదార్థము లభించు నేమోయనునాశతో శివాలయము సమీపించితిని. జనులు గీతవాద్యములతో ప్రదక్షిణములు, అభిషేకములు కడునుత్సాహముతో చేయుచుండిరి. నేనును వినోదముగా ఆ శివాలయము ప్రవేశించితిని, నన్ను చూచి అచ్చటి వారందరు కుక్క దేవాలయములోనికి వచ్చెను. కొట్టుడు కొట్టుడు అని అరచిరి. కొంతమంది నన్ను చంపుటకు ఉద్యుక్తులైరి. నేను ఎటుపోవుటకు దారిగానక ఆ శివాలయము చుట్టూ మూడు పర్యాయములు పరుగెత్తితిని. భయముతో (గర్భగుడి) ఆలయము ప్రవేశించి అచ్చట శివుని దర్శించితిని. జనులు ద్వారము బిగించి నన్ను శస్త్రములో చంపి బయట పారవేసిరి. శివరాత్రి దినమున తెలియక శివునకు ప్రదక్షిణమొనర్చి శివుని దర్శించిన పుణ్య విశేషముచే నీజన్మమున రాజునై జన్మించితిని.

శివరాత్రి దినమున ఆహారము లభింపనిచే నుపవాసము ఘటించెను. శివుని దర్శనమయ్యెను. అచట వెలిగించబడిన దీపములగూడ చూచితిని. శివుని చూచుచు ప్రాణముల విడిచితిని. ఇట్టి పుణ్యసముదాయము దైవ వశమున కుక్కనై యుండ లభించిన విశేషముచే నీ జన్మమున నింతటి వైభవము గలవాడనైయుంటిని. ఇక నా దురాచారమునకు కారణము చెప్పెద వినుము. పూర్వము కుక్కనైయుంటిని గాన నాజాతికి భక్ష్యాభక్ష్య వచిరాము లేకపోవుట, స్త్రీలంపటత్వము సహజముగా నుండును గాన పూర్వప్రకృతి ఈ జన్మయందును నన్ను వదలకయున్నది. అని రాజు చెప్పగా రాణి విని నాథా ! మీరు మీ పూర్వజన్మమున గూర్చి జెప్పితిరి. మీరు సర్వజ్ఞులు నా పూర్వజన్మవృత్తాంతము తమకు తెలిసిన సెలవిండని ప్రార్థింప నారాజు తన భార్యతో నిట్లనుచున్నాడు.

నీవు పూర్వజన్మమున నొక అరణ్యమున ఆడపావురముగా నుంటివి. ఒక దినమున ఆహారము కొరకు తిరుగుచు నొక మాంసశకలమును నోట కరచుకొని ఆకాశమార్గమున నీవు వచ్చుచుండ నొక గ్రద్ధ నిన్ను వెంబడించెను. నీవు ప్రాణభయముతో నెరిగి ఎగిరి దైవవశమున శ్రీశైలశిఖరమును సమీపించి గ్రద్ధ చంపునను భయముతో నా శిఖరము చుట్టు మూడు పర్యాయములు తిరిగి శిఖరముపై కూర్చొని యుండ గ్రద్ధవచ్చి నిన్ను సంహరించెను. ఆ దినము శివరాత్రి పర్వకాలమయ్యెను. శివరాత్రియందు మల్లికార్జునకు మూడు ప్రదక్షిణములు చేసి దేవాలయ సమీపమున ప్రాణత్యాగము ఘటించిన పుణ్య విశేషముచే నీజన్మమున నాకు భార్యవై యుంతటి వైభవము

ననుభవించుచున్నావు. అని చెప్ప ఆమె తిరిగి ప్రాణనాథా ! ఇప్పుడు ఈ జన్మమున మనము శివుని ఆరాధించుచుంటిమిగదా ఇక రాబోవు జన్మమున జరుగబోవునది మీ వలన వినగోరుచున్నానన, రాజు ఇట్లు చెప్పుచున్నాడు.

రాబోవు జన్మమున నేను సింధుదేశపు రాజు నైజన్మించగలను నీవు శృంజయదేశ రాజుకు పుత్రికవై నన్ను వరించగలవు. మూడవ జన్మమున సౌరాష్ట్రదేశమున కధిపతినై నేను జన్మించెదను. నీవు కళింగదేశపురాజుకు కుమార్తె వైనన్ను వరించెదవు. నాలగ్వ జన్మమున నేను గాంధారదేశాధి పతిని కాగా నీవు మగధరరాజు కూతురువైనన్ను చేపట్టగలవు. అయిదవ జన్మమున అవంతిదేశాధిపతినగు నన్ను దశార్ణ దేశాధిపతికి పుత్రివగు నీవు వరింపగలవు. ఆరవజన్మ అనంతుడను రాజుగ పుట్టెదను. నీవు యయాతివంశమున జన్మించి నన్ను చేపట్టెదవు ఏడవజన్మమున పాండ్యదేశ రాజునై నేను జన్మించెదను. పద్మవర్ణుడని నాపేరుండును. నీవు వైదర్భకులమున సుమతియను పేరుతో పుట్టి స్వయం వరమున దమయంతిని నలుని వరించినటుల నన్ను వరింతువు. మన మాజన్మమున యజ్ఞముల నాచరింతుము ధర్మపరాయణులమై దైవద్విజాతుల నారాధించి వృద్ధాప్యము రాగా కుమారునకు రాజ్యమిచ్చి అగస్త్యునివలన బ్రహ్మజ్ఞానోపదేశము పొంది ఆత్మ సాక్షాత్కారముగలవాడనై దేహావసాన కాలము రాగా పునరావృత్తిరహితమగు ముక్తి పొందగలను. ఇది మన భవిష్యద్వృత్తాంతమని రాజు భార్యతో చెప్పి భార్యాభర్తలిరువురు శ్రీశైలయాత్రకు వెడలిరి. కావున నోతంతుకా ! క్షేత్రమహాత్మ్యము వింటగివా. క్షేత్ర ప్రభావమువలన సామాన్యమైన నొక మానవుడు ఏడు జన్మల చక్రవర్తియై జన్మించెను. నీవు ఈశ్వరునారాధించుము. మన గంధర్వనగరమున కల్లేశ్వరుడు గలడు.

మల్లికార్జుననకు కల్లేశ్వరునకు భేద మింతైనను లేదు సంగమమున సంగమేశ్వరుడు కలడు. సంగమమునకు వెళ్ళి అచ్చటనున్న కల్లేశ్వరుడను పేరుగల సంగమేశ్వరుని అహర్నిశముల పూజించి ధన్యుడవుగమ్ము అని చెప్ప నా సాలెభక్తుడు గురుమూర్తితో మీరు సంగమేశ్వరుని పూజించుము, కల్లేశ్వరుని పూజించుము అని చెప్పుచున్నారు. నేను మల్లికార్జున స్వామి పూజ చేయబోగనచ్చట మిమ్ములనే గాంచితిని. మీరు సర్వవ్యాపకులు. మీకన్న సంగమేశ్వరుడు వేరుగ గలడా ! అనియన స్వామివారు నవ్వుచు ఓరీ పాదుకల గట్టిగా పట్టుకొని కన్నులు మూసికొనుమనిరి. క్షణకాలమున భక్తునితో సమేతముగా గురుమూర్తి సంగమము చేరిరి.

గణగాపురమున గ్రామస్థులందరు శివరాత్రిగాన స్వామి వారిని దర్శించుటకుగాను సంగమమునకు వచ్చిరి. స్వామివారు అచ్చట లేనందున వారు విభ్రాంతి నొందిరి. గురుమూర్తి సంగమము ప్రవేశించి తంతుకుని శిష్యులకు తమ రాక తెలుపుమని గ్రామమునకు పంపిరి. వాడు గ్రామ ప్రవేశ మొనర్చి అచ్చటి వారితో స్వామివారు సంగమమున నున్నారు రండనెను. గ్రామస్థులు తంతుకుని చూచి ఓరీ నీ వెక్కడికే తెంచితవి ? క్షౌర మెచ్చట చేయించుకొంటివి ; అని ప్రశ్నింపవారలతో గురుమూర్తితో కలసి నేను శ్రీశైలమునకు పోయి వచ్చితిని. ఇదిగో దేవుని ప్రసాదము విభూతి, చూడుడు అని చెప్ప నచటివారు రెండు జాముల పర్యంత మిక్కడనేయింటిరి గదా ? శ్రీశైలమునకు వెళ్ళుటెట్లు ? అనిశంకింప గురుమూర్తి నన్ను వాయువేగమున క్షణకాలమున తీసికొని వెళ్ళెనని అతడు చెప్పెను. అప్పుడు వారు సంతోషముతో మహోత్సవముతో సంగమము సమీపించి అచ్చట నున్న గురునాథుని భక్తితో పూజించిరి. సిద్ధముని నామధారకునితో నిట్లనుచున్నారు.

గురునాథుని ప్రభావము తెలిసి కొనక విశ్వసించనివారు మహాపాతకము నొందెదరు. ఇట్లు పరదునైదు దినములు జరుగగా శ్రీశైలయాత్రకు వెడలిన గ్రామస్థులందరు తిరిగి వచ్చిరి. వారి వలన తంతుకుడు శివరాత్రి దినమున శ్రీశైలమునకు వచ్చిన సంగతి నిర్ధారితమయ్యెను. అందరును గురుమూర్తి మానవమాత్రుడు కాడనియు, ఈశ్వరావతారమనియు తెలిసి కొని ఆనంద భరితులయిరి. ఇట్టి గురు మహిమను అమృతము వలె నెవరు గ్రోలెదరో వారు గురుమూర్తి యొక్క కృపకుపాత్రులు కాగలరని సిద్ధముని నామధారకునితో చెప్పెను.

**ఇట్లు గురుచరిత్రమందు నలుబది నాలుగవ అధ్యాయము సమాప్తము**

దిగంబరా దిగంబరా శ్రీపాదవల్లభదిగంబరా

**శ్లో॥ శ్రీశైలం తంతుకాయా సోయోగగత్యావ్యదర్శయత్ ।**
**శివరాత్రివ్రతాహేష శ్రీదత్తశ్శరణం మమ॥**

భా॥ ఒక సాలె భక్తుని స్వామివారు క్షణకాలములో శ్రీశైలమునకు తీసికొనిపోవుట.

# శ్రీ గురు చరితము

## నలుబదిఅయిదవ అధ్యాయము

### ఓమ్ అవధూతచింతనం శ్రీ గురుదేవదత్త జయ ఓమ్

### శ్రీ గణేశాయనమః శ్రీ దత్త

సిద్ధముని నామధారకునితో నామధారకా ! నీ భాగ్యమేమని చెప్పుదును. నీకు గురుచరిత్ర శ్రద్ధతోవిన ఆసక్తి కలుగుచున్నది. అన నామధారకుడు సిద్ధమునితో మీరు పరబ్రహ్మస్వరూపులైన శ్రీ గురుమూర్తి లీలల స్వయముగ చూచితిరి. మీ భాగ్యమే భాగ్యము. మీ వలన గురుచరిత్ర వినుటచే నా కష్టములన్నియు నశించి నా అభీష్టము సిద్ధించెను. గురుమూర్తి యొక్క పై చరిత్రను గూడ నాకు వినిపించి నన్ను ధన్యునిగా నొనర్చుదని ప్రార్థింప సిద్ధముని ఇట్లనుచున్నాడు. ఓ వత్స నామధారకా ! వినుము.

నందియను పేరుగల ఒక బ్రాహ్మణుడు కలడు. అతడు శ్వేతకుష్ఠరోగముచే పీడింపబడి తులజాపురమునకు వెళ్ళి రోగ నివృత్తి కొరకు పరమేశ్వరిని ఆరాధించ నామె చందంలా పరమేశ్వరిని సేవింపమన నతడు చందలా పరమేశ్వరీ క్షేత్రమునకు వెళ్ళి ఏడునెలలు తపమొనర్చ నా దేవి నీవు గణగాపురమునకు పొమ్ము అచ్చట త్రిమూర్త్యవతారమైన జగద్గురువు నరరూపమునగలడు. అచ్చట నీ రోగము నివర్తించగలదని స్వప్నములో చెప్పెను. అప్పుడతడు నీకు నా రోగము పోగొట్ట శక్తిలేనిచో మొదటనే ఎందులకు చెప్పవైతివి. నీవు గొప్ప దేవతవని తులజాపరమేశ్వరి చెప్పగా వచ్చితి. ఏడు నెలలు కష్టపడి ఉపవాసము లొనర్చితిని. ఇప్పుడునీవు మనుష్య మాత్రుని యొద్దకు పొమ్మనుచున్నావు. అట్లనుటకు నీకు సిగ్గయినలేదా ?నీవు నారోగనివృత్తి చేసిన చేయుము. నా ప్రాణమైన నిచ్చట నర్పింతునుగాని మరియొక చోటికి మాత్రము పోనని దేవితో చెప్పి మొండిపట్టుపట్టి అచ్చటనే దీక్షపూని యుండ మరునాడుగూడ అట్టి స్వప్నమే అతనికి వచ్చెను.

ఇంతియగాక అచ్చటి పూజారులకు స్వప్నములో దేవియగుపడి ఆ బ్రాహ్మణుని అచ్చట నుండి తరిమి వేయమని యాజ్ఞాపింప వారు ఆ నందియను బ్రాహ్మణునిసమీపించి నీవు దేవి యాజ్ఞప్రకారము ఇచ్చటనుండి వెడలిపొమ్ము. లేనిచో నిన్ను ఆలయములోనికి రానివ్వమనిరి. అప్పుడు వాడు చేయునది లేక అంతటితో తన దీక్షను వదిలి పారాణ మొనర్చి బయలుదేరి

గణగాపురము వచ్చి మఠమున గురుమూర్తి గలరా ? అని ప్రశ్నింప స్వామివారి పరిచారకులు గురుమూర్తి సంగమమున గలరు. నిన్న శివరాత్రి గాన సంగమమునకు వెళ్ళిరి. అచ్చటనే యున్నారు. మధ్యాహ్నమునకు పారణకు ఇచ్చుటకు రాగలరని చెప్పిరి. మధ్యాహ్నకాలమునకు గురుమూర్తి సంగమమునుండి మఠమునకు వచ్చిరి. నందియును గురుమూర్తిని దర్శింపపోగా శిష్యులు దూరముగ నుండుమని నిషేధించి గురుమూర్తి వద్దకు వెళ్ళి వారితో స్వామి; మీదర్శనార్థమొక బ్రాహ్మణుడు వచ్చి బయట నిలువబడియున్నాడు. అతని శరీరమంతయు కుష్ఠురోగముతో వ్యాప్తమైయున్నదనిరి. అప్పుడు గురుమూర్తి వారితో నాకు తెలియును. వాడు సంశయాక్రాంతమైన మనస్సుతో వచ్చెను. అయినను వానిని ఇచ్చటకు పిలుచుకొనిరండెనెను. వెంటనే శిష్యులు వేగముగా నా బ్రాహ్మణుని గురుసమక్షమునకు తీసికొనిరాగా నా బ్రాహ్మణుడు దూరమునుండియే నేల మీదపడి నమస్కరించెను. అప్పుడు గురుమూర్తి వానితో ఓయీసందేహము పెట్టుకొని నీ వెందల కిచటకు వచ్చితివి. దేనివలన కాసివని మానవులవలన యగునా ? సంశయాత్మునకు కార్యసిద్ధి ఎటుల కాగలదు, అనిరి.

స్వామివారి వాక్యములు విని తన మనోభావమును స్వామివారు గ్రహించుటచే వారియందు మనుష్యమాత్రులు కారను భావమేర్పడి ఇట్లనుచున్నాడు. స్వామీ; క్షమించుడు, నేను తమోంధుడనైతిని. అజ్ఞానాంధకారములోపడి పరబ్రహ్మస్వరూపులగు మిమ్ములల గుర్తించలేకపోతిని. నేడు సుదినముగాన మీ దర్శనమయ్యెను. పునీతుడనైతిని. పాప కర్ముడ, పాపాత్ముడ, పాపసంభవుడ, మీరు భక్తాధారులు మిమ్ముల శరణుపొందుచున్నాను. ఓ నృసింహసరస్వతీ! మీరు శరణాగతులకు వజ్రపంజరమని మీ బిరుదు జగద్విఖ్యాతమై విరాజిల్లుచున్నది. నేటితో నా దుష్కర్మనశించెను. పరబ్రహ్మను నేత్రముతో చూడగలిగితిని. యతిరాజా ! నేటికి నా మనోరథము నెరవేరినది. మీరు త్రిమూర్తి స్వరూపులు. భక్తజనులకు కామధేనువులై యున్నారు. మీ మహిమ ఎంత వారికిని అగోచరము. సగరచక్రవర్తి కుమారుల తరింపచేయు గంగ వచ్చినటుల భక్తుల తరింపచేయగలందులకు గాను మనుష్యదేహములో నవతరించితిరి. పాషాణమైన అహల్యను పాదస్పర్శతో శాపవిముక్తి నొందించిన శ్రీరామచంద్రులే మీరు. నాకు వివాహమైన తదుపరి ఈ వ్యాధి ప్రారంభమయ్యెను.

నా భార్యయు నన్ను స్పృశించ వెరచి పుట్టినింటికిచేరెను. తల్లిదండ్రులుగూడ నన్ను విడనాడిరి. దుఃఖముతో సంసారము విడచి వచ్చితిని. తులజాపురము వెళ్ళి తపమాచరింప నా దేవి నీవు పాపివిగాన నిచ్చట నీకు రోగనివృత్తి కాదు. చందలాదేవివద్దకు పొమ్మని ఆజ్ఞాపించ నచ్చట గూడ తపమాచరింప నా దేవి తమవద్దకు పొమ్మని ఆదేశింప నిచటకు వచ్చితిని. అంగహీనుడనగుటచే నా ముఖ మెవ్వరునుచూడరు. ఇక జీవించి ప్రయోజనమేమి. ఈ రోగము నివృత్తియగునో కాదో తమరు దయయుంచి తెలుపుడు. రోగమునివృత్తి కాని పక్షమున మీ వద్దనే ప్రాణములు విడచెద. మీరే రక్షకులని మిమ్ముల శరణు పొందితిని. తులజాదేవి, చందలాదేవివరాల వలె మీరుగూడ ముందు ఆశలు కల్పించి తరువాత విడనాడకుడు. అని దీనుడై ప్రార్థింప గురుమూర్తి నవ్వుచు సోమనాథుడను బ్రాహ్మణుని పిలిచి ఇట్లనిరి.

సోమనాథా ! నీవు ఈ బ్రాహ్మణుని సంగమమునకు తీసికొనిపోయి సంకల్పపూర్వకముగ స్నానము చేయించుము. అశ్వత్థప్రదక్షిణ చేయించి పాత వస్త్రమును పారవేయించి నూతన వస్త్రమును ధరింపచేసి నా వద్దకు తీసికొనిరమ్మనిరి.

సోమనాథుడు, ఆ బ్రాహ్మణుడు కలసి సంగమమునకు వెళ్ళిరి. బ్రాహ్మణుడు సంగమమున స్నానమొనర్చెను. స్నానముచేయుసరికి అతని శరీరము మారిపోయెను. అనంతరము అశ్వత్థ ప్రదక్షిణముచేయ శరీరమునకు సువర్ణఛాయ వచ్చెను. సోమనాథుడిచ్చిన నూతన వస్త్రమనను ధరించి పాతవస్త్రమును దూరముగ పారవేయ ఆ చోటు కమిలిపోయి చెవిటి నేల అయ్యెను బ్రాహ్మణుని వెంటనిడుకొనిసోమనాథుడు మఠమున కేతెంచెను.

అచటి వారందరును ఆ బ్రాహ్మణుని చూచి విస్మితులైరి.ఇ నందియను బ్రాహ్మణుడుస్వామివారికి నమస్కరించెను. సంతోషముతో స్తోత్రముచేయుచు పాదముల మీద పడిసాష్టాంగ వందన మాచరించెను. స్వామివారు అతనితో నీ మనోరథము నెరవేరేనా ? శరీరమంతయు శోధించుకొని చూడుమన వాడు చూడ శరీరమంతయు బాగుగ ఉండెను కాని కాలి పిక్కలో కొంచెము కుష్ఠశేషముండెను. వాడది చూచి భయపడి మీ స్వామీ ! కృపాదృష్టివలన శరీర మంతయు స్వచ్ఛమాయెను. కాని కాలిమడతలో మాత్రము కొంచెము వ్యాధి శేషించెను. ఇందులకు కారణమేమియో తెలియదు. నా యందు కృపయుంచి ఈ కొంచెము శేషము గూడ లేకుండచేసి రక్షించుడని ప్రార్థించెను.

గురుమూర్తి అతనితో నీవు మనుష్యమాత్రునివలన నేమికాగలదను సంశయముతో వచ్చినందున నిశ్శేషముగ నీ వ్యాధి నశించక కొంచెము శేషించెను. అదియు పోగలందులకు నీ కొకయుపాయము చెప్పెద. నీవు నా మీద కవిత్వముతో స్తుతి యొనర్చుము. అట్లు చేసితివేని నీ వ్యాధి నిశ్శేషముగ పోవునన నా బ్రాహ్మణుడు స్వామి పాదముల మీద పడిలేచి చేతులు జోడించుకుని స్వామి నేను నిరక్షరకుక్షిని కావ్యవ్యుత్పత్తి ఎంతమాత్రము లేదు. కవిత్వం ఎట్లు చెప్పవలయును దీనుడై పలుకగా స్వామి వారు అతని మీద దయగలవారై నోరుతెరుపుమని చెప్పి కొంత విభూతిని అతని నాలుకమీద చల్లగ అతనికి జ్ఞానోదయమై కవిత్వము చెప్పు సామర్థ్యము వచ్చెను. అప్పుడు అతను అందరు చూచుచుండ ఈ క్రింది విధమున స్వామివారిని స్తుతించుచు అద్భుతముగ కవిత్వము చెప్పుదొడగెను.

**నంది బ్రాహ్మణుడు చెప్పిన కవిత్వసారము :**

స్వామీ ! మాయలోపడి సంసారసాగరములో మునిగి తేలుచు మిమ్ము స్మరింపజాలక దూరమైతిని. మందమతినై మీ నామము స్మరింపజాలనైతిని. అందుచే స్వేదజములు, అండజములుగ పుట్టితిని. పశుజన్మలగూడ నెత్తితిని. అట్టి నీచ జన్మలయందు నిన్ను స్మరించు అవకాశమే లేకపోయెను. అన్ని జన్మలలోనికి మానవజన్మ ఉత్తమమైనది. అందును బ్రాహ్మణ జన్మ శ్రేష్ఠమైనది. అప్పుడును సద్గురువును భజించక మూర్ఖుడై కాలమును గడిపినచో నదియు వ్యర్థమేకదా; జీవుడు పైలోకమునుండి వర్షధారల ద్వారా అన్నమై తండ్రియందు రేతోరపమై ఋతుకాలమున తల్లి గర్భములో ప్రవేశించి ఆమె రక్తములో కలిసి అయిదు దినములకు ఒక బుడగరూపము నొందును. పదునైదు దినములకది గట్టిపడును. ఒక మాసమున కది మాంస పిండాకారము నొందును. రెండు నెలలకు శిరస్సు రెండు పాదములు ఏర్పడును. కాని అట్టి స్థితిలో జీవుడు నిన్ను స్మరించ జాలకున్నాడు. మూడు నెలలకు సర్వావయవములు, నవద్వారములు ఏర్పడును. ప్రాణము గూడ నందు ప్రవేశించును. కాని అప్పుడుకూడ మిమ్ము స్మరించు సామర్థ్యము లేనివాడుగనే యుండును.

అయిదవ నెలలో చర్మము, రోమములు ఏర్పడును. ఆరవ నెలలో ఉచ్ఛ్వాస నిశ్వాసముల విడుచును. ఏడవ నెలలో శ్రోత్రమును జిహ్వా ముక్కు ఏర్పడి తొమ్మిది నెలల వరకు తల్లి గర్భములో మలమూత్రముల మధ్య కష్టపడును. తల్లి భుజించిన కారము మదలగు తీక్షణపదార్థముల వలన

గర్భములో జీవుడు మితిలేని బాధ నొందును. ఆ బాధలో జీవుడు నిన్ను స్మరించజాలడు. ప్రసవకాలమురాగా ఎంతయో కష్టముతో తల్లి గర్భము నుండి జన్మించును. జన్మించిన తరువాత గూడ మానవుని జీవితములో సగభాగము నిద్రలో వ్యర్థమగుచున్నది. మిగిలిన సగము బాల్యము, యౌవనము, వార్ధక్యముగా మూడు విధములవిభజింపబడుచున్నది. బాల్యావస్థలోని కష్టముల చెపప నెవరితరము.

తల్లి ఉయ్యెలలో పరుండబెట్టును, బాలుడు మలమూత్రములలో పొరలుచు అజ్ఞానముతో తన మలమునే తాను భక్షించుచుండును. బాల్యములో పడిన బాధ స్మరించిన నెంత వారికి హృదయము కంపించును, ఉదరభాదతో బాలుడు బాధనొందుచుండ తల్లి తెలిసికొనజాలక ఆకలి అయ్యెనని పాలనిచ్చును. ఆకలితో నేడ్చుచుండ కడుపునొప్పితో బాధ పడుచున్నాడనుకొని లేనిపోని మందుల పోయును, అప్పటికి ఏడ్చుచుండ నా బాలుని ఉయ్యెలలో పరుండబెట్టి ఊపుచు నిద్రపుచ్చ ప్రయత్నించునుగాని వాని ఆకలిబాధ గుర్తించజాలదు భయపడెనేమోయని రక్షల గ్టించును. ఒక సమయమున ప్రక్కలో తేలుకుట్టి బాలుడు ఏడ్చుచుండతల్లి తెలిసి కొనలేక పాలిచ్చి ఏడ్పుమాన్ప యత్నించును. కాని తేలు కుట్టినట్లు తెలిసికొనజాలదు. పై పెచ్చుమరల నాతేలుగల ఎయ్యెలలోనే పరుండబెట్టును. బాలుడు ప్రాణాంతకరబాధ నొందునుగాని చెప్పజాలడు. ఇట్టి బాల్యములో జీవుడు నిన్నెట్లు స్మరించ సమర్థుడు !

క్రమముగ జీవుడు బాల్యముదాటి ఎంతో కష్టము ననుభవించి నిన్ను స్మరించక ఆటపాటలతో కాలము జరగుక యౌవనదశలో నడుగిడును. కామాంధకారములోపడి తల్లి దండ్రుల మరచును. పెద్దల తిరస్కరించును. వారవనితల కామించును. వృద్ధులను వెక్కిరించును. ఇంద్రియలోలుడ మిడుత దీపముమీద పడినటుల స్త్రీలరూపమును చూచి భ్రమించి వ్యభిచరించును. పరద్రవ్య మపహరించును. పెద్దల బోధ చెవిని పెట్టడు. మహాత్ముల నిందించును. ఇట్లు నిన్ను స్మరించక మదించి కాలము వ్యర్థ పుచ్చును. ఇంతలో వృద్ధాప్యమువచ్చి మీదపడును. అప్పుడు అతను భార్యా పుత్రులకు గూడ భారమైతోచును. కఫము ప్రారంభమగును. శరీరము వణకసాగును. వెంట్రుకలు తెల్లనగును. దంతములు ఊడిపోవును చెవులు వినబడవు.

స్వామీ ! ఈ విధమున మానవుని జీవితము నిన్ను స్మరించు భాగ్యము లేక నానా కష్టములకు పాలగుచున్నది. ప్రభో! నా యందు దయయుంచి నన్ను

సంసారసాగరము నుండి దరిచేర్చుడు మందమతినై మీ చరణ సత్త నెరుగనైతిని. మీరు కేవలము నారాయణావతారమై యున్నారు. నరవేషము ధరిపంచి విశ్వమును తరింపజేయ నవతరించితిరి. మీరు విశ్వపాలకులు, పామరులు దివాంధులవలె మిమ్ముల గుర్తించజాలరు. నేను మీ కింకరుడ, సంసారసాగరము నుండి తరింపచేయడు. అని ఇట్లు నందియను బ్రాహ్మణుడు అద్భుతముగ కవిత్వము చెప్పుచుండ జనులందరు ఆశ్చర్యపోవుచుండిరి. అప్పుడు అచటి జనులతో నంది ఇట్లనుచున్నాడు.

ఓ జనులారా ! వినుడు ! ఈ గురుమూర్తి కేవలము పరబ్రహ్మము వీరి దర్శనముచే నా పాపము లన్నియు నశించెను. దావాగ్నిచే తృణము దగ్ధమగురీతిని గురుకృప ఎవ్వరియందు ప్రసరించునో వారి పాపములన్నియు నటుల నిస్సంశయముగ నశించును. గురువుకన్న వేరు దేవుడేలేడు. కాన సద్గురుచరణముల భక్తితో భజించుడు గురుచరణము కడు పవిత్రము. గురుచరణ స్పర్శచే బ్రహ్మచే లిఖింపబడిన ఫాలమందలి దుష్టాక్షరపంక్తియు మారిపోగలదు. నిధివలె గురుమూర్తి సమక్షమున నున్నను మనము గుర్తింపజాలకున్నాము. శ్రీనృసింహసరస్వతి మనపాలిటి కామధేవును. కాన భజించి ధన్యులుకండు. గురుమూర్తి ఇహలోకమున సౌఖ్యము, పరత్ర సద్గతి ననగ్రహించ సమర్థుడు. ఈ మాట సత్యము ముమ్మాటికి సత్యము నమ్ముడు.

ఇట్లుపన్యసించుట చూచి గురుమూర్తి మిక్కిలి సంతసించి అచ్చటి వారితో ఈ బ్రాహ్మణునకు కవీశ్వరుడని బిరుదుము నిచ్చితిని. మీరిక మీద నితనిని



కవీశ్వరుడని పిలపుడనిరి. కవీశ్వరుడైన నంది అప్పుడు తన శరీరమందు విమర్శించి చూడ మిగిలియున్న ఆ కొద్ది కుష్ఠరోగము గూడ నివృత్తి చెందెను. అప్పటి నుండియు నంది కడు సంతోషముతో స్వామివారికి నమస్కరించి వారి సేవ చేయుచు వారి సమక్షముననే నిసించుచుండెను. ఓ నామధారకా ! గురుమూర్తి యొక్క అద్భుతమైన మహిమను వింటివి. స్వామివారి వద్ద నందికేశీశ్వరుడే గాక నరహరియును మరొయిక కవియు గలడు. అతనెటుల గురుకృపకు పాత్రుడయ్యేనో ఆ విషయమును నీవు పై అధ్యాయములో వినగలవని సిద్ధముని నామధారకునితో చెప్పెను.

**ఇట్లు గురుచరితమందు నలుబది అయిదవ అధ్యాయము సమాప్తము.**

**దిగంబరా దిగంబరా శ్రీపాదవల్లభదిగంబరా**

"ఈ కలియుగమున హరి భజనమే ముక్తి దాయకమైనది. ఇంతకంటె సులభమైన మార్గము మరి యొకటి లేదు. భూత దయ గలిగియుండి హింసను విడువవవలెను సత్య నిష్ఠులై యుండవలెను. అందరి యందును భగవద్విలాసములు గుర్తించుచు అందరి యెడలను ప్రేమతో మసలుకొనవలెను. అహంకార, మమకారములు నిర్జింపవలెను. శ్రీ కృష్ణ నామ కీర్తనము చేయుచు, భజన సేయుచు సకలమును రాధ వలె శ్రీ కృష్ణుని కర్పింపవలెను. ఇదియే తరణోపాయము, ఇదియే మోక్షప్రాప్తికి సాధనము."

**"హరే కృష్ణ హరే కృష్ణ కృష్ణ కృష్ణ హరే హరే**
**హరే రామ హరే రామ రామ రామ హరే హరే"**

**ఇదియే మహామంత్రము. ఇదియే ఆనందమును కలిగించును.**

**– శ్రీ గౌరాంగస్వామి చైతన్య మహా ప్రభువు గారు**

# శ్రీ గురు చరితము

## నలుబది ఆరవ అధ్యాయము

### ఓం అవధూత చింతనం శ్రీ గురుదేవదత్త జయ ఓం

శ్రీ గణేశాయనమః నామధారకుడు సిద్ధమునితో ఓ మునీంద్రా స్వామివారి వద్ద నందికవిగాక మరియొక కవి గలడని చెప్పితిరి అతనెవడు; ఎటుల స్వామివారికి శిష్యుడయ్యెనో కృపతో అమృత సమమగు గురు చరిత్రమును నాకు వినిపించి నన్ను ధన్యుని గావింపుడని ప్రశ్నించ సిద్ధమునీంద్రులిట్లు చెప్పుచున్నారు.

నామధారకా ! నిరుపమానమగు గురుచరితమును వినుము. గురుమూర్తి గణగాపురమున నుండ నంది యను కవి గురు కృపకు పాత్రుడైన సంగతి వినియుంటివి. నందిచే రచింపబడిన కవిత్వము నలుదిక్కుల వ్యాపించెను. అందరును అతని కవిత్వమును పఠించి ధన్యులగుచుండిరి.

ఇట్లుండ హిప్పరగ యను గ్రామవాసులు గురుమూర్తి ఖ్యాతిని విని వారి వద్దకు వచ్చి ప్రార్థించి వారిని తమ గ్రామమునకు కొనిపోయిరి. గొప్పగా పూజామహోత్సవముల నాచరించిరి. ఆ గ్రామమున గొప్ప కల్లేశ్వరశివాలయముగలదు. ఆ దేవాలయమున నరహరి యను బ్రాహ్మణుడు శివుని పూజించుచుండును. ఆ బ్రాహ్మణుడు విద్వాంసుడగుటచే నిత్యము అయిదు నూతన పద్యములు శివునిమీద రచించి శివుని ఆరాధించుచుండును. అతడు ఏకాగ్రముగ శివుని మాత్రమే ధ్యానించును. పూజించును. నుతించును గాని స్వప్న మందైన ఇతర దేవతల చూడడు. పూజించడు. స్తుతించడు.

ఇట్లుండ నా గ్రామస్థులు నరహరివద్ద కేగి అతనితో బ్రాహ్మణోత్తమా ! కవీశ్వరా ! గురుమూర్తి మన గ్రామమున కేతెంచిరి. వారికి కవిత్వమన్న కడుప్రేమ. కావున నీవు గూడ వచ్చి వారి మీద మంచి కవిత్వముచెప్పి వారిని సంతోషపరచు మన నతడు వారితో నిట్లనెను. నేను నాజిహ్వాను కళ్ళేశ్వరున కమ్మివైచితిని. ఇతర దేవతల నేను స్తుతించను. అట్టి నేను నరస్తుతి ఎట్లుచేయుదును. కావున మీరు కోరినపని నా వలన గాదు అనెను.

అదే దినమున నతడు స్నానమొనర్చి శివుని పూజించ శివాలయము ప్రవేశించెను. పూజించుటకు శివుని ముందు కూర్చొనెను. ఇంతలో గాఢనిద్రవచ్చెను. ఆ నిద్రలో నతనికి తాను శివుని ముందు కూర్చున్నటులును తన ముందరగల లింగము అదృశ్యమై దాని స్థానములో గురుమూర్తియే

కూర్చున్నటుల అట్టి గురుమూర్తిని తాను హర్షముతో పూజించుచున్నటుల స్వప్నము వచ్చెను. ఆ స్వప్న మందు స్వామివారు అతనితో నీవు నరుల స్తుతించువట గదా ! నన్నెందులకు పూజించి స్తుతించుచున్నావని యడిగిరి. అతను మాత్రము నిశ్చల భక్తితో గురుమూర్తిని స్వప్నమందు పూజించి నిత్యము వలెనే పంచపద్యములతో స్తుతించెను. ఇంతలో స్వప్నము నుండి మెలకువ వచ్చెను.

అప్పుడతను విస్మితుడై గురుమూర్తి మానవమాత్రుడు కాదనియు అవతార పురుషుడనియు అట్టివారి మహిమ గ్రహించలేక పోతినని పశ్చాత్తాపము నొంది భక్తితో గురు సమక్షమునకు అడుగడుగున సాష్టాంగ వందనము లాచరించుచు వచ్చి గురుమూర్తి పాదముల మీదపడి నమస్కరించి స్వామీ! మీ స్వరూపము గ్రహింపలేక పోతిని నాయందు కృపయుంచుడు. మీరు మానవమాత్రులు గారు శివస్వరూపులు అజ్ఞానములోపడి మీ మహిమ తెలిసికొన నైతిని, మీరు విశ్వమునకు ఆధారమైనవారు. మీరే కల్లేశ్వరులు, మీ చరణకమలముల యందు నేనిక భ్రమరమై యుండెదను మీరు శరణాగతులకు వజ్రపంజరమువంటివారు. నిధి యింట నుండ కట్టెపుల్లల కొరకు అడవిని వెతుకప్రయాస మెందులకు, మీరు భక్తులకు కామధేనువులై యున్నారు. పూర్వము మానవులు ఎంతో కాలము తపమాచరించినను వారికి మీ సాక్షాత్కారము కాకుండెను. నేడు మాకు ఎట్టి శ్రమలేకనే మీ రూపమున కల్లేశ్వరుడు మాకు ప్రత్యక్షమయ్యెను. మాకు నిధి లభించెను. మా కోరిక నెరవేరెను. నాయందు దయయుందచుడని చెప్పుచు గురుమూర్తి పాదములపై పడి భక్తితో నమస్కరించ గురుమూర్తి అతనితో నీవు నిత్యము మమ్ముల నిందించుచున్నావని వినుచున్నాను. నీకు నేడేల మా మీద నింత భక్తికలిగెనని యడుగ నా బ్రాహ్మణుడిట్లనుచున్నాడు.

స్వామీ! ఇంత పర్యంతము అజ్ఞానాంధకారములోపడి యుంటిని, క్షమించుడు. నేను ఇంత పర్యంతము చేసిన పుణ్యము వలననే నేడు మిమ్ముల



చూడగలిగితిని. నేడు నేను శివుని పూజించుచుండ లింగమునకు మారుగా మిమ్ములనే గాంచితిని. నా సంశయము నశించెను. నన్ను కూడ తమ శిష్యులలో నొకడుగా స్వీకరించుడని చెప్పి స్వామివారికి భక్తితో పూజ సల్పి స్వప్నములో చెప్పిన విధమున నూతన పద్యములను గూడ స్వామివారి మీద రచించి స్తుతించెను. స్వామివారు అచ్చుటివారితో నితడు నన్ను కల్లేశ్వరాలయమున గూడ ప్రత్యక్షముగ పూజించియు స్వప్నములో పూజించితినని చెప్పుచున్నాడు. ఇప్పుడు నన్ను మీ సమక్షమున ప్రత్యక్షముగ పూజించుచున్నాడు. అని పలికి అతనిని తన శిష్యునిగా చేసికొని నూతన వస్త్రముల బహూకరించి నీవు కల్లేశ్వరుని పూజించుచుండుము. కల్లేశ్వరుని పూజించుటయన నన్ను పూజించుటయే అనిరి అప్పుడు అతను స్వామి ! ప్రత్యక్షముగ నున్న మిమ్ముల విడిచి ఆ కల్లేశ్వరునితో నాకేమి ప్రయోజనము, నేను కల్లేశ్వరునియందు మిమ్ములనే గాంచితిని. మీరే కల్లేశ్వరులు, త్రిమూర్త్యవతారులు, ఇది సత్యము. మిమ్ములవిడిచి యుండ జాలనని పలికి గురుమూర్తికి శిష్యుడయ్యెను. అతనితో కలసి గురుమూర్తి గణగాపురము వచ్చిరి. నందియను కవివలె నీ నరహరికవియును గురుమూర్తి మీదననేక విధముల కవిత్వము చెప్పుచు గురుసేవ చేయుచుండెను.

ఓ నామధారకా ! ఎవ్వరు గురుభక్తి చేయుదురో గురుమూర్తి వారి యింటిలోని కల్పవృక్షమై సర్వాభీష్టముల నొసంగు చుండును.

**ఇట్లు గురుచరితమందు నలుబదిఆరవ అధ్యాయము సమాప్తము.**

**దిగంబరా దిగంబరా శ్రీపాదవల్లభదిగంబరా**

**శ్లో॥ నరకేసరిణే స్వప్నేస్వం కల్లేశ్వరలింగం,**
**దర్శయిత్వానుజగ్రాహ శ్రీదత్తశ్శరణంమమ**

## నరహరియను కవీశ్వరునకు స్వామివారు దర్శనమిచ్చుట.

"భారతీయులు, మహమ్మదీయులు, క్రైస్తవులు, బౌద్ధులు, మున్నగువారు అందరును గూడ ఆ పరబ్రహ్మము కొరకే వెదకుచున్నారు; కాని విశ్వాసములు వేరు, మార్గములు వేరు అయిన నేమి ? ఫల మొక్కటియే. ఉపాధి బేధము వలన రుచి భేదము గలిగినట్లే జాతి భేదముల ననుసరించి మత భేదములు గలిగినవి. ఇది ప్రకృతి విరుద్ధము గాదు ప్రపంచ మంతయు నద్వైతమును ధృవపరచుచున్నది. ప్రపంచము నెరుగని వారు భేదమును, ద్వేషమును బెంచెదరు" – శ్రీ రామకృష్ణ పరమహంస గారు.

# శ్రీ గురు చరితము

## నలుబది ఏడవ అధ్యాయము

**ఓమ్ అవధూతచింతనం శ్రీ గురుదేవదత్త జయ ఓమ్**

శ్రీ గణేశ ! నమస్కారము సిద్ధమునిని నామధారకుడుపై కథావృత్తాంతమును చెప్పుడని ప్రార్థింప వారు ఇట్లు చెప్పుచున్నారు. నామధారకా ! శ్రీ గురుచిత్రను మిక్కిలి ఉత్సాహముతో వినుచున్నావు. నీవు పుత్రపౌత్రాభివృద్ధిగలిగి శ్రీమంతుడవగుదువు. గురుచరితము వినిన పతితులు గూడ పవిత్రులగుదురు. అట్టి గురు చరిత్రమును వినుము.

గురుమూర్తి గణగాపురమున నుండ దీపావళి పండుగ సమీపించెను. ఏడు గ్రామములనుంచి శిష్యులు స్వామివారిని తమ గ్రామమునకు పండుగకు భిక్షకు తీసికొనిపోవు సంకల్పముతో గణగాపురము వచ్చిరి. వారికందరకు గురుమూర్తి యందు ఒకరికన్న మరియొకరికి ఎక్కువ ప్రీతి. వారందరును గురుమూర్తిని సమీపించి వారి పాదముల మీదపడి నమస్కరించి తమ తమ గ్రామములకు పడుంగకు భిక్షకు దయచేయుడని ప్రార్థించిరి.

అప్పుడు స్వామి వారితో నేనొక్కడను, ఏడు గ్రామముల కెట్లురాగలను. నేను శిష్యుల కధీనుడను. మీలో మీకు సమాధాన పరచుకొని ఈ పండుగకు ఎవరి గ్రామమున కాహ్వానించిన నచ్చటికి వచ్చెదమనిరి. వారు అన్యోన్యము



సంప్రదించుకొనిరి. ప్రతి వారును మాస్వామిని మా గ్రామమువే తీసికొనిపోయెదమని తుగువలాడ సాగిరి. గురుమూర్తి వారితో నేను మీ కందరికి సముడనే మీరు వివాద పడకుడు. నేను పండుగకు నాకు బుద్ధి పుట్టిన గ్రామమున కేతెంచెదమనిరి. స్వామివారి వాక్యములు విని శిష్యులు స్వామీ ! తమరు పక్షపాతము చూపరాదు. శ్రీమంతులు, దరిద్రులు అను బేధము చూపి మా గ్రామమునకు రానిచో మేము గంగాప్రదేశము చేయుదుము. భక్తవత్సలుడైన కృష్ణుడు చక్రవర్తియైన దుర్యోధనుని ఇంటికిపోక బీదవాడగు విదురుని ఇంటికి వెళ్ళి నటుల మా గ్రామమునకే తమరు దయచేయ వలయును. తమరు మీ గ్రామము వచ్చెదమని ఎవరితో చెప్పిన వారు ముందుగా తగిన ప్రయత్నము చేసికొనుటకు వీలు కలుగునని పల్కి గురుమూర్తి పాదములకు సాష్టాంగ వందనమాచరించిరి. గురుమూర్తి తప్పక మీ గృహములకేతెంచెద విశ్వసించుడు చింతించకుడు అనిరి. అప్పుడు వారు స్వామీ మీరు అందరితోను వచ్చెద ననుచున్నారు. మేము ఎవ్వరము మీ మాట నమ్మి వెడలిపోయి ప్రయత్నము చేసికొందుము ? కాన తమరు మాతో నిర్ధారణగ మీ గ్రామమే వచ్చెదనని సెలవిచ్చిన సంశయ నివృత్తికాగలదనిరి.

అప్పుడు గురుమూర్తి శిష్యులు అజ్ఞానులు గాన తమ సామర్థ్యమును గుర్తించలేరని గ్రహించి ఒక్కొక్కరిని ఏకాంతమునకు పిలిచి అతని చెవిలో రహస్యముగ మీ యింటికే రాత్రికి వచ్చెద. ఈ సంగతి ఎవ్వరికి చెప్పక నీ గ్రామమునకు వెళ్లి ప్రయత్నము చేసికొనుమని చెప్పి పంపివేసిరి. అట్లేతక్కిన వారితో ఏకాంతమున చెప్పి అందరిని పంపివేసిరి. అప్పుడు గ్రామస్థులందరు గురుమూర్తిని సమీపించి స్వామీ !క్షమ మీరు దీపావళి పండుగకు మమ్ము విడిచి గ్రామంతరము పోవలదని చేతులు జోడించుకొని దీనులై ప్రార్థించవారితో నీ నిచ్చటనే యుండెద నమ్ముడని వారల నోదార్చిరి. ఇంతల దీపావళి సంప్రాప్తయ్యెను. త్రయోదశి రాత్రి స్వామివారు ఎనిమిది రూపములు దాల్చి ఒక రూపమున గణగాపురములో నుండి ఏడు రూపములతో ఏడు గ్రామములందును ప్రత్యక్షమైరి. ఆయా గ్రాయస్థులు స్వామివారు తమయందలి ప్రేమతో తమ గ్రామమునకే ఏతెంచిరని సంతసించి స్వామివారికి మంగళ స్నానము చేయించి షోడశోపచారములతో స్వామివారిని గొప్పగ పూజించిరి.

స్వామి వారందరి చేతను పూజింపబడి తిరిగి ఆరూపముల నుపసంహారించి తమ నిజరూపమున గణగాపురములో నుండిరి. ఈ రహస్య మెవ్వరును

తెలిసికొన జాలరైరి. ప్రతి వారును తమ గ్రామమునకే స్వామి వారు వచ్చిరనియు, తమ పూజయే గ్రహించిరనియు భావించిరి. ఇంతలో కార్తీక పున్నమినాడు స్వామివారిని దర్శించి కార్తీక దీపమాలల నర్పింప నుద్దేశముతో నాయా గ్రామస్థులందరు గణగాపురము వచ్చి స్వామివారి పాదములకు నమస్కరించి తమరు మా గ్రామము దీపావళికి వచ్చి మమ్ములనానందింపజేసితిరి. అందుచే ధన్యులమైతిమి. తిరిగి పది దినములకు మిమ్ము దర్శింపవచ్చితిమనిరి. మా గ్రామము పండుగకు వచ్చిరి మేము పూజించి స్వామివారికి వస్త్రము అర్పించితిమి. మీ గ్రామమెట్లు వచ్చిరి అసత్య మెందుకు పలికెదరని ఇట్లు అన్యోన్య మందరు కలహించసాగిరి. గ్రామస్థులు మీరందరు అసత్యము పలుకుచున్నారు. స్వామి వారు మా గ్రామముననే దీపావళి పండుగ చేసి మమ్ముల నానందింప జేసిరి అనిరి. కాని స్వామివారి వద్ద గ్రామస్థులొనసంగిన వస్త్రములేకాక మిగిలిన ఏడుగురు గ్రామ వాసులొసంగిన వస్త్రములన్నియు గుర్తుగ నుండుట చూచి ఆశ్చర్యచకితులై స్వామివారు నారాయణమూర్తియేగాని నరమాత్రులు గారని నిశ్చయించుకొని భక్తితో స్వామీ ! మీ మహిమ తెలిసికొన మేమెంత వారము. వేదమూర్తీ ! విశ్వపాలకా ! గురునాథా ! మీరు త్రిమూర్తి స్వరూపులు. అని స్తుతించి స్వామివారి యెదుట దీపారాధనలు చేసి బ్రాహ్మణులకు పక్వాన్నములతో సమారాధనలు జరిపిరి.

సిద్ధముని నామధారకునితో నామధారకా ! గురు మహిమిట్లు దినదినమునకు వ్యాప్తమయ్యెను. శ్రీనరసింహ సరస్వతీ స్వామివారి ప్రభావము జగద్విఖ్యాత మయ్యెను.

కల్పవృక్షము సమీపముననున్నను దురదృష్టుడు తెలిసికొనలేనట్లే గురుమూర్తి సమక్షమున నున్నను భక్తి లేని వారు మాత్రము వారిని గుర్తెరుగ జాలరు. ఓ భక్తులారా గురునాథుని భజించుడు. గురునాథుడు తప్పక మీ మనోరథముల సమకూర్ప సమర్థుడు. ఈ మాట నేననుభవించి చెప్పుచున్నాను. విశ్వసించుడని గంగాధర సరస్వతి గురుచరిత్రమున చెప్పుచున్నాడు. అమృతమును వదలి ఉప్పు నీటిని మూర్ఖుడు గూడ త్రాగునా? జ్ఞానవంతులారా : గురునామామృత మును పానమొనర్చుడు గురుమూర్తిని సేవించుడు. గురుమూర్తి త్రిమూర్తి స్వరూపుడుగాని మనుష్యుడు కాడని ఢంకా వాయించి చెప్పుచున్నాను. సంసారము నుండి తరించుటకు గురువు కన్న వేరుగతిలేదు. గురుభక్తి లేని మానవుడు రాబోవు జన్మమున సూకరమై జన్మించునని వేదశాస్త్రములు

చెప్పుచున్నవి. సంసారమను ఎడారి యందు గురువను చలివేంద్రము నిర్మింపబడియున్నది. అట్టి గురుమూర్తి కథామృత పానమొనర్చి అమరత్వము నొందుడు. గణగాపురమున ప్రత్యక్షముగ నరసింహసరస్వతి గురురూపమున నవతరించి యున్నారు. కాన నచ్చటకు పోయి వారిని సేవించుడు. మీ మనోరథములు తప్పక నెరవేరగలవు. ఎట్టి అనుమానము పడనవసరము లేదు. దేవుడు అచ్చట ప్రత్యక్షముగ గలడు. మీ హితము చెప్పితిని, విని విశ్వసించి గురుమూర్తిని సేవించుడు.

**ఇట్లు గురుచరితమందు నలుబది ఏడవ**
**అధ్యాయము సమాప్తము.**

**దిగంబరా దిగంబరా శ్రీపాదవల్లభ దిగంబరా**

**శ్లో॥ అష్టమూర్తి ధరోస్యష్టగ్రామగో భక్తవత్సలః**
**దీపావళ్యుత్సవేభూపః శ్రీ దత్తశ్శరణం మమ ॥**

గురుమూర్తి ఎనిమిది రూపములతో ఎనిమిది గ్రామము లందు ఏకకాలమున దీపావళినాడు పూజింపబడుట.

**దోహా॥ కామిహినారి ప్యారిజిమి లోభిహి ప్రియజమిదామ్ ।**
**తిమి రఘునాథ నిరంతర ప్రియలాగహు మోహిరామ్ ॥**
**శ్రీ రామచరితమానసము ఉత్తరకాండము - 130 (ఖ)**
**శ్రీ సంత్ తులసీదాసుజీ మహారాజుగారు**

తా॥ కామీపురుషుడుయే ప్రకారము యెల్లప్పుడు తన ప్రియురాలి స్మరణచేయుచుండునో, మరియు లోభియగువాడు యే ప్రకారము ధనము పైననే ప్రీతికలిగియుండునో, అదే ప్రకారము ఓరఘునాథా ! ఓ రామా ! సర్వకాల సర్వావస్థలయందును. అనగా నిరంతరము నీవు నాకు ప్రియుడవై నా చిత్తము నీ చరణకమలముల యందే లగ్నమగునటుల వరమొసంగుము అనగా అనన్యభక్తి నొసంగుము అని భావము.

# శ్రీ గురు చరితము

## నలుబది ఎనిమిదవ అధ్యాయము

### ఓమ్ అవధూత చింతనం శ్రీగురుదేవదత్త జయ ఓమ్

శ్రీ గణేశాయనమః. నామధారకా ! గురుచరిత్రము నీకు చెప్పుచున్న కొలదియు నాకు సంతోషమగుచున్నది. ఒక అపూర్వమైన విషయము చెప్పుచున్నాను. శ్రద్ధతో వినుము. గురుమూర్తి నివసించుటచే గణగాపురమునకు అపూర్వమైన ఖ్యాతి వచ్చెను. ఆ గ్రామమున నొక శూద్ర భక్తుడుగలడు. వ్యవసాయముచే జీవించువాడు అతని కథ చెప్పెద వినుము. స్వామివారు గణగాపురమఠము నుండి ఉదయముననే బయలు దేరి సంగమమున కేగి అచ్చట ననుష్ఠానమొనర్చుకొని మధ్యాహ్నమునకు మఠమునకు భిక్షకువచ్చెడివారు, శూద్రభక్తుడు వ్యవసాయ మొనర్చు పొలము స్వామివారు పోవు మార్గమునకు కొలది దూరమునగలదు. స్వామివారు సంగమమున కేగుచుండ వాడు నిరీక్షించి వెంటనే పరుగెత్తి వచ్చి వారికి దూరము నుండి సాష్టాంగముగ నమస్కరించును. అదే రీతిని వారు తిరిగి గణగాపురమువచ్చుచుండ వాడు అట్లే వచ్చి వారి పాదములకు వందన మాచరించుచుండును. గురుమూర్తి వానితో మాట్లాడక ఊరక వాని భక్తి చూచుచుండెడివారు. వానికి స్వామివారియందు దినదినము భక్తి వృద్ధియగుచుండెను.

ఇట్లు కొంతకాలము జరుగ నొక దినమున వాడు నిత్యము వలె నమస్కరింప స్వామివారు అతనితో ఓరీ! నీవు కష్టపడి నిత్యము నాకు నమస్కరించుచున్నావు. నీ మనస్సులో ఏమి కోరికయో చెప్పుమన వాడు స్వామీ ! తమ అనుగ్రహము వలన మా వ్యవసాయము చక్కగ అక్కరకు వచ్చి మా పొలము చక్కగ పండిన మేము సుఖముగ జీవింతుము. ఇంత కన్న వేరు కోరిక ఏమియు లేదన స్వామివారు వానితో నీ పొలములో ఈ సంవత్సరము ఏమి పైరు వేసితివి అనవాడు స్వామి జొన్న పైరు వేసితిని పైరు వృద్ధియగుచున్నది. కంకులుపడు సమయము వచ్చినది. మీ యనుగ్రహము వలన మంచిగ పండిన పండవచ్చును. నా ప్రార్థన ఒకటి గలదు. ఏమన తమరు నాయందు దయయుంచి మా పొలము తమ పాదధూళితో పవిత్ర మొనర్చిన సంతోషించెదనన నాతని భక్తికి సంతసించి అతనితో కలసి అతని పొలము

సమీపించి పొలము చూచి ఓరీ భక్తుడా ! నే నొకటి చెప్పదలచితిని. చేసెద వాయని యడిగిరి. అప్పుడు వాడు స్వామీ! మీరు నాకు గురువులు. మీ వాక్యము నాకు ప్రమాణము! మీరు ఏమి చెప్పిన అటుల నాచరించుటకు సంసిద్ధుడను గాన సంశయ ముంచక నేనేమి చేయవలయునో ఆజ్ఞాపింపుడనెను.

గురుమూర్తి అతనితో ఓరీ ! నే నిప్పుడు సంగమమునకు వెళ్ళుచున్నాను. మధ్యాహ్నమునకు తిరిగి మఠమునకు భిక్షకుపోవుదును. ఇంతలో నీవు నీ పొలమును మొత్తము మొదటికి కోసివేయుము అని చెప్పి గురుమూర్తి సంగమమునకు వెళ్ళిరి.

ఆ శూద్రభక్తుడు మనస్సులో గురువాక్యమే నాకు ప్రమాణము గాన వారు చెప్పినట్లు చేయుటయే నా ధర్మమని నిశ్చయించుకొని గ్రామములోనికిపోయి క్షేత్రయజమానితో తనకు కౌలుపత్రము వ్రాసియిమ్మన నతడు ఈ సంవత్సరము పైరు అధికముగ పండవచ్చును. కాన నిరుటివలె నేను వ్రాసి యివ్వనన శూద్రుడు యజమానితో వెనుకటికన్న రెండు రెట్లు ధాన్య మిచ్చెద నాకు పత్రము వ్రాసియిండన వాడు అటులనే వ్రాసియిచ్చెను. యజమానివలన ప్రమాణపత్రము తీసికొని కూలీలను పిలుచుకొనివెళ్ళి వారలతో పొలమును కోయించ నారంభించెను. ఈ విషయము తెలిసికొని అతని దారాపుత్రాదులు నిషేధించరాగా వారల రాళ్ళతో గొట్టి వెళ్ళగొట్టెను. వారు క్షేత్రయజమాని వద్దకు వెళ్ళి కాపు వానికి పిచ్చిఎక్కినది. ఎవరో సన్యాసి చెప్పినాడని నెలలో పంటకు వచ్చు పైరును మొదటికి కోసి వేయించుచున్నాడు. అటుల చేయవద్దని



మేము ఆటంకపరుచబోగా మమ్ముల రాళ్ళతో గొట్టుచున్నాడు. అని చెప్ప నా క్షేత్రపతి వారలతో నేనేమి చేయగలను. నాకు పత్రము వ్రాసియిచ్చినాడు అని చెప్పియు అటుల చేయవద్దని చెప్పుటకు తన సేవకుని పంపెను. అతను వెళ్ళి యజమాని పంపగా వచ్చితిని పొలము కోయించవద్దని నిషేధించ నా శూద్రుడు నేను వెనుకటికన్న రెట్టింపు ధాన్యమి చ్చెదనని పత్రము వ్రాసియిచ్చితిని. యజమానికి భయమున్న నాయింట ధాన్యము గలదు. నేడే ధాన్యము కొలిచి యిచ్చెద. అట్లు కానిచో నా ఎద్దులనైన నతనికిచ్చెద. నేను కోయించుట మాననని చెప్ప నా నౌకరు వెళ్ళి కాపువాని మాటలను క్షేత్రపతితో చెప్పెను. క్షేత్రపతి కాపువాని యింట ధాన్యము సమృద్ధిగ గలదని తెలిసియున్నందున నతడు ధైర్యముతో నేమియైన కానిమ్మని యగుకొనెను.

శూద్రుడు తన పొలమంతయు గురువు చెప్పినటుల కోయించి గురుమూర్తి రాకకై నిరీక్షించుచుండ మధ్యాహ్నము గురుమూర్తి సంగమము నుండి వచ్చుచుండ నెదురేగి నమస్కరించి వారితో స్వామీ! మీ యాజ్ఞ ప్రకారము పొలము కోయించితినన గురుమూర్తి అతనితో ఓరీ! నేను పరిహాసమున కట్లంటిని. నీవు నా మాటలనమ్మి అట్లెందు కొనర్చితివన స్వామీ ! మీ వాక్యమే నాకు కామధేనువు నా కెట్టి సంశయము లేదు. అన నతని నిష్ఠకు గురుమూర్తి సంతసించి ఓరీ చింతపడకుము నీకే అధిక ఫలము సిద్ధించును. అని ఆశీర్వదించి మఠమున కేగిరి.

గురుభక్తుడైన శూద్రుడు ఇంటికిపోగా గ్రామస్థులందరు వచ్చి మూఢుడవై పొలము కోయించితివెందులకు అనిరి. భార్య ఏడువసాగెను. శూద్రుడు అందరిని ఓదార్చి చింతించకుడు. నేను మూఢుడనుగాను. గురువాక్యము కామధేనువు. వారి అనుగ్రహముండిన ఒకగింజకు వెయ్యి గింజలు రాగలవు. మీరు మూఢులు గాన గురుమూర్తి మహిమనెరుంగరు. గురుమూర్తి నరుడుకాడు. శివుడు. గురుకృపకు పాత్రుడైనవానికి దైన్యమెన్నడు నుండదు. అని దూరదృష్టి గలవాడు గాన భార్యా పుత్రుల గ్రామస్థుల నోదార్చెను. ఇట్లుండ ఒకవారము దినములు గడిచెను. ఇంతలో ఒక సుడిగాలివీచి గ్రామములోని పైరంతయు నేలవాలెను. సూర్యుడు మూలా నక్షత్రములో ప్రవేశించుటచే అఖండమైన వర్షముచే పైరులన్నియు నీటమునిగి కుళ్ళిపోయెను. శూద్రుని పొలము ముందుగనే కోయబడెను గాన వర్షముతగ్గి భూమి ఆరినకొలదియు అతని పొలములో కోయబడిన మొదళ్లనుండి అద్భుతముగ నొక్కొక్క దానికి

పదిపదకొండు అంకురములు బయలువెడలెను. కొద్ది రోజులలో నతని పొలము పైరుచే క్రిక్కిరిసి నేత్రములకు ఆనందకరముగ నుండెను. గ్రామస్థులందరు ఆశ్చర్యచరితులైరి.

శూద్రుని భార్య తన పొలము పైరుతో నిండియుండుట చూచి ఆనందము నొంది భర్తను సమీపించి, పాదములకు నమస్కరించి ఓ ప్రాణనాథా, నేను అజ్ఞానినై మిమ్ములను గురుమూర్తిని అనరాని మాటలాడి నిందించితి క్షమించుడని ప్రార్థించెను. భార్యాభర్తలిరువురు క్షేత్రదేవతకు పూజలొనర్చి గురుమూర్తిని సమీపించి భక్తితో పూజించిరి. గురుమూర్తి ఏమి కారణము? ఎందులకు ఆకస్మాత్తుగ వచ్చి నాకు పూజచేసెదరన శూద్రుడు భక్తితో స్వామీ! జయ జయ. మీరుమాకు కులదేవతలు. మీరు కామధేనువులై యున్నారు. మీ వాక్యము అమృతము మీ పాదము చింతామణి మామనో రథము నెరవేరెను. మీరే మాకు శరణు. భక్తవత్సల ! మీ బిరుదావళులు మా విషయములో సార్థకములయ్యెను. అని చెప్పుచు భార్యాభర్తలిద్దరును స్వామివారి పాదముల మీదపడి నమస్కరించిరి, పూజించి, నీరాజనమిచ్చిరి స్వామివారు సంతసించి మీరు అఖండైశ్వర్యము నొందగలరని ఆశీర్వదించిరి, గురుమూర్తి ఆజ్ఞనొంది శూద్రదంపతులు వారి గృహమునకు వెళ్లిరి.

ఒక నెలరోజులలో పైరు పెరిగి కంకులు అద్భుతముగ బయలువెడలెను. గురుమూర్తి అనుగ్రహము వలన నా శూద్రునికి వెనుకటి సంవత్సరము కన్న నూరురెట్లుగ ధాన్యముపండెను. శూద్రుడు సంతోషముతో ధాన్యము సిద్ధపరచి క్షేత్ర యజమానిని సమీపించి అతనితో నీ సంవత్సరము నాకు ధాన్యము అధికముగ పండెను. అందులోసగము మీకిచ్చెదనన అతను వానితో ధర్మహాని వలదు. నీవు గురుభక్తుడవు. గురుప్రసాదము వలన వచ్చిన దానిని నీవే అనుభవించుము. అని చెప్పెను. శూద్రుడు ఇంటికి వచ్చి యజమానికి ఇవ్వవలసినది యిచ్చి బ్రాహ్మణులకు సహితము తన ధాన్యము పంచిపెట్టెను. అది మొదలు గురుమూర్తి కృపవలన శూద్రుడు శ్రీమంతుడై సుఖముగ నుండెను.

ఓ నామధారకా ! చిత్రమైన గురుచరిత్రను వింటివా ! గురుమూర్తి యందు దృఢభక్తి గలవారి కెన్నడును దైన్యముండదని గ్రహించుము. సర్వాభీష్టప్రదమైన గురుచరిత్రనెవ్వరు నిత్యము భక్తితో పఠింతురో వారి గృహమున లక్ష్మి తననైసర్గిక చాంచల్యమును విడనాడి స్థిరనివాసమొనర్చును. కాన భావికులు నిత్యము గురుసేవ చేసిన ఐహికాముష్మిక సుఖమును సంపదను పొందగలరు.

**ఇది గురుచరితమున నలుబది ఎనిమిదయధ్యాయము సమాప్తము.**

**దిగంబరా దిగంబరా శ్రీపాదవల్లభదిగంబరా**

"సమస్త సంశయములను ద్రోసిపుచ్చి, సుస్థిరచిత్తులై మీ గుర్వాజ్ఞను బాలింప కంకణముగట్టుకొనుడు ! అస్ఖలిత బ్రహ్మచర్యము నవలంబింపుడు. ఇదియే పారమార్థిక జీవన రహస్యము హనుమంతుని గనుడు, అతదెట్టి భగవత్సేవకుడో! ఆదర్శ మూర్తియో ! తనయఖండ బాహు బలముచే రావణుని, రాక్షస సైన్యములను హాహాకారమెత్తింప గల్గిన మహావీరు డాతడు. మరియొక వైపున రామపద పంకజార్చకులలో నద్వితీయుడు నాతడే. రామచంద్రుని సేవించుటయే, యాతని జీవితేచ్ఛ. అందులకై యాతడు తన జీవితము ధారపోయ సమకట్టెను. బ్రహ్మపద ప్రాప్తిని సహితము లక్షింపలేదాతడు అట్టి నిశ్చలమైన భక్తియే దేశమున కిపుడావశ్యకము".

**– "శ్రీ వివేకానంద స్వామీజీ"**

# శ్రీ గురు చరితము

## నలుబది తొమ్మిదవ అధ్యాయము

**ఓమ్ అవధూత చింతనం శ్రీగురుదేవదత్త జయ ఓమ్**

నామధారకుడు సిద్ధముని పాదములకు నమస్కరించి చేతులు జోడించి ఇట్లు ప్రశ్నించుచున్నాడు.

త్రిమూర్త్యవతారమైన గురుమూర్తి భారతదేశమున నెన్నియో క్షేత్రములుండ గంధర్వనగరముననే చాలా కాలము నివసించుటకు ఏమి కారణము? దయయుంచి ఆ క్షేత్రమాహాత్మ్యమును నాకు సమగ్రముగ సెలవిండని ప్రార్థించ సిద్ధముని ఇట్లు చెప్పుచున్నాడు. శ్రోతలారా ! శ్రద్ధతో గంధర్వనగర మహిమను వినుడు.

ఒక సంవత్సరము అశ్వయుజ బ॥ చతుర్దశి దీపావళి మహోత్సవము సమీపించెను. గురుమూర్తి శిష్యులను బిలిచి మనము కాశీ, గయా, ప్రయాగలను త్రిస్థలములకు యాత్రకు పోదమనిరి. శిష్యులు గురుమూర్తి వాక్యమువిని స్వామీ! మేము సకుటుంబముగా వచ్చెదము. యాత్రకు తగిన సన్నాహము చేసికొందుమనిరి. అందుకు స్వామివారు నవ్వి మన గ్రామముననే కాశి గయా ప్రయాగలు కలవు. మీరు యాత్రకు వేరుగ నేమియు ప్రయత్నము చేయనవసరము లేదు. రండని స్వామివారు శిష్యసమేతముగ సంగమమునకు వెళ్లి స్నానమొనర్చి శిష్యులతో ఈ సంగమము ప్రయాగతో సమానము. భీమానదిలో అమరజానది కలియుటచే నీ క్షేత్రము గంగాయమునలు కలిసిన తీర్థరాజము వలె అంతటి మహిమ కలది. ఇచ్చట అమరజానది ఉత్తర వాహినియగుచే నిదికాశీతో సమానము. ఈ క్షేత్రమున ఎనిమిది తీర్థములు గలవు. ప్రత్యేకము ప్రతి తీర్థము యొక్క మహిమ ఎంతవారికి సమగ్రముగా చెప్ప శక్యముకాదు అనిరి. స్వామి వారి వాక్యము విని స్వామీ! ఈ అమరజానది ఎట్లు ఉద్భవించెను. ఈ నదికి అమరజానదియని పేరెందుకువచ్చెనో సెలవిండని గురుమూర్తి శిష్యులతో నిట్లు చెప్పుచున్నారు. శిష్యులారా ! మంచి ప్రశ్న చేసితిరి. వినుడు.

పూర్వము జాలంధరుడను రాక్షసుడు దేవతలనందర యుద్ధమున పరాభవించెను. అనేకమంది దేవతలు అతనిచే సంహరింపబడిరి. ఇంద్రుడు చేయునది లేక కైలాసమున కేగి ఈశ్వరునితో దేవా! జాలాంధరునిచే దేవతలు

సంహరింపబడిరి. నా స్వర్గస్థానమును గూడ అతడు అపహరించెను. మేము రాక్షసులసంహరించినను వారిరక్తబిందువులలో నుండి అసంఖ్యాకముగ రాక్షసులు పుట్టి మాతో యుద్ధమొనర్చుచున్నారు. లోకమంతయు రాక్షసులచే వ్యాప్తమయ్యెనుగాన మిమ్ముల శరణు పొందుచున్నాను. దయయుంచి రాక్షసులసంహరించి మమ్ముకాపాడుడు. మరణించిన దేవతల తిరిగి యేయుపాయము చేతనయిన జీవింప జేయుడని ప్రార్థించెను. ఈశ్వరుడు కరుణించి రాక్షసుల దునుమాడ తాను రౌద్రరూపము దాల్చి బయలుదేరుచు ఇంద్రునకు అమృతరసపూరితమైన ఒక ఘటమును ఇచ్చి ఇందలి అమృతమును మృతులైన దేవతల మీద ప్రోక్షించుము. వారలు బ్రతుకగలరని చెప్పెను.

ఇంద్రుడు అందలి అమృతమును మృతులైన దేవతల మీద చల్ల వారు జీవించిరి. మిగిలిన అమృతము ఇంద్రునిహస్తముననున్న ఘటము నుండి భూమిపై పడెను. అదియే మహా ప్రవాహమై అమరజా యను నదిరూపమున ప్రసిద్ధిగాంచినది. ఇట్టినది యందు ఎవ్వరు భక్తితో స్నానమొనర్చెదరో వారికి కాలమృత్యువులేదు. ఇక అపమృత్యువు ఎట్లురాగలదు. ఈ నదిని స్నానమొనర్చిన దుఃఖములు రోగములు బ్రహ్మ హత్యాది పాతకములు నశించును. ఇట్టి సంజీవినీనది భీమానదితో కలిసి సంగమమయ్యెను గాన నీ క్షేత్రము ప్రయాగతో సమమని వేరుగ చెప్పనవసరము లేదు. వైశాఖ, కార్తీక, మాఘమాసము లందిచ్చట స్నానమొనర్చు వారు ఇహలోకమున సుఖమునొంది అంతమున మోక్షమునొందుదురు. సూర్యచంద్రగ్రహణములందు సంక్రాంతులు పర్వకాలములు ఏకాదశి మొదలగు తిథులందు స్నానము చేయువారు. అనంత ఫలము నొందగలరు. ఘటించిన సర్వకాలములందును స్నాన మొనర్చుట ప్రశస్తము.

ఇవ్విధమున గురుమూర్తి శిష్యులతో నమరజానది మాహాత్మ్యమును చెప్పి అచ్చటికి ఉత్తరముగ కొలది దూరముననున్న అశ్వత్థవృక్షము వద్దకు శిష్యసమేతముగ వచ్చి శిష్యులారా ! ఈ అశ్వత్థము కల్పవృక్షము. ఇచ్చటి తీర్థము మనోహర తీర్థమనబడును. ఈ తీర్థమున స్నానమొనర్చి అశ్వత్థమునకు పూజలు ప్రదక్షిణములు చేయువారికి వారి మనోరథములన్నియు నెరవేరగలవు. నేనెప్పుడు నీ అశ్వత్థవృక్షమందు నివసించెద. నన్ను ఎవ్వరు అశ్వత్థవృక్షమందు ధ్యానించి పూజింతురో వారికి ఈ కలియుగమందును దర్శన మిచ్చెద. అని చెప్పి అచటనున్న సంగమేశ్వర శివాలయమునకు శిష్యుల తీసికొనిపోయి వారితో

శ్రీశైలమున మల్లికార్జునునివలె నీ క్షేత్రమున సంగమేశ్వరుడు భక్తులకభీష్టములివ్వ సమర్థుడు.

ఓ శిష్యులారా! ఈశ్వరునకు ప్రదక్షిణ మొనర్చువారికి అనంతఫలము సిద్ధించును. ప్రథమమున నందీశ్వరునకు నమస్కరించి అచ్చటి నుండి చండీశ్వరుని వద్దకు పోవలెను. చండీశ్వరునకు నమస్కరించి అచ్చటి నుండి మరలి సవ్యముగ నందీశ్వరుని చూచి అచ్చట నుండి సోమసూత్రము సమీపించి తిరిగి నందీశ్వరుని వద్దకు వచ్చి అచ్చటి నుండి సోమసూత్రము చండీశ్వరుని దర్శించి శివుని వద్దకు రావలెను. ఇట్లుచేయు ప్రదక్షిణము శివ ప్రదక్షిణమనబడును. ఇట్లు మూడు ప్రదక్షిణములొనర్చుటచే పాపము లన్నియు పోగలవు. నందీశ్వరుని వృషణముల మీద నెడమచేతి నుంచి కుడిచేతి అంగుష్ఠతర్జనులతో నంది యొక్క రెండు కొమ్ముల స్పృశించి మధ్య నుండి శివుని చూడవలయును. ఇట్లు శివుని దర్శించువారు. పుత్రపౌత్రాభివృద్ధిని ధనధాన్య సమృద్ధిని గూడ నొందగలరు. అని ఇట్లుసంగమేశ్వరుని మహిమ చెప్పి శిష్యులతో గూడ అచటికి కొలదిదూరమునగల వారణాసియను తీర్థము సమీపించి శిష్యులతో నిట్లనెను. ఈ తీర్థము ఇచ్చటికి అర్థక్రోశమున గల నాగేశమను గ్రామము నుండి బయలుదేరెను. దాని వృత్తాంతము చెప్పెదవినుడు.

పూర్వము భరద్వాజగోత్రపు బ్రాహ్మణుడొకడు గలడు. అతడు గొప్పవిరాగియు శివభక్తుడు అగుటచే లోకమునకు పిచ్చివానివలె దేహస్మృతిలేక ఆనందముతో తిరుగుచుండును. అతనికి ఈశ్వరుడనియు, పాండురంగడనియు నిద్దరు సోదరులు కలరు. సోదరులిద్దరును ఒక సమయమున కాశీయాత్రచేయ సంకల్పించి ప్రయాణమగుచు విరక్తుడై అంతర్ముఖుడైయున్న తమ సోదరునితో ఓ పిశాచమా ! మాతో కాశీవచ్చెదవా ! అని యడిగిరి. పామరులకు బ్రహ్మవిధులు పిశాచములవలెను. పిచ్చివారి వలెను గోచరించుట సహజము. సోదరులవాక్యములు విని ఆ బ్రాహ్మ విదుడు విశ్వేశ్వరుడు నావద్దనే గలడనెను. అప్పుడు సోదరులు ఇచ్చటనే విశ్వేశ్వరుడున్న కాశీకిపోవలసిన పని ఏమి? నీవిచ్చట శివుని చూపగలవా! అని అడిగిరి. అప్పుడు తను స్నానమొనర్చి శివునిధ్యానింప నచ్చుట శివుడు ప్రత్యక్షముగ నావిర్భవించెను. ఆ భక్తుడు శివా ! నన్ను అనుగ్రహించి ఈ క్షేత్రము కాశీక్షేత్రముగ నొనర్చుమన ఈశ్వరుడు సంతోషించెను. అచ్చట మణికర్ణిక గుండము ఏర్పడెను. కాశీక్షేత్రమందలి

చిహ్నము లన్నియు నచ్చట అగుపడెను. అదిచూచి అతని సోదరులు ఆశ్చర్యపడిరి. అప్పుడతను మీకు కాశీకిపోనవసరము లేదు. ఇచ్చట స్నానమొనర్చుడు. విశ్వేశ్వరుని పూజించుడు. నా పేరు గోస్వామియందురు. మీరు ఇచ్చట శివుని పూజించుడు. మీరు పండరీపురము వెళ్లి అచ్చట ఆరాధ్యులను పేరుతో పండరీనాథుని పూజించుడు. ప్రతి సంవత్సరము ఇచ్చటకు వచ్చి ఈశ్వరుని పూజించుచుండుడని తన సోదరులకు ఆజ్ఞఇచ్చెను. అప్పటి నుండియు ఈ క్షేత్రమువారణాసీ తీర్థమను పేర ప్రసిద్ధిగాంచినది. ఈ తీర్థము భీమానదిలో కలియుటచే నీ క్షేత్రము కాశీక్షేత్రముతో సమానము గాన నిచ్చట స్నానమొనర్చి శివుని పూజించిరి. అచ్చట నుండి గురుమూర్తి శిష్యులతో కలిసి కొలదిదూరమున నున్న పాపవినాశమను తీర్థమునకు వచ్చిరి. ఏ తీర్థము స్నాన మాత్రము చేతనే అగ్ని తృణరాశిని దగ్ధ మొనర్చు రీతిని సమస్త పాపరాశు ల దగ్ధమొనర్చునో అట్టి తీర్థమును వారు శిష్య సమేతులై వచ్చుసరికి స్వామివారి పూర్వాశ్రమపు సోదరి రత్నాబాయి అచ్చటకు వచ్చెను. స్వామివారు ఆమెతో నీవునన్ను దర్శింపవచ్చితివి. నీవు పూర్వము చేసిన పాపముల తెలసికొంటివా! యనిరి. అప్పుడామె స్వామి వారి పాదములకు నమస్కరించి స్వామీ ! అజ్ఞానురాలను, మూఢురాలను. పూర్వ జన్మమునుగురైరుగు శక్తినాకెక్కడిది. తమరు సర్వజ్ఞులుగాన నాపూర్వార్జితమును చెప్పిన తెలిసికొందుననెను.

స్వామి వారు ఆమెతో నీవు పూర్వజన్మమున ఒక పాపమొనర్చితివి. అదియేమన ఒకపిల్లి నీళ్లకాగులో నైదు పిల్లలపెట్టెను. నీవు చీకటిలో తెలియక కాగులో నీరుపోసి కాచుటచే నా అయిదు పిల్లికూనలు మరణించెను. ఇంకను కొన్ని పాపములు చేసితివి. అవి నేనిదివరకే నీకు తెలిపితిని. ఆ మాట వినుట తోడనే ఆమె శరీరము కుష్ఠ రోగముచే వ్యాప్తమయ్యెను. ఆమె భయపడి స్వామివారికి నమస్కరించి గురునాథ దయాబ్ధే ! రక్షించుడు. పాపనివృత్తి కాంక్షించియే మీ దర్శనార్థము వచ్చితి ననెను. ఆమె వాక్యమువిని ఆమెతో నీవు ఈ పాపఫలము ఈ జన్మలో ననుభవించెదవా ! లేక వచ్చు జన్మలో ననుభవించెదవా ! అని అడిగిరి. స్వామీ నాకు జన్మరాహిత్యమే కావలెను. నాకిక జన్మలేకుండ చేయుడని ప్రార్థించెను. అప్పుడు స్వామివారు కరుణించి ఆమెతో నీవు ఈ పాపనాశన తీర్థమున స్నానమొనర్చుము. నీ పాపము నశించును. నీ విచ్చటనే నివసించి నిత్యము ఈ పాపవినాశన మందు స్నానమొనర్చుచుండుము. ఈ తీర్థమున స్నానమొనర్చుటచే సప్తజన్మార్జిత

పాపములే భస్మములు కాగలవు. నీ కుష్టురోగము నశించు విషయములో సంశయమేలయనిరి. స్వామివారి వాక్యము విని ఆమె ఆ తీర్థమున స్నానమొనర్చగా కుష్ఠరోగము తత్క్షణమే నివర్తించెను. ఈ విషయము నేను స్వయముగ చూచితినని సిద్ధముని నామధారకునితో చెప్పెను.

రత్నావతియు పాపవినాశన తీర్థమహాత్మ్యమున కచ్చెరువంది అచ్చటనే మకాము నిర్మించుకొని నిత్యము అచ్చట స్నానమొనర్చుచు జీవితమును ధన్యమొనర్చుకొనెను. అటు మీద గురుమూర్తి అచ్చటకు మరికొంత దూరముననున్న కోటి తీర్థమునకు వచ్చి శిష్యులతో జంబూద్వీపమున నెన్ని తీర్థములుగలవో అన్ని తీర్థములును ఈ తీర్థమున గలవు. కాననే దీనికి కోటితీర్థమని సార్థకనామధేయము వచ్చెను. సూర్యచంద్ర గ్రహణములు, పూర్ణిమ, అమావాస్య, సంక్రాంతులు ఇట్టి పుణ్యకాలములందిచ్చట స్నానమొనర్చిన అనంతఫలమువచ్చును. ఇచ్చట చేయబడిన గోదానము మొదలగు దానములు కోటిదానముల ఫలమొసంగును. అని గురుమూర్తి శిష్యులతో చెప్ప శిష్యులు అచ్చట స్నానదానము లాచరించిరి. గురుమూర్తి అచ్చట నుండి శిష్యుల రుద్రపాదమును పేరుగల తీర్థమునకు గొనివచ్చిరి. శిష్యులతో ఇచ్చట రుద్రపాదముల నర్చించుటచే కోటి జన్మార్జిత పాపములు గూడ నశించును. ఈ తీర్థముగయతో సమము అని చెప్పి అచ్చట నుండి శిష్యుల చక్రతీర్థమునకు గొనివచ్చిరి. అచ్చట కేశవదేవాలయము గలదు. శిష్యులతో నీ తీర్థమున స్నానమొనర్చి కేశవుని పూజించువారు జ్ఞానవంతులగుదురు. ఈ తీర్థమున వేయబడిన అస్థులు (ఎముకలు) చక్రాంకితములగును. ఈ తీర్థము ద్వారకతో సమమని చెప్ప శిష్యులచ్చట స్నానదానము లాచరించిరి. అచ్చట నుండి గురుమూర్తి శిష్యులను గ్రామము నకు పూర్వభాగముననున్న మన్మథతీర్థమునకు గొనివచ్చిరి. అచ్చట కల్లేశ్వరుడను శివాలయము గలదు. ఈ కల్లేశ్వరుడు శ్రీశైల మల్లికార్జునుని తోడను, గోకర్ణమందలి మహాబలేశ్వరుని తోడను సముడని శిష్యులతో చెప్పిరి. ఈ మన్మథ తీర్థమున స్నానమొనర్చి కల్లేశ్వరుని పూజించువారు అష్టఐశ్వర్యములతో తులతూగగలరు. శ్రావణమాసమున అఖండాభిషేకము కార్తీకమాసమున దీపమాలికలచే కల్లేశ్వరుని పూజించుటచే అక్షయమగుపుణ్యము లభించును. అని ఈ విధమున నాదినమున శిష్యులకు గణగాపురమునందలి అష్టతీర్థముల నెరుక పరచిరి. శిష్యులందరు నానందభరితులైరి. స్వామి వారితో మేమిచ్చట

నివసించియు ఇంతకాలము వరకు ఈ క్షేత్రమహిమను గుర్తెరుగమైతిమి. తమ కృపచే నేటికి తెలిసికొంటిమి అని చెప్పి ఆ దినమున శిష్యులందరు గొప్ప ఉత్సవముతో స్నానదానము లాచరించిరి. బ్రాహ్మణ సమారాధన చేసిరి. ఇవ్విధమున గురుమూర్తి శిష్యుల కృతార్థులగావించుచు గంధర్వపురమున నివసించిరని సిద్ధముని నామధారకునకు చెప్పెను.

**ఇట్లు గురుచరితమందు నలుబది తొమ్మిదవ**
**అధ్యాయము సమాప్తము.**

**దిగంబరా దిగంబరా శ్రీపాదవల్లభ దిగంబరా**

తన పూర్ణాశ్రమ భగినిమైన రత్నాబాయిని పాప వినాశన తీర్థము యొక్క మహిమచే కుష్ఠురోగము నుండి విముక్తురాలను చేయుట.

# శ్రీ గురు చరితము

## ఏబదియవ అధ్యాయము

**ఓమ్ అవధూత చింతనం శ్రీగురుదేవదత్త జయ ఓమ్**

సిద్ధముని నామధారకునితో ఓ నామధారకా! నీకు ఈ గురుచరిత్రమందు (9) వ అధ్యాయమున ఒక రజకుడు గురుమూర్తి అనుగ్రహమునకు పాత్రుడైన విషయము, అతనిని గురుమూర్తి రాబోవు జన్మమున నీవు మ్లేచ్ఛకులమున చక్రవర్తివై జన్మింపుమని ఆశీర్వదించిన విషయము నీవు వినియుంటివి. వాడు గురుమూర్తి ఆజ్ఞప్రకారము వైడూర్య నగర (బీదర్) మున మ్లేచ్ఛకులమున రాజై జన్మించెను. అష్టైశ్వర్యములతో తులతూగుచు పుత్రపౌత్రాదులతో సమేతుడై జాతిహీనుడైనను పూర్వ సంస్కారమును బట్టి పుణ్యకర్మలందును దానధర్మములందును. ఆసక్తి కలవాడై యుండును. ఇంతియకాక బ్రాహ్మణులందు భక్తిగలవాడై దేవాలయములకు తీర్థక్షేత్రములకు నుపద్రవముచేయక చక్కగ రాజ్యమేలుచుండెను. అతని పురోహితులు రాజుతో ఓ రాజా! నీవు మ్లేచ్ఛుడవు అయినను హిందువుల ద్వేషింపక వారలతో మైత్రి చేయుచున్నావు. ఇట్లు చేయుట మనజాతికి విరుద్ధము. అట్లొనర్చిన నీకు పాపము రాగలదు. ఎవ్వరి ధర్మము ప్రకారము వారు నడువవలయును. హిందువులు తెలివిలేనివారు గాననే రాతిబొమ్మలను కట్టె బొమ్మలను దేవతలని కొలుచుచుందురు. గోపు నీరు నిప్పులను గూడ దేవుడని కొలుచుచుందురు. నీవిక మీద మ్లేచ్ఛధర్మము ప్రకారము నడచుటమంచిదని హితబోధచేయ ఆ మ్లేచ్ఛరాజు తనమ్లేచ్ఛ స్నేహితులతో నిట్లనుచున్నాడు.

మీరు చెప్పినది సరికాదు. దేవుడు ప్రతి అణువునందును తృణము నందును. సర్వత్రకలడు. పరమేశ్వరుడు తన సంకల్పముతో నీజగద్రూపమై ప్రతి వస్తువునందును లోపల నంత ర్యామియై ఇమిడియున్నాడు. గోవులువేరైనను పాలుఒకటియై నటుల ఆభరణములు వేరుగనున్నను సువర్ణ మొక్కటియైనటుల జగత్తుతోని పదార్థములు వేరువేరుగ కనబడుచున్నను అన్నిటి యందును నున్న పరమాత్ముడొక్కడే. కుండలు వేరు వేరుగ నున్నను అందలి ఆకారమునకు భేదము లేదు గదా! నామ రూపాత్మకమైన జగత్తంతయు సూత్రము మీద మణులున్నటుల పరమాత్మ మీద ఓతప్రోతమైయున్నది. జాతులు వేరైనను

అన్ని జాతులచే నారాధింపబడు దేవుడొక్కడే అట్టి దేవుడు ఆకాశము వలె సర్వవ్యాపకుడు. అట్టి నిరాకారమై సర్వవ్యాపకమైన పరమాత్మను తెలిసికొనుటకు చిత్తశుద్ధి అవసరముగాన చిత్తమును నిలుపగలందులకు గాను హిందువులు, విగ్రహములను, గోవులను పూజింతురు. వారుగూడ చిత్తశుద్ధి గలిగిన తరువాత విగ్రహారాధన మాని నిరాకార మైన తత్వమునే ధ్యానింతురు. వారి వారి భావనను బట్టి భగవంతుడు వారి వారికి ఫలముల నొసంగును. భగవంతునకు అందరును సమానముగాన మీరు ఇక మీద హిందువుల ధూషింపకుడు. ఎవ్వరికి ఏ ధర్మము విహితమో వారు ఆ ధర్మము నాచరించుట వలన శ్రేయస్సునే పొందెదరు. ఎవరి మతము ప్రకారము వారు నడచుకొనవలెనని తన పురోహితులకు హితము చెప్పి తాను యధాపూర్వముగ దేవ బ్రాహ్మణభక్తిగలవాడై పుణ్యకర్మల నాచరించుచుండెను. ఇట్లుండ ఆ మ్లేచ్ఛరాజు రాజ్యమేలుచుండ దైవయోగముచే నతని తొడమీద నొక వ్రణము లేచుట సంభవించెను. ఎన్నియో చికిత్సలు చేసిరిగాని వ్రణబాధతగ్గక పోగా దినదినమునకు ఎక్కువగుచుండెను.

ఇట్లుండ గంధర్వనగరమున గురుమూర్తి సర్వజ్ఞులు గాన మ్లేచ్ఛ రాజు తన దర్శనమునకు రాగలడు. అతడు వచ్చిన బ్రాహ్మణులకు బాధ కలుగును. నా అవతార ప్రయోజనము పూర్తి అయినది, కలియుగమగుటచే నేను అంతర్ధాన మొందుటయే ఉచితము లేనిచో నిక మీద మ్లేచ్ఛులు గూడ నాదర్శనార్థము రాగలరు. బహుధాన్య సంవత్సరము బృహస్పతి సింహరాశిలోనికి రాబోవుచున్నాడు. గాన గౌతమీ తీర్థయాత్ర యను మిషతో నేను గణగాపురము వదలి వెళ్లెదననిభావించి శిష్యులతో నేనిచ్చట నుండిన ఇక మీద మ్లేచ్ఛులు గూడ నావద్దకు వత్తురు. అందుచే మా ధర్మములకు కష్టము రాగలదు. కాన నేను గౌతమీ నదికి యాత్రగ పోదలచితిని. అనిరి. శిష్యులు గురుమూర్తి వాక్యము విని ఏమి చేయవలయునో తోచక మ్లేచ్ఛులు వచ్చినను శ్రీదత్తదేవుడే తమను రక్షించి గలడను నమ్మకముతో నుండిరి.

మ్లేచ్ఛరాజు వ్రణముచే బాధపడుచుండెను. ఎన్ని చికిత్సలు చేసినను ప్రయోజనములేకపోయెను. అప్పుడు రాజు బ్రాహ్మణుల పిలిచి నాకీ వ్రణము తగ్గ ఉపాయమేమియైన నుండిన చెప్పుడని ప్రార్థింప బ్రాహ్మణులు అతనితో నిట్లనుచున్నారు.

ఓ రాజ ! వినుము పూర్వజన్మములో చేసిన పాపముల వలననే వ్యాధులువచ్చును. తీర్థయాత్రలు, దేవతల పూజలు, దానములు ఆచరించుట

చేత వ్యాధులు పోగలవు. సత్పురుషుల దర్శనముచే అరువది (60) జన్మల పాపములు గూడ నశించగలవు. నీవు సత్పురుషుల దర్శించితివేని నీ పాపము నశించును. నీ వ్రణము ఉపశమించి నీకు ఆరోగ్యము వచ్చుననిరి. బ్రాహ్మణవాక్యములు విని భక్తితో ఓ మహాత్ములారా ! నేను మ్లేచ్ఛుడనని ఉపేక్షించకుడు. నేను మీ సేవకుడను. పూర్వ జన్మములో నేను గురుసేవ చేసియుండుట చేతనే ఈ జన్మలో రాజునైతిని. పాపవశమున మ్లేచ్ఛ కులమున జన్మించితిని. మహాత్ముల దర్శనము వలన రోగములు నశించునని చెప్పితిరి. అట్టి వారి దర్శనము వలన ఎవ్వరికైన రోగనివృత్తి అయ్యేనా ! నాకు విశ్వాసము కలుగగలందులకు ప్రశ్నించుచున్నాను అని రాజు అడుగ నా బ్రాహ్మణులు అతనితో నీ ప్రశ్నలకు రహస్యస్థలమున సమాధానము చెప్పెదము నీవు ఏదియో ఒక నిమిత్తమును కల్పించుకొని మీ నగరసమీపమున పాపవినాశనమను తీర్థముకలదు. అచ్చట ఒంటరిగ రమ్ము. అచ్చట నీకు సత్పురుష దర్శనమువలన గలుగు ఫలమును తెలియపరచెదమనిరి.

రాజు బ్రాహ్మణుల వాక్యము శిరసావహించి ఒక దినమున పరివారమును విడనాడి ఒంటరిగా పాపవినాశన తీరమున కేగి అచ్చట స్నానమొనర్చి కూర్చుండెను. అప్పుడు ఒక బ్రాహ్మణయతి అచ్చటకు వచ్చెను. రాజు ఆ యతికి నమస్కరించి తన వ్రణము చూసి అది శమించు నుపాయమేమియైన నుండిన చెప్పుడని వినయముతో ప్రార్థింప నాయతి ఆ రాజుతో నిట్లను చున్నాడు. ఓ రాజా! వినుము సాధువుల దృష్టిపడినమాత్రము ననే నీ వ్రణము శమించి నీకు ఆరోగ్యము కలుగును. ఇందుకు గాను నీకొక ఇతిహాసమును చెప్పెద వినుము.

పూర్వము అవంతినగరమున నొక దురాచారుడగు బ్రాహ్మణుడుండెను. అతను జాతికి బ్రాహ్మణుడైనను బ్రాహ్మణధర్మమును విడనాడి వరస్త్రీలోలుడై స్నానసంధ్యాదుల త్యజించి దురాచారుడై పింగళయను వేశ్య యింటనే నివసించుచు అచ్చటనే భుజించుచు అహోరాత్రులు దానితో క్రీడించుచుండెను. ఇట్లుండ ఋషభుడను నొక మహాయోగి దైవయోగమున నొకదినము సాయంకాలమునకు ఆ పింగళ యింటివద్దకు రాగా నా నీచ బ్రాహ్మణుడు ఆ ఋషికి ప్రణమిల్లి ఆహ్వానమొనర్చి ఇంటిలోపలికి గొనిపోయి ఆసనమున కూర్చుండబెట్టి షోడశోపచారములతో వేశ్యాసమేతుడై పూజించి, ఆఋషీశ్వరుని

పాదతీర్థమును తానును ఆవేశ్యయును గ్రహించి వారికి పక్వాన్నములతో భోజనమిడెను. అనంతరము వారి హస్తములు పాదుకలు కడిగి తుడిచి తాంబూలమిడి మంచిమృదువైన తల్పమున పరుండబెట్టి ఆవేశ్యయుతానును ఆఋషీశ్వరుని పాదసంవాహన మొనర్చిరి. ఇట్లు వారిచే పూజింపబడి ఆరాత్రి వారియింట సుఖముగ నిద్రించి తెల్లవారుట తోడనే ఆఋషీశ్వరుడు యథేష్టముగా తన త్రోవను తానుపోయెను.

కొంతకాలమునకు ఆ బ్రాహ్మణుడు ఆవేశ్యయును వార్ధక్యమురాగా మరణించిరి. ఒక దినము మాత్రమే సాధు సేవచేసిన పుణ్యవశమున ఆ బ్రాహ్మణుడు దశార్ణదేశమునకు రాజైన వజ్రబాహు మహారాజు యొక్క పెద్దభార్యయగు సుమతి గర్భమున జన్మించెను. రాజు తన పెదభార్య గర్భవతి యైనందుకు కడుసంతసించి పుంసవనాది సంస్కారములను గొప్ప వైభవముతో గావించెను. ఇట్లుండ నా రాజు యొక్క చిన్న భార్య తనకు సంతానము లేక తన సవతికి సంతానము కలిగిన రాజుకు తనయందు ప్రేమతగ్గునని భావించి అసూయతో సుమతికి తీవ్రమగు గరళమును భోజనముతో కలిపి యొసంగెను సుమతి శరీరమంతయు విషముతో వ్యాప్తమయ్యెను. గాని దైవయోగమున మరణించకుండెను. నవమాసములు నిండ కష్టముతో ప్రసవించెను. గాని బాలుడు గూడ విషము జీర్ణించుటకే తల్లి వలె శరీరమంతయు విషవ్రణములు గలవాడై జన్మించెను. వ్రణబాధతోనా బాలుడు రాత్రిందినములు నిద్రాహారములు లేక నేడ్చుచుండెను. రాజు, తన భార్యయు కుమారుడును విషవ్రణములతో దుఃఖపడుచుండుట చూచి చింతాక్రాంతుడై అనేకమంది వైద్యులపిలిచి ఎన్నియో చికిత్సల చేయించెను గాని విషవ్రణములు శమింపమయ్యెను. తల్లికి కుమారునకు గూడ వ్రణముల నుండి చీము పురుగులు గూడ పడుచుండెను. ఇట్లురాణియు బాలుడును కడుదుఃఖము ననుభవించుచుండిరి. నిద్రాహారములు లేక కృశించుచుండిరి. ఇట్లుండరాజు వారల చూచి "ఎన్ని చికిత్సలు చేయించినను వీరల వ్యాధి తగ్గుట లేదు ఏమిచేయుదు వీరల బాధచూచి సహించుటగూడ దుర్భరముగనున్నది. వీరు పూర్వజన్మమున మహాపాపమాచరించిరి. వారి పాపము వారు అనుభవించియే తీరవలయును. ఇకమీద వారల చూడజాలనని భావించి తన సూతుని పిలిచి అతనితో నీవు రాణిని ఆమె కుమారుని రథము మీద గొనిపోయి నరసంచారములేని కీకారణ్యమున వదలి రమ్మని యాజ్ఞాపించి నా సూతడట్లేచేసివచ్చెను. నగర

మందలి ప్రజలందరు రాజు చేసిన ఘోరకృత్యము చూచి హాహాకారము లొనరించి రాజును దూషించిరి. రాజు ఈ విషయమును ఇతర భార్యలతో చెప్పవారు సంతసించిరి. రాజు ఇతర భార్యలతో సుఖించుచుండెను.

రాణి బాలునితో సహ అరణ్యములో అన్నోదకములు లేక ఎంతయో కష్టమునొందుచు నడచుటకు మార్గమైన లేనందున నటు నిటు ముళ్లకంపలలోను రాళ్లగుట్టలలోను మెల్ల మెల్లన తిరుగుచు వ్యాఘ్రములు సర్పములచూచి భీతిల్లుచు దప్పికయైనను త్రాగుటకు నీరు లేక బాధపడుచు దైవవశమున అరణ్యమార్గమున కొంతమంది వైశ్యులు గోవుల తోలుకొని పోవుచుండ వారల సమీపించి ఇచ్చట ఎక్కడనైనా ఉదకము దొరుకునాయని అడిగెను. అప్పుడు వారు ఈ సమీపముననే ఒక గ్రామము గలదు. మావెంటరమ్ము అని ఆమెను వెంటనిడుకొని వారి గ్రామమున కామెను గొని పోయిరి. ఆ గ్రామమును పద్మాకరుడను వైశ్యుడు పరిపాలించుచుండెను. అతడు పుణ్యాత్ముడు. దయాళువు నగుటచే నతడు రాణిని ఆదరించి ఆమె పూర్వవృత్తాంతము తెలిసికొని ఆమె నివాసమునకొక గృహమిచ్చి అన్నపానములు గూడ యథేచ్ఛగ నొసంగుచు పోషించుచుండెను.

కొంతకాలమట్లు జరుగుచుండెను గాని వ్రణములు మాత్రము ఎన్నిచికిత్సలు చేసినను ఉపశమింపకుండెను. ఇట్లుండ నొకదినమున నామె కుమారుడు వ్రణపీడితుడై మృతినొందెను. అప్పుడు రాణి పుత్రుని మరణమునుచూచి మూర్ఛనొంది లేచి పుత్రునిగూర్చియు, తన పూర్వస్థితిని స్మరించియు మిక్కిలి దుఃఖించెను. వైశ్యునిభార్యయు ఇతర స్త్రీలును ఎంతయో ఓదార్చిరి గాని ఆమె దుఃఖముశమింపదయ్యెను. హాకుమారా! భర్తయు బంధువులు గూడ విడనాడినను నిన్ను చూచి బ్రతుకుచుంటిని నన్ను వదలి నీవెట కేగితివి! నీవునన్ను రక్షింతువనుకుంటిని. నీవు మరణించితివి. ఇక నాకు రక్షకులెవ్వరు? నేనును ప్రాణము విడిచెద. అని ఇట్లు రాజు భార్య శోకించుచుండ నానగర మందలివారందరును దుఃఖింపసాగిరి.

అట్టిస్థితిలో ఋషభయోగి ఆ పిల్లవాడు పూర్వజన్మమున తనకు ఒక దినము రాత్రిచేసిన పరిచర్యను స్మరించి ఆ బాలుడు మరణించి పడియున్న స్థలమునకు వచ్చెను. వైశ్యుడు ఆయోగీంద్రున కర్ఘ్యపాద్యముల నిచ్చి పూజించెను. అప్పుడా యోగియువైశ్యునితో ఏమియు తెలియనివాడువలె ఈమె ఎవ్వరు? ఎందులకు ఏడ్చుచున్నది. అనియడుగ నావైశ్యుడు ఆమె వృత్తాంతమంతయు చెప్పెను.

అప్పుడా ఋషభయోగి ఆమెను సమీపించి ఇట్లనెను.

ఓ రాణి ! ఎందులకు మూఢురాలవై శోకించెదవు ! పుట్టున దెవరు చచ్చునదెవరు ! ఆత్మకా పుట్టుక లేదు. చచ్చుట లేదు. ఆత్మ ఎవ్వరికి గోచరమగునదేకాదు. దేహమా? ఇది పాంచ భౌతికము, పుట్టుటకు పూర్వము లేదు. మధ్యనకొంతకాలము నీటిలో తరంగ ఫేన. బుద్బుదములవలె కొంతకాలము కనబడి నశించును. పంచభూతముల చేరిక వలన నేర్పడిన శరీరమందు జీవుడు సూక్ష్మశరీరసమేతుడై కర్మముననుసరించి సంచరించి కర్మ తీరినతోడనే దేహమునువిడనాడును. అప్పుడు ఈ స్థూలశరీరము జడమైపడిపోవును. ఆత్మకు నాశమేలేదుగాన నీకు శోకము తగదు. జీవుడు ప్రకృతి గుణములకులోనై కర్మబంధములో పడి సత్వగుణమునుబట్టి దేవత్వమును, రజోగుణము వలన మనుష్యత్వమును తమోగుణము వలన తిర్యక్త్వమును పొందును. ఎప్పుడు గుణములకతీతుడగునో అప్పుడు జీవుడు జన్మమరణ పరంపరల నుండి విముక్తిగాంచును. ఏ గుణము ప్రబలముగ నుండజీవుడు మరణించునో వచ్చు జన్మ ఆగుణముననుసరించియే వచ్చును. ఈ సంసారమున జన్మించు ప్రతిజాతియు సుఖదుఃఖములను, జన్మమరణములను కర్మననుసరించియే పొందుచుండును. కోటికల్పముల ఆయుష్యముగలవారైనను చివరకు మరణించ వలసినదేకదా! ఇక స్వల్పాయుష్యము గల మనవంటి వారల విషయము చెప్పనేల. ఈ విషయము తెలిసిన విజ్ఞులు జన్మయందు మోదమును. మరణమందు విషాదమును పొందరు. జీవుడెప్పుడు గర్భమున ప్రవేశించెనో మృత్యువు అప్పటి నుండియు అతనినాశ్రయించియేయున్నది. కొందరు బాల్యమునను, కొందరు తారుణ్యమునను మరికొందరు వృద్ధాప్యమునను మరణింతురు. ఏ జీవి ప్రారబ్ధము ప్రకారమాజీవి జన్మమరణముల నొందు చుండును. ఇట్లుండ తత్వము తెలిసికొనలేక పుత్రుడు భార్యయని మోహముతో మానవులు బంధము నొందుచున్నారు, బ్రహ్మలలాటమున లిఖించినవ్రాతను మార్చుగల శక్తిదేవతలకు గూడ లేదు. పూర్వజన్మలో నీవు ఎవ్వరికి తల్లివో ఎవ్వరికి భార్యవైతివో. అప్పుడు నీచుట్టములెవ్వరో విచారిచుము వారల గూర్చి నీవు దుఃఖించుచుంటివా! కాన నేచెప్పిన రీతిని విచారించి శోకమువిడనాడి ఈశ్వరుని శరణుపొందుము. కృతార్థురాలవు కాగలవు. అని ఋషిచెప్ప నారాణితిరిగి వారితో నిట్లనుచున్నది.

ప్రభో ! ఋషిపుంగవా ! నేను రాజభ్రష్టురాలనగుటయే గాన ఇట్టి స్థితి నొందితిని. ఈ పుత్రుడు జీవించగలడను ఆశతో తల్లిదండ్రుల నందరగూడ విడనాడితి. ఇట్టి స్థితిలో నా ప్రాణ ప్రియుడగు పుత్రుడే మరణించ నిక నేనుజీవించి ఏమి ప్రయోజనము ! నేనును మరణించెదనని చెప్పి మరణోన్ముఖురాలై యాఋషిపాదముల మీద పడెను. అప్పుడు ఆయోగీంద్రులు ఆ బాలుడు పూర్వజన్మమున తనకు చేసిన సేవనుస్మరించి ప్రసన్నుడై కొంచెము భస్మము మంత్రించి కొంతబాలుని మీద చల్లి కొంత నోటిరోనుంచ వాడు నిద్రలోపోయినవానివలె లేచి కూర్చుండెను. ఆ బాలుని శరీరము దివ్య కాంతివంతమయ్యెను. వ్రణబాధ నివర్తించెను. మరికొంత భస్మము నా రాణి మీద ప్రోక్షించనామెయు వ్రణబాధపోయి సువర్ణ కాంతి గల శరీరము కలదయ్యెను. యోగీశ్వరుడు వారలకు వరములననుగ్రహించెను. ఆ బాలునకు భద్రాయువను నామమిడి ఈ బాలుడు కీర్తిమంతుడై గుణసంపన్నుడై తండ్రివలె చిరకాలము రాజ్యమేలగడని ఆశీర్వదించి వెడలిపోయెను. భద్రాయువను బాలుడు ఋషభయోగీంద్రుల ఆశీర్వచన బలమున నిహాలోకమున నఖండసౌఖ్యము ననుభవించెను.

కాన నోరాజా ! సత్పురుషుల సేవించుటచే సర్వ వ్యాధులు తప్పక నివర్తించగలవు. కాన నీవు చింతింపక సత్పురుషుల దర్శింపుము. నీకు వ్రణమునివర్తించునని చెప్ప నా తురుష్కరాజు ఆ యతికి నమస్కరించి ప్రస్తుతకాలములో నెవ్వరైన అట్టి సత్పురుషులు ఉన్నదయతో సెలవిండు. నేను సత్వరమువెళ్లి వారినిదర్శించెద వారి దర్శనమాత్రముచేతనే నా వ్యాధి నయమగునని నమ్మకము నాకు గలదు అని ప్రార్థించ నాయతి ఓ రాజా! భీమాతీరమున, గంధర్వపత్తనమునపరమ పురుషుడు. భగవంతుడు నృసింహసరస్వతియను నామముతో వెలయుచున్నారు. నీవు వారి నిదర్శించితివేని తప్పక నీకు ఆరోగ్యము కలుగును అని చెప్పిపోయెను.

వెంటనే ఆతురకరాజు విశ్వాసము గలవాడై చతురంగ బలముల వెంటనిడికొని గంధర్వనగరము సమీపించి గ్రామస్థులతో ఈ గ్రామమున నొకతాపసి సన్యాసిరూపముననున్నారని వింటిని. వారెక్కడనున్నారో చెప్పుడని యడుగ గ్రామస్థులు తురుష్కుడు వచ్చెను. ఏమిచేయునోయని భీతిల్లిరి రాజు తిరిగి వారలచూచి స్వామివారిని చూడవచ్చితిని మీరు చెప్ప రెందులకని

కోపముతో బలుక వారు స్వామివారు అనుష్ఠానమునకు సంగమమునకు వెళ్లిరి. మధ్యాహ్నమునకు గ్రామమునకు భిక్షకురాగలరని చెప్పిరి. వారి వాక్యమువిని తనపరివారము నచ్చటనే ఉంచి తాను ఆందోళిక నధిష్ఠించి సంగమమునకు వెళ్లి దూరముననే ఆందోళిక నుండి దిగి పాదచారియై స్వామి వారిని సమీపించి నమస్కరించెను.

స్వామి వారు రాజునుచూచి ఓరీ ! చాకలీ ! వచ్చితివా ! ఎంతకాలమునకు నిన్ను చూడగలిగితిననిరి. స్వామి వారి వాక్యము వినుట తోడనే అతనికి పూర్వజన్మజ్ఞానము కలిగిన సాష్టాంగముగ నేలపైబడి నమస్కరించి భక్తిపరవశుడై ఆనందాశ్రువుల కార్చుచు నేలపై పొరలుచు లేచి ఏడ్చుచు తన పూర్వజన్మను స్మరించి గద్గదధ్వనితో నిట్లనుచున్నాడు. స్వామీ ! నన్ను మీరు ఉపేక్షచేసితిరి. గృహస్థకూపమున పడిపోతిని. మదించి మీచరణముల మరచితి. దుష్టబుద్ధినై సంసారసాగరమున మునిగితి. మాయాజాలములో చిక్కుకొని మీ పాదముల స్మరించనైతిని. మతిహీనుడనై మీసాన్నిధ్యమును విడనాడితిని. మీరు అజ్ఞానుల నుద్ధరించువారై యుండియు నన్నెందులకు ఉపేక్షించి అజ్ఞానమహాసముద్రమున పడవేసితిరి. నన్ను దయయుంచి జన్మపరంలో తిరిగి పడకుండ నుద్ధరించుడని దీనుడై ప్రార్థించెను. గురుమూర్తి సంతసించి రాజుతో నీకోరిక ఫలించుగాక యని యాశీర్వదించిరి.

అప్పుడు రాజు స్వామివారితో తొడమీద నొక రాచపుండు లేచి అపరిమితమైన బాధపడుచున్నాననెను. అప్పుడు స్వామివారు వానితో ఓరీ ! అబద్ధమాడుచున్నావు. ఏది చూపుము చూచెదననిరి. వాడు స్వామి వారి వాక్యములు విని ఆశ్చర్యపడి కట్టువిప్పిచూడ తొడమీద వ్రణము యొక్క గుర్తైనలేకపోయెను. అప్పుడతడు ఆశ్చర్యము నొంది సంతసించి స్వామివారి పాదములమీదపడి నమస్కరించి స్వామీ ! మీ ప్రసాదమువలన రాజ్యమునొందితిని. ఐశ్వర్యమునకా మితిలేదు. పుత్రపౌత్రాదులుగలరు. నా మనస్సు తృప్తినొందెను. కాని ఒక కోరిక కలదు, తమరు దయయుంచి నారాజ్యమునకు వచ్చి నా ఐశ్వర్యమును తిలకించుడు. అటు పిమ్మట నేను ఈ సంసారభారము విడనాడి మీపాదదాసుడనై యుండెద. ఇదియే నాకోరిక అనెను.

ఆ రాజు మాటవిని స్వామివారు ఓరీ ! నేను సన్యాసిని. మీరుతురకలు మీ గ్రామములో గోహత్యలు జరుగుచుండును. తురుష్కులు మహాపాపము లాచరింతురు. అట్టి మీనగరమునకు నేనెట్లురాగలను అనిరి. అప్పుడు ఆరాజు

దీనుడై నేను ప్రస్తుతము నీచజాతిలో తురుష్కరాజునై జన్మించినను పూర్వము మీదాస్యమొనర్చిన చాకలినే గదా ! మీయనుగ్రహముచే రాజునై ఈ జన్మలో సమస్తసుఖముల ననుభవించితిని. తమరు వచ్చి నా పుత్రపౌత్రాది సంపద వీక్షించిన నాకు సంతోషమగును. అనంతరము సర్వమువిడనాడి మీపాదసేవ యొనర్చెదననెను. ఇటుల ఆ రాజు దీనుడై మాటి మాటికి ప్రార్థించ గురుమూర్తి తనమనమున నిట్లు విచారించిరి.

నేనికమీద నీలోకమున నుండదగదు. ఉంటినేని నీచులు గూడ నన్ను వచ్చి ఆశ్రయింతురు. కలిప్రబలుచున్నది కాననేను గౌతమీయాత్రయను మిషతో నీక్షేత్రము విడనాడి మ్లేచ్ఛునిమనోరథము తీర్చి సింహరాశిలోనికి బృహస్పతి వచ్చెనుగాన గౌతమీపుష్కర స్నానమొనర్చి ఈ లోకమున నిక నదృశ్యరూపముననుండెద. అని భావించి రాజుతో కొలది శిష్యులతో సహ బయలుదేరిరి.

మ్లేచ్ఛరాజు గురుమూర్తిని పాలకియందు కూర్చుండబెట్టి వారి పాదుకల శిరసావహించి పాదచారియై నడుచుచుండెను. స్వామివారాతనితో నీవు రాజువు గాన గుఱ్ఱమునధిష్ఠించుము. లేనిచో సేవకుడనైన రజకుడనేగద! పరశువేదిచే లోహము సువర్ణ మైనరీతిని మీయనుగ్రహముచే రాజునైతిని. మీరే రాజులు నేను మీ సేవకుడను అనుచు స్వామివారితో సహపాదచారియై గణగాపురము సమీపించి అచ్చటనున్న తనరథగజతురగాది సైన్యమునంతను గురుమూర్తికి ప్రదర్శింపచేసెను. గురుమూర్తి అతని సంపదచూచి సంతసించి అతనితో చాలా దూరము ప్రయాణము చేయవలయునుగాన నాయాజ్ఞననుసరించి గుఱ్ఱమునధిష్ఠించమన నారాజు గురుమూర్తి శిష్యుల నందరను ప్రత్యేకపు గుఱ్ఱముల మీద నెక్కించి తానుగూడ గుఱ్ఱమునధిష్ఠించెను. ఆరాజుతనకు గురుదర్శనభాగ్యమబ్బెనని సంతోషములో పరవశుడై యుండెను. స్వామివారాతనిపిలిచి ఓరీ ! నీవు నీచకులమున పుట్టినను భక్తికి సంతసించితిని. నేనొకమాటచెప్పెద వినుము, మేముతాపసులము. నేను నీవెంట వచ్చుచో మాకు అనుష్ఠాన భంగమువాటిల్లును. నేనుముందుగ వెళ్ళి పాపవినాశనము వద్దనుందును. నీవుపరివారముతో సహమెల్లగవచ్చి అచ్చటనన్ను దర్శించుము అని చెప్పి శిష్యసమేతముగ నంతర్ధానమొంది వైడూర్య నగరమునకు కొలదిదూరమున నున్న పాపవినాశనము చేరి అనుష్ఠానమొనర్చుచుండిరి.

స్వామి వారచ్చటకు వచ్చుట వైడూర్యనగర ప్రాంతమున కాపురమున్న సాయందేవుని కుమారుడు నాగనాథుడు విని స్వామివారిని శిష్యసమేతముగ తనగృహమునకు కొనిపోయి షోడశోపచారములతో మహాపూజగావించి భిక్షచేసెను. స్వామివారు నాగనాథునితో మ్లేచ్ఛరాజు నాదర్శనముకొరకు సాయంకాలమునకు పాపనాశనము నకు రాగలడు. నేనిచ్చట నుంటినేని నాకొరకు అతడు మీగృహము నకువచ్చుచో మీయాచార ధర్మములకు భంగము వచ్చును, గాన నేనచ్చటకు పోయెదనని చెప్పి శిష్యసమేతముగ పాపనాశనము చేరి అచ్చట అనుష్ఠానమొనర్చుచుండెను.

తురుష్కరాజు గురుమూర్తి శిష్యసమేతముగ అంతర్ధాన మొందుటచూచి ఎంతయువిచారించి గురుమహిమ తెలిసిన వాడగుటచే తనమనమున నిట్లు అనుకొనెను. గురుమూర్తి మహిమ నెవ్వరు తెలిసికొనగలరు? నా భాగ్యము మంచిది గాననే వారి చరణదర్శనమయ్యెను. వ్రణమనుమిషచే వచ్చివారిని దర్శించితిని. వారి దర్శనమాత్రముననే వ్రణము అదృశ్యమయ్యెను. "నేను ముందు వెళ్ళి పాపనాశనముననుందు" మనిరి గదా! వారు మనోవేగమున నచ్చట కేగియుందురని ఆ రాజు నిశ్చయించుకొని వేగమునపోగల గుఱ్ఱము నెక్కి నలుబది నాలుగుకోసులదూరము దినమంతయు ప్రయాణమొనర్చి సాయంకాలమునకు పాపవినాశనము సమీపించి అచ్చట స్వామివారిని దర్శించెను. స్వామి వారికి నమస్కరించి తన నగరమునకు దయచేయుడని ప్రార్థించి నగరమంతయు ముత్యాలతోరణములతోడను. పతాకములతోడను అలంకరింప చేసి స్వామివారిని దివ్యమైన పల్లకిలో కూర్చుండబెట్టి తాను పాదచారియై నగరమంతయు ఊరేగింపుచేసెను. నగరస్థులు స్వామివారికి ఇంటింట రత్నాలహారతులనిచ్చిరి. మ్లేచ్ఛజాతి వారున్నూమాత్రము ఈ రాజుజాతి ధర్మమువిడిచి విప్రుల పూజించుచున్నాడు. ఎవరిముఖము చూడరాదో అట్టివారి సేవచేయుచున్నాడు. ఇతను జాతి భ్రష్టుడయ్యెనని నిందించుచుండిరి. మంచివారు మాత్రము రాజుయొక్క మంచిస్వభావము చూచి వేయినోళ్ల పొగడుచు రాజును ఆశీర్వదించిరి.

నగరములోని వారందరు స్వామివారి పల్లకి వద్దకు వచ్చి నమస్కరించి ఈ మహానుభావుడు భగవంతుడు గాననే ఈ రాజుమ్లేచ్ఛుడయినను వారి సేవచేయుచున్నాడని భావించిరి. నానావిధముల వాద్యములు మ్రోగుచుండెను. స్వామివారికి బిరుదావళులు వందిమాగధులు పఠించుచుండిరి. రాజు ఆనంద

నిర్భరుడై బీదలకు వస్త్రముల పంచిపెట్టి భిక్షకుల సంతోషపెట్టెను. పల్లకి రాజభవనము సమీపించ స్వామివారి పాదములు నేలకు ఆనకుండమార్గమంతయు దివ్యాంబరములపరచిరి పల్లకినుండి స్వామివారిని దింపి ఆమ్లేచ్ఛ రాజు తన రాజభవనమునకు గొనిపోయి మహాసింహాసనమున వారినికూర్చుండబెట్టెను. రాజు భార్యలు హారతులనిచ్చిరి. రాజభవనము చక్కగనలంకరింపబడెను. గురుమూర్తియు వారి ముఖ్య శిష్యులమైన నాతో నలుగురు మాత్రమే రాజభవనమును చూచితిమి. మిగతా జనమంతయు భవనమునకు వెలుపలనే ఆపబడిరి. రాజు తన పుత్ర పౌత్రులచే గురుమూర్తికి నమస్కారముచేయించెను. గురుమూర్తి వారిని ఆశీర్వదించి కుశల ప్రశ్నగావించిరి తరువాత గురుమూర్తినవ్వుచు నీమనోరథమనెరవేరెనా ? ఇంకనేమైన కోరికలు గలవా ? చెప్పుమనిరి అప్పుడు ఆరాజు స్వామీ! ఈ విభవములలో పడి మీకు దూరమైతిని. బుద్ధివచ్చెను. మీ పాదసేవ చేయుటతప్పనిక నేకోరికయు కోరననెను. గురుమూర్తి కొంతకాలమునకు నీవునన్ను శ్రీశైలమున కలిసికొనగలవు. నీవు నీపుత్రునకు రాజ్యమప్పగించి నావద్దకు రమ్మని చెప్ప వాడు నాకుజ్ఞానమును అనుగ్రహించుడని కోరెను. అట్లే అతనికి జ్ఞానదానము చేసి శిష్యసమేతముగ వెడలి గౌతమిస్నానమొనర్చి గణగాపురము ప్రవేశించిరి. స్వామి వారిని దర్శించి అచ్చటి వారందరు ఆనంద భరితులైరి. ప్రజలందరు హారతులనిచ్చిరి అప్పుడు స్వామి వారుశిష్యులనందర రావించి వారలతో నిటుల చెప్పిరి.

మాకీర్తి లోకమంతట ప్రకటమైనది. యుగధర్మము కఠినముగనున్నది. ఇకమీద ప్రకటరూపమున నన్ను తురుష్కులుగూడ నావద్దకు వత్తురు. నిజమైన భక్తిలేక అనేక కామనలతో ఎందరో వారి వారి మనోరథములను సఫలము గావించు కొనగలందులకు రాగలరు. కాన నేనికమీద నదృశ్యరూపమున గుప్తముగనుండెద. శ్రీశైల యాత్రయను మిషతో నీక్షేత్రమునుండి బాహ్యమునకు వెళ్లినటుల కనబడుదునేగాని నా సాన్నిధ్యమిచ్చటనే ఉండును. ఇచ్చట నదృశ్యరూపముననుండి భక్తుల కాపాడుచుందుననిరి.

సిద్ధముని నామధారకునితో నిట్లనుచున్నారు. నామధారకా గురుమూర్తి ఇప్పటికి ప్రత్యక్షముగ గణగాపురమున కలడు. భక్తితో భజించు వారికి దర్శనమిచ్చెదరు. సందేహింపకుడు. ఇట్టి గురుచరితమును భక్తితో నియమముతో పఠించువారికి వారిమనోరథముల గురుమూర్తి యొసంగి రక్షించుచుండును.

నామధారకుడిట్లను చున్నాడు. శ్రోతలారా ! గురుమూర్తి లోకదృష్టికి అవతారము చాలించిరేగాని భక్తితో ధ్యానించువారికి గణగాపురమున నిప్పటికి దర్శనమిచ్చెదరు. నేను అనుభించిచెప్పితిని. సంశయింపక గణగాపురమువెళ్ళి గురుమూర్తిని దర్శించి కృతార్థులు కలడు.

**ఇట్లు సిద్ధనామధారక సంవాదాత్మకమగు గురుచరితమున ఏబదియవ అధ్యాయము సమాప్తము.**

**దిగంబరా దిగంబరా శ్రీపాదవల్లభ దిగంబరా**

# శ్రీ గురు చరితము

## ఏబదియొకటవ అధ్యాయము

### ఓం అవధూత చింతనం శ్రీ గురుదేవదత్త జయ ఓం

శ్రీ గణేశాయనమః. నామధారకుడు సిద్ధమునితో స్వామీ! ఆపైననేమీ జరిగెనో చెప్పుడన సిద్ధమునితో ఇట్లనుచున్నాడు.

గురుమూర్తి మ్లేచ్ఛనగరము నుండి బయలువెడలి గౌతమీస్నాన మొనర్చి గణగాపురము వచ్చినతరువాత తమ మనమున నిట్లనుకొనిరి. నా మహిమ లోక విఖ్యాతమయ్యెను. ఇకమీదనేను గుప్తరూపమున నుండెద. లేనిచో నానాజాతి వారును నా వద్దకురాగలరని భావించి శిష్యులపిలిచి వారలతో తమ సంకల్పము చెప్పి శ్రీశైలయాత్రకు వెడలసన్నద్ధులైరి. అందరు స్వామివారి వియోగమును సహింపజాలక విలపింపసాగిరి. స్వామివారు వారలతో నవ్వుచు, మీరు చింతించకుడు. నేను ఈ గ్రామముననే యుందును. నిత్యము అమరజా సంగమమున స్నానమాడి మధ్యాహ్నమున నిచ్చటిమఠమునకు భిక్షకు వచ్చెద. నేనుగుప్తరూపమున నున్నను నిజమైన భక్తులకు ప్రత్యక్షముగూడ దర్శనమిచ్చెద. మఠమున మీపూజగూడ గుప్తరూపమున స్వీకరింతును. మీరెంత మాత్రము సందేహింపవలదు. ఇచ్చట నా నిర్గుణ పాదుకలనుంచెద. ఎవ్వరు సంగమస్నాన మొనర్చి అచ్చటి అశ్వత్థమును పూజించి మఠమున నున్న నిర్గుణపాదుకల శ్రద్ధతో భక్తితో నర్చింతునో వారి మనోరథములన్నియు తప్పక నెరవేరగలవు. ఇచ్చట చింతామణి వినాయకుని పూజించువారి సర్వకార్యములు నిర్విఘ్నముగ కొనసాగగలవు. ఇచ్చటి అష్టతీరములందు స్నానమొనర్చుడు. అట్లొనర్చువారు నాయనుగ్రహమునకు పాత్రులయ్యెదరు. నా నిర్గుణపాదుకలకు త్రికాలములయందు ఆరతులనిచ్చువారికి వారి మనోరథములన్నియు తప్పక నెరవేరగలవని శిష్యుల సమాధాన పరచి స్వామివారు గ్రామము నుండి బయలువెడలిరి. గ్రామస్థులు స్వామివారిని ప్రయాణము చేయించి తిరిగి వచ్చి మఠము ప్రవేశించిగూడ నచ్చట స్వామివారు ప్రత్యక్షముగ వారికి కనబడిరి. లోకులందరు స్వామివారు ప్రత్యక్షముగ వారికి కనబడిరి. లోకులందరు నప్పుడు స్వామి వారు మనుష్య మాత్రులు కారనియు త్రిమూర్తి స్వరూపులనియు నిశ్చయించిరి. ఇట్టి స్వామివారిని మనుష్యులనియు తలచువారు తప్పక యమపురము నొందగలరని భావించిరి. స్వామివారు క్షణమాత్రమున తిరిగి యదృశ్యులయిరి.

స్వామివారు నలుగురు శిష్యులతో కలసి శ్రీశైలమందలి పాతాలగంగను సమీపించి శిష్యులతో మీరు అరటి ఆకులతోను పుష్పములతోను ఒక ఆసనమును సమకూర్చుడు. అందు నేను కూర్చుని మల్లికార్జునునితో నైక్యము కాగలందులకు పోవలయునని యాజ్ఞాపించిరి. శిష్యులు చేమంతి, మాలతి, కల్హారాది పుష్పములు తెచ్చి అరటి ఆకులతోడను పుష్పములతోడను ఒక ఆసనమును సిద్ధపరచి ఆ యాసమును ప్రవాహమున నుంచ స్వామివారు వారలతో మీరు మీ గృహములకు శీఘ్రముగపొండు. నేను గణగాపురముననే గుప్తరూపమున నుండెద. భక్తులకు దర్శనమిచ్చెద. అభావికులకు ఇకమీద కనబడకుండ నుండగలందులకు గాను నేను నా గుప్తమగుచున్నాను. ఇది నిశ్చయము. నేను నిర్ధారణగ భక్తు గృహములనుండెదననిరి. శిష్యులు గురుమూర్తి పాదముల శిరముంచి నమస్కరించ వారి నాశీర్వదించి గురుమూర్తి పుష్ప విమానముమీద కూరుచుండిరి. స్వామివారు శిష్యులతో మీరు మీ గృహములకు పొండని ఆజ్ఞాపించ శిష్యులు నిర్వణ్ణులై దుఃఖించుచుండిరి. అప్పుడు స్వామివారు శిష్యులతో మీరు వేరుభావన చేయకుడు బాహ్యమునకు లేనట్లుకనబడుదును. భావికులకు నేను దర్శనమిచ్చుచుండెను. నేను నా భక్తుల గృహములందే నివాసమొనర్చెద. దుఃఖించకుడని ఓదార్చిరి. అప్పుడు శిష్యులు గూరుమూర్తి పాదములకు నమస్కరించిరి. స్వామివారు వారల నాశీర్వదించి ఆనందముతో పుష్పాసనమున కూర్చొనియుండిరి. బృహస్పతి కన్యరాశికి వచ్చెను. బహుధాన్య సంవత్సరము ఉత్తరాయణము మాఘమాసము కృష్ణపక్షము, శుక్రవారము పుణ్యదినముగాన నీ రోజున నేను నా స్థానమునకు పోవుచున్నాను. మీకు నేను ప్రసాద పుష్పముల పంపెద. మీరు వాటిని గ్రహించి పూజించుడు. మీరు లక్ష్మీ సంపన్నులు కాగలరు. నాకు గానమన్న కడుప్రీతిగాను నిత్యము మీ గృహముల భగవంతుని గాన మొనర్చుడు. అట్టి గృహములు నేను నివసించెద. వారియింట వ్యాధులుగాని, దారిద్ర్యముగాని ఉండజాలదు. వారు దీర్ఘాయుష్మంతులై పుత్రపౌత్రాభివృద్ధి గావించగలరు. నా చరిత్రను పఠించువారు దీర్ఘాయుష్మంతులై లక్ష్మీసంపన్నులై యుండెదరు. ఈ విషయమున నెట్టి సంశయములేదని శిష్యులతో చెప్పి స్వామివారు అంతర్ధానమొందిరి.

శిష్యులు గురుమూర్తి వియోగమును సహించలేక విచారపడుచుండిరి. ఇంతలోకొంత మంది పల్లెవ్వాఆంధ్రు అచ్చటికి వచ్చి మీ గురుమూర్తిని మేము చూచితిమి. దండము ధరించి యతీశ్వరరూపమున నున్నారు. వారు మాతో

"నాపేరు నరసింహసరస్వతి. నేను నా నిజస్థానమునకు పోవుచున్నాను. అయినను గణగాపురముననే నిత్యము నివసింతును. అని మీతో చెప్పుమనిరి. మీ గురుమూర్తి స్వర్ణపాదుకల ధరించియుండిరి. వారు మీతో మీ గ్రామములకుపోయి నా యందు భక్తిసల్పుచు సుఖముగ నుండుడు. మీకు ప్రసాద పుష్పముల పంపుచున్నాను. వాటిని తీసికొనిపొండు" అని చెప్పిరని పల్లెవారు చెప్పుచుండ ప్రవాహములోనుండి నాలుగు పుష్పముల శిష్యులున్న స్థానమునకు కొట్టుకొని వచ్చెను. ఆ పుష్పములకు స్వామివారి శిష్యులు గ్రహించిరి. అనిసిద్ధముని చెప్ప నామధారకుడు స్వామీ! స్వామివారి కైలాస యాత్ర సమయమున వారి సమీపమునకున్న ముఖ్యశిష్యులెవరో సెలవీయుడని ప్రార్థింప సిద్ధముని ఇట్లనుచున్నారు. నామధారకా ! స్వామివారికి ఎంతోమంది శిష్యులు కలరు. కొంతమంది గణగాపురముననున్నారు. స్వామివారికి శిష్యులైన యతీశ్వరులు కృష్ణసరస్వతి, బాలసరస్వతి, ఉపేంద్ర మాధవసరస్వతి మొదలగువారు స్వామివారి యాజ్ఞ ననుసరించి తీర్థయాత్రలు చేయ వెడలిరి. స్వామివారు శ్రీశైలయాత్రకు వచ్చునపుడు నలుగురు ముఖ్య శిష్యులు మాత్రమే వారివెంట వచ్చిరి. అందులో మొదటివాడు సాయందేవుడు, నందినరహరి అను ఇద్దరు కవీశ్వరులు, నాలుగవవాడను నేను. మేము స్వామివారి పుష్పముల స్వీకరించితిమి. అని తన వద్ద నున్న ప్రసాదపుష్పమును చూచి ఆనందభరితుడై నామధారకుడు నమస్కరించెను. సిద్ధముని నామధారకా ! నీకు నిరుపమానమగు గురుచరిత్రను సంక్షేపముగ చెప్పితిని.

గురుచరిత్ర భక్తులకు కామధేనువు. ఇట్టి దీనిని పఠించువారు వినువారు



దుఃఖము దారిద్ర్యములేక లక్ష్మీవంతులై పుత్రపౌత్రాభివృద్ధిగలిగి సుఖింతురు. దీనిని పఠించువారు ధర్మార్థ కామమోక్షముల నొందగలరు. ఈ పుస్తకమును స్వయముగా నెవరు లిఖింతురో వారు సర్వసిద్ధు నొందగలరు. అని సిద్ధముని చెప్ప నామధారుడు సంతసించెనని గంగాధర సరస్వతి మహారాష్ట్ర భాషలో నిట్టి పవిత్రమైన గురుచరిత్రను రచించెను. గురుచరిత్రన భావికులగు సజ్జనులకు మాత్రమే రుచించును. గురుచరిత్రను శ్రద్ధతో వినువారు సంసార సముద్రమును అవలీలగ దాటగలరు. అట్టివారికి పరమార్ధము కరతలామలకము. అమృతముతో సమనుగు నిట్టి గురుచరిత్రను శ్రద్ధతో వినువారిని గురునాథుడు శ్రీ నసింహసరస్వతి వంశపరంపరగ రక్షించుచుండును. శ్రోతలారా ! నమస్కారములు. మనోహరమగు ఈ గురుకథ సకలాభిష్టములను ఈయసమర్థుము. కాని ఫలము పఠించువారి మనోభావమును బట్టి యుండును. కాన ప్రేమతో పఠించుడు. అందలి అర్థమును మననమొనర్చుడు. గురుమూర్తిని భక్తితో ధ్యానించుడు. నృసింహ సరస్వతి మిమ్ముల రక్షించును. ఇట్టి పవిత్రమైన గ్రంథమును శుద్ధమైన వస్త్రమున కట్టి గృహమున ఉంచి నిత్యము పూజగావించుడు. గురుమూర్తి మిమ్ముల రక్షించును.

**ఇట్లు గురుచరిత్రమున ఏబది ఒకటవ**
**అధ్యాయము సమాప్తము.**

**దిగంబరా దిగంబరా శ్రీపాదవల్లభదిగంబరా**

**శ్లో॥ శ్రీశైలయాత్రామిషేణవరదః పుష్పపీఠగః ।**
**కతౌతిరోభవద్యస్సః శ్రీదత్తశ్శరణంమమ ॥**

శ్రీశైలమున స్వామి వారు పుష్పాసనము నధిష్టించి అంతర్ధాన మొందుట.

**ఆ. సేవజేసి గురుని స్థిరభావమందెడు**
**త్రోవనంటి జ్ఞప్తి దొలగనీక**
**భావమందె పరము బరికించిచూడరా**
**విశ్వదాభిరామ వినురవేమ. – "వేమన యోగి"**

తా॥ గురుసేవజేసి స్థిరభావము నొందవలసిన త్రోవనంటి జ్ఞప్తిని తొలగద్రోయక భావములోనే పరతత్త్వమును పరికించి చూడుము. ఇదియే ముక్తి సాధనము.

# శ్రీ గురు చరితము

## ఏబది రెండవ అధ్యాయము

**ఓమ్ అవధూత చింతనం శ్రీగురుదేవదత్త జయ ఓమ్**

**ఓం శ్రీ గణేశాయనమః, ఓం గురుదేవ శ్రీదత్తాత్రేయాయనమః**

**శ్లో :- గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః**

**గురురేవ పరం బ్రహ్మ తస్మై శ్రీ గురువేనమః.**

శ్రోతలారా వినుడు. పావనమైన గురుచరిత్రమును సిద్ధమునివలన విని నామధారకుడు ఆనందనిమగ్నుడై దేహభావము విడిచి సమాధినిష్ఠుడయ్యెను. అప్పుడు సిద్ధముని నామధారకుని కొలదిసేపటికి సమాధి నుండి బహిర్ముఖునిగావించి ఆలింగనమొనర్చి అతనితో బాలకా! నీవు తరించితివి. అయినను నీవిట్లు సమాధిలో నుండిన లోకులు తరించుట ఎట్లు? మనసును గురుచరణములయందు లగ్నముచేసి బాహ్యమునకు లోకాచారమునకు అనుకూలముగ ప్రవర్తించవలెను. నీ వలన నాకు గురుచరిత్రములు సమగ్రముగా స్మరించి చెప్పుభాగ్యము లభించెను. అనెను. నామధారకుడు సిద్ధముని పాదములకు నమస్కరించి చేతులు జోడించుకొని గురునాథ! మీ వలన భవసాగరమును దాటగలిగితిని. గురుచరిత్రను వింటిని, తృప్తి అయ్యెను. మనసు స్థిరపడెను. కాని గురుచరిత్ర కథాను క్రమణికను నాకు దయచేసి సెలవిండు. అని ప్రార్థించ సిద్ధముని నామధారకునితో నీ క్రింది విధముగ అధ్యాయ అనుక్రమణిక చెప్పుచున్నాడు.

మంగళాచరణము, ఇష్టదేవతా స్మరణము. సద్గురు దర్శనము, గురుమహాత్మ్యము, దీపకునికథ, అంబరీషుని కథ దత్తాత్రేయుని జన్మ వృత్తాంతము, గోకర్ణమహిమ, శ్రీ పాదుల వారి జన్మ, శనిప్రదోషవ్రత మాహాత్మ్యము. రజకునకు వరము నొసంఉట, కురువపురమహిమ. నృసింహసరస్వతి జన్మవృత్తాంతము. వారి సన్యాసస్వీకారము. సాయం దేవుని అనుగ్రహించుట, తీర్థయాత్ర మహిమ మందమతికి విద్యనొసంగుట. దరిద్రునకు ధననిధిని చూపుట, స్వామివారు అమరపురమున నివసించి అచ్చటి భక్తుల నుద్ధరించిన వృత్తాంతము స్వామి వారు గణగాపురముచేరుట అచ్చట వారు చూపిన అద్భుత అతిమానుషలీలలు ఇవి ఈ గురుచరిత్రయందు విస్తరించి నిరూపింపబడినవి.

కలియుగమున అధర్మము వృద్ధినొందుట చూచి స్వామి వారు అదృశ్యమైరి. కాని భక్తి గలవారికి వారి దర్శనమగుచునే యుండును. గురుచరిత్రమును సప్తాహపారాయణము భక్తితో చేయువారికి గురునాథుడు వారి మనోరథము తీర్చును. సప్తాహపారాయణము చేయువారు మంచిదినము చూచుకొని స్థలశుద్ధియొనర్చుకొని దీపము వెలిగించి నియమపూర్వకముగా గ్రంథమును పూజించి ప్రథమదినమున 7 అధ్యాయములు 2వ దినము 18వ అధ్యాయము పూర్తి. 3వ దినమున 29వ అధ్యాయము పూర్తి. 4వ దినమున 35 వ అధ్యాయము పూర్తి. 5వ దినమున 38 వ అధ్యాయము పూర్తి. 6వ దినము 43 వ అధ్యాయము పూర్తి. 7వ దినమున గ్రంథ సమాప్తి పర్యంతము పఠింపవలెను. చివరకు గ్రంథమునకు పూజగావించి యథాశక్తి బ్రాహ్మణ సువాసినీ సమారాధన జరుపవలెను. ఇట్లు శ్రద్ధతో సప్తాహ మొనర్చు వారికి గురునాథుడు దర్శనము ఇవ్వగలడు. వారి మనోరథము నెరవేరగలదు. అని సిద్ధముని నామధారకునకు చెప్పెనని గంగాధర సరస్వతి గురుచరిత్రను వ్రాసెను. ఇట్టి గురుచరిత్రము యథాశక్తి శ్రీదత్త అవధూతచే ఆంధ్రమున అనువదింపబడెను. సిద్ధమునికి వందనములు. నామధారకునకు వందనములు.

**ఇతి నారాయణ స్మరణమ్.**

గురుశిష్యస్వరూపానారాయణా, జయ జయ. జయ దేవ జయదేవ జయసద్గురు దత్తా. హారతి ఓంవాళితా హారతి భయచింతా.

**: పరాభవ విజయదశమి :**

లేఖకుడు, మ.సు.శర్మ.తేది 18-10-71 విరోధికృత్ ఆశ్వీయుజ దీపావళి. సోమవారము.

**శ్రీదత్త**

# శ్రీ సత్యదత్త వ్రత పూజా విధానము

సత్యనారాయణ వ్రతమునకువలెనే పూజా ద్రవ్యముల సమకూర్చుకొనవలెను. ఆసనమునందు కూర్చొని ఆచమనము చేసి, ప్రాణాయామ మాచరించవలెను. సుముఖశ్చైక దంతశ్చ..... అని దేశ కాలసంకీర్తనముచేసిమమసమస్త సంభావిత దురితక్షయ పూర్వకసకలమనో వాంఛితఫల సిద్ధ్యర్థం యథామిళితోపచారైః (పురుష సూక్తాదిమంత్రైః) శ్రీసత్య దత్తస్య సాంగస్య సపరివారస్య పూజానం కరిష్యే॥ అని సంకల్పము చేయవలెను.

తత్రాౌదౌ నిర్విఘ్నతా సిద్ధ్యర్థం గణపతి పూజనం కలశాద్యారా ధనం. శరీర శుద్ధ్యర్థం షడంగన్యాసాంశ్చ కరిష్యే॥ అని సంకల్పించి పూజాపీఠమందు గణపతిపూజ మున్నగునవి చేయవలెను. (తరువాత ఆదిత్యాది నవగ్రహములను లోకపాలకులను పూజించవలెను).

తరువాత (తూర్పున) పీఠప్రాగ్ద్వారే ఓం లక్ష్మీనారాయణాభ్యాంనమః (దక్షిణమునందు) దక్షిణే ఓం పార్వతీ పరమేశ్వరాభ్యాంనమః (పశ్చిమమున) పశ్చిమే ఓం రతీకందర్పా భ్యాంనమః (ఉత్తరమున) ఉత్తరే ఓం భూవరాహాభ్యాంనమః (మధ్య) మధ్యే ఓం నమోభగవతే దత్తాత్రేయాయ అని సత్యదత్తదేవుని యంత్రమునందు గాని, విగ్రహమునందుగాని, గురుపాదుకలయందు కాని, శాలిగ్రామము మున్నగు వాటి యందుగాని ఆవాహనము చేయవలెను. తరువాత పూజ ఇట్లు జరిపించవలెను.

శ్రీదత్తం ఖేచరీముద్రాముదితం యోగిసద్గురుం । సిద్ధా సవస్థం, ధ్యాయే ధీవరప్రదకరం హరిమ్ ఇతి ధ్యానం ॥

"ఓం సహస్రశీర్షా....॥ దత్తాత్రేయాహవ్వయామ్యత్ర పరివారైః సహార్చనే।
శ్రద్ధాభక్త్యైశ్వరాగచ్ఛ ధ్యాతధామ్నాంజసా విభోః ఇత్యావాహనం ॥

ఓం పురుషేవేదగ్ం....॥ సౌవర్ణం రత్నజడితం కల్పితం దేవితామయం రమ్యం సింహాసనం దత్త తత్రోపవిశ యంత్రితే ఇత్యాసనం ॥

ఓం ఏతావావస్య....॥ పాద్యం చందన కర్పూర సురభి స్వాదు వారితే । గృహాణ కల్పితం తేన దత్తాంఘ్రీ క్షాలయామితే ॥ఇతి పాద్యం॥

ఓం త్రిపాదూర్ధ్వ....। గంధాబ్జ తులసీబిల్వ శమీపత్రాక్షతా న్వితం సాంబర్ఘ్యం స్వర్ణపాత్రేణకల్పితం దత్తగృహ్యతాం ॥ఇత్యర్ఘ్యం॥

ఓం తస్మాద్విరాడజాయత....॥ సుస్వాద్వాచమనీయాంబు హైమపాత్రేణ కల్పితం। తుభ్య మాచమ్యతాం దత్త మధుపర్కం గృహాణ చ ఇత్యాచమనీయం మధుపర్కంచ సమర్పయామి ॥

ఓం యత్పురేషేణ.....॥ ప్రవచనాదిసుదుర్గభతా శ్రుతేస్త్ర్యధిపతే త ఇహ శ్రుతివిశ్రుతే పరమభక్తి సుశీతల సజ్జలం వపుషి సిక్త మధాప్లుత యేస్త్వలం । ఇతిస్నానం।

ఓం ఆప్యాయ......కామధేను...ఇతిపయఃస్నానం పురుషసూక్తము, రుద్రము, పవమాన శ్రీసూక్తములు మున్నగువాటిచే నభిషేకము చేయవలెను. స్నానము తరువాత దేవుని పీఠమునసుంచవలెను.

తం యజ్ఞం....భక్త్యా దిగంబరాచాంతజలేదం దత్త కల్పితం కాషాయపవిధానం తద్ గృహాణైణేయ చర్మచ। ఇతివ్రస్తం॥

ఓం తస్మాద్య...సంభృతం....॥నానాసూత్రాధ। రైతేతే బ్రహ్మసూత్రే ప్రకల్పితే గృహాణ దైవతమయే శ్రీదత్త నవతంతుకే॥ ఇతియజ్ఞోపవీతం॥

ఓం తస్మా....యి.....॥ భూతిమృత్స్నాసుక స్తూరి కేశరాన్విత చందనం రత్నాక్షతాః కల్పితాస్త్వామలం కుర్వేథ దత్తతైః ఇతి చందనం అక్షతాంశ్చ॥

ఓం హరిద్రా...హరిద్రారంజిత....॥ ఇతిహరిద్రాం। కుంకుమం కామదం...ఇతికుంకుమం నానాపరిమళద్రవ్యాణిచ

ఓం తస్మాదశ్వా...॥ సచ్ఛమీ బిల్వ తులసీవత్రై ॥ సౌగంధికైః సుమై మనసా కల్పితై ర్నానావిధై ర్ధత్తార్చ యామ్యహమ్ ఇతిపుష్పాణి ॥ తరువాత అష్టోత్తర శతనామములతో పూలు, తులసి మారేడుపత్రి, జమ్మిపత్రి మున్నగు వాటిచే నర్చించవచ్చును. దీని తరువాత ఆవరణ పూజ చేయవలెను.

ఆద్య...తిథౌ శ్రీసత్యదత్త వ్రతాంగత్వేన ఆవరణ దేవతా పూజనం కరిష్యే॥ అని సంకల్పించి ఆయాదేవతలను పూజింపవలెను.

ఓం శీక్షాయైనమః ఓం కల్పాయనమః ఓం వ్యాకరణాయనమః ఓం నిరుక్తాయనమః ఓం జ్యోతిషాయ నమః ఓం ఛందసే నమః ఓం వహ్నాయే నమః ఓం ఈశాయ నమః ఓం రక్షసే నమః ఓం వాయవే నమః

శ్లో॥– దయాబ్ధే త్రాహిసంసార సర్పాన్మాం శరణాగతం।

భక్త్యా సమర్పయే తుభ్యం ప్రథమావరణార్చనమ్ ॥

అని ప్రతిపర్యాయము అక్షతలు నీళ్ళు విడువవలను.

2వ ఆవరణ : ఓం ఋగ్వేదాయ నమః ఓం యజుర్వేదాయ నమః, ఓం సామవేదాయ నమః, ఓం అథర్వణాయ నమః, ఓం ఇతిహాస పురాణేభ్యో నమః ఓం మీమాంసాయై నమః, ఓం న్యాయాయ నమః॥

శ్లో॥ దయాబ్ధే....ద్వితీయావరణార్చనం ॥...॥

3వ ఆవరణ : ఓం సరస్వత్యైనమః ఓం గణపతయే నమః, ఓం శుకాయ నమః ఓం సుమంతవే నమః ఓం జైమినయే నమః ఓం వైశంపాయనాయ నమః, ఓం పైలాయ నమః, ఓం గోభిలాయ నమః॥

శ్లో॥ దయాబ్ధే....తృతీయావరణార్చనం ।...।

4వ ఆవరణ : ఓం కశ్యపాయ నమః, ఓం అత్రయే నమః, ఓం భరద్వాజాయనమః, ఓం విశ్వామిత్రాయ నమః, ఓం గౌతమాయనమః, ఓం

